

చెన్నపట్టణము జూన్ ౧౯౨౫.

సంపుటము ౨. క్రోధన సంవత్సరము జ్యేష్ఠమాసము సంఖ్య ౬.

# కవితాప్రశంస

కవికొండల వేంకటరావు గారు; బి. ఎ., బి. యల్.

జన సామాన్యముయొక్క దృష్టి నేడు కవిత వైపునకు దిరుగుచున్నట్లివల కెప్పుడును దిరిగియుండలేదు. ఈనాడు మనము ప్రతిదైనికపత్రికయందు నొక సారస్వతానుబంధము నరయుచున్నాము. ప్రతివారపత్రిక నొకపుట పద్యప్రచురణములకై వినియోగపడుచున్నది. మాసపత్రికలు ప్రత్యేకముగ సారస్వతాభివృద్ధికై నెలకొలుపబడుచున్నవి. విద్వాంసులు రసజ్ఞులు కూడ "కవిత్వమనున దెట్లుద్భవించుచున్నది? దానివిలాస మెట్టిది? దాని యుపయోగ మేమి?" అనుచర్చలకుం దొడంగి వాదోపవాదములు సల్పుచుండుట కనుచున్నాము. అన్నిసంప్రశ్నంబుల కాకరమగు కవితయొక్క స్వరూపమును గూర్చి మనముకూడ కొండొక తడవు యోజించుట కాలయాపనము కాదనుకొందును.

కవితయనఁ గవిత్వపుశైలి నుదితమైన కవిత్వపుటూహ. రసాయన శాస్త్రమన నేమి? రసాయనశాస్త్ర పారిభాషను రసాయన శాస్త్రభావములను వెలిబుచ్చుటయు. నీళ్లు అనుటకు మాఱుగ '$H_2O$' అనిపలుకుచు దాని నిర్మాణమును బోధించునప్పుడు మనము రసాయనశాస్త్రవేదిక నధివసించుచున్నారము.

అట్లే కవితావేదిక నధివసించుటకును మన మొకానొక పరిభాష నుదితమగుచున్న అనగా గవిత్వపుశైలి నుదితమగుచున్న ఒకానొక ప్రబోధము ననగా గవిత్వపు టూహను మది గొనవలెను.

కవిత్వపుశైలి, కవిత్వపుటూహ అననేమి?

రేగుపండు చెట్టునుండి పడునంత న్యూటన్ అను మహానుభావుని నెమ్మనమ్మున భూమియొక్క ఆకర్షణశక్తి నిలిచెను. అది అతడు వెలికి నుబ్బినప్పుడు ప్రకృతిశాస్త్రఖండము ప్రభవించెను. వాల్మీకియను మహర్షి క్రౌంచద్వితయమ్మున నొక్కపక్షి నిషాదబాధితమ్మగుడు దదాక్రోశనంబు విని రామాయణ ప్రసన్నుడయ్యె. ఈయిరువురియొక్క అనుభవవిభేదము నెఱుంగుటలో కవిత్వమిట్టిదని నిర్వచింపనగు.

న్యూటన్ కనిపెట్టుటకుముందును వెనుకను రేగుపండ్లట్లు పడుచునేయుండెడివి. ఆభూపతనభావము భూమితోబుట్టినదియు. తన్నిత్యపతనమును ప్రత్యక్షతాత్కాలిక ప్రదర్శనమున నిర్వచించినాడు న్యూటన్. అట్లుగాక వాల్మీకి విన్న పక్షిపరిదేవన మంతకుముం దెన్నడు విననిది: ఇతరులెఱుంగనిది. అది ఆపక్షి వ్యక్తికరించిన తాత్కాలిక కరుణరసము. ఆరసము రామాయణగేయమున నిత్యసంస్ఫురణముగ నిలుపబడె. కావున కవిత్వమనునది ఒకానొక వ్యక్తియొక్క తాత్కాలిక రసప్రదర్శనమును నిత్యసత్యప్రతిష్ఠితమ్ముగ నిలుపు. ఇతరశాస్త్రములో నిత్యసత్య ప్రతిష్ఠితంబులై పరగువానిని తాత్కాలిక ప్రదర్శనమ్ముల నిర్వచించు.

ఆదిని ఈతాత్కాలిక రసప్రదర్శన మనునది ఒకానొక అవతారపురుషుని యొక్క అనివార్యపరాక్రమమందు, ఒకానొక వంశవీరునియొక్క యుద్ధాతిరేకమున, ఒకానొక నాయకుని గుణలక్షణముల కనుగొనబడుచువచ్చి రామాయణము, భారతము, ఇలియడు, ఒడిస్సే మున్నగు మహాపురాణము లుద్గమించుటకు వలనుసూపినది. తరువాత వారొక్క నాయకునియందు, ఒక్క మహావీరునియందు తమదృష్టిని కేంద్రీకరింపక ఒకానొక రసమునందు తన్మయులై ఆ రసపోషణ మును పెక్కుపాత్రములచే చేయించుచువచ్చినారు. వేణీసంహారమున బీభత్సరసము, ఉత్తర రామచరిత్రమున కరుణరసము, ఆంధ్రప్రబంధముల శృంగారరసము ఇట్లే స్తంభీకృతములయ్యె. అందుచే నేమైనది? తొలుత పెక్కురసము లొక్కనాయకుని పట్ల చూపించు తెఱంగునుండి ఒక్కరసము పెక్కు మందికి తావలమగునట్లు చిత్రింపబడు తెఱంగునకు సారస్వతము మాఱినది. దానినుండి విశాల దృష్టిని వీక్షించుచో మనకు గోచరించున దేమి? ఒక్కొక్కనియెడ నొక్కొక్కరసంబు ప్రదర్శింపబడుట. ఎంతమందిమానవులు, ఎన్ని జీవరాసులు లోకములో కలవో అన్నిటికి నొక్కొకవిచిత్ర రసప్రదీపన మున్నదని.

ఈనైక సంస్ఫురణమ్ముల నిత్యప్రతిష్ఠితమ్ములుగ నూపుటలో చిన్నచిన్న గీతికలు, చిన్నఊహలు, చాటుపద్యములు, వ్యక్తి సంకీర్తనములు వెలువడుచున్నవి. "ఏల వెలువడ రాదు? ఒక్కమహావీరుడే అపారమైన క్షుప్ర

ణయము సూపువాడా? సామాన్యునింట నంతపాటి సుప్రణయు మొకనాడైన కనమా? కందుము. కనుచో ఆనాటి ఆ ప్రణయము చిత్రించిన అది కయితకాదా" అను ఈ దృశంపుటుత్సుకతతో నవయుగము తొంగి చూచుచున్నది. దాన లోకమెల్ల లలితకళామయమ్ముగజూపబడుచున్నది. నికృష్టునియొక్కయు, నిందుముదుసలియొక్కయు చర్యలనుండి సంస్తవనీయమగు భావములు సేకరింపబడుచున్నవి. అయ్యవి సారస్వతశాఖ నలంకరించుచున్నవి. ఆ అలంకరించుటలో పూర్వపుటంశములు గాక క్రొత్తఅంశములు, పూర్వపు టితివృత్తములుగాక క్రొత్తయితివృత్తములు, పూర్వపు శైలిగాక క్రొత్తశైలి, పూర్వపు పోకడలు గాక క్రొత్తపోకడలు తప్పక బయలువెడలుచున్నవి. దరిలేని మహాసముద్రముగ ఈఆధునిక సారస్వతము తోచుచున్నది. విమర్శనప్రియుడు 'దీనికిమూలమేమి? ఇందలిమట్టు, లయ ఎందున్నది? ఇది శాశ్వతసుఖము నిచ్చునా? నీతిని బోధించునా?' అని తన పూర్వపుపంథ యోజించి వికలుడగుచున్నాడు. మన మాపూర్వపంథవిడిచి నిష్పక్షపాతబుద్ధిని కొండొకపరి యోజింతము.

కవిత్వము నెన్ని తారుమారులు చేసి చూచినను ప్రధానవిభాగములు రెండు గనిపించు- భావము:భాష; ఊహ: ఉక్తి; అర్థము: వాక్కు. వాక్కువల్ల అర్థమా? అర్థమువల్ల వాక్కా అనుమీమాంస కెందును ఎడము లేకుండ వాక్కుతో అర్థమును, అర్థముతో వాక్కును ప్రతి మానవవ్యక్తికిని స్ఫురించుచుండును. అందులకే కాళిదాసు పార్వతీ పరమేశ్వరుల కలయిక కుపమానముగ "వాగర్థావివ సంపృక్తౌ" అని సూచించినాడు. శబ్దార్థములు రెండును పరస్పర సంజనితములు కాకపోయినను రెంటికి నుత్పత్తిస్థాన మెయ్యదియైన నున్నదా? ఏది యీశబ్దార్థ ప్రచురణమునకు మూలము? అని విచారింతము.

మనుజుడు సహజసంగీత ప్రియుండు. ఒక్కరుం డూఱకకూరుచుని 'లేలేలే'అనియో 'రేరేరే' అనియో దీర్ఘము తీసికొనుచు ఆత్మైకానందమున లీనముగాఁగలవాఁడు. ఆసహజసంగీతశక్తిసామర్థ్యములను వెలికిఁ గోయిలపిట్టవోలె కీర్తించునప్పుడ వాగర్థము లుట్టపడుచున్నవి. లోలోనున్నంతపర్యంత మది యెంతసుభాషితమయ్యు భావమున జీర్ణమగుచున్నది. వ్రాఁత, అచ్చు, పరిషత్తు, ప్రచారము- ఇవియెల్ల వాగర్థములకు మూలాధారములు కావు. కవియన పక్షి. పక్షియొక్క పాట మనము తెలిసికొనవలయునన్న దానిని "కువకువ"అని పొత్తములో తెలిసికొను నంత సరిపడునా? ఆధ్వని ఆ కోయిలపిట్ట ముఖతః వినునప్పుడ,ఆకొండలోయ మాఱుమ్రోఁత నను గమించునప్పుడ, ఆ మామిడిచెట్టు కొట్టకొనఁ జూపులమరల్చునప్పుడ సువ్యక్తమగు. అట్లే మనము వ్రాతప్రతులయందు, అచ్చుపొత్తములందు, పత్రికలందు అచ్చుకట్టంబడువానింగను నంత కవిత్వముం గనుఁగొంటి మని విమర్శింప గడంగరాదు. శబ్దార్థములయొక్క నిజస్థానము కవితాసంకీర్తనము. అది సీసపద్యమే కానిండు, తేటగీత కానిండు, వచనము కానిండు, గీతిక

కానిండు, ఏదియైనను ఒకానొక గానకళ మితి ననుసరించి వచ్చియుండుఁగాని సీసముగ తేటగీతగ వెలువడియుండునవికావు. సీసచిహ్నమే కనుక బాసకు ప్రధానమగున దేని

"మందార మకరంద మాధుర్యముఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు"

అనునదియు

"ఓరోరి బండోడ! ఒయ్యారి బండోడ
నీమీద నామోజు నిల్పుబండి"

అనునదియు నొకేతీరున ఏలచదువము? మొదటిది చదువునప్పుడు ఆచిఆచియు, రెండవది చదువునప్పుడు సాచిసాచియు చదువుట ఎట్లు? అందు గమనిక సూచించునది సీసము కాదు, గణములుకావు. ఆంతరంగికాంశము యొక్క గానకళారహస్యము. రెండింటి యొక్క శబ్దార్థములకు జన్మస్థానములు వేఱు. ఆగానకళ అవ్యక్తి ప్రదర్శనము నాశ్రయించి యుండును. 'ఆదితాళము—శంకరాభరణము' అని సూచించునంత 'మత్తకోకిల' అనివ్రాయునంత తేటతెల్లముకాదు. అవి యొకకొన్ని నిరంతర సామాన్యలోకానుభవమునకు సంజ్ఞలుగ పూర్వులేర్పఱచినవి అంతియ. అవికాక వేరు గానము లోకములో లేదే? వేరు వృత్తమునకు ఆస్కారము కానమే? కవి క్రొత్త యూహాల నల్లుకొలంది క్రొత్తరాగము విలసిల్ల జేయును. ఈనిశ్శబ్ద ఖగోళమునందెన్ని విధములగు శబ్దములు లయమొందుట లేదు? ఎన్ని క్రొంగ్రొత్తగ వినిపించుట లేదు?

అట్లంటివని మన మెద్దియేసి పాడుకొనవలెనన్న, చదువుకొనవలెనన్న ఉండుండి ఆ కవియొద్దకు పఱుగెత్తవలయునని తలపోయకుడు. కవియొక్క గొంతుకతో కాని, కవియొక్క జీవనముతోగాని, కవియొక్క వేషభాషలతోగాని, వానియొక్క ఆచారవ్యవహారములతోగాని మనకు పనిలేదు. మనము సాక్షాత్కరించుకొనవలసినది అవ్యక్తి ప్రదర్శనము: అనగా ఆ ప్రత్యేకపు టంశముతో మనకు సానుభూతి; ఆ యంశమునందే తన్మయత్వము మనకుఁ గలుగవలెను. కవి విరచించునప్పుడట్లు తన్మయుడై రచనకుం దొడంగు. అవ్యక్తముగ నొక్కొక్కప్పుడు అమిత దీర్ఘముగ ఆతని కావ్యశక్యము గానంతటిసముత్సుకతతో గాన మతనికి తదంశ ప్రదర్శనాభిలాషను వెల్లివిరియు. పాడుకొనునప్పుడు పూర్తిగ స్వేచ్ఛగ తనకుగల నిసర్గ రాగముయొక్క కురుచ పొడవులతో నతడు పాడుకొనుచున్నాడు.

"ఓ! చతురాస్యవంశకలశోదధిపూర్ణ శశాంక"

అని ఎత్తుగడ ఎత్తునప్పుడు "ఓ! చతురాస్య"అనిమాత్రమే ఊరుకొనడు "ఓ" అని. 'ఓ'కు పెద్దదీర్ఘమిచ్చి సంబోధనము సూచించును.

"కమ్మోరి సిన్నోడు సిరిసిరిమువ్వ
కాసులుకంటేలు సిరిసిరిమువ్వ"

అనునప్పుడు ఉన్నదిఉన్నట్లే అన్న కవిత్వము కానేరదు.

"కమ్మోరి సిన్నోడమ్మా సిరిసిరిమువ్వా!
కాసూలుకంటేలు సిరిసిరి మువ్వా!"

అని అదియొకవిధమగు దీర్ఘమిచ్చి ఆలపించునప్పుడ అందలి నిజమైనకవిత్వము గోచరించును.

అచ్చునగాని, వ్రాతనుగాని మనము చూచుసరి కేమగుచున్నవి? ఈదీర్ఘములు కనపడవు. ఈహ్రస్వములు చూపట్టవు. అంతయు చిత్రిక పట్టినట్టుగ సాపుగనుండు. కళయొక్క హొయలు, సొగసు, చక్కందనము, మురుపు అందు నుండవు. అవియెల్ల మన సంకీర్తనము నందు మనకున్న అంశ తన్మయప్రసుప్తిని- అంశప్రదర్శనమును, తత్సంకీర్తనమును మెరుపు ఉరుములవంటివి. అంశప్రదర్శనము మెరుపు. సంకీర్తన ముఱుము. కవి మునుముం దంశప్రదర్శనమును గాంచి సంకీర్తనము చేయుచున్నాడు. పాఠకుడు సంకీర్తనము జేసికొనుచు అంశప్రదర్శనము గనుచున్నాడు. అంతియ భేదము. కావున ఎప్పుడేని ఏదియైన నూతన గ్రంథము మనచేత బడునప్పుడు ఇది నడువదు అనుట సమంజసము కాదు. మనభావ మాభావముతో, మనవాక్కు ఆవాక్కుతో లీనము గాగలదేని మనకు బ్రతిరచనమునందును సొబగు లగపడు.

"కశ్చిత్కాంతా విరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః"

"అథప్రజానా మధిపః ప్రభాతే".

అని ఎల్లప్పుడు చదువునట్టియు, నేర్పునట్టియు నెందఱు కళాభిజ్ఞులు

"కలలోననైన నవ్వులకైన నామాట
జవదాట నెఱుఁగ-నో చంద్రవదన
ఏపదార్థంబు నాయెదుటఁ బెట్టక మున్న
ఎవ్వారికొసగఁ దోయిఁగురుఁబోడి
చెలులు నాతో నేమి చెప్పుదురో యని
లంచంబులిచ్చునో చంచలాక్షి
తోడి చేడియలు నాతోడి వంతులకు రా
సైరింపఁజాల దోసన్నుతాంగి
అరమరలు లేనికూరిమి నవఁగి పెనఁగి
కొదలు తీరని కోర్కులఁ గూడియాడి
కపటమెఱుగని మమతల గలసి మెలసి
యున్నవిభుఁ డిట్లు సేయునే యో లతాంగి"

అనునది చదువునప్పుడు నందలి రసమును గ్రహింపనేరక తెలుగును నిరసించుట లేదు? ఎందఱు

Under the green wood tree
Who loves to lie with me

అనునది చదువునప్పుడు పరవశు లగుచు

"మల్లెపందిరి దగ్గరో! సుందరి!
మాపువుఁ దల్లడుగో!

అనునప్పుడు తూష్ణీంభావమును జూపుచున్నారు కారు? ఎందుచేత? తదంశమునం దభిరుచి లేమి కాదే? Green wood. Primrose. అన్న స్ఫురించుటయు, మల్లెపందిరి అన్న తట్టమియు ఈఊహాకు అలవాటుపడమి కాదే? కావున మునుముందు మన కాయంశమునందు అభిరుచి కుదరవలెను. అదిలేనిచో వారుదానిని విమర్శించుట కర్హులు కారని నా తాత్పర్యము. అభిరుచి అలవఱచుకొనవలెను. ఒకదాని నలవఱచుకొనుటకుముం దది మంచిదా చెడ్డదా అను వితర్కము తోచకమానదు. అంశము మంచిద్రో చెడ్డదో అను విచక్షణజ్ఞానము సారస్వతప్రియునియొక్క ప్రధానలక్షణము.

ఇచ్చో అతనికి నుండవలసిన క్రొల కళ. లోకమునందుఁగల అందము, ఒయ్యారము, రసప్రదీపనము, భావవికాసము, నొక విరాగివోలె నొకానొకయోగివోలె నాతడు కనుగొనుట కలవాటుపడవలెను. అంతియ కాని

ఆపద్దెము మనకు భుక్తిపెట్టునా? దాన ముక్తి కల్గునా? అది యేదేని నైతికసూత్రమును ప్రతిపాదించెనా లేక వేదాంతతత్త్వము బోధించునా? అని చూడరాదు. అయ్యవియెల్ల ఇతరశాస్త్రముల నెమకనగు. కవితను గాదు: కవిత నుండకూడదని, నుండవని నా యుద్దేశ్య మెంతమాత్రమును గాదు. ఉండు. ఉండ వచ్చు. కాని అవి కవితకు జీవగఱ్ఱలు కావు. కవితకు జీవగఱ్ఱ కళ. ఆకళ లోకమం దెచ్చో కానంబడిన నయ్యది కవిత కాస్థానము.

ఎందున్న దీకళ? ఎట్టిదీకళ అన్న ఇద మిత్థమని చెప్పవలను గానిది. కొబ్బరిచెట్టు యొక్క చిట్టచివర రెండాకు లల్లాడుచు నేయు నట్టి యుల్లంపు టురివుకంటె నిశ్శబ్దముతో విన వచ్చునది. అంతకంటె సున్నితపు చూపు చూపించునది.

"చూచి ఝుళం ఝుళత్కటక
సూచితవేగ పదారవిందయై
లేచి కుచంబులున్ దుఱుము
లేనడు మల్లలనాడ నయ్యెడం
బూచినయొక్కపోఁకనును
బోదియఁ జేరి విలోకనప్రభా
వీచికలం దదీయపద
వీకలశాంబుధి వెల్లిఁగొల్పుచున్.

అన్నపద్యమునందు పెద్దనార్య డావరూధిని అనుచిన్నదానిని పోఁక చెట్టుక్రింద చిత్రించుటలో నీతిగాని, వృక్షశాస్త్ర ప్రబోధనంబుగాని సూచించెనా? సూచించినది సున్నితపు కళ. జవ్వివలె పెఱిగిన మోక క్రింద మవ్వంపు టచ్చెఱుపాటు. అపారమగు సౌందర్యము: అతిపేశలమగు భావానందము. పూచిన యొక్కపోఁకనును బోదియ వర్తకునకు మార్గసునకు మఱియొందువిధముగ నుపకరించు. కవికి ఆవిధము పనికిరాదు. అయ్యది శోభన దేవత కాశ్రయము కావలెను. అప్పు డాతనికి సంతుష్టి కలుగవలెను. ఎందులకన్న ఏమో? కావున అట్టి నిర్మోహపు మోహాసంపుదృష్టితో మనము చూడగల్గునప్పుడు మనకు నిజమైనకళ గోచరించు.

అట్లు చూడగల్గుట కనువౌసంగు కళా కలికలు, సంధ్యారాగము, కన్నీరు అవ్యక్త సుశ్రుణయమ్ము, నీటితెమ్మెరలు మున్నగు వానియందు పొడసూపు. అవి మనుజుడు సేకరించుచు తన కళాకలితదృక్పథమును పోషించుకొనఁజెల్లు. ఈ చిన్న చిన్న యంశముల వైపునకు ఎప్పుడు మనదృష్టి మనము మఱల్చుకొందుమో అప్పుడు మనఊహా లంతకంతకు సున్నితంబులగు; మన ఆశయములు మోహాబద్ధములు గాక సుకుమార మోహానంబులగుచు భౌతిక సౌఖ్యవర్ణనంబునందుకంటె కోమలహృదయాంతర్గత భావసువాసనలపై దేలియాడు.

అంశ మొండు సభ్యమైనది. దానియందు మన కభిరుచి కుదిరినది. ఇఁక జదువ మొదలిడుదము. అప్పు డూహింపఁదగ్గది యేమి? ఆ అంశమునందలి భాష చక్కగ జూపించుచున్నదా లేదాయనియే. ఏమన భావమును విడిచి, ఊహ నరయక, అంశమును పోద్రోచి, ఈత డుపయోగించినభాష గ్రాంధికమా, గ్రామ్యమా? దేశ్యమా, సంస్కృతమా అని

విమర్శించుటకుం గడంగుట నేలవిడిచి సాము సేయుట. ఏపాత్తమునుగాని మీరిది అంతయు ఈగ్రాంధికభాష, నిదియంతయు ఈగ్రామ్యభాషను వ్రాయుడని నిర్దేశించుట కెవ్వరికిని హక్కులేదు: సబబుకాదు. గులాబిపువ్వు ముళ్లపొదతో బుట్టిన "ఓసీ! నీవు ముళ్లపొదలో పుట్టరాదు. తులసిచెట్టుపై నున్న బాగుండియుందువే" అని అనుకొన్నట్లుండు. ముళ్లు లేక పరిమళసలలితమ్ములగు దళసముదయమ్మున నుండుతులసికి గులాబి పువ్వునంటి పువ్వు లేదేయని వితర్కించినట్లుండు. ప్రతి పువ్వునకు ఎట్లు దానియొక్క స్వతస్సిద్ధమ్మగు ఆకులజొంపము, తొడిమనిడుపు, గాలికదుపు లుండునో ప్రతియూహకును దానియొక్క సొంతములగు పస, కత్తు, వన్నె, వాసి, చదువునట్టితీరు, గ్రహించునట్టి పొందిక లుండును. ఆపస, కత్తు మున్నగువానినెల్ల మఱచి అన్ని ఊహాలను నన్నయభట్టీయము ననుసరించి, అప్పకవీయమును బురస్కరించుకొని, ఆదికాలపుపంథ ననుగమించి వ్రాయుడన్న అంతకంటె నిరంకుశసూత్రము వేరొండు కనబోము. అట్లే అంతయు గ్రామ్యమున వ్రాయుడన్న అర్థములేదు. కవులగువారు దానిని పాటింపరు. ఇదివఱకు పాటించియుండలేదు. ఉత్తమవిమర్శకులు దానిని ప్రతిపాదింపరు. ఆమోదింపరు.

కావున ఊహా, ఆఊహకు తగ్గ పస, వన్నె, కత్తు, వాసి మున్నగునవి యున్నవా లేవాయని విమర్శించుట కర్జము.

"కాంక్షితక్రీడ కంగము పంపుసేయమి
నొడ్డుగా నిట్టూర్పు లొలయబొగులు"

మున్నగు మోహాంధకారబంధుర వాక్యములను జదువుటకు మనము సిగ్గుపడము కాని,

"ఓరంపగాడ! బంగరుమామా! చంద్రగిరిచీరలంపరా!"

అను అమాయకప్రేమరుతము నెత్తుటకు నిసీ యందుమా! ఇయ్యది కేవలము భావముయొక్క సభ్యాసభ్యము లరయక భాషయొక్క ప్రబంధప్రౌఢిమకు దోసిలొగ్గుటచే వచ్చినదోసముకాదా? ఊహింపుడు.






త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు

ఎంతకష్టము తల్లి యెంతకష్టమ్ము
నాయమ్మ నీకు నెంతటికష్ట మొదవె.

పుట్టఁబుట్టినయట్టి దిట్టమున్ నుడువు
పుట్టతేనియతీపు లుట్టుకబ్బమ్ముఁ
గడుభక్తి నీకిచ్చి గణుతిఁ గన్నట్టి
కవులఁ గన్నపు డింత కష్టమ్ము లేదు. ఎంత.

దివిఁబుట్టినమేటి తీపారఁబల్కు
నైదవప్రాఁబల్కు టందంపుఁ గృతిని
నీకు నర్పణచేసి నిన్నుఁ గై సేయు
ముమ్మూర్తులంబోలు ముగురు బిడ్డలను
గన్నప్పుడును నింత కష్టమ్ము లేదు. ఎంత.

శ్రీకృష్ణలీలలం జెలఁగు పొత్తమ్ముఁ
జిత్తమ్ములో బత్తి చిగురొత్తఁ జెప్పి
నిను ధన్యఁ జేయు నా నిఱుపేదకొడుకుఁ
గన్నయప్పుడు నింతకష్టమ్ము లేదు. ఎంత.

సద్భావకవితారస ప్రవాహినులఁ
బఱపి లోకమ్ముఁ దెప్పలఁ దేల్చినట్టి
వివిధప్రబంధసత్కృతులైన సుతులఁ
గన్ననాఁడును నింతకష్టమ్ము లేదు. ఎంత.

వంగభాషాకోమలాంగి గన్నట్టి
జగదేక విఖ్యాతుఁడగు పట్టిఁజూచి
యట్టిసంతతిఁ గాంతునని నీవు నేఁడు
పడుచున్న కడలేని ప్రసవవేదనను
దలఁచినంగడుపుచుమ్మలు వాఱునకట. ఎం.

భావార్థశూన్యమ్ములై వీనులకును
వెగటైన మూల్గులే వినవచ్చుఁగాని
కాను పేనాఁటికిం గానరా దయయొ
గర్భసంపద లేక కలుగునే కాన్పు
ఇంతకష్టమ్ము నీకేల మాయమ్మ
మునునీవు గన్న యాతనుజాతు లసదె. ఎంత

పరమేశ్వరుని కృపాగరిమమ్ము కలిమి
నట్టిసంతతియు నీకబ్బెడుంగాక
యూరకే యిటు బల్మి నుబలాటపడిన
నెంకిఁ బోలినకానుపే కల్గుఁజూవె. ఎంత.






## కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారు

> "వినదగు నెవ్వరు సెప్పిన, వినినంతనె వేగపడక వివరింపఁదగున్,
> గని కల్ల నిజము తెలిసిన, మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో సుమతీ."

వాగనుశాసనుం డగు నన్నయభట్టోపాధ్యాయ సార్వభౌముఁ డారణ్యపర్వ మొనరించుచు మృతినొందెననియును, మిగిలిన భాగమును ప్రబంధ పరమేశ్వరుఁడగు నెఱ్ఱనార్యుండు పూరించెననియు ననాదిసిద్ధమగు ప్రసిద్ధి కలదనుసంగతి లోకవిదితము. దీనినిక్కాలపువారు కొందఱు శంకించి నూత్నమార్గముఁ ద్రొక్కుచున్నారు. నన్నయభట్టారకుఁ డాదిసభారణ్య పర్వముల మూఁడింటిని బూర్తిగ విరచించెననియు, వానిలోఁ దుదిదగు నారణ్యపర్వములోఁ గొన్ని భాగములు శిథిలములు కాఁగా నాశిథిలభాగపూరణమునుమాత్రమే యెఱ్ఱాప్రగడ కావించెను గాని శేషభాగసంపూర్ణ రచనము చేయలేదనియు మహారాజశ్రీ, శ్రీనడకుడిటి వీరరాజుపంతులుగా రొక యపూర్వవాదమును దెచ్చిపెట్టిరి. శ్రీపంతులవారు తాముచెప్పునదే సిద్ధాంతమను పట్టుతోఁ దమ వ్యాసమును వ్రాసియుండలేదు. "ఆంధ్రవాఙ్మయ పరిశోధకులు సత్యవిషయనిశ్చయము లగుదు రను తలంపున నారణ్యపర్వమునకును, నెఱ్ఱాప్రెగడ మహాకవికిని గలసంబంధమునుగూర్చి నాకుఁగలిగిన యభిప్రాయమును,అయ్యభిప్రాయ మొదవుటకుఁ గల్గ కారణములను గ్రమముగ నిందుఁ బ్రదర్శించుచున్నాను."అని సరసముగ వ్రాసి యున్నారు. ఈయది విమర్శనార్థమై ప్రకటింపఁబడిన వ్యాసమేకావునను సర్వవిధముల విమర్శనీయమై యున్నది గావునను దీని నిందు విమర్శించుచున్నాఁడను. చదువరులు దత్తావధానులై చిత్తగింతురుగాక!

శ్రీపంతులవారు విశేషపరిశ్రమచేసి బహుగ్రంథములఁ బరిశీలించి చేర్పుమీఱ నీవిషయమై విపులమగు వ్యాసరాజమును వ్రాసియుండిరి. శ్రీ పంతులవారి నూత్నవాద మాపాతమధురముగాఁ గానిపించుచున్నది గాని, పరిశీలించి చూచిన నిలుచునదిగాఁ గానుపించుటలేదు.

## ప్రథమవాదప్రాచుర్యము

నన్నయ చెప్పఁగా మిగిలిన యారణ్యపర్వ శేషము నెఱ్ఱాప్రెగడ పూరించినట్లాదినుండి నేఁటివఱకును, గవిపండితలోకములో దృఢప్రసిద్ధియున్నట్లు వీరరాజు పంతులవారీక్రిందివాక్యములలో నంగీకరించి యుండిరి. "శ్రీమదాంధ్రమహాభారతములోని యారణ్యపర్వోత్తర భాగము నెఱ్ఱాప్రెగడ మహాకవి రచియించె ననువాడుక చిరకాలమునుండి యాంధ్రదేశమునం దెల్లయెడల నలమికొనియున్నది. దీనికి ఆంధ్రప్రబంధములలోని కవిస్తుతి పద్యములు, ఆంధ్రలక్షణగ్రంథములు, పెద్దల వచనములు మున్నగునవి యాధారములై యున్నవి. ఇంత ప్రసిద్ధిగల యీపండితాభిప్రాయమును ద్రోసిరాజనుటకు నిప్పటి మనవారికి విరాటపర్వ పీఠికలో తిక్కనమఖి వ్రాసిన ఈ క్రిందిపద్యము ముఖ్యాధారమై యున్నది.

ఉ. ఆదరణీయసారవివి
ధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణ
సంభృతమై పెనుపొందియుండె నం
దాదిఁ దొడంగి మూఁడు కృతు
లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహి
తాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్.

ఈపద్యమునందు కవిబ్రహ్మ నన్నయభట్టు మూఁడుకృతులొనరించినట్లు చెప్పియున్నాఁడు. ఇదియే నవీన వాదములకు మూలాధారము. ఇప్పుడు మనము విచారింపఁ గొనవలసినదినన్నయయారణ్యపర్వములో 'శారదరాత్రు' లను పద్యాంతమువఱకే వ్రాసియున్న యెడల సోమయాజి మూఁడు కృతులు నన్నయ వ్రాసెనని యెట్లు చెప్పెనను సంశయైయున్నది. కాని యీయంశమును దేల్చుటకుఁ బూర్వము పలువిషయములు పరిశీలింపవలసి యున్నవి. కానవానిని ముందుగాఁబరిశీలించి పిమ్మట తిక్కనవ్రాసిన దానింగూర్చి చర్చించుకొందము. తిక్కన వ్రాసినరీతిగా నన్నయ యాదిపర్వత్రయమును బూర్తిగ వ్రాసియున్న యెడల నందు నెఱ్ఱాప్రగ్గడకుఁ దావే లేకపోవును. కాని గ్రంథముంబరిశీలించి చూచిన శంభుదాసుఁడు వనపర్వములోఁ గొంత వ్రాసెనని యందులను గూడఁ జెప్పుకొనవలసి యున్నది. నేఁటివఱకుఁ బ్రబంధ పరమేశ్వరునకు నారణ్య పర్వముతో సంబంధము లేదని చెప్పువారు బయలు వెడల లేదు. నేఁడు క్రొత్తవాదమును దెచ్చిన శ్రీవీరరాజు పంతులవారుకూడ నెఱ్ఱాప్రగడ అరణ్యపర్వములో కొంచెముగానో గొప్పగానో కొంత వ్రాసినట్లంగీకరించి తీరినారు. కావున నన్నయచేఁ బూర్తిగ వ్రాయఁబడిన యారణ్యపర్వములోనికి నెఱ్ఱాప్రగడ కవిత్వమెట్లు వచ్చినదను శంక యనివార్యమైనది. దానికి సమాధానము చెప్పఁబోయి మన శ్రీపంతులవారపూర్వమార్గముల యథేచ్ఛముగఁ ద్రొక్కిరి. అయ్యవి పూర్వవాదముకంటె దుర్బలములును, సత్యదూరములును, పరస్పరవిరుద్ధములునై యుస్నట్లు గాన్పించుచున్నవి.

## నూత్న వాదవైఖరి

పంతులవారు నన్నయ కృతారణ్యపర్వములో మాత్ర మచ్చటచ్చట శైథిల్యములు పొడమినట్లును మొదటి పర్వద్వయమును శైథిల్యములపాలు గానియట్లును సాహసించి వ్రాసియుండిరి. నన్నయకృతాదిసభాపర్వములు లోకములోఁ బ్రసిద్ధిగాంచెనఁట ! విశేషమైన వాడుక నందెనఁట! అరణ్యపర్వము మాత్రము ముట్టరానిదై యప్రసిద్ధమై యొకమూలంబడి యుండి శైథిల్యమునకు లోనయ్యెనఁట! మొదటి రెండు పర్వములును ప్రసిద్ధి కలిగి యున్నట్లును, మూఁడవది ప్రసిద్ధి లేక మూలంబడి శిథిలమైనట్లును వీరు వ్రాసిరిగాని యీయప్రసిద్ధికిఁగల కారణము మాత్రము తృప్తికరముగఁ దెలుపలేక పోయిరి.

## అరణ్యపర్వ ప్రాశస్త్యము

నన్నయభట్టారకుని మరణకథనే తీసికొనకుండిన వనపర్వము విఘ్నకారి యని తెలుపుట కేయవకాశము లేదు. భారతములో సమస్తవిషయముల ఘనప్రసిద్ధి నందియున్నవి వన శాంత్యనుశాసనికపర్వములై యున్నవి. ఇవియే మిక్కిలి పెద్దవి. వీనిలో నారణ్యపర్వము మఱియు ముఖ్యము. ఇది మూలకథతో సంబంధించినది. శాంత్యనుశాసనికములు తీసివేసినను భారతకథ కాతంకము రాదు. ఆరణ్యపర్వ మట్టిదికాదు. ఇది ప్రధాన కథాంశమును దెల్పుముఖ్యపర్వము. ఇది లేకున్న భారతకథ యంతయుఁ జెడిపోవును. మఱియు మనోహరములైన యుపాఖ్యానములు, మోక్షప్రదములైన ధర్మములు, పవిత్రములైన యితిహాసములు కలిగి భారతకథకంతకును మూలకీలకమై యున్నది. ఈపర్వమును మనకవులు బాగుగ చదువుకొని యిందున్న యుపాఖ్యానములను దీసికొని వేలువేలు ప్రబంధముల విరచించి యున్నారు. కిరాతార్జునీయము, నైషధము, సావిత్ర్యుపాఖ్యానము మన్నగునవి యిందుండియే తీసికొనఁబడినవి. భాసుఁడు మత్స్యమప్రసాసన మనురూపకమును నీయారణ్యపర్వములోని కథను తీసికొనియే రచించె. సావిత్రీచరిత్రముచే వనపర్వము పవిత్రమైనదని రామేశచంద్ర దత్తుగారు వ్రాసియున్నారు. పవిత్రతమమగు శ్రీరామచరిత మిందే కలదు. ఈపవిత్రఘనపర్వము కవిపండితలోకముచే నస్పృశ్యముగా నెంచఁబడినదని వీరరాజు పంతులవారు వ్రాసినవ్రాఁత వింతను గొలుపుచున్నది. అరణ్యపర్వము విఘ్నకారి యను భీతి సంస్కృత భారతవిషయమునఁ గూడఁ గలదని పంతులవారు వ్రాసిరి. ఈవాడుక బహుకాలమునుండి కలదని వీరి తలంపు. అదియే సత్యమై తన నాఁటికే యది యుండినయెడల భట్టారకుఁడా ప్రతీతి నెఱిఁగియే యుండునుగదా! పండితలోకములో నిట్టిభీతి యున్నప్పు డామహాశయుఁడు తానాదిసభాపర్వములను బూర్తిచేసినపిమ్మట వనపర్వాంధ్రీకరణమునకై పూనక లోకమునందలి వాడుకనుబట్టి శాంతిపర్వమునే యాంధ్రీకరించి యుండును. అట్లుచేయక సభాపర్వాంధ్రీకరణ

మైన వెంటనే యారణ్యపర్వాంధ్రీకరణమునకు నాలోక ఘ్నుఁ డావయోవృద్ధుఁ డాపూర్వాచార పరాయణుండు పూనునా! పూనఁడు. భంగశాంతికై శాంతి నాంధ్రీకరించి పిమ్మట నారణ్యపర్వ పరివర్తనమునకై ప్రయత్నించి యుండును. అట్లు చేయలేదుగావున నన్నయనాఁటికి నారణ్యపర్వముంగూర్చిన భీతి లేదని తేలుచున్నది. ఆది నాంధ్రమహాభారతము వనపర్వమునందే యుండి విషాదాంతమైన కతనఁ దా లోకమునకు భీతిపుట్టినదని పంతులవారనిరి! సంస్కృతభారతము వనపర్వములో నంతమొందక మొదటినుండియుఁ బదునెనిమిది పర్వములును కలిగి సజ్జనులగు ధర్మరాజాదులు వనవాసక్లేశమునుండి దాటి యావలకువచ్చి సౌఖ్యమునందినట్లు తెలుపుచున్నది. కావున సంస్కృత భారతవిషయములోఁ గూడ నీభీతియుండుట యాంధ్రభారతము మూలముగా పుట్టినదై యుండవలయును గాని మఱియొకవిధముగా పుట్టియున్నదనుట కవకాశమే కాన్పించుటలేదు. భట్టారకుఁడు వనపర్వము సభారంజకమనియే వర్ణించినాఁడు. ఈపర్వముంగూర్చి యాతఁడే యిట్లు స్తుతించియున్నాఁడు:

క. ఆరణ్యపర్వ మనఁగా
　నారణ్య ప్రముఖశోభిశాంతః పర్వ
　ధారమయి సకలసూరి స
　భారమ్యంబగు తృతీయపర్వము వెలయున్.

ఇట్లు సకలసూరి సభారమ్యంబగు నీ యారణ్య పర్వమును ముట్టరాదనువాఁడుక యెట్లు వచ్చినది? నన్నయ భట్టారకుని హఠాన్మరణముతోడ సంబంధమును తీసివేయుదుమేని, వనపర్వముంగూర్చి మనవారు భీతి పెట్టుకొన నవసరము లేదు. ఈభీతికి మనపంతులవారు వేరొకయద్భుత కారణమును నీక్రిందిరీతిని గల్పించిరి. "మన భాషయందు పూర్వము విషాదాంతకథలులేవు. ఎన్నికష్టములు వచ్చినను తుదకు సుఖముతోఁ గథ ముగియవలయునని మనవారి యాశయము. అరణ్యపర్వమునఁ బడిన సజ్జనులగు ధర్మరాజాదులు వెలుపలికివచ్చి సౌఖ్యము నందినట్లు తెలిపెడికథ యప్పటికిఁ దెలుఁగున వ్రాయఁబడియుండలేదు. కావునఁ దెలుఁగువనపర్వము నక్కాలమునఁ జదువువారు లేకపోయిరనియు, దానం జేసియే తత్పర్వపుఁ బ్రతులు పలసినన్ని దేశమున వ్యాప్తిం గాంచియుండలేదనియు నూహింప నగుచున్నది." ఇది వింతవాదము. గ్రంథము విషాదాంతమో, సంతోషాంతమో తెల్పుటకు గ్రంథకథ నంతను తీసికొని తుదిభాగమునుబట్టి తేల్చవలయునుగాని గ్రంథ మధ్యమందుగాదు. భారతము సంతోషాంతముగాని విషాదాంతముకాదు. అరణ్యపర్వము గ్రంథమధ్యగతముగాని, గ్రంథాంతము గాదు. కావున దానినిబట్టి విషాదాంతత్వ సంతోషాంతత్వ నిర్ణయము చేయరాదు ఆంధ్ర భారత మప్పటికి వనపర్వముతో ముగిసెను గావునను, సజ్జనులగు ధర్మరాజాదులు వెలుపలికి వచ్చి సౌఖ్యమునందినట్లు నన్నయయారణ్యపర్వము తెలుపుటలేదుగావునను విషాదాంతమని చెప్పుమంటిమందురా! అట్లయిన సభాపర్వమును విషాదాంతమే. ఏమన సజ్జనులగు పాండవు లరణ్యములకు బోయినట్లు తెలుపుచోట నాపర్వము ముగిసినది. ఆ పర్వాంతమున వీరడవికిపోయిన మార్గమిట్లు తెలుపఁబడి యున్నది.

సీ. వదనసరోజంబు వస్త్రాంతమునఁ గప్పి
　　కొనియేఁగె ధర్మనందనుఁడు మఱియు
భీమ బాహులు రెండుఁ బెద్దలుగాఁ జాఁచి
　　ఘన సత్త్వఁడగు మరుత్తనయుఁడరిగె
నిసుము సల్లుచు నమరేంద్రపుత్రుఁడు వోయె
　　ధూరేణుగ్రస్తశరీరుఁ డగుచు
నకులుండు సనియె మానక లజ్జఁ జేసి య
　　ధోవక్త్రుఁడై సహదేవుఁడరిగె
విస్మృతకేశభరము వ్రేలంగ ద్రౌపది
　　సనియె రౌద్రయామ్యసామగాన
ముఖరితాస్యుఁడగుచు మ్రోల ధౌమ్యుండేఁగె
　　సకల జనులు శోకజలధిఁ దేల.

ఇట్లు విషాదకర వేషములను దాల్చినసజ్జను లగు పాండవులు నడవులలో నిడుమల గుడుచుటకుఁ జనినట్లు దెలుపు నీక్రిందిపద్యములో పర్వము ముగిసినది.

క. వీరులగు పాండుసుతులు మ
　హారణ్యనివాసనిరతు లయి ధరణీబృం
　దారక సహస్రములతో
　సారమతుల్ సనిరి నిత్యసత్యవ్రతులై.

విషాదాంతమను కారణమున నారణ్యపర్వము చదువరానిదాయె నను నెడల సభాపర్వమును నట్టిదియే

యైపోయినది. ఇంకఁ బంతులుగారు సభాపర్వాంతము వఱకు లోకులు చదివెడివారని యెట్లు చెప్పిరో! పంతుల వారివాద మిట్లు నిస్సారమగుచున్నది.

## పూర్వము లోకు లారణ్యపర్వముఁ జదివెడి వారా? లేదా?

అప్పుడు లోకు లారణ్యపర్వమును జదివెడివారు కారనునదియును నిర్మూలమే. భారతమనునది యొక్క పురాణమాత్రము గాదు. నన్నయ భట్టారకుఁడు తెల్పిన రీతిగా ధర్మశాస్త్రము, వేదాంతశాస్త్రము, కావ్యలక్షణ శాస్త్రము మున్నగు లక్షణము లనేకములు కలదై యున్నది. అందులో నాంధ్రమహాభారత మాంధ్రపండిత లోకమునకు మూలఖని. అందులో నాదిపర్వత్రయ మాదినుండియు సమస్తకవులకు నాధారము. పురాణ పారాయణమునకై పర్వత్రయమును బఠింపకున్నను లక్ష్యలక్షణ సిద్ధికై మొదటినుండియు పర్వత్రయమే మూలాధారమగుటచే నాపర్వత్రయమును నమూల్యరత్నఖనినిగా భావించుకొని మనవారు కాపాడుకొనుచు వచ్చిరి. ఇట్లు తెల్పుట కనేకాధారములు కలవు.

## ఆదిపర్వత్రయ ప్రసిద్ధి

ప్రాచీనకవులు లాక్షణికులు నన్నయకృత పర్వత్రయమును లక్ష్యముగాఁదీసికొనెడివారని కవిరాక్షసాభిప్రాయమువలనఁ దెలియవచ్చుచున్నది. ఈ ప్రాచీనకవి నన్నయకృతపర్వత్రయములోని తెలుఁగులనే కాని యన్యమును వాడరాదని నియమము చేసెనఁట. ఈయంశము నీక్రింది యప్పకవీయపద్యములవలనఁ దేలుచున్నది.

ఉ. ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పిన భారతంబులో
నేదివచింపఁగాఁబడియె నందును దాని నెకాని సూత్రసం
పాదన లేమిచేఁ దెలుఁగుఁబల్కఁ డొక్కటి కూర్చి చెప్పఁగా
రాదని దాక్షవాటి కవిరాక్షసుఁడీనియమంబు చేసెనన్.

"క. ఆమూఁడు పర్వములలో...... తెలుగుకవీంద్రుల్"

ఇట్లు నియమించిన కవిరాక్షసుఁడు తిక్కనకంటెఁ బూర్వుఁడని కవులచరిత్ర చెప్పుచున్నది.

ఇట్లు కవిరాక్షసాదులు మూఁడు పర్వములను నాంధ్రకవి పండితలోకముచేఁ బ్రమాణముగాఁ దీసికొనం బడుచున్నట్లు చెప్పిరని వీరేశలింగం పంతులవారు గూడ వ్రాసియున్నారు. వారును వీరును జెప్పుటయేల! మనలో ననేకములగు లక్షణగ్రంథములు కలవు. అవి యన్నియును నన్నయకృత పర్వత్రయమునుండియు లక్ష్యముల నిచ్చుచున్నవి గాని యాదిసభాపర్వములనుండి మాత్రమే యుదాహరణముల నిచ్చుటలేదు. ఆనాఁటిలక్ష్యకారులును పర్వత్రయ ప్రశంస గావించుచున్నారు.

"ఉ. సారకథాసుధారసము........, భారత సంహితన్ మును త్రిపర్వము లెవ్వఁడొనర్చె నట్టి........
........నన్నయభట్టు గొల్చెదన్."

(మార్కండేయ పురాణము)

శ్రీపంతులవారు తమ వాదమునకు బలము కలుగుటకై "మొదట, దేశమునం దంతట నసంఖ్యాకముగ వ్యాపించిన తొలిపర్వములు రెంటిప్రతులు నిర్దుష్టకవితా లక్షణమును దెల్పుటకు సమర్థములై యే యున్నవి." అని యొకవింతవ్రాఁతను వ్రాసిరి. నిర్దుష్టాంధ్ర కవితా లక్షణము తెలిసికొనుటకు నాది సభాపర్వములు రెండే చాలునని వ్రాయుట మహాసాహసము కాదా! మనవారు నన్నయ పర్వత్రయమునే కాక తిక్కన పదునేను పర్వములను జూచినను జాలక లక్షణమునకై యితర ప్రాచీనకవుల మహాగ్రంథములనుగూడ లక్ష్యముగఁ దీసికొనుచున్నారు కదా! అట్టిస్థితిలో నాది సభాపర్వములే లక్ష్యముకొఱకు జాలుననుట న్యాయమా?

పూర్వకాలమందు లక్షణగ్రంథములు లేకపోవుటచే లక్ష్యగ్రంథమగు నీపర్వత్రయమందే యెక్కుడగు భక్తిశ్రద్ధలు సారస్వతాభిమానులు కలిగియుండెడి వారని ప్రాచీనులగు కవిరాక్షసాదుల నియమాదులు తెల్పుచునే యున్నవి. ఇట్టి పర్వత్రయములో నరణ్యపర్వమునకు లోకమున ననాదరణము గల్గుటకు హేతువేమియును లేదు. వాదము నిమిత్తము శ్రీపంతులవారు చెప్పిన విషాదాంతత్వదోషము నంగీకరించినను లాభము గాన్పించుట లేదు. ఏమన తిక్కన మిగిలిన పదునేను పర్వములను దెనిఁగించిన తరువాత గ్రంథము పూర్తియై యావిషాదాంతత్వదోషము తొలఁగినదని మనపంతులవారు వ్రాసిరి కదా! కావున విషాదాంతత్వ దోషము పర్వత్రయమునకును తగులుటయ్యనది తిక్కనతరువాత లేదని

పంతులుగారు వ్రాసినదానినిఁబట్టియే తెలియుచున్నది. ఇంక నీయారణ్యపర్వమునకు దోషము తగులుటయు, ననాదర భావముండుటయు, ననునవి తిక్కనకుఁ బూర్వమునందె యుండవలయును.

తిక్కనకాలమునకును నన్నయకృతపర్వత్రయము సంపూర్ణమై లోపములు లేకయున్నట్లు తిక్కనమారనాదుల వాక్యములే తెల్పుచున్నవి కదా! తిక్కన తరువాత వాని కనాదర భావమే లేదని పంతులవారే వ్రాసిరి కదా! తిక్కన నాఁటికే యారణ్యపర్వము విశ్లథ స్థితిలోనున్నదందురా? అట్టి దురవస్థలోనున్న యాభాగమును ముందుగా సవరించి (యెఱ్ఱనవలెనే) పిమ్మట మిగిలిన పదునైదుపర్వములను వ్రాయును గాని, లోప భూయిష్ఠమైన యారణ్యపర్వమును దిక్కనలోపములతోనే విడిచియుండునా? ఒక చిత్రకారుఁడు సర్వాంగ సుందరమైన చిత్రప్రతిమ నొకదానిని వ్రాయఁదలపెట్టి దానిమట్టు రేఖల నేర్పరుచుకొని శీర్షమును నిండుగ లిఖించి కంఠమునఁ గొంతభాగమును వ్రాసి మృతినొందు, నాప్రతిమనే పూర్తిసేయఁదలంచువేఱొక చిత్రకారుఁడు తానెంత రమ్యముగఁ జిత్రించు నేర్పరియైనను తాను లిఖించు తక్కిన విగ్రహమును బూర్వపు కంఠభాగముతో గల్పునప్పుడందు కాలవశమున శైథిల్యమునొందిన ముక్కు, చెవి, కన్ను, మున్నగు నవయవముల సరిచేసి పూర్వపుసుందరాకృతిని నిల్పి పిమ్మట గంఠభాగముతోఁ దనసైపుణ్యము మీఱ మిగిలిన భాగమునుఁ గలుపఁడేని నాచిత్తరువు చూపఱకు సంతోషము నిండార జేయునని భావింపఁ జాలఁడుగదా! కావున తిక్కననాఁటి కారణ్యపర్వము లోపము లేనియేయున్నదని చెప్పవలసివచ్చును. అట్లు చెప్పిన మనవారు విషాదాంతమును భీతిచే నారణ్యపర్వము మూలపడవేసిరను సంగతి హాస్యాస్పదమగును.

## మచ్చుపద్యముంగూర్చి

నన్నయకృతారణ్యపర్వము లోన్లి యనాదరభావ ముపాలైన దనుటకై మనపంతులవారొక యపూర్వాధారమును దీసికొనివచ్చిరి. నన్నయ మరణానంతరమున మిగిలిన భారతమును బూరించుటకు సమర్థుఁడెవఁడో తెలిసికొనుటకై నన్నయపద్యము నొకదానిని రాజనరేంద్రుఁడు మచ్చుగనిచ్చి దేశదేశములకుఁ బంపినట్లొక ప్రతీతి కలదు. దానిని స్వపక్షమున కాధారముగఁ దీసికొని మన పంతులవారిట్లు వ్రాసిరి. "రాజనరేంద్రునకుఁగూడ నారణ్యపర్వము ప్రీతిపాత్రము గాలేదని మాత్రము గ్రహింపవచ్చును. ఎట్లన: ఆమహారాజు విద్వత్కవులచెంతకు నాదిపర్వములోని "నిండుమనంబు......"అను పద్యమునో, సభాపర్వములోని "మదమాతంగ......" అనుపద్యమునో పంపెనుగాని యరణ్యపర్వములోని నన్నయ కడపటి పద్యమనబడు "శారదరాత్రులు......"అను పద్యమును బంపఁడయ్యెను! పైరెండుపద్యములును దీనికంటె రసవత్తరములుగావు. మఱియు నిప్పద్యముతో సాటి వచ్చు పద్యమును వ్రాయుసమర్థుఁడే లభించునో, నాంధ్రమహాభారతము అతుకుతెలియని మేలిహారమువలె నొప్పారియుండునని యారాజేంద్రుఁడు భావించి దానినే పంపియుండఁడా! కావున రాజరాజునైతము వనపర్వమును పరీక్షింప వెనుదీసెనని యీకథ చెప్పుచున్నది." ఈసందర్భములో ప్రమాదభూయిష్ఠమగు వ్రాఁతను మనపంతులవారు వ్రాసిరి. భారతమును బూరింపఁగల సమర్థుని దెలిసికొనుటకై రాజనరేంద్రుఁడు రెండుపద్యములఁ బంపిన ట్లెచ్చటను బ్రతీతిలేదు. పంతులవారు చెప్పిన ట్లొకపద్యమునుమాత్రమే పంపినట్లు కలదు. ఆపద్య మాదిపర్వములోని "నిండుమనం"బను నదియని కొందఱును సభాపర్వలోని "మదమాతంగ" అనునది యని మఱికొందఱును తలంచుచున్నట్లుగాఁ గవులచరిత్రమునందుఁ దెలుపఁబడి యున్నది. అది యాదిపర్వములోని పద్యమగుచో సభారణ్యపర్వములకు రెండింటికిని ననాదరభావమున్నట్లు దేలును. "మదమాతంగ" అనుపద్యమగుచో నాద్యరణ్యముల కనాదరభావమున్నదన్నట్లు తెలుపవలసి వచ్చును. అంతియే కాని అరణ్యపర్వమున కొకదానికే యనాదరభావమున్నట్లు తెలుపుట కవకాశము లేదు. అయినను ఒకభాగములోని పద్యముల నొకటి రెండింటిని లోకులు హెచ్చుగ మెచ్చుకొనుట తటస్థించినఁ దక్కిన భాగములన్నియు ననాదరభావము పాలైనవనవచ్చునా? కవికుల సార్వభౌముఁడగు కాళిదాసు విరచించిన శాకుంతలములో నాల్గవ యంకమునందలి శ్లోకచతుష్టయమును లోకము హెచ్చుగా మెచ్చుకొనుట తటస్థించుచున్నది. అంతమాత్రముచే తక్కినభాగములన్నియు ననాదరభావము పాలైనవన వచ్చునా? అది యెట్లుండనిండు. మనపంతులవా రేపద్య

రాజమును రాజనరేంద్రుఁడు మెచ్చుగ నేల యీయలేదని శంకించుచున్నారో యా "శారదరాత్రు"లను పద్యరాజమునే యాతఁడు మెచ్చుగా నిచ్చినట్లు లోకములోఁ బ్రతీతి లేకపోలేదు. అయ్యది వీరేశలింగము పంతులవారికిఁ దెలియలేదు కాఁబోలు. రెండుపద్యములను మాత్రమే వారు వ్రాసియుండిరి. మఱికొందఱు "శారదరాత్రు"లను పద్యమునే మెచ్చుగా నిచ్చినట్లుగాఁ జెప్పుకొనుటయే కాక పంతులవారి వాదము బయలువెడలుటకుఁ బూర్వమే పత్రికలలో నా "శారదరాత్రు"లను పద్యము రాజనరేంద్రునిచే మెచ్చుగా నీయఁబడినట్లు ప్రచురించియుండిరి. కావునఁ బంతులవారు చెప్పినది పర్వవిభాగముల నసమంజసము. భట్టారకులవారి కవిత్వముతోఁ దుల్యమగు కవిత్వమును జెప్పువారిం గనుంగొనుటకై భట్టారకుని తుది పద్యమునే యీయ నవసరములేదు. ఆ మహాశయుని కవిత్వ మాదినుండి తుదివఱకు నొక్క విధముననే యున్నది గాని యాపణాంబరమువలె మచ్చుకమ్మి కూర్పువేలుగను, మధ్యభాగపు కూర్పువేలుగను నుండ లేదు. కావున "శారదరాత్రు"లను పద్యముతోఁ దుల్యమగు పద్యము చెప్పినప్పుడే యతుకు సరిగ నతుకుకొనుననియు నాది సభాపర్వములలోని పద్య రాజములవంటి పద్యములఁ జెప్పిన నతుకు కలియదనియు వ్రాయుట సమంజసము గాదు. ఏవిధమునఁ జూచినను భట్టారకులవారి యారణ్యపర్వభాగమనిన లోకమున కనాదరభావము కలుగుటకుఁ గల కారణమును, నయ్యదిమాత్రమే శైథిల్యము నొందుటకుఁగల హేతువును సరిగఁ బంతులవారు తెలుపలేకపోయిరి. సంస్కృతభారతములోని యరణ్యపర్వమున కనాదరభావము లేదని ఋజువు చేసినాము. దానికే కాక యితరభాషలందుఁగల యరణ్యపర్వవిషయములలోఁగూడ ననాదరభావ మున్నట్లు గాన్పింపదు. ఉన్నయెడల శైథిల్య మొక్కయాంధ్రారణ్యపర్వమే పొందినది గాని తదితర భాషలలో నున్న యారణ్యపర్వము లేవియు నంపకుండునా? ఇంతయేల? పంతులవారు చెప్పిన శైథిల్య మాంధ్రారణ్య పర్వమునకుమాత్ర మేల కలుగవలెనో తెలియవచ్చుట లేదు. వీరనుకొనినట్లు వనపర్వప్రతులు మూలంబడి యుండలేదు. ఆదిసభాపర్వము లెట్టిప్రాచుర్యము కలిగియున్నవో యట్టి ప్రాచుర్యమునే వనపర్వమును గలిగియున్నది.

## ప్రాచీన లిఖితారణ్య పర్వప్రతులు

ప్రాచీనప్రతులఁ బరిశీలించిచూడ వనపర్వప్రతులు తప్పక వేలుగఁ బహివేయఁబడియున్నట్లు గాన్పించుట లేదు. ఆంధ్రపరిశోధకమహామండలివారి తాళపత్రగ్రంథములు పరిశోధించిచూడగా 295 సంఖ్యగలప్రతి వనపర్వశల్యపర్వములు గలదిగాఁ గాన్పించుచున్నది. 275 సంఖ్యగల ప్రతి వనపర్వములో 5, 6, 7 అశ్వాసములును విరాటపర్వమును కలసియున్నట్లు గనుపడుచున్నది. వీనిం బట్టిచూడఁ బూర్వులోకమూల వనపర్వమును బారవైచిరనుట కవకాశము గాన్పించుటలేదు. ఇతర పర్వములతో కలసియున్న యీపర్వ మొక్కటియే శైథిల్య మొందెననుట యసంగతము. కాఁబట్టి యారణ్యపర్వము భంగములపాలగుటకు గలకారణము మన పంతులవారు చెప్పినది కాదనియు మనపూర్వులు చెప్పునదియే యనియు మనము గ్రహించుకొనవలెను. అరణ్యపర్వ మాంధ్రకవితాగురుని మ్రింగివేసినదని మన వీరరాజు పంతులవారును నంగీకరించిరి. కావున పూర్వులు తెలుపు హేతువునే మనము శరణముగాఁ దీసికొనవలసియున్నది.

## ఎఱ్ఱన చేసినది శిథిలాక్షర పూరణమా?

ఎఱ్ఱనార్యుఁడు చేసినది యారణ్యపర్వము నందలి శిథిలాక్షరపూరణమే కాని యుత్తరభాగరచనము కాదనుచో మొదటి వాదమును మించిన చిక్కులు వాటిల్లును. శంభుదాసుఁడు చేసినది శైథిల్యపూరణమే యగుచో నా పూరణ మెట్టిదియో మనము గనుఁగొనవలసి యున్నది. ప్రబంధపరమేశ్వరుఁడు తన నృసింహపురాణములో తన యారణ్య పర్వపూరణముంగూర్చి ముచ్చటించుకొనెనని యు నయ్యది యాగ్రంథమునందలి "కతిపయాక్షరచాపలంబున" అనుదానింబట్టి తేలుచున్నదనియుఁ బంతులవారు వ్రాసిరి. అరణ్యపర్వములో శంభుదాసుఁడు చేసినది కతిపయాక్షర పూరణమని యీ వ్రాఁతవలనఁ దేలుచున్నది. పూర్వపు ప్రతులలో నచ్చటచ్చట నక్షరములు పోవుచు రాఁగా వాని నెఱ్ఱనార్యుఁడు పూరించెనఁట! అందుమూలముచేతనే కతిపయాక్షర చాపలమను ప్రయోగమఁట!

ఇది సందర్భవిరుద్ధమైన వ్రాఁత. అయినను వాదము నిమిత్తము దీనిని యథార్థముగా నంగీకరింతము.

## కతిపయాక్షర చాపల మననేమి?

కతిపయాక్షరచాపలమనఁగా లోపించిన యక్షరములఁ బూరించుటయనునర్థమున్న గదా మనము పంతులవారి ధోరణిననుసరించి తెలిసికొనవలసి యున్నది. ఇట్టి స్థితిలో నెఱ్ఱనార్యుఁడు చేసినది నృసింహ పురాణములోఁ జెప్పినట్లుగఁ గతిపయాక్షరపూరణమై యుండఁగా దానిని మన పంతులవారు పెంచి అక్షరపూరణ, పదపూరణ, పాదపూరణ, పద్యపూరణములుగా నెట్లు మార్చిరో తెలియవచ్చుటలేదు. పోనిండు, అక్షరపూరణ మనఁగా నట్టిదియే యండము. ఏదియైనను మిక్కిలి స్వల్పమగు పని యని పంతులవారు తేల్చిరి. ప్రాచీనకవులకు మడికిసింగన శ్రీనాథుఁడు మున్నగువారలీపూరణమును లెక్కలోనికే తీసికొనలేదనికూడ లిఖించిరి.

## ఎఱ్ఱనార్యకృత పూరణపద్ధతి

ఎఱ్ఱనార్యుఁ డారణ్యపర్వములోఁ జేసినది యక్కడక్కడ నగు చిన్నచిన్న శైథిల్యముల పూరణ మనుటయే కాక యయ్యది యైనను నాతనిచే నూతన విరచితమైనది కావనియు, బహుప్రతులు చూచి నన్నయ పాఠమేదియో తెలిసికొని దాని నాయా తావులఁ బెట్టుటయే యనియుఁ బంతులవారు లిఖించిరి. వారివాక్యములనే యీక్రింద నిచ్చుచున్నాను.

"ఉన్నయశబ్దమున కర్థము విచారింపఁగా ఉన్న దానిని పైకిలేవనెత్తుట (ఉద్ధరించుట) యనియే కాని "క్రొత్తగాసృష్టించుట" అనునర్థము లేదని విశదమగును. (ఉన్నయమ్ కూపాదితో జలాదేరుత్తోలనమ్)" దీనింబట్టి వనపర్వోత్తరభాగములో శంభుదాసుని కవిత్వము లేదనియును, నాతఁడు చేసినపని నన్నయ వ్రాసిన యారణ్యపర్వప్రతులలోఁ గొన్నిటియందుఁ బురువులు తినివేయగా గలిగిన లోపములను నట్టిలోపములు లేని ప్రతిని జూచి సరిచేయుటయనియును దేలుచున్నది. ఇదియె సత్యమగుచో నెఱ్ఱనార్యుఁ డారణ్యపర్వమునందెచ్చటను తనగద్యను వేసికొనకుండుటయును తన కందులోఁ బాలు కలవని వ్రాయకుండుటయును మిక్కిలి సమంజసమై యుండును కదా!

## శిథిలాక్షరపూరణ మొకగొప్పలోనికివచ్చునా?

పంతులవారు వ్రాసినదానింబట్టి చూడ నిప్పటి గ్రంథ ముద్రాపకులు ప్రాచీనగ్రంథముల ముద్రించుటకై క్రిమికుల పస్తాక్షరలోపాదుల బహు ప్రాచీనప్రతులు చూచి సవరించి చేయుప్రకటనము లెట్టివో అట్టిదియే యెఱ్ఱనచేసినదియు నని తేలుచున్నది.

## ఇట్టిఁడు గ్రంథకర్తపేరును జెలుపగలఁడా?

ఇట్లు ప్రతుల సవరించువాఁడు, గ్రంథకర్తలయుఁ దద్భర్తలయుఁ బేరులఁ జెలుపఁ జాలఁడుకదా! అయినను మనపంతులవారు శంభుదాసుఁడు వనపర్వశేషమున నన్నపరాజనరేంద్రుల పేరులఁ జెలుప లేదనియుఁ దన గద్యమును వేసికొనలేదనియు నట్లుచేయుట గొప్పవిశేషమనియు మఱలనీక్రిందివాక్యముల లిఖించిస్తుతించియున్నారు.

"నన్నయ కవీంద్రుఁడు విశేషశ్రమమున కోర్చి వార్థకదశయందు నవయవపటుత్వము తగ్గి పోయినను, ఓపికమెయి దీనిని రచియించినాఁడు. ఇందుఁ గొన్ని చోట్ల లచ్చటచ్చటఁ గాలవశమున శిథిలమై పోయినవి. ఇట్టి మహాత్ముని శ్రమ వూరక పోవలెనా? ఆతని శ్రమమును భూమిపై నేల నిలుపరాదు? నేనెంత శ్రమపడిననేమి? మొదటిశ్రమ మాతనిదేకదా? ఆతనికీర్తియందు నాకు భాగమేటికి?" అని యీయౌదార్యశాలి తలంచి నష్టభాగములను సాధ్యమైనంతవఱకు నన్నయపదాదులనే నిలుపుచుఁ బూరించుచు, ఎక్కడు పరిశ్రమము తనదే యైనను నందున్న నన్నయ రాజనరేంద్రుల నామములఁ జెలుప నిచ్చగింపఁడయ్యెను."

ఇటఁబంతులవారి వాక్యములు చాల సందర్భరహితములై యున్నవి. మడికిసింగనాదులచే నొకవిశేషముగ నెంచఁబడని స్వల్పశిథిలభాగపూరణము కావించిన యెఱ్ఱనార్యుఁడు గ్రంథకర్తపేరుఁ జెలుపలేదనియు నౌదార్యశాలియై పేరునిల్పెననియు వ్రాయుటయం దింతయును సరసత్వము కాన్పించుటలేదు.

## ఎఱ్ఱన తనపేరును జెప్పుకొనలేదా?

అది యటులుండ మనయెఱ్ఱనార్యుఁడు వనపర్వశేషమును దాను వ్రాసినట్లు ప్రకటించుకొని తీరినాఁడు.

కాని నన్నయ పేరుపెట్టి వ్రాసి యూరకుండలేదు. తా నరణ్యపర్వశేషోన్నయ మొనరించితినని తననరసింహ పురాణములో జెప్పుకొనియె. ఇది నన్నయకీర్తిలోఁబాలు కోరుటకాదా? ఎఱ్ఱనార్యుఁ డరణ్యపర్వశేషోన్నయ మొనరించెనని చెప్పుటయె యవసరము లేదని భూలోకమునందలి మడికి సింగనాది పూర్వకవులు తలంచియుండఁగా నెఱ్ఱనయుఁ దనకరణ్య పర్వమున నేవిధమగు పాలైన కలదని అరణ్యపర్వములో జెప్పుకొనుట అవసరముకాదని తలంచియుండఁగాఁ బరలోకమునందున్న యెఱ్ఱనార్యుని పితామహుఁడు భూలోకమునకు దిగివచ్చి తనమనుమఁడు చేసినపనిని పెద్దఁజేసి, "ఉన్నతసంస్కృతాంధ్ర చతురోక్తిపదంబుల కావ్యకర్తవై, యెన్నికమై ప్రబంధ పరమేశుఁడనంగ నరణ్యపర్వశే, షోన్నయ మాంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించితి"వని పొగడుటయెట్లు సంప్రాప్తమైనది? ఒక ప్రతిలోనిలోపముల నింకనొక ప్రతిఁజూచి సవరించుట యనునది గొప్ప కానప్పుడు తానేల తన నృసింహపురాణములో నెఱ్ఱనార్యుఁ డట్లు చెప్పుకొనియె? ఇట్లారణ్యపర్వములో తనకు భాగముకలదని తనపేరు ప్రకటించుకొనువాఁడు నన్నయభట్టారకునందలి భక్తిచే నాతని పేరే నిల్పిన వాఁడెట్లు గాఁగలఁడు? ఈప్రశ్నలకు పంతులవారు సమాధానములఁ జెప్పియుండలేదు. తాము పూర్వవాదమును ఖండించుటకై యేయుక్తులను దీసికొనివచ్చిరో, యాయుక్తులే తమవాదమును మఱింతహెచ్చుగ బాధించుచున్నవి. దానికి సరియగు సమాధానము చెప్పలేక మనపంతులవారు డోలాయమాన మానసులై యిటునటు నూగులాడుచు, పరస్పర విరుద్ధాశముల వ్రాయ మొదలుపెట్టిరి. ఆరణ్యపర్వములో ప్రబంధపరమేశ్వరుఁడు తాను క్రొత్తగ కవిత్వముఁజెప్పి చేర్చిం దేదియు లేదనియు, ప్రాచీన నన్నయపాఠములనే బహు ప్రాచీనప్రతులఁజూచి పైకి తీసెననియు నిచ్చటఁ జెప్పి, మఱల శంభుదాసుఁడు చేసినపని యల్పముకాదనియు, యతిఘనమైనదనియు మఱియొకచోట ప్రశంసింప మొదలిడిరి. ఆవాక్యముల నీక్రింద నిచ్చుచున్నాను. "ఎక్కుడుపరిశ్రమము తనదేయైనను, నందున్న నన్నయ రాజనరేంద్రుల నామములఁ జెఱుప నిచ్ఛగింపఁడయ్యెను." ఎక్కుడుపరిశ్రమ తనది యని మన పంతులవారు వ్రాసిరి. ఇక్కడ పరిశ్రమమన నేమి? 'నన్నయ పాఠముల సంపాదించుటకగు పరిశ్రమమా? తాను క్రొత్తగ గ్రంథము వ్రాయుటకగు పరిశ్రమమా? మొదటిదగుచో నన్నయ రాజనరేంద్రుల పేరు చెఱుచుట కవసరము లేనే లేదుగదా! రెండవది యగుచో నెఱ్ఱనచేసినది పంతులవారి "యున్నయము" కానేరదే? ఎఱ్ఱనచేసినది యున్నదానిని సమర్పించుట కాని క్రొత్తదానిని జేయుట కాదుకదా? పంతులవారు పూర్వులవాదమును ఖండించుటకై యెఱ్ఱన చేసినది పూర్వమున్నదానిని నిలుపుటయేకాని క్రొత్తది వ్రాయుటకాదని "ఉన్నయ" శబ్దమునుబట్టి సాధించిరి. తమ వాదమును స్థిరపఱచుకొనుటకై మఱల నిచట క్రొత్తగ్రంథరచన మను నభిప్రాయమును దెచ్చిరి. విశేషశ్రమ క్రొత్తగ్రంథరచనకే యగుచో నట్లు శ్రమచేసి గ్రంథరచనముచేసినవాఁడు తనపేరును బెట్టుకొనక యాయశస్సు నన్నయ కేలవిడచె? ఎవరును నెన్నఁడు నట్లు విడువరని పంతులవారు నొక్కి వక్కాణించి యున్నారు. కావున మొదటివాదమునకు నేచిక్కును మన పంతులవారు తెచ్చిపెట్టిరో పంతులవారి నవీనవాదమునకుఁగూడ నాచిక్కు కలిగినది. పంతులవారు వ్రాసినది యిట్టి సందిగ్ధస్థితిలో నికివచ్చినది.

## వనపర్వ విషయమున యెఱ్ఱనార్యునిది విశేషపరిశ్రమమె

ఆరణ్యపర్వవిషయములో, నెఱ్ఱనార్యుఁడు చేసినది శాశ్వతకీర్తిని సంపాదించు విశేషపరిశ్రమమే కాని క్రిమికుల దష్టనష్టాక్షర పూరణమాత్రము కాదు. అదియేదియన, తన మృదుమధుర కవిత్వముతోఁ నన్నపార్యుఁడు చెప్పఁగా మిగిలిన వనపర్వశేషమును బూరించుట. ఈయంశము భారతారణ్య పర్వాంతమున నున్న పద్యద్వయము చేతను, నృసింహపురాణమునందలి పద్యము చేతను రూఢిపడుచున్నది. ఆరణ్య పర్వాంతమునందలి పద్యద్వయ మెఱ్ఱనకృతిము కాదని పంతులవారు వ్రాసిరి. వాదము నిమిత్తము దాని నిప్పటి కంగీకరింతము. నృసింహపురాణ మితఁడు చేసినదేకదా! అందుఁ దానునారణ్యపర్వ శేషోన్నయ మాంధ్రభాష నొనరించినట్లు విస్పష్టముగాఁ జెప్పుకొనియున్నాఁడు. అరణ్యపర్వశేషోన్నయ మాంధ్రభాష నొనర్చుట యనగా నాంధ్రీకరింపఁగా శేషించియున్న సంస్కృతభాగముయొక్క యాంధ్రీకరణ



వరహూరు గోపాలస్వామి గారు



నారాయణతీర్థులవారు

మని యర్థమిచ్చును గాని యాంధ్రీకృత గ్రంథములోని క్రిమికుల దష్టనష్టాక్షరముల బహుప్రతులఁ జూచి సరిచేయుటయని యర్థము కాదు. క్రిమికుల దష్టాక్షర లోపమును ప్రాచీనప్రతులు చూచి సవరించుట గ్రంథశేషోన్నయ మాంధ్రభాషలో నొనర్చుటయే యగునెడల ప్రతిసంవత్సరమును ప్రాచీనగ్రంథముల ముద్రించు ముద్రాక్షరశాలాధికారు లెల్లరును బహు గ్రంథముల విషయములో నెఱ్ఱనార్యుఁడు చేసినపనినే చేసినవారగుదురు. ఆనందముద్రాక్షరశాలవారు, వావిళ్లవారు మున్నగు వారొక్క యారణ్యపర్వ లోపములనేగాక కవిత్రయకృతాష్టాదశ పర్వలోపములను సవరించి భారతమును ప్రచురించుచున్నారు. వీ రెఱ్ఱనార్యునికంటె నెక్కువ పని చేసినవారగుచున్నారు కదా! వీరిని భారత శేషోన్నయ మాంధ్రభాషలో నొనర్చినవారని చెప్పవచ్చునా? కూడదు. అట్టిపనినే యెఱ్ఱనార్యుఁడు చేసినయెడల నాతనినిగూడ నారణ్యపర్వశేష మాంధ్రభాషలో నొనరించినవాఁడనఁదగదు. ఆరణ్యపర్వశేషమన నారణ్యపర్వమునందలి క్రిమికుల దష్టాక్షర లోపమని యెవరును జెప్పఁబోరు. శేషశబ్దార్థముం గూర్చి వీరేశలింగం పంతులవారు చెప్పినదే సమంజసముగా నున్నది. అయ్యలార్యుఁడు యుద్ధకాండశేషమును చెప్పితినని వ్రాసికొనియె. దానిని క్రిమికులదష్టాక్షర లోపపూరణమనియె చెప్పవచ్చునా? అట్లు కాదని పంతులవారే యంగీకరించిరి. కాన వీరు చేసిన శేషశబ్దార్థము సమంజసము కాదు.

## ఉన్నయశబ్దార్థ విచారము.

ఇఁక నున్నయశబ్దార్థ విచారము గావించుకొందము. ఉన్నయ మనఁగా నున్నదాని నుద్ధరించుటయే గాని క్రొత్తది వ్రాయుట కాదని మనపంతులవా రర్థముఁ జెప్పిరి. మఱియు నుద్ధరించుటఁ గలయనర్థమును కూడదనిరి. ఆదిసభాపర్వములును, నారణ్యపర్వములో గొంతభాగమును నాంధ్రీకరింపఁబడి మఱల విరాటము మొదలు పదునైదు పర్వములును, దెలిగింపఁబడి యొక్క యారణ్యపర్వోత్తరభాగము మాత్రము తెలిఁగింపఁబడక నడుమనఁ బడియున్నప్పుడు దాని నాంధ్రీకరించి తక్కిన భాగములతో సరియగు స్థితికి దెచ్చుట యుద్ధరించుటఁ (ఉన్నయము) గాదా? కావున నారణ్యపర్వశేషోన్నయమొనరించుట యన నారణ్యపర్వశేషముఁ గ్రొత్తగ నొనరించుట యను నర్థమునకు హానియుండనేరదు. "సమున్నయన్నూతిం" అని భారవి ప్రయోగించి యుండఁగా, "భూతిం= సంపదం, సమున్నయన్ సముత్కర్షయన్" అని మల్లినాథసూరి వ్యాఖ్యలో వ్రాసె. కావున నున్నయశబ్దము క్రొత్తదానిని తెచ్చి కలిపి, యున్నదానిని వృద్ధిచేయుట యనునర్థమిచ్చునదిగానే యున్నది. అదిగాక యాంధ్రభాషలో నున్న యారణ్యపర్వమునందలి నష్టాక్షర లోపములఁ బూరించువాఁడు "నే నారణ్యపర్వశేషమును నాంధ్రభాషలో నొనరించితి" నని చెప్పుకొనవలసరము లేదు. ఆంధ్రమున నున్న గ్రంథమునందుఁ గాలవశమునఁ గలిగిన క్రిమికుల దష్టాదినష్టభాగముల బహుపూర్వప్రతులఁ జూచి సవరించువాఁడు "నే నారణ్యపర్వశేషమును నాంధ్రభాషలో నొనర్చితి" నని చెప్పుకొననేల? ఆంధ్రమున నున్న గ్రంథమునందలి సవరణము లాంధ్రమనంగాక మఱియొక భాషయందగునా? ఆరణ్యపర్వోత్తరభాగము సంస్కృతమున మాత్రమే యుండి తెలుఁగున లేకపోవుటచే తానాభాగము నాంధ్రీకరించి, యాలోపమును పూరించినవాఁడు కావుననే "యరణ్యపర్వశేషోన్నయ మాంధ్రభాష సుజనోత్సవమొప్పగ నిర్వహించితి" నని యెఱ్ఱనార్యుఁడు చెప్పుకొనినాఁడు. తాను చేసినపనిని తనగ్రంథములలో గొప్పగా జెప్పుకొనినాఁడు.






(సంపుటము ౨, సంచిక ౫ తరువాయి)

ఉ. క్రించుదనంబునం జెలఁగి క్రిందును మీదును జూడఁబోక న
ర్తించెదు నీవు మాదృశసతీజనతాసుచరిత్ర మేగతిన్
గాంచఁగనేర్తు వౌర కలకాలము నుత్పథచారివైన నిన్
మంచిగ దిద్ద బ్రహ్మతరమా? పెఱమాట లిఁకేల రావణా! ౨౬

ఉ. దానవనాథ! సారె ననుదాకఁగఁ జూచెద వృద్ధతుండవై
నేను శపించినన్ బ్రతుకనేర్తువె నాపతి యానతీయమిన్
మానితిఁగాక లేనియెడ మత్సుచరిత్ర మహాగ్నికీలలన్
మేను క్షణార్ధమాత్రమున నీఱయిపోవకయున్నె యెన్నఁగన్. ౨౭

చ. పుడమియు లచ్చిగోలుపడి పొక్కుచు నొంటిగఁ గాననంబులో
నిడుమలఁ జెందనేల సిరులిచ్చెదనం చధికాశఁ గొల్పు లో
బడుదునె రావణుండ! కులపాలిక భర్తకుదక్క లాతికిం
జెడిపి తెఱంగునన్ సిరికిఁ జేపడనెంచునె? యెన్నఁడేనియున్. ౨౮

చ. వనములలోవసించి క్రతువర్గముసల్పుచుఁ గందమూలముల్
దిని మనుచున్ జనార్దను మదిన్ నెఱనమ్మి భజించుచుండు స
న్మునులను ద్రుంచియున్ మిగులనొంచియు నెవ్వగ పొందఁబోని నీ
మనుగడయేల నీ నిరుపమానపరాక్రమమేల రావణా! ౨౯

శా. నీరుండ్రావియొ గాలినిన్ మెసవియో నిష్కాములై నిత్య మా
త్మారాముల్ మునులాశ్రమంబులఁ దపోధ్యానాదులన్ సల్పుచో
వారిం బల్మరుబట్టి డెందములు నొవ్వంగొట్టినా వక్కటా!
క్రూరా? రాక్షసనాథ! తత్ఫలము నీకున్ వేగఁ జేకూఱెడున్. ౩౦

ఉ. వారిని వీరినోర్చి కడువన్నియ కెక్కితినంచు నిక్కుచున్
సారెకు నిన్ను నీవె నుతిసల్పికొనన్ విని వీరు లెంతుకే

వీరకులాగ్రగణ్యుఁడని విశ్రుతి గాంచెడు రామభద్రునిన్
పోరున గెల్చినం బొగడుఁబో నిను నీజగమెల్ల గర్వితా. 3౧

చ. ఇనకులనేతయౌ దశరథేంద్రునికోడలి రాజయోగియౌ
జనకుననుంగుఁ గూఁతు నతిశౌర్య జితోద్ధత వైరియైన రా
మునిసహధర్మిణిన్ విబుధపుంగవసన్నుత పూతచర్య నన్
జెనకఁగఁజూచు కూళలకుఁ జేటొనగూడకయున్నె పాతకీ. 3౨

చ. పుడమి ననంగు రాజఋషిపుంగవకోటుల నేమఱించి పైఁ
బడి కడునొవ్వఁగొట్టి పలుబాములఁ బెట్టియుఁ బారనెట్టియున్
పొడువతనంబునన్ దురుసుపోకల మీఱి మెలంగుచున్న నీ
పొడవడగింప రాముఁడయి పుట్టెను విష్ణుఁడు నమ్ము రావణా. 33

చ. తనువు దొలంగు కాలము మిదె దాపురమాయెను నీకుఁ గాని వో
నను నిటు లేల తెత్తువల నాపతి శ్రీపతియంచుఁ జెప్పినన్
వినవు దురాత్మ! రావణ! వివేకవిహీనుఁడు చెట్టత్రోవఁ బ
ట్టి నడుచుఁగాని విచ్చలవిడిం దనకీడు గణించునే మదిన్. 3౪

చ. తలకడు కీడు సేతలకు ధర్మ్యపథంబున నొక్కనాఁడునున్
మెలఁగఁ దలంపఁబోవఁ డవినీతికిఁ గొంకఁడు లాతికాంతలన్
గలఁచును మొండికట్టె యనఁగా నితఁ డేయని రోయ నిస్సిరో?
నలుగురినోళ్ల లోనఁ బడినావిక నీబ్రతుకేల తుంటరీ. 3౫

చ. చదువగలేదె వేదములు శాస్త్రములుం గనలేదె నీతి నీ
యెద కితరాంగనాజనుల నేచుట కీడని తోచలేదె దు
ర్మదమునఁ గన్నుగాన కిటు మాటికిఁ బైకొనఁజూతు వౌర! నీ
బ్రదుకు బయల్పడన్ జగతివర్తిల సిబ్బితిలేదె మూర్ఖుడా. 3౬

చ. నలువకు మన్మడంట? యిరునాలుగు దిక్కుల గెల్చెనంట? ని
చ్చలు శివపూజసల్పునట? సాటియొకింతయులేని సంపదన్
వెలసెడునంట? రక్కసులు సేవురుగొల్వఁగ మించునంట? నిం
దల కొడిగట్టెనంట? యని నల్వురు నవ్వఁగ నొత్తె రావణా. 3౭

చ. సురవరవర్ణినీజనులు సుందరమూర్తులు నప్సరోంగనల్
దురపిల భంగపెట్టి బలుతుంటరివై నను లంకలోని కీ .

వరుసను దెచ్చి నెవ్వగలపాలొనరించితి వోరి! నిన్నుఁ గన్
ధరసుజనుల్ ప్రసంగవశతం గడుఁ దిట్టక మాన రుద్ధతా. ౩౮

ఉ. చక్కనిచుక్క వేలుపులసానిని రంభను బల్మిబట్టినన్
జక్కలఱేనిపట్టి విని శాపమొసంగుటఁజేసి కాదె నా
దిక్కున నీనిసర్గమగు తెంపును జూపకయుంటి కానిచో
నెక్కడ నిల్వనీక యలయింపకయుందువె నన్ను ధూర్తుఁడా.' ౩౯

ఉ. క్రూరపుఁ గర్మముల్ సలుపు కొంటెలలో మొదలింటివాఁడవై
యూరక యాగతింజెడక యోరుపుఁ గైకొని యిప్పుడేనియున్
తారకమంత్రరాజమును దత్పరతన్ జపియింతువేని నీ
పేరును బెంపు నిల్చు నిటు విన్మ నిజం బిది దానవాధిపా. ౪౦

చ. కరుణకు నుక్కుపట్టు బుధగణ్యచరిత్రము పట్టుఁగొమ్మ ని
ర్భరతరశాంతితావు నయపాలననైపుణి జీవగఱ్ఱ భా
స్వరగుణరత్నరాశి నృపవర్గలలాముఁడు రాముఁ డెన్నఁగన్
శరణముఁ జొచ్చినన్ సహజశాత్రవునేనియుఁ గాచు రావణా. ౪౧

చ. మనమున రామనామమును మానక సంతతమున్ స్మరించుచున్
దనదురవస్థఁ బాపికొనఁదగ్గ యుపాయమె చూచెఁగాని యా
వనమును గన్నులెత్తి నలువంకలఁజూచి యెఱుంగ దా సతీ
జనమణి సీత! తుచ్ఛసుఖసంపదఁ గోరుదురే కులాంగనల్. ౪౨

ఉ. రక్కసిబోంట్లు చేరి యల రావణుఁ గూడకయున్న నీయొడల్
ముక్కలుచేసి మెక్కెదముపో యని సారెకు భీతిఁగొల్పినన్
చిక్కులువెట్టినం దవిలి సీత తదుక్తుల కియ్యకోదహో ?
చిక్కెనె సాధ్వి నీచులకుఁ జెల్లరె కొండొకనాటికేనియున్. ౪౩

ఉ. మాయలమారులైన బలుమానిసిదిండిపడంతు లెప్పుడుం
బాయక చుట్టునిల్చి చెడుపల్కులు పల్కిన నేవగించి స
ద్గేయచరిత్రయైన పతి దేవత శీలముఁ గాచికొన్న సీ
తాయికి సాటివచ్చు వనితం గనుగొందుమె వేయునేటికిన్. ౪౪

ఉ. మచ్చరికించి రావణుఁ డమానుషచర్యను దన్ను బల్మిమైఁ
దెచ్చుటఁజేసి యెల్లరకుఁ దీరని సందియ ముందునంచు పై
యచ్చరబృంద మద్భుతమునందుచు సన్నుతిసల్పఁ జిచ్చులోఁ
జొచ్చి మహీజ నైజపరిశుద్ధతఁ జూపెఁ ద్రిలోకవంద్యయై. ౪౫




ఆరిద్ర శేషగిరి రావు గారు (సారస్వతసమాజము)

భారతి (సం. ౨: సం. 3.) లో శ్రీపారనంది జగన్నాథస్వామిగారు శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి "భీష్మప్రతిజ్ఞ" యను నాటకమును విమర్శించియున్నారు. ఏతద్విమర్శనమున స్వామిగారు అసంగతములు, అసందర్భములు నైన దోషముల నుద్ఘాటించుటయే గాక పెక్కుతావుల గుణములను దోషములుగాఁ బరిణమింపఁజేయుటచే సత్యము నుపలక్షించి నే నీప్రతివిమర్శనము వ్రాయ దొరకొంటిని.

## ౧

## కథానిర్వాహణము

'కృతిని చక్కఁగా మథిస్తేనే కాని కవిహృదయము తెస్సగా గ్రహించవీలుకాదనిన్నీ, ఆలాగుచేస్తేనే కాని రసాస్వాదనసుఖము పొందవీలుండదనిన్నీ,' ఎఱిఁగియుండియే తామీరూపకవిమర్శనము చేయుచుంటిమని స్వామిగారు తొలుదొల్త చాటిచెప్పుటనుబట్టి వారీనాటకమును మథించియున్నారని మన మూహింపనై యున్నది. కాని ఈవిమర్శన చదివినవారలకు స్వామిగారికి నాటకముతోఁ గల పరిచయము కొద్దియని తోఁచకమానదు. ప్రథమాంకములో అశ్వమేధాంగమైన దిగ్విజయము వర్ణింపబడినట్లు విమర్శకులు వివరించుచున్నారు. ఇది యెంతయు హాస్యాస్పదముగ నున్నది. నాటకములో అశ్వమేధప్రస్తావనే లేదు. శంతనుఁడు చాటఁబంచిన దిగ్విజయము సార్వభౌమప్రతిష్ఠకని కంఠోక్తిగా నాటకమున వ్రాయబడియుండ స్వామిగారీదిగ్విజయము అశ్వమేధాంగమైనదని అపోహపడి అందుమీఁద తమకు దామే సంకల్పవికల్పములు గావించుకొనుచు అశ్వమేధాంగమైన దిగ్విజయము కథకు అప్రస్తుతమని, అశ్వమేధయాగదీక్షాపరుఁడైనరాజు నగరములో నుండవలసినదే కాని అశ్వముతోఁబోవు సేనలోనుండుట యొక్క అప్రసిద్ధమైన ఏర్పాటని, భార్యారహితుఁడైన శంతనుఁడు అశ్వమేధమొనర్చుచుండెననుట హాస్యాస్పదమనియు నధిక్షేపించుచు రెండుపుటలగ్రంథము వ్రాసిరి. ఇవి విమర్శకుని అపోహపై నాధారపడియున్నవనుటకు నాటకమునుండి నిదర్శనము లెత్తి చూపుచున్నాను.

పుట 22:—గురువరా! విజయ యాత్రకు వచ్చిన నాయనగారి వీరఘోషణ విని పరాక్రమించితిని.

పుట 23:—కౌరవా! ఏమి! పెద్దయొత్తె త్తితివి? ఇపుడున్న రాజులలో నీవే మగవాఁడవుగాఁబోలు! జాహ్నవీతీరవీరులందఱు కప్పము లర్పింపవలయునే?

పుట 28:—శిష్యా! అప్రతిహతవీర్యంబున దిగ్విజయంబొనర్చి నీతండ్రికి సార్వభౌమప్రతిష్ఠ నొడఁగూర్చి జగత్ప్రసిద్ధుఁడవై చిరంబు జీవింపుము.

పుట 31:—కావునఁ బౌరవ వంశభూషణులగు నాయనగారికి సార్వభౌమ ప్రతిష్ఠ కరతలామలకమైనది.

సార్వభౌమ ప్రతిష్ఠాపనార్థము శంతనుఁడు విజయయాత్రకు వెడలెనని నాటకమున నిట్లు విస్పష్టముగనుండ అశ్వమేధాంగమైన దిగ్విజయమొనర్చెననుటకు విమర్శకుల కాధారమెక్కడిదో? మఱియు.

ఉ. భాగతవంశ భూషణుఁడు
బాహుపరాక్రమదాంతపక్షిమో
ర్వీరమణుండు శంతనుఁడు
వెల్వడె దిగ్విజయేచ్ఛ జాహ్నవీ
తీరప్రవీరులార! యరు
దెంచెదరా యరియప్పనంబులన్

గౌరవబుద్ధి నీయదు? నటు
గాక రణం బొనరింపవత్తురా? (పుట. 6.)

అని వీరఘోషణము. ఇందు అరిఅప్పనములఁగొని తెంపనియేగాని అశ్వమును బట్టరం డను వీరాహ్వానము లేదు. ఈయది అశ్వమేధాంగమైన దిగ్విజయమే యగుచో నశ్వమును బట్టగం డను వీరాహ్వాన ముండియుండదా? ఇంతకును నాటకమున అశ్వమే లేదు. అశ్వప్రస్తావనయే లేదు.

ఉ. ఊరును బల్లెయాశ్రమము
నుగ్రవనంబును నాక వేడ్కమై
వారణమెక్కి దుందుభిని
బాఁదినమాత్రేఁ బ్రతిష్ఠవచ్చునే? (పుట. 7.)

తొండముతోఁ బతాకఁ దాల్చిన మదగజంబు ముందు వచ్చుచున్నది. (పతాకం బరిశీలించి) దీనిపై యక్షరపంక్తియేమి!— శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ శంతను చక్రవర్తి దిగ్విజయపతాక......(పుట. 6 )

మాటలింకా? స్వామిగారు భావించినట్లు కౌరవ సేన పురోభాగమున నడచినది గుఱ్ఱముకాదు. అదియేనుగు. దానిగండస్థలమునఁగట్టినది విజయపతాకగాని విమర్శకు లనుకొనినట్టుల యాగపత్రికకాదు. గ్రంథము 'మథించుట' యటుంచి పరిశోధనదృష్టితోఁ బఠించి యుండినను విద్యావివేకసంపన్నులగు స్వామిగారిట్టి అసందర్భములకుఁ దమవిమర్శనమునఁ దావిచ్చియుండరని సవినయముగ మన విచేయుచున్నాను.

శాంతపావనములగు తాపసాశ్రమములందు దుందుభిని బాఁదినట్లు వర్ణించుటలోఁ గవి అనౌచిత్యము గలిగించెనని విమర్శకు లనుచున్నారు. భూవిజయ మొనర్చి సార్వభౌమత్వము నొందఁగోరువసుమతీశుఁడు లోకమున మందునకైన ప్రతివీరుఁడు లేకుండఁ జేసికొనవలసి యున్నది; కావున శంతనుఁడు 'ఊరును బల్లె యాశ్రమము నుగ్రవనంబును నాక' సర్వత్ర రణదుందుభిని మ్రోయింపించెను. ఈవిషయమును కవియే ఒకపాత్రచే నిట్లు చెప్పించెను.—

పుట 7:—ఎందయిన నిట్టివాఁడుండవచ్చునని యే మన సేనాని సర్వత్ర చాటించుచుండవలయు నని యాజ్ఞాపించె

ఇట్లగుట నిం దనౌచిత్యమేమున్నది? ...

దేవవ్రతుని విద్యాభ్యాస వర్ణనములో మూలాతిక్రమణమున్నదనియు, అట్టిమూలాతిక్రమణకుఁ గారణము దురూహ్యముగానున్నదనియు నాక్షేపించిరి. ఒకానొక ఇతివృత్తము నెంచి తీసి రూపకముగా సవరించి రసావిర్భావమునకుఁ బాత్రశీలవర్ణనమునకు వీలు గల్పించుకొనవలసిన కవికి సంపూర్ణ స్వాతంత్ర్య ముండవలయును. అట్టిచో మూలాతిక్రమణము దోషముగాఁ బరిగణించుట పాడిగాదు. కృతిప్రణేత కామాత్రము స్వేచ్ఛ లేనిచో రసపోషణము పాత్రపోషణము గావించి నాటకమునకు జక్కదనముఁ గొనిరాఁగల్గునా? దేవవ్రతుని విద్యాసంపాదన వర్ణనములో శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారు సంస్కృతాంధ్ర భారతములందు లేని,

సీ. చదివించినాను బ్రా♦జదువులు నాలుగు
గురువరుండగు పరా♦శరునియొద్ద

నేర్పించినాను సా♦న్వీక్షికీవిద్యలు
ఘనతపోధనుఁడు భా♦ర్గవునియొద్ద
..............................
(పుట' 25)

అను రెండువిషయములు పెచ్చు చెప్పి నాటకమందలి భీష్ముని సంస్కృతాంధ్ర భారతములందలి భీష్ములకంటె విశేష విద్యావంతునిగాఁ బ్రేక్షకహృదయాకర్షణపాత్రునిగాఁ జిత్రించి పాత్రవర్ణనము చక్కఁబఱచినారు. ఈమార్పుచేత పాత్రపోషణమునకు రసనిష్పత్తికిఁ గవి విమలశేముషీవిశేషముచేఁ గొనితెచ్చినది కాని రసజ్ఞానము పాత్రౌచిత్యముఁ బాటింపక మార్చినదికాదని గ్రహించెదరుగాక!

కథానిర్వహణములో మఱియొక ఆక్షేపణ మునర్చిరి. ఇది గాంధర్వ రాక్షస వివాహవర్ణనకు సంబంధించినది. వధూవరులు సమ్మతించి యమంత్రకముగాఁ జేసికొను వివాహము గాంధర్వమనఁబడును. అట్టి వివాహమునకు సత్యవతియనుమతిఁ గైకొనుటకై శంతనుఁడు

పుట 48:—ప్రియభాషిణీ! శకుంతలాది రాజకన్యాచరితంబులు వినియున్న నీకు గాంధర్వము విధి విహి

తము గురుసమ్మతమగునని మరల మరలఁ జెప్పవలయునా? అని వచింపఁగా సత్యవతి ఇట్లని జవాబిచ్చినది.—

పుట 49:—భూనాయకా! నా దొక్కమనవి. గురుజనంబు దగ్గఱలేనివారికి గతియైన గాంధర్వమునకు నామన సొడఁబడక యున్నది. పిమ్మట నాటనుండి పెంచిపెద్దదానిగాఁజేసిన తల్లిదండ్రుల మన స్సొక్కసారిగాఁ జివుక్కురు మనునని ఆమె గాంధర్వమున కనుమతింపలేదు. నలచిన హృదయ మున్నప్పుడు శంతనుఁడు రాక్షసవివాహ మంగీకరించుటకు ఆటంక మేమున్నదని విమర్శకుల ప్రశ్న. నాయిక గాంధర్వమున కియ్యకొనకుండుటకుఁ గారణము రూపించి చెప్పి నాయకుఁడు రాక్షస మంగీకరింపకుండుటకు నేయుపపత్తిని వచింప లేదట. రాక్షసమనఁగా బలాత్కారమునఁ గన్య నపహరించుకొని వచ్చి చేసికొనెడు వివాహము. అట్లు శంతనుఁడు బలాత్కరించి దొంగిలి పోయి పరిణయమగుచోఁ దండ్రి మనము నొప్పించినదాన నైతినేయని పితృవత్సల యగు సత్యవతి కంటఁగిల్లును. శంతనచక్రవర్తి స్వార్థపరాయణుఁడుగాక పరాభిప్రాయములను గౌరవదృష్టితోఁ ఆలకించు ప్రాజ్ఞుఁడగుటచే సత్యవతి మనము నొవ్వఁజేయుట కాతని కిష్టము లేక పోయినది. దాశరాజునను మతి బడసియే తానామెను పెండ్లియాడఁ గృతనిశ్చయుఁడైనాఁడు శంతనుఁడు.

పుట: 49.—......రమణీ! నీయభిప్రాయమున మనమనోరథము దాశరాజసమ్మతంబు గావింప నిశ్చయించితిని.

సత్యవతి మనస్సునకుఁ దీరని చింతగల్గునను భయసంకోచమే శంతనుఁడు రాక్షస మంగీకరింపకుండుటకు గారణమని తెలియఁదగును.

విమర్శకులు, ప్రాచీనార్వాచీన నాటక కర్తలు ప్రఖ్యాతేతి వృత్తములను ప్రదర్శనానుగుణముగా రసపుష్టి దాయకముగా ఏయేవిధముగా మార్పు చేసికొనుచు వచ్చిరో ఎఱిఁగియుండియు నెఱుఁగనట్లు, ఈనాటకములోని రెండవ యంకములోనికథ 'ఇది తెనుఁగునుండి సంగ్రహించినది. ఇది సంస్కృతమునకు సరిగానే ఉన్నది' అని వ్రాయుచు 'దానిలో శకుంతలాపరిణయానుకరణము తప్ప మఱేమియు లేదు' అని భారతకథకంటె నాటకకథ ఇసుమంతయు మారకూడదను అభిప్రాయముతోఁ గాఁబోలు విమర్శనకు మఱేమియుఁ దోచక చిత్తమువచ్చినట్లు విమర్శించినారా యనునట్లుగా అసంగతముగాఁ గొంత వ్రాసిరి.

సత్యవతీశంతనుల సమావేశకథ చదువునపుడు అది శాకుంతలకథననుకరించి యున్నదని నాటకమును 'పఠించుట'చే వీరికే తెలిసినదని సంతోషించుచున్నారు కాఁబోలు. సత్యవతీశకుంతలల జననాదివృత్తాంతమునకు నెక్కువ పోలికయున్నదని అక్షరాస్యుల కెల్ల తోచకపోదు. అట్లు తోచకుండ చేయుటకు వీలును లేదు. అట్లు చేసినచో సారస్యమును ఉండదు. కావుననే వానికున్న పోలికలను తొలగింపలేక అనుకరణము విస్పష్టమగుచున్నదను అభిప్రాయముతోడనే గాబోలు కవి శంతనునిచే నాతని మనోరథము సత్యవతికిఁ దెలియఁజేయుట కనుగుణముగా నిట్లు చెప్పించియున్నారు.

పుట 46:—సుశీలా!......తక్కిన నీవృత్తాంతము శకుంతలోదంతమునకు సరిపడుచున్నది...అట్లయిన మనమాశకుంతలనుబట్టి ప్రాచీనబాంధవంబున సంబంధించితి మెఱుఁగుదువా?

ఇంతకును నాటకములో పాంథాశ్రమవర్ణనమునఁ గాని సత్యవతీశంతనుల సమావేశమునఁ గాని మఱియొకచో గాని 'శకుంతలాపరిణయానుకరణము' లేనేలేదు. శకుంతలా సత్యవతుల చరిత్రములకు సన్నిహితసారూప్యమున్నది. వారిరువురుకూడ నచ్చరలకుఁ బుట్టినవారు. ఇద్దఱును పరులపంచల బెరిగినవారు. శకుంతలను దుష్యంతుఁడు సత్యవతిని శంతనుఁడు మృగయావిహారానంతరము ఒక్కటేస్థితిలోఁ జూచి వలపుగొన్నారు. ఇట్లగుటచే సిద్ధమైన ఈయంశమును అనుకరణమని ఆక్షేపించుట అనర్హమని తోపకపోదు. కావున విమర్శకు లనుకొనినటులు శకుంతలాపరిణయప్రస్తావన అనుకరణమై కథాసారస్యమునకు భంగము కల్గింపకుండుటయేగాక మీదు మిక్కిలి నయ్యది సిద్ధవిషయమై నాటకమున కొక విధమైన రుచి విశేషమును హత్తించి శంతనుని గంభీరునిగా గడుసువానిగాఁజేసి పాత్రశీలమును పరిపోషించుటకు సాయపడినది. శకుంతలాపరిణయ ప్రస్తావనయే లేనిచో శంతనుఁడు సత్యవతితోఁ 'దరుణీ! నిన్ను నేవలచితిని. నన్ను చేపట్టుమ'ని 'అచ్ఛవైటికము'గా నని గాంభీర్యము గడుసుఁదనము లేని

'వెత్తిబాగుల తండ్రి'-గావలసివచ్చును. అట్లుగాక శంతనుఁడు శకుంతలాపరిణయవృత్తాంతమును సత్యవతికిఁ జెప్పి వ్యంగ్యముగా గడుసుఁదనముగాఁ దనమనోరథమును వెల్లడించినాఁడు.

మ. జలజాక్షీ! విను మస్మదన్వయమునన్
జన్మించి నీ వాశకుం
తలయుం జూడ సగోత్రులై తిరిగదా
ధన్యుండు దుష్యంతుఁ డే
నలపౌరవ్యులమై సగోత్రులమె కా
మా కావ నీవేను బం
ధులమైనారము తొంటిమట్టికి నమం
దుం గల్గు మేలెంచుమీ! (పుట 47)

'నాటకము త్రేతాయుగ సంబంధమైన ప్రాచీన నాగరకతను జెందినదైనా కుర్చీలు, పడకకుర్చీలు, వార్తా పత్రికలు మొదలైన సామగ్రి నాటకములోకి కవి తెచ్చెనని విమర్శకు లాక్షేపించుచున్నారు. కుర్చీలు మొదలైన ఆసన సామగ్రి లేకయే పూర్వులు మహాసామ్రాజ్యములను బరిపాలించిరా? అట్లయినచో 'ఆసంది' అనుపదమునకు విమర్శకు లేమి అర్థము చెప్పుదురో? వార్తాహరులతోఁ బాటు వార్తాపత్రికలుగూడఁ బూర్వముండినవో లేవో కాని నాటకమున మాత్ర మెచ్చటను లేవు. గ్రంథముతో విమర్శకులకు సాంగత్యము తక్కువగుటయే యిట్టి విచిత్రవిమర్శనకుఁ గారణము.

మఱియొక ఆక్షేపణ 'యౌవరాజ్యాభిషేకమప్పుడు శంతనుఁడు, సామంతరాజ్యపరిపాలన చర్చసమయమున దేవవ్రతుఁడు చేసినపౌరజనసభలు, ఆసభలలోని వాదప్రతివాదములు ఈరోజులలో జరుగుతున్న సభల అనుకరణము'లట. చిరకాలమునుండి మనదేశమున పౌరజన సమావేశములు జరుగుచున్నవనుటకు నిదర్శనములు కుప్పతెప్పలు. ద్వాదశవిధమంత్రులు నొక్కచోఁగూడి రాజ్యాంగవిషయమై వాదప్రతివాదములు జరుపుకొను చుండిరని శుక్రనీతిసారము చాటుచున్నది. చంద్రగుప్తుని కాలమున పౌరజన సభలున్నవనుట చరిత్రజ్ఞులకనుభవపునరుక్తమే. ఉత్తర రామచరిత్రలో అంతర్నాటకమును పౌరజనసమావేశవృత్తాంతసంపాదనార్థముగదా రాముడు ప్రదర్శింపించినది. రామాయణకాలమునాటికే వ్యాప్తికెక్కియున్న పౌరసభలు భారతయుగమున లేకుండునా? భారతములోఁ గృష్ణరాయబారమునాటి పౌరజన సమావేశముకంటె పూర్వము పౌరజనసభలున్నవనుటకు నిదర్శనమేమి? ఇన్ని నిదర్శనము లున్నను శంతనుఁడు దేవవ్రతుఁడు గావించిన పౌరజనసభలు నేటిసభల యనుకరణములనుట సాహసమే యగును గదా!

## ౨

## రసపోషణము

ఇఁక రసవిషయమున స్వామిగారు చేసినవిమర్శనలు చర్చింతము. ప్రథమాంకమున రససాంకర్యము కల్గినదఁట. తన(దేవవ్రతుని యనుట) విచిత్రచరిత్రముఁ దెలిసికొనుటతో జాలిపుట్టించు నచటిపూర్వవృత్తాంతము స్మృతికి వచ్చుటచే నివ్వెఱఁగంది వీరాలాపము లుజ్జగించి శాంతుఁడైన శంతనుచక్రవర్తి మాఱుఁజూచి భీష్ముఁడు "వీరము శాంతమై శాంతము కరుణమైన" (పుట. 20)దనుకొనిన మాటల ముందిడుకొని 'అలంకారికుల మతములో విరుద్ధములనే వీరశాంత కరుణారసములకు మైత్రి' కల్పబడినదనుటకంటె సాహసము మఱియొకటుండఁబోదు. రసనిర్వచనము, నిరూపణము ప్రకరణము ననుసరించి యొనర్పవలయునుగాని ఒకటిరెండు వాక్యశేషములఁ బురస్కరించుకొని వీరము, శాంతము, కరుణ అనుపదములతోడనే ఆయారసములు పోషితములయ్యెననుట హాస్యాస్పదము.

రసనిర్వచనములో నిట్లుఁ బొరపడుటయేగాక స్వామిగారు విమర్శకులు చూపవలసిన నిష్పాక్షిక బుద్ధిని గౌరవదృష్టిని విసర్జించి—'వీటిలో వ్యక్తమైన శృంగారాదులతో బీభత్సక్రోధఅద్భుతములను మాత్రము కలపక పోవుటచేత నవరసముల ఏకీభావమునకు సమయ మొకటి పోయినట్లైనది'— అని కవిని గేలిగొట్టుటకుఁ గూడ దొరకొనిరి. ఇట్టిహేళన సద్విమర్శకు లొనర్పవలసినది గాదు.

ప్రథమాంకమునందు రససాంకర్యము గల్గినదని వచించుచు మొత్తముమీఁద రూపకమున ప్రధానరస మిట్టిదని నిరూపించి చెప్పుటకుఁగూడ నవకాశము లేదని స్వామిగా రనుచున్నారు. ఇదియును నిలువఁజాలని యాక్షేపణయే. వీరరసముచే నాయకుని ప్రవర్తనము చక్కఁగాఁ బరిపో

షింపఁబడి మిక్కిలిగాఁ బరిపుష్టినొంది నాటకమున విశేషప్రస్తావన గావింపఁబడునో అదియే ప్రధానరసమని అలంకారిక నిర్వచనము. నాయకుని ప్రవర్తనము దేనివలన ప్రకాశితమును జరితార్థమున్ను నగునో అది అంగరసముగును. ఈనాటకమున శాంతనవుఁడు నాయకుఁడు. ఆతని ప్రవర్తనము వీరరసముచేఁ జక్కఁగాఁ బరిపోషింపఁబడి పరిపుష్టినొందినది. కావున, వీరమే ఈరూపకమున ప్రధానరసమని నిర్ణయింపవలయును. పితృసపర్యకై కులక్రమాగతమైన యైశ్వర్యమును విడిచి అడవులకుఁబోయిన జీమూతవాహనునివలె; పితృశుశ్రూషా సుఖలాలసుఁడై స్వశక్తిచే సంపాదించిన ప్రాజ్యసామ్రాజ్యమును ద్రోసి, ఇహలోకసౌఖ్యభూమియైన వివాహమును విసర్జించి, స్వశరీర సౌఖ్యదాన మొనర్చి తానొనర్చిన దానమునకు రక్షాబంధముగ నుండునట్టుల శాశ్వత బ్రహ్మచర్య మను భీషణ ప్రతిజ్ఞ పూని ప్రేక్షకులను వీరరసోత్కర్షచేఁ దెప్పలుఁదేలించిన రాజ్యసుఖ నిరభిలాషి, ఇహలోక వాంఛావిముఖుఁడు, త్యాగవ్రతశీలుఁడు నగు భీష్ముని అనుసరించియున్న వీరరసము ప్రధానమగును. దానదయాయుద్ధము లనెడు త్రివిధ వీరములలో దాన యుద్ధములనెడి ద్వివిధవీరము లీ నాటకమున వర్ణితములు. సర్వాతిశాయిజిగీషుత్వమును సూచించు యుద్ధవీరమును, విశ్వాతిశాయి సౌజన్యమును గనఁబఱచు దానవీరమును నెఱపి మహావీరుఁడు, మహోదారుఁడునై భీష్ముఁడు నాటక ప్రేక్షకులకు రసోద్రేకము పుట్టించి వెలుఁగొందుచున్నాఁడు. నాయకునియందు వర్ణింపఁబడిన యుద్ధ దాన వీరములలో యుద్ధవీరము ప్రాసంగికము. దానవీరము ప్రధానము. ఎట్లందురా? సత్యవతీశంతనుల పరిణయ పూర్వకమైన శృంగారము శాంతనవుని దానవీరమును జరితార్థమొనర్చుచుండుటచే అంగరసమగుచున్నది. ప్రధానాంగమైన ఏశృంగారరసమును నిర్వహించుచు అంగియైన ఏదానవీరము పరిపోషింపఁబడి చరితార్థమై ఉత్కర్ష కల్గించుచున్నదో అది ప్రధానముగాక మఱియొకటి యెట్లు గాఁగలదు? అట్లగుట నీప్రతిజ్ఞాశాంతనవనాటకమున దాన వీరము అంగిరసము, శృంగారము అంగరసము నగుటయు, విమర్శకు లూహించినటు లిందు రసద్వైవిధ్యము పొసఁగకుండుటయు విదితమే.

వీరము నాటకమున ప్రధానరసమని నిర్ణయించినచో నాయిక లేకపోవునని విమర్శకు లనుచున్నారు. నాగానందనాటికయందు తుదిరెండు అంకములలో వర్ణితమైన జీమూతవాహనుని దయావీరమునకు నాయిక ఎవరు? మలయవతి యనుట అసంగతము. అటులనే ఈ నాటకమున గూడనని ఊహించునది.



## ౩
## పాత్రపోషణము

ఇఁక పాత్రపోషణవిషయమై చర్చింతము. శంతనుని పాత్రశీలవర్ణనములో శాస్త్రిగారు మూలమునందు చలచిత్తుఁడుగా, స్వార్థపరాయణుఁడుగా, 'యంజేద'గా నున్నవానిని ధీరునిగా, గంభీరునిగా, నుదారునిగా, శాంతునిగా మార్చియుండగా నాటకమున శంతనుఁడు ఉత్తమనాయకలక్షణలక్షితుఁడుగాక స్వకార్య నిర్వహణదక్షతలేని ఈబరిగొట్టువలెఁ గన్పట్టుచున్నాఁ డని స్వామిగా రనుచున్నారు. మూలమునందు శంతనుఁ డాత్మజునితో 'వావిడిచి' బహుపుత్రార్థంబు యత్నంబు సేయవలయు, వివాహంబయ్యెద'నని చెప్పుట అనౌచిత్యముగ నుండి రసాపకర్ష మొనర్చుచు శంతనుని గాంభీర్యమునకుఁ దీరని వెలితి దార్చుచున్నది. నాటకమునను శంతనుఁడు పొంగి పొరలివచ్చుచున్న ప్రేమప్రవాహమును ధైర్యముతో నరికట్టి, తన అభిలాషోన్నతి స్థైర్యముతో నణఁచివేసి అంతరంగికులగు మంత్రిపురోహితుల నొద్దనైన తనకుఁ దానై పెండ్లియూసునెత్తక వారాప్రసంగ మెత్తినపుడు గూడ వివాహవాంఛావిముఖత్వమును వెలిబుచ్చి ధృతదీక్షుడై ఔచితీనిర్వహణమునకు రసనిష్పత్తికి సాధనమగుచున్నాఁడు. శంతనుఁడు విమర్శకు లనినటుల మనోధైర్యములేని జెలరయే యగుచో మనమునఁబుట్టి నెట్టుకొని వచ్చుచున్న కళత్రవాంఛను వీడఁగల్గునా? శంతనుఁడు తనలో

పుట: 54—ఛీ! ఇట్టి తుచ్ఛసుఖమునకై స్వచ్ఛమైన యశస్సుగోల్పోవుటకంటె నవివేకముగలదా? ఇకనైన దరికితెచ్చికొని యీసంకల్పవికల్పము బయలుపడకుండ మెలఁగితినా, కొంతకాలమిందుఁ దల యెత్తుకొని బ్రతుకవచ్చునుగాని లేకున్న బరిహాసపాత్రుఁడనై ప్రాణ

ప్రియమైన యశస్సుతోఁగూడఁ బ్రాణములు విడువవలసి వచ్చును.

అని అనుకొని యశోహానికై జంకి పరిణయవాంఛ భ్రాంతిగావవలె మనసునిలిపికొనియుండ గృతనిశ్చయుఁడై నాఁడు. వికారహేతువులున్నను మనస్సునందు వికారము కలుగకుండుట ధైర్యమనబడు నని శాస్త్రనిర్వచనము. మనస్సునకు బాధ కలిగించుచున్న పరిణయ వాంఛను త్రోక్కి పెట్టి శంతనుఁడు ధీరత్వముచూపెను. తెంప రాని ప్రేమపాశమును గోసివైచుచున్నను శంతనుఁ డిసుమంత యు విషణ్ణస్వాంతుఁడు గాఁడు:—

ఉ. ధర్మనిరూపకత్వమున
ధైర్యమున స్మహనీయమూర్తి స
త్కార్యనిషిద్ధలం జతుక
తా మహిమ న్దలిర్చుధీ............— భాగవతము.

నెవ్వ రీతని నీకుఁరాఁరు అనునట్లుఁ బ్రవర్తించిన శంతనుచక్రవర్తి నా జేలయనుఁటు?

'సత్యవతికి శంతనునిపై మోహము ఉద్భవించిందో లేదో కాని, దేవవ్రతుని చూడగానే అతనిపై వలపు కలిగిందా అనే ప్రశ్నకు అవకాశము' సత్యవతిమాటలలో నున్నదని స్వామిగారొనరించిన ఆక్షేపము కొంతఁబట్టిం మనది, ఉత్సరింపరానిదిగను నున్నది. సత్యవతికి శంతను నిపై మోహముద్భవింప నేలేదట! పాంథాశ్రమమున ప్రథమ మున సందర్శించినపుడే సత్యవతికి శంతనునిపై గాఢమగు వలపు కుదురుకొన్నదని ఆమె ముగ్ధమధురవచనములే చాటుచున్నవి. పరస్పరావలోకనాదులచేనుదయించి మనన, చింతనాదులచేఁ గ్రమవికాసమునొందుచు నామె హృదయము నింతవఱకు వినోదపెట్టుచున్న ప్రేమ యగ్గలమై సత్యవతిని వియోగసాగరమునముంచివేసినది. వియోగవిహ్వలచిత్తయై తనచెలికత్తెయగు మనోరమతో సత్యవతి యేమన్నదో చూచితిరా!

ఉ. కోరినవాఁడు నిక్కముగు
కూరిమిదెల్పినవాఁడు నన్నుదే
వేరిగఁ గైకొనంగఁదల
పెట్టినవాఁడు సముద్రమేఖలో
ర్వీరమనేలువాఁడు కను
విందగు నవ్వుమొగంబు వాఁడు 'నా

భారతరాజు భర్తయగు
భాగ్యము నాకిఁకఁ గల్గునే చెలీ! (పుట: 78.)

శంతనునిపై నిట్లు పంచప్రాణములు బోటి పెట్టుకొనియుండి, ఆతనిని చేపట్టుట మహాభాగ్యముగఁ దలంచు చు మదనానలతాపమున మ్రగ్గుచున్న సత్యవతికి భారత రాజుపై మోహ ముదయింప లేదనుట సమంజసమా? వియోగానలమున వేగివేగి సత్యవతి ఉత్కంఠితురాలై తుది శృంగారావస్థ యగు మరణావస్థనుకూడఁ బొందగనున్న దనుట క్రిందిపద్యము ప్రబలనిదర్శనము.

చ. మనసున నెక్కినట్టి నవ
మన్మథుఁ గూసలమేర శీననం
బునకు నిదానమైన సుగు
భూవరు కీర్తికి మూరమైన నా
ఘనుగడిగాంచు భాగ్యమున
మానవు గాక మాకేమి గల్గు గా
వున నిఁక నీరు నిప్పు సుఖ
పూర్తికి మార్గముగాఁగ జూచెదన్. (పుట: 80.)

సత్యవతికి శంతనునిపై మోహము కల్గలేదను అసంబద్ధమునకేగాక మిఁదుమిక్కిలి ఆమెకు భీష్మునిపై వలపునిలిచినదను అనుచితాపాదకమైనదోష ప్రతిపాదనమునకుఁ గూడ స్వామిగారు పాల్పడినారు. భీష్ముఁడు నెఱపిన నిరుపమాన స్వార్థపరిత్యాగము, స్వశరీరసౌఖ్యదానము, మహనీయమహిమ, పితృవాత్సల్యాతిశయము, స్నేహపారవశ్యము, పరార్థసంపాదనపరాయణతయు తిలకించి విశ్వసించి సత్యవతి

పుట: 100—కుమారా! ఇట్టి మహోదారుఁడవు. నీవు రాజ్యముచేయుట కోర్వలేక కోరినట్లైనది. (విషాదమభినయించును.)

అని నిష్కల్మష హృదయముతో మెచ్చి పలికిన ఈవచనములలో శృంగార భావద్యోతక మున్నదనుట కుంపటిలోఁ దామర మొలచిన దనుటయే. తనమూలముగ నిట్టి లోకోత్తరచరిత్రుఁడు ఇహలోకసౌఖ్యదూరుఁ డగుచున్నాఁడే యను గాఢవిషాదమును, మంగళయోగ్యమైన వివాహము దుఃఖకళంకితమగుచున్నదేయను అతివైక్లబ్యమును సత్యవతి మనమున మట్టుమీరుటచే ననురూపవర లాభమహోత్సవము డిందుపాటునొందిన దామెకు. పరా

గ్థసంపాదన రసపారవశ్యముచే నాత్మజీవితమును ధార పోసి గురుచరణ శుశ్రూషాసుఖలాలసుఁడై, ఇహలోక వాంఛావిముఖుడై లోకమాన్యుఁడై వెలుగొందుచున్న భీష్మునిఁ బ్రీతి, ప్రసన్నమైన ఆనందముఖమును గనులారఁ దిలకించి **అత్యాశ్చర్యముతో**:—

పుట:—103— ఆహా! ఇతఁడు మందాకినీ నందనుఁడా?

అని మెచ్చి జాలి మల్లాడు మోముతో నిలువున నీరై నిలిచియున్న సత్యవతికి భీష్మునిపై మోహమా, నీతి బాహ్యము, నీచము నగునట్టి తలంపులు పుణ్యవతియైన సత్యవతి తలపై రుద్దుటకంటె అవిమర్శత వేఱొక టుండఁబోదు. సారంగధరచరిత్రమును మనమునం దుంచుకొని తెలపరాని నికృష్టభావమున కిందు ప్రయత్నపూర్వకముగ స్థానమిప్పించి లేనిపోని అశ్లీలమును, తులసిదళముల వలెఁ బవిత్రములు పూజ్యములును నైన సత్యవతి విశుద్ధవచనముల కాపాదించుట మహాపాతకమే యగును.

నాటకము పూర్తిగాఁ జదువక, చదివినదానినైన నిష్పక్షపాతబుద్ధితో దిలకింపక, గ్రంథములందు లేనియంశములను తెచ్చిపెట్టి దోషములనుజూపుచు, ఉన్న రసౌచిత్యపాత్రౌచిత్యాదిగుణములను దోషములను గా జేయ పాటుపడుచు వ్రాసిన స్వామిగారి విమర్శనకు ప్రతివిమర్శన వ్రాయనక్కఱలేదని యెఱిఁగియు ఉత్తమ పట్టపరీక్షలయందు కృతార్థులైన వారి విమర్శనము చూచి పామరలోకము భ్రాంతిపడునేమో యను తలంపుతో ఈ మాత్రమైనను ప్రతివిమర్శనము వ్రాసినందులకుఁ బండితలోకము నన్ను మన్నించుఁగాక!



# ప్రోలరాజు

క్రీ. శ. ౧౧౪౦ వరకు

విశ్వనాథ సత్యనారాయణ

కాకతి బేతరాజునకు ప్రోలరాజు కుమారుడు. ఇతడు రాజ్యతంత్రజ్ఞుడయిన మహాయోధుడు. ఈకథలో చెప్పబడిన యంశములన్నియు నితడు జరిపినవే.

కల్పన

శకయవనహూణాదుల దాడు లెక్కువయయిన యారోజులలో నాంధ్రదేశము చిన్నచిన్న రాజ్యములుగా నుండుటచేత పరులరుదెంచినప్పుడు తెనుగురాజులందరు తమ సైన్యములను కలిపి యుద్ధముచేసిన బాగుండునని ప్రోలరాజుసభ గావింపించెను. మంత్రపురాధీశ్వరుండయిన గుండరాజు దీనిని భగ్నపరచెను. తరువాత ప్రోలరాజు వానిశిరస్సు తెచ్చి తన కోటగుమ్మమున గట్టెను. కాకతి ప్రోలునికాలములో చిన్నదైన కాకతిరాజ్యము విశాలమై భావి మహాదశకు తగినంత వైశాల్యముగలది యయ్యెను.]

‘అంసంబందున బారుటీటె నిడి నేత్రాంభోజముల్ భావ తీ
క్ష్ణాంశుల్ జిమ్మఁగ ధాత్రి పాదహతికిన్ గంపింపగా క్షత్త్రియో

త్తంసుం డొక్కఁడు హన్మకొండ కెలన్ దారాడ తానొక్క సా
యంసంధ్యాసమయంబునందున లలాటాకుంచితవ్యగ్రుఁడై.'

'నాఁడే మజ్జనకుండు వైరినృపకాంతారమ్ము ఛేదించుచో
గూడందీసెనుగాని బాసటని యాగొడ్డళ్లఁ జే నేమి రా
పాడం జాలఁడు? మంత్రకూటపతి, యారా! గుండరా జెంతయా
టాడెన్ తైలపదేవుఁడింతకును బాహాగర్వహీనుం డగున్.

'తైలపదేవుఁడైన నొకదారికి వచ్చెడువాఁడ యేమి! యె
వ్వీలుననైన నాహుతికి వేచినవారల యెల్లరెప్పుడే
నాళులనేమొ! కాలహరణం బొనరింపమి మేలయౌను 'చే
గాలిన వెన్క నాకులని గంతులు వైచుట పాడిలేమికిన్'

'తెలుగు చళుక్యరాజుల ప్రతిష్ఠలతో సరిగాఁగ వారిదౌ
ర్బలమును సన్నగిల్లినది వారిక పూర్వపు పేరిసవ్వడిన్
నిలుపుకొనంగఁజాల రవనీస్థలి పంచుకుపోయి యింతము
క్కలయిన వెన్క హూణులకుఁగాఁ గయికో లొనరింత్రొ, యేమొకో.'

'ఉత్తరభూములన్ యవనహూణులమందలు చెల్లరేగి రా
యొత్తిడి వింధ్యదక్షిణపుటూరుల కల్గెనయేని నేఁడిటన్
కత్తులగోడ కట్టఁగల క్ష్మాపతి యెవ్వఁడు? సూర్యవంశరా
హుతులమీఁద వచ్చిపడదో యపకీర్తి యెదర్చకుండినన్'

'పరు లరుదెంచినన్ గలనృపాలురు నల్వురుకూడి వారిపై
నరుగఁగ రాదొ? యెవ్వరికి నబ్బిన వారికయౌంట! యెంతదో?
పరిణతశక్తి! రాజసభ భగ్నము సేయునొ గుండరాజు త
చ్ఛిరమున మత్పదం బిడక చేవయనన్ గలదే ధరాస్థలిన్.

'అప లదికాదు లోనగల యట్టితలం పిఁకడేమి! భూమిరా
డ్వాసరమునంతయున్ సభకు పిల్చుటయే మరుదెంచుటేమి వా
ర్పొసగఁగ చేయుటా యనియ పుట్టెను తొల్త! సదూహయే! బలే
యొసపరియూహ! బాగుపడునూహయె తెన్గుల దేల్చు నూహయే!.

'ఆయతమై ప్రశస్తమగు నాంధ్రచళుక్యకులావనీరుహ
చ్ఛాయలలోన తెక్కఁగమి చాఁచినవారము, వారిమీఁదనే

యాయితమా యనంగ నిసుమంతయు త్రైలపదేవుడెంచ డా
కోయతలంపు గుండపతిగుండియ గ్రుచ్చక యాలె నిల్పునే?.

'తనశౌర్యంబధి యెంత రాజుల గర్వింగ్ తానెంత? యెంతెంతయో
జనకుల్ బారలుసాపె! తద్విపులవక్షంబుల్ ప్రభేదింపకుం
డిన శ్రీ కాకతిదేవి పాదములయందే మోపలే దీశిర
స్సును! రేపే శుభలగ్నమాంధ్రవిషయేశుం డెవ్వడో తేల్చెదన్.

'త్రైలపదేవు బందిగొని తత్కులమందలి మాకృతజ్ఞతా
మూలముగా వెసన్ విడిచి పుచ్చెద నాపయి గుండరాజుపై
వ్రాలిన నాకు నడ్డమయి రా డత డప్పుడుగాని కాకతి
ప్రోలుడనంగ నేమొ తలపోతలు సాగవు గుండరాజులోన్.

'అగు గోవిందుడు త్రైలపేశ్వరుని సైన్యాధీశ్వరుం డేటికిన్
పొగరేగించెడు? రేగజేయునెడలన్ భూమీశవిధ్వస్తకం
బగు శ్రీ కాకతి వీరశౌర్యదహనాహంకారకీలన్ హవి
స్సగు సాగించెద కాకతీయ నవరాజ్యశ్రీవినిర్మాణముల్.

* * * *

'ఆయుద్రేకముచేత భూమిపతి స్వీయాంగంబు లుష్ణంబులై
సాయంకాలము లుష్ణమై తొలివెసన్ చంద్రోదయంబైన న
వ్యాయోగంబును బోలె తత్కిరణ సాంద్రానంత శైతల్యగే
ఖాయోగంబున చేసి చల్లపడి సౌఖ్యంబయ్యె నొక్కింతలోన్.

'అంతట రాజదుర్గసముపాంతము చేరగ బంటులాత్తిక్రొం
చెంతయు నమ్రులై పథమునిచ్చిరి, యొచ్చటికేగి యొంటిగా
నింతటిప్రొద్దు పోవువఱకేనియు రాడని కొందరందులో
మంతనమాడినారు పతి మందగతిన్ చన వెన్కనిట్టుగన్!

కాకతి కన్నుదోయి తెలికల్వల కాంతులతో ప్రసన్నతా
శ్రీకత దాల్చె నాటి నిశి జేని సభక్తికమైన పూజలన్
జేకడముట్ట విన్పడె నరిందమమై దెసలందు జైత్రయా
త్రాకకుదంబు నిస్సహాణరావము భీకర మన్మకొండపై.





# వానరులు

ఒంగోలు వెంకట రంగయ్య గారు, బి. ఏ., బి. ఎల్.

వానరులను గూర్చినప్రశంస యీ పత్రికయందు జరిగియున్నది. శ్రీరామసైన్యమగు వానరులు జాతిచేత కోతులా యనువిషయమున కొలదిసందేహము గలదు. ఈసైన్యమున వానరులేకాక ఋక్షగోపుచ్ఛాదులును గలరు. వానరులును, కోతులును యొకరేయైనను ఋక్షగోపుచ్ఛాదులుకూడ కోతులగుదురా? కోతికి తోక ప్రధానమయి అందుచేత అదియొక విశిష్టజాతి యగునెడ జన్మచేత తోకలేనివి కొన్ని గలవు. వాలిడి ఈగణములో జేరినది.

వానరజాతి మృగజాతిలో జేరినట్లుగ వాల్మీకి రామాయణమువలన దెలియుచున్నది. వాలి తానొకమృగమునని చెప్పుకొనియున్నాడు. భక్ష్యాభక్ష్యమృగ ప్రశంస చేయుచు, అభక్ష్యమృగమగు దన నేల క్షత్రియపుంగవుడగు రాముడు జంపెనని రాముని గూరియున్నాడు.

"వయం వనచరా రామ మృగా మూలఫలాశనాః"

కిష్కింధ: సం: 17.

ఇటులుండ తిర్యగ్జంతుప్రాయములగు కోతుల నెటుల శ్రీరాముడు సైన్యముగజేర్చికొనెనని యాశ్చర్యము గనున్నది. శ్రీరాము డవతారపురుషుడు గాన అట్లువానికి యమానుషము సాధ్యమయియుండుననుట సరియగు ప్రత్యుత్తరము గాజాలదు. సీతాన్వేషణము, సేతుబంధము ఇత్యాదులం దాయమానుష మగపడదు.

హనుమంతుడు సీతతో సంభాషించుచున్నపుడామె మొదట నాతని సందేహించి "వానరాణాం నరాణాంచ కథ మాసీ త్సమాగమః" యని యామె చేసినప్రశ్నకు సరియగు ప్రత్యుత్తరము నీయక నెమ్మదిగ శ్రీరామవర్ణనం బూనినాడు. వానరత్వము రాక్షసుల భ్రమింపజేయుటకై పూనిన జాలముగ నుండును. అటులేకాకుండిన యుద్ధకాండయం దీక్రిందివాక్యముల కక్కర గలిగియుం డెదు:—

"నచైవ మానుషం రూపం కార్యం హరిభి రాహవే"
"ఏషా భవతు సంజ్ఞా నో యుద్ధేఽస్మిన్ వానరే బలే
"వానరా ఏవ నశ్చిహ్నం స్వజనేఽస్మిన్ భవిష్యతి"

(యుద్ధకాం. స. 438)

యుద్ధము పూర్తియగువరకు మానవమందరము వానరచిహ్నధారులమై యుండవలయునని కపిసైన్యమంతయు సమాఖ్య చేసికొనినటు లీవాక్యములవలన దెలియుచున్నది. వీరు కామరూపులనియు మనుష్యరూపమున యుద్ధము చేసినయెడల సంకులయుద్ధములలో రాక్షససైన్యమునకు వానరసైన్యమునకు భేదము దెలియకపోవునని యిట్లు యేర్పాటు వీరు చేసికొనినటులు వ్యాఖ్యాత లీవాక్యమును సమర్థింపజూచిరి గాని యది సహజముగ నుండ లేదు. చరిత్రలలో గల యేయుద్ధమునను ఆత్మపరభేద నిర్ణయమునకై యిట్లు సందేహ మెవ్వరికి గలిగినటులు లేదు. ఉభయసైన్యములును మానవరూపముననే యుద్ధము జేయుచుండిరి. వేష భేదము లుండవచ్చును.

మఱియు పైవాక్యముల కొక రీక్రిందివిధమున వ్యాఖ్యానము చేసియున్నారు.

"ఇదానీం మానుషరూప పరిగ్రహప్రతిషేధ
"సామర్థ్యాత్ ఇతఃపూర్వం మానుషరూపం పరి
"గృహ్య సీతా ఇత్యవగమ్యతే"

ఇంతియకాక వానరులందరు శ్రీరామునితో గూడ నయోధ్యకు బోయినపుడు

"నరనాగ సహస్రాణి యయురాస్థాయ వానరాః"
"మానుషం విగ్రహంకృత్వా సర్వాభరణ భూషితాః"

(యుద్ధకాండ. స. 181)

అని వర్ణింపబడియున్నారు. మఱియు భరతు నొద్దకు హనుమంతుని శ్రీరాముడంపగ నాతడు

"మానుషం ధారయద్రూపం అయోధ్యా త్వరితో యయౌ" (యుద్ధ. స. 128)

వానరసాధ్వీమణులు చీరెల సింగారించునపుడు తోకలనేమి జేసిరో! ఇత్యాది సందర్భముల జూడగ వానరులనబడు వీరి నిజరూపము మనుష్యరూపమనియె దోపగలదు. యుద్ధోపాయముల నుద్దేశించి (Contemptible little Army)* రాక్షసుల భ్రమింపజేయుటకై కోతిముఖమువంటి ముఖకవచములను రామసైన్యము ధరించియుండు. ఉదాహృత "నచైన మానుషంరూప" మిత్యాదివాక్యము లీయూహకు సహాకార మొనర్చుచున్నవి.

మనరామాయణ కథవంటిదైన ట్రోజన్ యుద్ధమున (Trojan war) శత్రువులమోసపుచ్చి దుర్గప్రవేశము చేయుటకై దారుమయాశ్వమొకటి (Wooden horse) నిర్మింపబడినది. బర్నాము అడవి (Burnum forest) డన్సినేన్ కొండకు (Dunsinane Hill) నడుచునను నీకుమరణము లేనని యక్షిణులు (Witches) మెక్బెత్తునకు (Macbeth) నరమిచ్చినటుల షేక్సపియరుకృత మెక్బెత్తు నాటకమున గలదు. తుదకు మెక్బెత్తుశత్రువులు బర్నాము అడవిగుండ దరలివచ్చుచు పరులకు దామగపడకుండుటకై యొక్కొక్కయోధుడును ఒక్కొక్కచెట్టు కొమ్మను నరుకుకొని తనకడ్డముగ బెట్టుకొని నడువ బర్నాముఅడవి నడచుట సార్థకమై మెక్బెత్తు నిధనము నొందెను.

మఱియు డగ్లసు అను స్కాట్లాండు వీరుడు బర్రెలవేషమున కొందఱుసైనికుల వెంటబెట్టుకొని శత్రువులనేమరించి యొకకోట బట్టుకొనినటులు స్కాటు రచించినతాతగారికథలలోగలదు.(Scott's Tales of grand father.)

మఱియు వానరత్వము ఒకతెగవారికి జాతిసంకేతముగ నుండును. ఇట్టిదానినే ఇంగ్లీషున చరిత్రకారులు టోటం (Totem) అందురు. నాగులును గరుడులును ఇట్టి సంకేతములవారని చారిత్రకులు నిర్ణయించుచున్నారు. పంపాపరిసరముల "నాగులు" "శిశునాగులు" యుండినటు లరణ్యకాండయందు జెప్పబడియున్నది. (అరణ్య. స.73) పూర్వపువ్యాఖ్యాత లీనాగులు శిశునాగులు వేరువేరుతెగల మనుజులని తెలియక యేనుగులు యేనుగుగున్నలు అనియర్థము వ్రాసియున్నారు. నాగులనుగూర్చి ఆంధ్రులచరిత్రము నవిస్తారముగ చర్చగలదు.§ బ్రిటిషువారి సేనలలో "డ్రాగూన్సు ఐరన్ సైల్సు" (Dragoons & Irion siles) అను ప్రౌఢనామములు గలవు. ఈరెండుశబ్దములకు నైసర్గికార్థమును జెప్పతగదనియు ఇవి సంస్థాపనమునకై పెట్టుకొనిన పేళ్లనియు యందర రెరుగుదురు. కార్యసాధనమునందు "కోతిపిడికిలి" ప్రసిద్ధమగు సామెతగ నున్నది. హనుమంతుడు లంక కేగునపుడు:—"సర్వథా కృతకార్యోహం ఏష్యామి సహసీతయా" యని ప్రతిజ్ఞ చేసియున్నాడు. ఇట్లు మనోదార్ఢ్యమె వానరసైన్యమునకంతెయు గలిగియుండినదనుట సమాదరణీయము కాగలదు.

రామసైన్యముయొక్క వానరత్వము రావణుని పదితలలవంటిదై యుండును. సుందరకాండయందు రావణుని నిద్రావస్థ వర్ణింపబడియున్నది. (సుందర. స. 10)

"సుప్తం రాక్షస శార్దూలం ప్రేక్షతేస్మ మహాకపిః"

ఆతని బాహువర్ణన మనేక ద్వివచనముల చే జేయబడి

"తాభ్యాం పరిపూర్ణాభ్యాం భుజాభ్యాం రాక్షసేశ్వరః"

యని సమాప్తినొందియున్నది. అట్టి పైముఖవర్ణనమున

"మాతపున్నాగసుకభిః.........పానగంధ పురస్సరః

"తస్యరాక్షససింహస్య నిశ్చక్రామ మహాముఖాత్"

అని యొకవచనము గలదు. అంతియకాక,

"ముక్తామణి విచిత్రేణ కాంచనేన విరాజితమ్
ముకుటే నాపవృత్తేన కుండలో జ్వలితాననం"

అని ఇతోక యేకవచనమున ప్రయోగింపబడియున్నది. ఈవర్ణనమును వింశతి బాహుత్వద్విశిరస్త్వములతో సామరస్యము పొందింపజాలక పూర్వవ్యాఖ్యాతలొకరు "అత్ర ద్విభుజత్వ ఏకముఖత్వోక్తిః, స్త్రీణాం కామనీయత్వాయ" యనియు, "రావణస్య కామరూపిత్వాత్" అనిమరి యొకరును వ్రాసియున్నారు. తిలకుడను యింకొక వ్యా

* ఇంగ్లీషువారి సైన్యమును కెయిజరుగారు ఈమాటలతో తూలనాడినటుల యుద్ధారంభమున పత్రికలలో నుండినది.
§ వీరభద్రరావుగారి ఆంధ్రులచరిత్ర వాల్యూం. I.

ఖ్యాత "అత్ర ద్విభుజ కరణాత్, యుద్ధకాల ఏవవింశతి భుజత్వం దశశీర్షత్వంచ బోధ్యం" అని యుపదేశించి యున్నాడు. ఈసమర్థనము లెటులున్నను నిద్రాసమయమున రావణుని కొకతలయు రెండుచేతులు మాత్రమే యుండినవని యంగీకరింపవలసి యుండినది. నిద్రాదిమానుషకృత్యములలో కామరూపులు స్వస్వరూపధారణమె చేయుట సంప్రదాయమని తెలియుచున్నది. "మనుచరిత్ర"లోని మాయాప్రవరాఖ్యుడిందు కొకసాక్షి కాగలడు. దశగ్రీవత్వము బిభీషికాకల్పము (తెరబొమ్మ)గ నుండును.

ఇటులనె ఈవానరకల్పులవానరత్వమును యుద్ధోపాయములకొరకు అనుసంధింపబడియుండును. కాని వీరు జన్మచేత వానరులుగారు. సైనికు లెందరున్నను అందరికిని ఏకరూపములగు నడుపుల జూచుచున్నారము. ఏకరూపమగు వానరముఖకవచమును సాధ్యముగనె యుండగలదు. మనకాలమున జరిగిన రుష్యా జపానుయుద్ధములో రుష్యాచే మిగుల జపానుసైనికుల ముఖావయవముల కాపాడింపకుండుటకై ప్రతివానికిని యొలుకతోలుతో చేయబడిన నాసికాకవచ మొకదాని జపానువారమర్చిరని అప్పటి యుద్ధచరిత్ర పత్రికలందు దెల్పబడియుండినది. రామదండునకు వానరత్వము చెప్పగనె కపిచేష్టలన్నియు వారిపై బెట్టవలసివచ్చినది.

"ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛ మి"త్యాది కపి ప్రకృతులన్నియు నారోపింపబడుచున్నవి. మధువనమున వీరి కపిత్వము పూర్తిగ జూపబడియున్నది. ఈ కపిత్వాదికము కవిత్వవిశేషముపై నాధారపడియున్నది. బాలకాండయందు

"అప్సరస్సు రముఖ్యాసు గంధర్వీణాం తనూషుచ"
"యక్షపన్నగకన్యాసు ఋక్షవిద్యాధరీషుచ"
"కిన్నరీణాంచ గాత్రేషు వానరీణాం తనూషుచ"
"సృజధ్వం హరిరూపేణ పుత్రాంస్తుల్యపరాక్రమాన్."
(బాల. స. 17)

అని వాల్మీకి వానరోత్పత్తిం జెప్పియున్నాడు. రావణునితో యుద్ధముజేయుటకు మనుష్యరూపుడగు శ్రీరాముడు పనికివచ్చెనేని శ్రీరామసైన్యమును మనుజులుగనుండవలెగదా? అయినను శ్రీరాముడు నట్టిచో నియందు సంపాదించుకొనిన ఈవానరుల పుట్టుకయందు మనుష్యస్త్రీలమాత్రము జెప్పలేదు. కాగా మేమిగనుండునన్న వీరేజాతివారో దెలియక మనుష్యేతరజన్మ వారి కారోపింపబడినది.

"తస్మాత్తస్య వధో దృష్టో మానుషేభ్యః పరంతప"
(బాల. స. 16)

యనిస్పష్టముగ నుండగ రామసైన్యము మనుష్యులుగ నుండుటయే సమంజసమగును. రామరావణ యుద్ధమునప్పు మరెచ్చటను వానర ప్రశంస జరిగినటుల లేదు. ఇట్లు అజ్ఞాతపూర్వులు పశ్చాచ్ఛ్రుతులు నగు వారి జన్మమునుగూర్చి విచిత్రగాథల గల్పింప గారణమైనది.

వానరసాహచర్యమున నిట కొలది శాఖాసంక్రమణము జరిగినది. రామాయణమును సూక్ష్మదృష్టితో బరిశీలించిన వానరోత్పత్తి, శ్రీమహావిష్ణువు బ్రహ్మాదులకు బ్రత్యక్షమగుట లోనగు యనేకాంశములు కథాసరళికప్రస్తుతములైన ప్రక్షేపములుగ నుండునని సందేహింప నవకాశము గల్గును.






ఈ శే ర

ప్రాలసముకల పొడుపునవ్వుల విదల్చు
నును పయిరుగాడ్పుతరఁగలనురుఁగులా
నీ జిలుఁగుపాట, నాహృత్సరోజ మంటి, [చు
ఏమొనర్చెనో యెఱుఁగ, కోయిలనెలంత!

స్వప్నవాటిక, పసరాకుచాయ నిలిచి,
మోడ్పుగన్నులఁ దెఱువకపోతి నపుడు;
పొడుపుచాయలు కన్నీట మున్కలాడు
ఈయుదయవేళ, నిపుడో నిద్రింపఁజాల.

చెక్కుటింతలమేల్కొల్పు చిన్నెలెవియొ,
శ్రవణపుటములఁ బూరించు రక్తియెవియొ,
కనుల కందించు కన్నీటితునక లెవియొ,
పరువపుటెడంద విచ్చు పుష్పంబులెవియొ,
తెలియలేనైతి నా దురదృష్టగతుల!

గున్నలేమావిచివురాకు గుబురుటెడఁద
నగవు సంకెళ్ల మధురగానం బొనర్చు
నీమనోహరమూర్తిని నిలుపనైతి
భావవీథుల నరవిరిపాన్పుపైన.

ఈరహస్యానుతాపలజ్జారవంబు
లిప్పు డీమౌనతంత్రి చలింపనిమ్ము;
కోయిలా! కోయిలా!! రగుల్కొనెడి జ్ఞప్తి
నారుపంబోకు మీ శీతలానిలముల.

స్వాగతానందగీతి నిశ్శబ్దమాట
చిన్నవోయిన నేఁకువకన్నె యదిగో!
మంచుతెరచాటుమొయిలు దుఃఖించువేళ,
ఎచట దాఁగొనియుంటి వీమృత్యుసీమ?

ప్రకృతి బాష్పతరంగిణీప్రబలధాటి,
“విశ్వగాయకుఁడే”ని తపించిపోమె!
ఓ!—నడుగరాని ప్రేమగానానుభూత
గతుల కీమౌనమే పరిణతుల దిద్దు.

ఈమలినమౌన, మీచలి, యీవిషాద,
మీవిశీర్ణాతిపులకిత స్మృతవిహార
శాశ్వతానందలీల లీ “యీశ్వరు”నకె
గాక, కోయిలా! నీకును గలవె జగతి?

అయిన నీకనేమి! పాటలపయిఁ బఱుండి,
స్వప్నవనవాసవిధుల—స్వప్నములరీతి—
స్వప్నదుఃఖాశ్రు మలిన తర్పణము లొసఁగి,
శిథిలశూన్యంబులను మఱచెదము లెమ్ము!

పాలచిగురాకుతేటను బదిలపఱచి,
కలికితొలకరియే మేలుకొలుపునిమ్ము:
పిదప నీయార్ద్రగీతాలఁ బదనుపఱచి
మేలుకొలుపు “మీశ్వరు”ని నేవేళకైన






క్రొత్తపల్లి సూర్యారావు గారు

గ్రంథములలోఁ బూర్వపురుషులకు శిరోబాహుళ్యముం గూర్చి చదువుచున్నారము. అగ్నికి రెండు తలలు, దత్తాత్రేయునకు మూఁడు, బ్రహ్మకు నాలుగు, శివున కైదు, కుమారున కాఱు నీవిధమున ననేక శిరస్సులున్నట్లు చెప్పఁబడియున్నది. కొందఱకుఁ గాలు సేతు లనేకము లున్నట్లు కలదు. విష్ణువు, లక్ష్మి, సరస్వతి మొదలగువారి కొక్క తల నాలుగేసి బాహువులు—కొందఱకుఁ దలకు రెండేసి చేతులు చొప్పున—షణ్ముఖుఁడు గాన కుమారస్వామి కాఱు రెండ్లు పండ్రెండు హస్తములు. బ్రహ్మకు నాలుగు తలలున్నను జేతులెనిమిది యున్నట్లు కనఁబడదు. కార్తవీర్యార్జునునకుఁ దలయొక్కటియు వేయిహస్తములు నఁట. సందర్భశుద్ధి కనఁబడదు. చతుర్ముఖుఁడు, షణ్ముఖుఁడు నని చెప్పుదురు. దీని నుపపత్తి కలదందురు. నాలుగుముఖము లున్నట్లేకాని చతుర్గ్రీవుఁ డనుటకాని షణ్ముఖుఁడనియేకాని షట్కంఠుఁ డనికాని ప్రయోగములు సాధారణముగా నగపడవు. నాల్గుముఖము లొక్క కంఠముమీఁదనే యాధారపడినవా? కంఠాధారములేని తలలు శబ్దముల నుచ్చరించుటకుఁ బనికివచ్చునా యని శంక. బ్రహ్మకు మున్నైదు తలలుండెనఁట. ఒక్కదానిని శివుఁడు నఱకివైచెనఁట. దానితోఁ బంచమవేదము నశించిన నశించునుగాక తలమొత్తుపోవునా? చిత్రకారు లెవ్వరు నాలోపమును జూపుటలేదు. విమర్శకాగ్రణులు బైలుదేఱుచున్న యిక్కాలమునఁ బ్రతికకళలయందును సందేహనివారణమునకై మార్గములను బుద్ధిమంతులు చెప్పుచున్నారుగాని చిత్రలేఖకు లింకను బ్రారంభింపలేదు. పాశ్చాత్య విజ్ఞానమును మన విజ్ఞానముతో సంపుటి చేయుట కనఁబడదు. గాయత్రి కైదుతలలు మొన్న మొన్న నొక్క కంఠము నూతగనే శిల్పి కనఁబడినవి. నాల్గుకంఠములపై నాల్గు శిరస్సులున్నట్లుగాని, యవి వరుసఁగానో నాల్గుదిక్కులకు నాల్గుగానో యున్నట్లుగాని బ్రహ్మ నెవ్వరు చిత్రించి చూపెదరో! సంశయము తీర్పవలసియున్నది.

ఆనడుమ రావణుని విషయమై కొంత ప్రసంగము జరిగినది. రావణునకుఁ బదితలలు లేవని యుదాహరణములం గనఁబఱిచిరి. లోకము తాత్కాలికముగాఁ గాఁబోలు ననితలంచెను. పరబిభీషికకై పదితలలను ధరించును, ఇరువదిచేతులను దాల్చునని సమర్థింపఁబడినది. అపు డితరములు లక్కవియ్యా, యేపనికి నొదుఁగనివి మృద్దారురూపము లేవో నా!

రామాయణములోనే 'దశగ్రీవ ముపస్థితో త తాస్తుతే। చారాబహిర్యత్న చరానిశాచరాః' అని దశముఖుఁడే యనక దశగ్రీవుఁడని కనఁబడినది. దశకంఠుఁడని, బంతికుత్తుకల రక్కసుఁడు పంక్తిశబ్దమునకు బంతియఁట. పంక్తి=పది. ఇది "బార్బర్సు బ్రిడ్జి, ఘంగలవారావధి" వలె చాలుకుత్తుకల రక్కసుఁడైనది. పంక్తిరథుఁడగు దశరథుఁడు నిల్చు బంతితేరుల దొర యయ్యెను. కాఁబట్టి దశముఖుఁడనఁగాఁ గంఠములతోఁ గూడిన ముఖములుగలవాఁడే యగును. తత్తుమాల్యవతో వాక్యం, హితముక్తం దశాననః। .....సబధ్వా భ్రుకుటిం వక్త్రే." వక్త్రే యని - ఇది యేకవచనమేనా? "గత్వాసామ్య దశగ్రీవం బ్రూహి మద్వచనాత్కపే"—విశ్రుత్యనయనే క్రూరః రావణో లోకరావణః"—ఈమాటలనుబట్టి తలయొక్కటియే యున్నదనుకొనియు—దశగ్రీవాదిశబ్దములు కరము వేఱుగానుండునేమో యనుకొంటిని. కనఁబడలేదు. తలకు రెండు చెప్పిన నిరువది చేతులున్నట్లు "దశాస్యో వింశతి భుజైః ప్రగృహీత శరాసనః। అదృశ్యత దశగ్రీవః మైనాక ఇవ పర్వతః" అని యొకచోఁ గనఁబడినది. వెట్టి మెత్తి తిరుగవేయఁగాఁ దిరుగవేయఁగా "రాఘవః పరమాయత్తః లలాటే పత్త్రిభిస్త్రిభిః...అదృశ్యతే మచ్ఛరైశ్ఛిన్నం శిరోజ్వలిత కుండలం క్రవ్యాదోవ్యపకర్షంతు" అని రాముని మాట యొక్కటి యున్నది. ఏమిచేయుదును? 'రావణస్య శిరశ్ఛిన్నత్ శ్రీమజ్జ్వలితకుణ్డలం। ...తస్యైవ దదృశే చాన్యత్ రావణస్యోత్థితం శిరః ద్వితీయం రావణ శిరః భిన్నః సంయుగే సాయకైః। ఏవమేకశతం భిన్నమ్' అని యొక్కచో నున్నది. రావణుని తలలు పదియా యొక్కటియా తేలలేదు ఒక్కనాటకములో త్వాంవృణు త్వాంవృణు—అని రావణునితలలు వంతులాడినట్లున్నది. బ్రహ్మను వరమడుగుటకే యభిమానపడినవి—తల్లిపాలు త్రాగుచున్న యొక ముఖమునుగాంచి వేఱొక ముఖ మేడ్చినదఁట. కవి చమత్కరించినాఁడనిన లేనివానికిఁ బది తలలు వెట్టి చమత్కరించునా? ఎవ్వరినైన వేఱొక్కకవి యట్లు వర్ణించినాఁడా? లేదని యే నాబుద్ధికిఁ దోఁచుచున్నది. రఘువంశములో.

శ్లో. స్వాసిధారాపరిహృతః కామం చక్రస్య తేన మే।
స్థాపితో దశమో మూర్ధా లభ్యాంశ ఇవ రక్షసా.

దీనికి మల్లినాథుఁడు వ్యాఖ్యానములో—'పురాకిల త్రిపురారి ప్రీణనాయస్వశిరాంసి ఛిత్త్వా దశకంధరేణ యద్దశమం శిరోఽవశేషితం తన్మచ్ఛక్రార్థమిత్యాహ' అని వ్రాసియుంచెను. అపుడు మరల వెనుకకు మరల వలసివచ్చినది. పదితలలతోఁ బుట్టుటచేతనే వాల్మీకి దశముఖుఁడు, దశగ్రీవుఁడు మొదలగు పదములు చిన్నతనమునాఁటి స్థితినిబట్టి రూఢముగా వాఁడినాఁడు. సీతాపహరణమునాఁటి కొక్క తలయే యున్నది. యుద్ధాంతరమున నొక్క తలయేయున్నదని చెప్పనక్కఱలేదు. తొమ్మిది తలలు రఘువంశశ్లోకమునుబట్టి పోయినవిగాని పదునెనిమిది చేతులు పోలేదు. ఇది యొక్క శంక. ఆంజనేయుఁడు, రాత్రి నిద్రించు. రావణుని, సీతను వెదకఁబోయినపు డొక్క

తలవానినే చూచియున్నాఁడు. కాని రావణునికిఁ బదితలలు లేవని, 18 చేతులు లేవని భ్రమ కలిగించుచున్నాఁడు. శివ్రని బ్రత్యక్షము చేసికొనుటకై తలలు నఱకికొనిన ఘట్ట ముత్తర కాండలోనిది కాఁబోలును.

గ్రంథాధారము లున్నవిగాని చిత్రాధారము మనము చూడవలసియున్నది. ఏయొక్క బ్రహ్మనో యేకుమారస్వామినో చిత్రలేఖకులు ఉపపత్తియుతముగాఁ గంథాధారములతో వ్రాసి గ్రంథాధారమునకు జతపఱచి నావలె సంశయగ్రస్తులై యున్నవారి తలతిక్కలు తీర్తురుగాక.



# కవితారచన

కావ్యతీర్థ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

క. కవితాకన్య మనింటియాఁడుపడుచా! కాకున్న నిల్లాల! లే
క వశంగామిని యైన వారవనితా! కా దిట్టులం బూర్వ సం
భవమందుంగల పుణ్యలేశమున సంప్రాప్తించునే గాని మా
నవ్రుఁ డెన్నెవిధులం దపించినను జెంతం జేర దొక్కింతయున్.

శా. ఎన్నన్ భోజనసౌఖ్య ముండి హృదయం బెంతో సుఖం బుండి పే
రొక్కన్నం గాలము మంచి దుండి యెదుటన్ శ్రోతల్ మహావిజ్ఞులై
యున్నం జెప్పినదే కవిత్వమని తా మూహింతురే గాని లే
కన్నప్పిల్లను జెప్పుదానిఁ గవన మ్మంచందురే! సత్కవుల్.

మ. అరయన్ వ్రాఁతను ద్రాక్షపాక మని యం ద్రాపాతమాధుర్యముం
బరిశీలించినఁ దోఁచు మాధురిమ రంభాపాక మండ్రెవ్వ దు
ర్భరమాధుర్యము నారికేళ మని సంభావింతు రీమాఁటికిన్
విరసం బై కనుపించెనేని యది కుంభీపాకమే యయ్యెడిన్.

ఉ. ప్రాసకు వేసటంబడఁగరాదు యతిప్రతిపాదనార్థమై
గాసిని జెందరాదు గణకల్పనకోసము జల్లిపల్కుల
భ్యాసము సేయరాదు తగినంతటి సొంపుగ నొక్కపద్యమేన్
వ్రాసినఁ జాలదే! కవిశిరంబుల నుయ్యల లూఁప నేపునన్.

మ. పదలాలిత్యము నర్థగౌరవము భావప్రౌఢియున్ రీతి చ
క్కఁదనంబున్ గుణసౌష్ఠవంబును నలంకారంపుసౌందర్యముం
గుదురా మేల్నడజాడ లేనికవితన్ యోజింతురే! యీసడిం
చెదరే గాక రుచింతురే: సరసులుం జింతింపఁ గన్యాగతిన్.

ఉ. పామరుఁ డుల్లసిల్లవలె బాలుఁడు కేళినిఁ దేలఁగావలెం
గోమలి మోహమొందవలెఁ గోవిదుఁడుం దలయూఁపఁగావలెన్
స్వామియుఁ బ్రీతిఁ జెందవలెఁ జక్కనిశైలిని బద్యమల్లుచో
నేమిటికో మఱెవ్వరికి నింపౌనఁ గూర్పని పద్యజాలముల్.

మ. కవితాలోకము సృష్టిసేయునెడ ముక్కాల్వాసి ప్రాయంబుగాఁ
గవివాచస్పతి ప్రౌఢభావము సుమార్గంబుం బ్రసిద్ధంబు న
ర్థవిశేషంబు మనోహరంబు నగు శబ్దవ్రాతభూతావళిన్
స్తవనీయంబుగఁ జూపకున్నడ నగస్త్యభ్రాత లన్నట్లగున్.

ఉ. ఒక్కొకతావునుండి యొకటొక్కటి గూరిచి వంటకంబునన్
జక్కనిశుద్ధిఁ జేయఁగ మనంబున కింపగుమాడ్కి నెన్నఁడేన్
జక్కనియక్కరంబులు పొసంగియొసంగు ప్రసంగసంగతుల్
మక్కువఁ గూర్చఁగాని యథమస్థితిఁ గాంచిన రుచ్యముండునే!

ఉ. ఒక్కెడ శబ్దచిత్రము మఱొక్కెడ నర్థసమాగమంబు వే
ఱొక్కెడ సంస్కృతంబు మఱియొక్కెడ నాంధ్రపదావలంబ మిం
కొక్కెడ శబ్దభేదము మఱొక్కెడ గొప్ప సమాస మొప్ప నిం
పెక్కఁగ గూర్పఁగావలయు నీవిధి నయ్యయిచోట్ల నౌచితిన్.

మ. కనినన్ వాఙ్మయ మెంతలేదు! కొలఁదిం గక్కుట్టిపా లెందుకై
చనెనో! యించుక కన్నువిప్పునెడ నిచ్ఛామాత్ర సంసృష్టియే
యననౌ, బ్రాయముగాఁ గవీశ్వరున, కిట్లెయుండఁగా వ్రాతలం
దున నొక్కమ్మడి జల్లిబిల్లి పలుకుల్ దోపంగరా దెప్పుడున్.





# బమ్మెర పోతరాజు

నిడమర్తి సత్యనారాయణమూర్తి గారు

బమ్మెర పోతనామాత్యుని కవితామృతమును జవిచూచి చొక్కనివారు తెలుగు దేశమున నుండరు. అతడు సుప్రసిద్ధుడు. విమర్శకులాతని దర్శనార్థము పోవునపు డతిజాగరూకతతో మెలంగి దూరమున నుండియె తమ గౌరవమును వెలిబుచ్చవలెను. ఎంతటి గౌరవభక్తివిశ్వాసములతో నాంధ్రులాతని జూచుచున్నను సర్వతోముఖమును నిరుపమానమునగు నతని గొప్పతనమును గ్రహించి వారాతడు చూపిన సన్మార్గమున నడువజాలకున్నారు. దిఙ్మాత్రముగ నాతని జీవితోద్దేశమును జదువరులకు జూపుటయే ఈవ్యాసముయొక్క యభిప్రాయము.

కవులకు చిత్రమగు గుణముల నారోపించు టన్నిదేశములందును గలదు. అది మనదేశమునం దొకింత హెచ్చు. కవులయందు దమకుగల భక్తివిశ్వాసములనుబట్టి సమకాలికులు వారియం దద్భుతగుణముల నారోపించి భావికాలమువారికి కవియొక్క నిజమగు చరిత్ర తెలియకుండ జేసిరి. వీరపూజ మంచిదే. కాని అది కేవలము 'విగ్రహారాధన'గా బరిగణింపబడినచో నష్టమువాటిల్లక తీరదు. పోతనార్యుని జీవితముగూడ నిట్టి యగాధమునబడి మాయమైనది.

పోతరాజు వీరుడును, యోధుడును. యోధునకు జయాపజయములతో బ్రసక్తి లేదు. ధర్మము నాచరించుటే యాతని విధి. ఆతని కేదియెట్లైనను జంకడు. ఆతని దృష్టి శాశ్వతమగు వస్తువుపై నిలచును. నిత్యానిత్యవస్తువివేకము గలవాడతడు. సంకుచిత భావ సంకలితమగు సంఘమున దాను గావింపవలసిన కార్యమతని కెఱుకయై యుండును. దాని నొనర్చుటే యాతని జీవితోద్దేశము. ఆంధ్రాకురముఖులు ధనలాలసులై కావ్యకన్యకను గాసులకమ్ముకాలమున నితడుదయించెను. మిక్కిలి పేదవాడతడు. పిల్లలు గలవాడు. గ్రాసము గడుచుట కష్టముగ నుండెను. తన మధురకవిత నమ్మినచో మహేంద్రభోగము ననుభవింపవచ్చును. కాని యాతని వీరహృదయమా దుష్కృత్యమును జూచి మండిపోయెను. పరమేశ్వర వరప్రసాద లబ్ధమగు కవిత్వమును మనుజేశ్వరాధములకిచ్చుటకంటె హాలికవృత్తి ప్రశస్తమని నిశ్చయించి ప్రకటించెను. కష్టపరంపర లాతని పరిపరివిధముల బాధించెను. వజ్రతుల్యమగు నాపేదవిప్రుని హృదయము మాత్రము చలింపలేదు. ఈర్ష్యాపరవశులాతని జూచి విస్మయమందిరి. మహారాజు లాతనిగాంచి వడికిపోయిరి. పోతరాజయోధుడు జయ

మునొంది ఆంధ్రప్రపంచమున కొక తేజము నొసంగెను.

అట్లు జయముగాంచుట కతని హృదయము వజ్రతుల్యమగుటయే కాదు. అమృతతుల్యమును, నవ్యనవనీతమునుగూడ నగును. కాకున్న నామధురభావపుష్పములు కర్కశస్థానములం దుదయింపగలవా? ప్రతిపద్యమునందు నీతనికిగల భక్తి వెల్లడి యగుచున్నది. యశోదకు కృష్ణునిపైగలప్రేమచే పోతనార్యుని హృదయము నిండిపోయినది. కరుణారసభరితుడు. అందుచేతనే యత్యుత్తమమగు,

ఉ. చెక్కులు రాపు సిల్లలకు- చేపటి నుండియు
మేతగానమిక్కి! బొక్కుచు గూటిలో నెగసి-
పోవగ నేరవు మున్న తల్లియు! దిక్కున
నుండి వచ్చునని- త్రిప్పని చూడ్కుల నిక్కి-
నిక్కి నల్దిక్కులు చూచుచున్నవతిరోసత
నెల్లుభరింతు నక్కటా!

అనుపద్యమును వ్రాయగలిగెను. పోతరాజు సంపూర్ణమగు మానవప్రకృతి గలవాడు. కవికి ముఖ్యముగ నుండవలసిన గుణములలో నిది యొకటి.

భావనాశక్తి యితనియందు లెస్సగా కలదు. గ్రంథమును వ్రాయునపు డతడు తన్మయుడగుచుండును. చిత్రించువిషయమునాతడు తనకన్నులయెదుట జరుగుచున్నట్టు లాలోచింపగలశక్తిగలవాడు. గజేంద్రరక్షణయందు తత్పరుడై పరుగిడు విష్ణుని వర్ణించు తావును, హరిభావనారూఢుడైన ప్రహ్లాదునిచిత్రించుస్థలమును, శ్రీకృష్ణుని బాల్యక్రీడాప్రశంసయును నాటకమువలె కన్నులయెదుట గన్పట్టును. అటులె ఒకటిరెండు పద్యములలో వ్యక్తుల సంపూర్ణమగు నాకృతిని మన నయనాంగణమున నిలబెట్టును. చూడుడు.

మ. త్రిజగన్మోహన నీలకాంతి తను-వుద్దీపింప
ప్రాభాతనీరజబంధు ప్రభమైన చేలము
పయిన్-రంజిల్ల నీలాలక । వ్రజసంయుక్త
ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప
మా।విజయుం జేరెడు వన్నెలాడు మది
నావేశించు నెల్లప్పుడున్.

అనుదానితో

సీ. కుప్పించి యెగసిన.........

యను సీసపద్యమును జదివిన వెనుక నెవరికి కోదండపాణియగు శ్రీకృష్ణుడు కన్పింపకుండును? ఈతనికి గల పాత్రపోషణాశక్తి ప్రశంసనీయమైనది. ప్రహ్లాదుడు, హిరణ్యకశిపుడు, బలి, కృష్ణుడు, యశోద మొదలగు పాత్రలు మనతో సంభాషించుచున్నటులుండును.

భాషకును భావమునకును ఎడలేని సంబంధము కలదను విమర్శకుల యభిప్రాయము ఈతనియందు ధృవపడుచున్నది. పోతనార్యుని భావమా భాషా యేది ఎక్కువ లలితమైనదని యడుగుచో రెండును సమానములే యని చెప్పవలసివచ్చును. లాక్షణికు లాతనియందు దప్పులున్నవందురుగాక! ఆతనిమాటలు సజీవులగు మానవులవలె పాఠకులను సంబోధింప శక్తిగలవి. ఆతనియందు దా ప్రాణధారకలదు. నిర్దుష్టమయ్యును నిర్జీవమగు కవన మతనిది గాదు.

సప్రాణమని రుజువగుటకు వలయు చలనము, శక్తి, కాంతి, చైతన్యము పోతనార్యుని భాషయందును భావమునందును గలవు.

అందుచేతనే లాక్షణికుల యాగ్రహమునకు గురియయ్యు నితడాంధ్ర సారస్వతమును నిరభ్యంతరముగ శాసించుచున్నాడు. కవులను బట్టి లక్షణమువచ్చునుగాని లక్షణమునుబట్టి కవులు రాజాలరు. నన్నయ కవి. అతనినిబట్టి లక్షణమువచ్చినది. అన్యదేశీయుల మతమునింతే. పోతరాజు పుట్టుకతోడనే కవి. అతనికి లక్షణ మనవసరము. అతనిపలుకే కవనము. అదికాదనుట పోతరాజు కవికాదనుటవంటిది. అతడు స్వాతంత్ర్యాభిలాషి. అతనిది సహజపాండిత్యము. అందుచేతనే భాషావిషయమున గూడ స్వతంత్రతను జూపినాడు.

భావనాశక్తియందును, భావస్ఫోరకత్వమునందును పోతరాజు నిరుపమానుడు. ఆభావనాశక్తికీడగు కళాకౌశలము అతనివద్ద కన్పింపదు. రూపవతియగు కోమలికి అలంకారాదులెట్లు శోభస్కరముగ నుండునో కావ్యమునకు కళాకౌశలము నటులే రమ్యముగ నుండును. తిక్కనార్యునియందీ రెండు గుణములును సరిసమానముగ తూగుచున్నవి. భావోద్రేకమున మైమరచినపుడు కూడ తిక్కన కావ్యముయొక్క కళానిర్మాణమునందాసక్తుడగుచున్నాడు. పోతరాజు మాత్ర మట్లుకాదు. భావోద్రేకమాతనికి మిక్కుటము. కళానిర్మాణ కౌశలము తక్కువ: లేదని యనరాదు. ఏలనన అతని అంత్యప్రాసములు, అతీవలలితములును, పాంథికగలవియునగు మాటల కూర్పును కళాకౌశలములేని వానికి వచ్చుట కల్ల కాని ఇతడుద్రేకము నడంచుకొను శక్తిగలవాడుకాడు. ఈతని గ్రంథమున నారెంటికిని సమత్వము (Balance) లేదు.

లోపముండుట మానవజాతికి లక్షణము. పోతరాజు మానవుడు. అతనియందును లోపములుండును. కాని అవి అరుదు. అతని లోపము లోపముతో తుల్యముకాదు. అతనియందుగల ఇతర గుణములు అసామాన్యములు. ఆకారణముననే అతనియందాంధ్రలోకమున కంతభక్తి విశ్వాసములు కలవు. పోతరాజు విశ్వకవిశ్రేణిలోనివాడు. ఇతని మేటితనము నితరజాతుల కెఱిగించు భారము ఆంధ్రులయందే కలదు. ఆంగ్ల విమర్శకుడగు కార్లైలు వచించినటుల ప్రపంచోద్ధరణార్థము యోధుడు కవిరూపమున వచ్చును. అతడజ్ఞానాంధకారవర్తులగు వారికి జ్ఞానజ్యోతిని బట్టుసేవకుడు; దురాచారాటవినిదహింపజేయు బడబానలుడు. విశ్వమానవసోదర భావమును పోషించు పితృతుల్యుడు. పోతరాజు నట్టివాడే. ధర్మమును ప్రచారముచేసి మానవాళి నుద్ధరింప నుదయించిన మహాయోధాలిలో పోతరాజొకడు.






శ్రీ శేషాద్రిరమణ కవులు

రాముని పవిత్ర పాద నీరజయుగంబు
సోఁకి పుణ్యాభిరామమౌ శోభఁగన్న
ఆంధ్ర దేశంబునందు నే నాంధ్రసుకవి
కుద్భవించితి నెంత ధన్యుండ నేను.

నన్నయయు సోమయాజి శ్రీనాథ సార్వ
భౌమ ముఖ్యులువ్రాసిన పద్యకావ్య
మండలికి చెందియుండె నామాతృభాష
క్షోణిజనులందు మిక్కిలి సుకృతి నేను.

అమృతరసమును వర్షించు నాంధ్ర వాణి
కుత్తుకను వీరరసవహ్ని కుసురుకలచి
యశముఁ గైకొన్న ఖడ్గతిక్కనపొలంతి
చేతఁ బావనమగు నాంధ్రజాతి నాది.

భర్తృచితి ప్రేమసుమముకైవడిఁ దలంచి
తేనెవలె దానిలోనవిలీనమైన
ఆంధ్ర కాంతల సహగమ నాంగణమున
నడచుచుంటి నదృష్టవంతుఁడను నేను.

అన్ని బాసలకంటెను నాంధ్రభాష
రమ్యతరమంచు సాటిన రాజకీర
మలరఁ జేసిన యామ్రశాఖాంతరమున
నుంటనోఁచితి నెంతధన్యుండ నేను.

ఆంధ్రవిష్ణు పవిత్ర పదాంకములకు
నెలవుగానుండిన తెలుఁగు నేలయందు
ఆంధ్రకవితామృతము మనసారఁగ్రోలు
తాల్మిలభియించె నెంతసార్థకుఁడ నేను.

ముత్యములఁబోలు వర్ణసమూహమునకు
వీనులకు విందుఁగూర్చు కవిత్వమునకు
అమృతరసమును వర్షించు నల్లికలకు
నెలవయిన తెల్గునేర్చితి నేనె సుకృతి.

శారదాదేవి వేఁడి కన్నీరుఁగార్ప
తగదు తగదంచు నెవ్వఁడోదార్చె నట్టి
పోతనకవీంద్రుఁ డేనొక్క పొలముకాపు
కాంధ్రమైతిమి ఎంతభాగ్యంబు నాది.

జీవరస ముట్టిపడునట్లు శిల్పివరులు
సూక్తి రసముట్టిపడునట్లు సుకవి వరులు
చిత్రకళలు వెలార్చిన సీమయందు
నుదయమందితి నెంతధన్యుండ నేను.

తఱిపి వెన్నెలసోనలఁ గరువు గట్టి
చిత్రతరరూపములుగ రచించినట్లు
చెలఁగు నమరావతీస్తూపసీమ చెంత
ఉద్భవించితి నెంత ధన్యుండ నేను.

ఆంధ్రమాతృమతల్లి గీతామృతంబు
తాళదళపుస్తకౌఘ కాంతారమందు
నేకతంబున వీనుదోయికిని జేర్చు
దశ కలదునాకు, నేనెంత ధన్యతరుఁడ.

మాసిపోయిన యాంధ్ర సామ్రాజ్యగీతి
నాలపించు శిలాశాసనాదికములఁ
బ్రమదమునఁగాంచి యానంద బాష్పములను
విడువనోఁచితి నెంత ధన్యుఁడను నేను.




కాశీనాథుని భైరవమూర్తి గారు

శ్లో. ఆద్యోఽజాస్యత మార్థవాచక తయా యోషః స్వరః పంచమః
సర్వాత్మాస్పష్టత మార్థవాచకతయా వర్ణః పవర్గాంతకః
వక్త్రిత్వేన మహావిభూతి సరణి స్వాధార గోహృద్గతో
భ్రూమధ్యే స్థిత ఇత్యతః ప్రణవతా తే గీయతే ఒంభోగమైః॥

(దుర్వాసః కృత దేవీమహిమ్నం)

ఈసంచికయందు వర్ణము, అలంకారము చౌకవర్ణము, తానవర్ణము, స్వరజతి వీటి యొక్క ముఖ్యోద్దేశములు, వీటి లక్షణములు నుదాహరింపబడుచున్నవి. ఇందు వర్ణమనగా

శ్లో. గాన క్రియోచ్యతే వర్ణః సచతుర్ధా నిరూపితః। స్థాయ్యారోహ్యా వరోహీచ సంచారీత్యథ లక్షణం. స్థిత్వా స్థిత్వా ప్రయోగః స్యాత్ ఏకస్యైవ స్వరస్యయః। స్థాయీ వర్ణ సవిజ్ఞేయః పరా వన్వర్థనామకౌ ఏతత్సం మిశ్రణాద్వర్ణః। సంచారీ పరికీర్తితః.

గాన క్రియలలో వర్ణమనునది యొక్కటి. దీనియందు స్థాయి, ఆరోహి, అవరోహి, సంచారి అని నాల్గువిధము లనిరి.

"శ్లో. యత్రోపవేశ్యతే రాగః స్వరః స్థాయీ సకథ్యతే" అన్నగ ప్రారంభించిన స్వరముందే తిరుగనిలిచెడునట్టి గానక్రియ స్థాయీ వర్ణమగును. "శ్లో. ఏషా మాద్యన్తయో రేకః స్వరః తేస్థాయివర్ణగాః" ఆద్యన్తస్వరము లేకములై దేనియందునగలదో అదియు స్థాయీ వర్ణమని గలదు. వీటిలో 1. ప్రసన్నాది, 2. ప్రసన్నాంతము, 3. ప్రసన్నాద్యంతము, 4. ప్రసన్నమధ్యము, 5. క్రమరేచితం, 6. ప్రస్తారము, 7 ప్రసాదము అనియు స్థాయి వర్ణమునందు నేడుఅంతర్భాగముల జేర్కొనిరి. ఉదాహరణము: సా సా సా సా సా స్సా, సారిసా, సగమస సపదనిస, ఇత్యాదికములు. ఆరోహి

వర్ణమున ప్రారంభింపబడిన స్వరమునుండి క్రమముగ నెక్కు గానక్రియ ఆరోహివర్ణ మగును. ఉ: సరిగమ, రిగమప మొ॥ ఇట్లే అవరోహివర్ణమున క్రమముగ దిగునట్టి గానక్రియ ఉ:— సనిధపమ, నిధపమగ, మొ॥, సంచారియందున పైన మూడు విధములును గలసిన దగును. ఉ:— సపమగరిమనిపమపస నిద. గాని ప్రస్తుతమున పైనుదహరించిన నాల్గు విధములు గల్గి సాహిత్యము గల్గిన దానిని మాత్రము వర్ణమని వాడుచున్నారు.

అలంకారమునకు

శ్లో. విశిష్టవర్ణసందర్భ మలంకారం ప్రచక్షతే
ఏకైకస్యాం మూర్ఛనాయాం త్రిషష్టి రుదితా బుధైః.　(సం. రత్నాకరదర్పణము)

ఇదిగాక భరతులు

శ్లో. "శశినా రహితేవ నిశా విజలేవ నదీ
లతా విపుష్పేవ, అవిభూషితేవ కాన్తా
గీతి రలంకారహీనా స్యాత్."

పైనుదాహరించిన వర్ణభేదముల ననుసరించి క్రమముగ స్వరముల చేర్చుటయే అలంకారమనియు అది లేనిదే గానము శోభిల్లదని యువ్రాసియున్నారు.

శ్లో. మంద్రప్రకరణేఽత్ర స్యాత్ మూర్ఛనా
ప్రథమస్వరః, సఏవ ద్విగుణస్తారః పూర్వః
పూర్వో థవా భవేత్, మంద్రపర స్తత
స్తారః ప్రసన్నో మృదురిత్యపి, మంద్ర స్తా
రస్తుదీప్తః స్యాత్ మంద్రోబిందు శిరాభవే
త్, ఊర్ధ్వరేఖా శిరా స్తారో విపాత్రి
క్వచనాత్ ప్లుతః.

ఒక్కొకమూర్ఛనభేదములలో నొక్కొక స్థాయియందున అరువదిమూడు అలంకారములని వివరించిరి. వీని నామాదులు, వీటివివరము విశేషముగ రత్నాకరమున గలదు. గ్రంథవిస్తరమగుటచే నిట కొన్నిమాత్రము వ్రాయబడుచున్నవి. ససరిరిగగమమ; ససస రిరి; ససస స-రిరిరిరి; సాసాసారి-గాగాగామ; సగపని; సా రీరీ-గాగాగా (హసితాలంకారః శివప్రియః) సారీ-రీగా; సగా, గపా, పనీ (ఆక్షిప్తాలంకారః) సరిగా; గమపా; ససరిగా; మమిమపదా (ఉద్గీతాలంకారము) మొదలైనవి. ఆరోహ్యలంకారములు. ఇట్లే అవరోహ్యలంకారములు: సగరీ-రిపమా; రిగసా-గపమా; సగా-రిమా - గపా; సరిసా-రిగరీ, సాగరిమాసా - రీమగపామా- గా పమదాగా (వ్యావృతాలంకారం); సగరిమ - మరిగస; సగమా - రిమపా; సరిగా - రిగమా; సా నీనీ రిసా; సరిగరి-రిగమగ; మామామాసమా, పపాపారిపా (ఊర్మి అలంకారము); సరిరిసా-రిగగరీ; సరిసగసా; సపరిధ - గని; - సరి- సరిగ- సరిగమ-...రిగ-రిగమ-రిగమప (క్రమాలంకారము); సరిపమగరి -రిగదపమగ; సగరి సగరిసా- రిమగరిమగరీ- (రంజితాలంకారం) సపామగరీ-రిదాపమగా; సాసరిమాగా- రీరిగ పామా- గాగమదాపా (వేణురలంకారం); సరి మరిసా- రిగపగరీ; సారిమరీసా-రీగపగారీ (లలితాలంకారము); సరిగరిసా - సరిగమగరిసా (హుంకారాలంకారము); సగరిసా- రిమగరీ; సగమామరిసా - రిమపాపగరీ (అవలోకితాలంకారం); ఇవి సంచార్యలంకారములు. ఇవిగాక సప్తాలంకారములు గలవనిరి.

శ్లో. అన్యేపిసప్తాలంకారా। గీతజ్ఞైరుపదర్శితా।
తారమంద్రప్రసన్నశ్చ! మంద్రతార
ప్రసన్నకః। ఆవర్తకః సంప్రదానోవిధా
తోప్యుపలోలకః। ఉల్లాసితశ్చేతితేషాం।
అధునా లక్ష్మకథ్యతే॥ (సం. రత్నాకరం)

వీని కుదాహరణములుగ వరుసగ నిట్లుదాహరించియున్నారు. సరిగమపదనిసాసా; సాసానిదపమగరిసా; ససరిరిససరిసా; ససరిరిసస; సగసగా; రిమరిమా; సరిసరిగరిగరి; ససగసగా రిరిమరిమా; వీటిని పూర్వమున ప్రసిద్ధాలంకారములనిరి.

శ్లో. అనన్తత్వాతు తే శాస్త్రే। నసామస్త్యేన
కీర్తితాః। రక్తిలాభః స్వరజ్ఞానం
వర్ణాంగానాం విచిత్రతా। ఇతి ప్రయో
జనా న్యాహుః అలంకారనిరూపణే॥

అనగ నీయలంకార ప్రభేదము లనంతములు బ్రస్తరింపనగును. వీటిలో నింపగువాటిని మాత్రము స్వీకరించునది. ఎల్లైనను వీటి సాధనముచే రక్తిలాభము, స్వరజ్ఞానం అనగ నాయాస్వరస్థానముల గుర్తెరుగుట వర్ణాంగముల వైచిత్ర్యము తెలియనగుటే యీ అలంకారములకు గల ప్రయోజనమని నుడివియున్నారు. గాని ప్రస్తుతగానమందుఅలంకారములనిన సప్తతాళ ప్రభేదములను తెల్పునట్టివిగా నున్నవి. అహోబలపండితునిచే రచింపబడిన సంగీతపారిజాత మనుగ్రంథమున సప్తప్రసిద్ధాలంకారములును స్వరాళి (సరళి) అనెడు ఝంపటాతాళము (చతురశ్రజాతి త్రిపుటతాళము) అనగ బ్రస్తుతమున, వాడుకలోనున్న ఆదితాళముతో జేరిన అలంకారమునుగూడ చేర్చి ఎనిమిది అలంకారములని వేంకటమఖి యనువారు తమ చతుర్దండిప్రకాశికయందు నుడివియున్నారు. ఈఝంపటాతాళమునకు నాలుగక్షర కాలముగల యొకలఘువును రెండు అక్షరకాలము గల దృతములు రెండును మొత్తమువిూద నెనిమిది అక్షరకాలముగల తాళమును దెలుపును. సరిగమ- పద- నిస ఇపుడు వాడుకనున్న సరళి, జంట మొదలగునవి యీతాళముననే నున్నవి.

1. ధ్రువతాళాలంకారము: సరిగమ- గరి- సరిగరి- సరిగమ, 14 అక్షరములు.
2. మధ్యతాళాలంకారము; సరిగరి- సరి- సరిగమా_ 10 అక్షరములు.
3. అటతాళాలంకారము: సరీగా- సారిగా- మా- మా- 14.
4. రూపకతాళాలంకారము: సరి- సరిగమ- 6.
5. ఝంపె: సరిగసరిసరి- గ- మా- 10.
6. త్రిపుట: సరిగ- సరి- గమ- 7.
7. ఏకతాళము: (దీనికొకలఘువు) సరిగమ,4.

ధ్రువతాళమున సరిగమగరి యను ఆరక్షరకాలముగల లఘుశేఖరమని యుండెడిది. దీనిని ప్రస్తుతమున సరిగమ- గరి అని విడదీసి లఘువుగను దృతముగను విడదీసియున్నారు. వేంకటమఖియ్యనువారు మూడు ఘాతలే ధ్రువతాళమున వేయవలసినదిగా నేర్పఱచినట్లు ఇప్పటికిని కొందఱు ధ్రువతాళ

మునకు మూడుఘాతలే వేయుచున్నారు. ఈ తాళములవిషయమై విపులముగ మున్ముందు తాళాధ్యాయమున వివరింపబడును. ఈ ఎనిమిది తాళములుతప్ప తక్కినతాళములను గీతములందు జేర్పగూడదని వేంకటమఖియనువారు నుడివియున్నారు. ఇదిగాక యొక్కొక తాళమునందునను తిస్రము= 3 అక్షరముల కాలము; చతురశ్రము=4 అక్షరములకాలము, మిశ్రము= 7 అక్షరకాలము, ఖండము= 5 అక్షరకాలము; సంకీర్ణము= 9 అక్షరకాలము= ఇట్లు 5 విధములగు జాతుల నేర్పఱచియున్నారు. ఒక్కొకతాళమున నైదుజాతులైనయెడల సప్తతాళములును 7 × 5= 35 ముఖ్యతాళాలంకారము లగుచున్నవి. వీటికి గ్రమముగ

ధ్రువతాళమునకు

1. శ్రీకర, మణి, పూర్ణ ప్రమాణ, భువన యనియును,
2. మధ్యమునకు=సమ, సార, ఉదీర్ణ, ఉదయ, రావ,
3. అట=లేఖ, గుప్త, లోయ, విదళ, ధీర,
4 రూపక=పత్తి, చక్ర, కుల, రాజ, బిందు
5. ఝంపె=మధుర, కదంబ, సుర, చణ,కద,
6. త్రిపుట=ఆది, శం, లీల, దుష్కర, భోగ,
7. ఏక=మాన, సుఖ, రాగ, రత, వసు

అనియు 35 తాళములకు పేర్లు గలవు. వీటి కన్నిటికిని అలంకారములుగలవు. గ్రంథ విస్తరభీతి నిట విరమింతము. పిమ్మట

గీతము

"శ్లో. రంజకఃస్వరసందర్భోగీతమిత్యభిధీయతే"

శ్లో. ఉద్గ్రాహః ప్రథమ స్తత్ర తతో మేలాపకధ్రువౌ। ఆభోగశ్చేతి తేషాంచ క్రమాల్లక్ష్మాభిదధ్మహే। ఉద్గ్రాహః ప్రథమో భాగః తతో మేలాపక స్మృత। ధ్రువత్వాచ్చధ్రువః పశ్చాత్ ఆభోగ స్త్వన్తిమో మత । ధ్రువా భోగా స్తరే జాతో ధాతు రన్యో ఽ న్తరాభిధః । సతుసాలగ సూడస్థ రూపకే ష్వేవదృశ్యతే. (సం. రత్నాకరం)

శుద్ధఛాయాలగ సూడ అనగ శాస్త్ర నియమంబులగల ఛాయను బొందిన గీతమున కరము. ఛాయాలగ శబ్దభవము సాలగము. సాలగ, సూడ, ధ్రువమధ్య, ప్రతిమధ్య, నిస్సారుక, అటతాళ, రాసతాళ, ఏక తాళములైన యేడుభేదంబులు ధ్రువము, ఉద్గ్రాహము లని రెండుఖండము లగును. ఈఉద్గ్రాహఖండమందుగల స్వరముల కంటె నుచ్చమైన స్వరములుగలిగిన ఆభోగము అను నొకఖండము గలదు. ఉద్గ్రాహఖండ ప్రథమ భాగన్యాసమునకు ధ్రువము అనిపేరు. ఇదిపదు నొకండక్షరములు మొదలు ఇరువదియారక్షరములవరకునుగల పదునాఱు భేదములకును, నామములును, రసములును తాళములు మొదలగు లక్షణాదికముల నుడివియున్నారు. ఇట్లే శేషింపబడిన 6 తాళములకును చెప్పియున్నారు. ఇట్టిగీతము లిపుడు గానము. వేంకట మఖి యనువారు జెప్పినట్లే తొమ్మిది తాళములు మాత్ర మిప్పటి గీతములందు గానవగును, రెండుఖండములుగల గీతములు కొన్ని,మూడు ఖండములుగలగీతంబులు మరికొన్నియుగలవు. రెండుఖండములు గల గీతములలో మొదటి

దానియందు ధృవఖండము మధ్య షడ్జన్యాసం బుగా నుంచబడియున్నది. మూడుఖండములు గల గీతములలో ఉద్గ్రాహఖండము, ఆభోగ ఖండము, మూడవది ముద్రతో జేరిన ఖండ మగుచున్నది. దీనిలో మాత్రము అంతరి గలదు. మొదటి ఉద్గ్రాహఖండమున ధృవం, అంతరి,జావడ ఇవి వరుసగను, రెండవ ఆభోగ మున ఆభోగము అంతరి, మూడవదాని యందు ముద్రాఖండము మరల అంతరి-అనగ మూడుఖండములకును నీ అంతరి యొకటిగనే యుండును. ఇది పూర్వాచారము. ఈ యస్త రమును ఐదవధాతువనియు త్రిఖండగీతంబుల మాత్రమే కనబడుచున్నదనియు తన చతు ర్దండిప్రకాశికలో వేంకటమఖిగారు చెప్పియు న్నారు. అట్లే సంగీతసంప్రదాయ ప్రదర్శిని యందునవ్రాసియున్నారు. ఎచ్చటనోఅరుదుగ తక్క-శేషించినగీతములందు ఉద్గ్రాహ ముద్రా ఖండంబులు నొకటిగనేయుండుటచే అంతరిగల అనేకగీతములు ముద్రాఖండములు వదలి వేయబడుటచే ద్విఖండయుతము లౌచు న్నట్లు గానబడుచున్నవి. రూపకతాళమున గల కొన్నిగీతములలో ధృవరూపకమనియు రూపక ధృవమనియు ద్వివిధములుగ నున్నవి. దీనికి వివరంబు సంగీతసంప్రదాయ ప్రదర్శిని యందు గలదు. ఈగీతములలో

శ్లో. అష్టభాషాపదై ర్యుక్తం అయ్య అంవో తిపై ర్యుతం। స్వరరాగైః ప్రగాయన్తి గీతమి త్యభిధీయతే॥

అనియు గలదు. గనుకనే నీ గీతముల యందు "అయ్య తియ్య అయ్యం వయ్య" అను బహుప్రయోగముల గనుచున్నాము. ఒకభాషనేగాక ఎనిమిదిభాషలతోగూడ గూడి యుండవలెనను నియమముగూడ బెట్టికొని యుండుట దీనివలన గనుచున్నాము. ఇక కీర్తన, పదము, దరువు, చౌకవర్ణము, తాన వర్ణము మొదలగువాని లక్షణము నుదాహ రింతము.

కీర్తనములందు మాతులనగ సాహిత్యము దేవతాస్తుతిగను, పల్లవ అనుపల్లవచరణ ములను త్రిఖండయుక్తముగను నుండుట గను చున్నాము. కొన్ని కీర్తనాదులందు అందు ముఖ్యముగ దీక్షితులవారి కీర్తనాదులందు చర ణాంతమున ద్రుతకాలమున కొంతభాగ ముండు టయు గనుచున్నాము. ఇదిగాక లక్షణజ్ఞులగు పూర్వీక వాగ్గేయకారకు లగువారిచే రచి యింపబడిన కీర్తనములందు పల్లవియందున నుండుదానికి అనుపల్లవియందున ద్విగుణము గను, చరణమున అనుపల్లవికి ద్విగుణము గను అనగ 1: 2: 4 యీలెక్కను వరుసగ నుండుట గాననగును. సామాన్యముగ కీర్త నాదులన్నిటియందునను మంద్ర,గాంధారము మొదలు తార స్థాయి పంచమమునకు మ ధ్యనే జంత్ర గాత్రములందు సంచారము గల్గియుండుటయు తెల్లమగును.

పదము: కీర్తనాదులందువలె గాక దీని యందు సాహిత్యము శృంగారరసప్రధానమై నాయికా నాయకలక్షణ వ్యవహారాదులతో పల్లవి అనుపల్లవి చరణములను గల్గి విళంబ కాలమున బాడదగినవై యున్నవి. సామాన్య ముగ మూడుచరణములు గల్గి కడపటి

చరణము నాయకముద్రాంకితమై యొప్పును. చరణములు అన్నిట స్వర మొక్కటీరే యుండును. ఒకేఫణితి యని యర్థము. శబ్దార్థము సుస్థితిగ రసానుభవముతో చక్కగ చౌకమున శ్రావ్యమగునట్లు పాడుటయే సంప్రదాయము.

దరువు: పదమువలెనే శృంగారరస మనుసరించియుండి యొకటిగాని రెండు మూడు వరకునుగాని చరణములు గల్గి పదమువలె చౌకమునగాక కొంచెము ద్రుతకాలమున పాడునట్టివై యున్నవి.

చౌకవర్ణము: పదమునకు దీనికిని కొంత పోలిక గలదు. అనుపల్లవి ఆవర్తమునకు ద్విగుణమైన ముక్తాయిస్వరము పాడి పిదప పల్లవి నెత్తుకొని పాడునట్లును, తరువాత చరణమున నాల్గుఖండములుగను, మొదటిది చరణములో పల్లవివలెను, పిమ్మట విళంబ కాలమున బాడదగు ఏకావర్తస్వరము నొకదాని గల్గి, మధ్యమకాలమున నొకటి కొకటి ద్విగుణముగా గల్గిన ద్వితీయతృతీయ చతుర్థ ఖండములు అనగ స్వరములు గల్గి, ఒక్కొక్క ఖండాంతమున చరణమందలి పల్లవి బాడుచు, ఇట్లన్నిస్వరములు బాడినపిమ్మట అనుపల్లవి గల ముక్తాయిస్వరమును పాడుకొని పల్లవినెత్తి నిలువవలెను. ఇది పూర్వోక్త సంప్రదాయము గాని ప్రస్తుత గానమున చరణాంతర్భాగ మగు స్వరముల బాడి చరణమందలి పల్లవిని బాడి విరమించుటయే వాడుకగానున్నది గాని మరల ననుపల్లవి గల ముక్తాయిస్వరము పాడి మరల పల్లవి పాడుట యెందుచేతనో వదలివేయబడినది. వీటి సాహిత్యము విశేషముగ శృంగారరసయుక్తమే; ఎచ్చటనో స్వల్పముగ కొన్నిమాత్రము భక్తిరసయుతములు గలవు.

తానవర్ణము:— సంప్రదాయజ్ఞులు దీనిని మధ్యమకాలమునందే బాడుచుండుట వాడుక. చౌకవర్ణమునందువలెనే సాహిత్యము శృంగారరసప్రధానమే విశేషము; భక్తిరసము అరుదుగ గలదు. దీనియందునను అకార ఇకారాదులు గల్గి గాయకగాత్రసాధనసాధారోహణ సోపానములలో నొకటిగ నలరుచున్నది. శేషించిన పల్లవి అనుపల్లవి దీని నమరు ముక్తాయిస్వరము బిమ్మట చరణము, బిమ్మట చౌకకాలమున బాడదగిన యొకస్వరము తరువాత మధ్యమకాలమున బాడదగిన స్వరములు, వీనిలో నొకదానికొకటి ద్విగుణముగ నావర్తములు గల్గియుండుట మొదలగు సంప్రదాయము చౌకవర్ణమునందువలెనే దీనికిని గలదు. ఈవర్ణములు విశేషముగ ఝంపటాతాళమున ననగ ఆదితాళమున గలవు. కొన్ని ఖండజాతి అటతాళమున గలవు. అరుదుగ ఖండజాతి త్రిపుటయందుననుగూడ గలవు. ఇందు అటతాళవర్ణములుమాత్రము విళంబముగ బాడుటయు గలదు.

సర్వజతి:— దీనిలో మధ్యమకాలము ననుసరించి శృంగారరసప్రధానమగు సాహిత్యమును, పల్లవి, అనుపల్లవి వర్ణములందువలెనే గల్గి ముక్తాయిస్వరమున సగము స్వరము సగము పాట గల్గి చివరను తధిగిణతోం అను పాటయును చేర్చి పల్లవి నెత్తికొనునట్లుండ

వలెననిరి. దీనికిని సాహిత్యము గలదు. ఇవియు శృంగార, భక్తిరసయుతములై యున్నవి. ఇది యునుగాక యిప్పుడు వాడుకలోనున్న స్వరజతులు వర్ణమునందలి యావర్తములవలె దీర్ఘములుగాక చిన్నచిన్న ఆవర్తములుగల్గి వర్ణములకు దిగువ సోపానములవలె నమరుచున్నవి.

జతిస్వరము:—ఇది నృత్యమునమాత్ర ముపయోగపడుచున్నది. దీనికి పల్లవి, అనుపల్లవి చరణములందు ధాతుమాత్రమే గానమగును. సాహిత్యము గనము.

జావళి:—ఇది అన్నివిధములను దరువు ననుసరించియుండి శృంగారరసప్రధానమై సంగీతమునకు ముఖ్యోద్దేశమగు భక్తిరసమునకు విరుగుడుగ సృజింపబడి వేశ్యలకు విటసాధన పరమానంగామోఘాస్త్రమై యొప్పారునట్టి దిదియే. దీనంబడియే మోక్షసాధనమగు సంగీతప్రాముఖ్యమగు సార్థక్యమును గోల్పోవుచున్నారు. దీని మహిమమువిషయ మందఱికిని సుప్రసిద్ధమే. భక్తులు సాధులు దానిజోలికి బోకుందురుగాక.

తిల్లాన:—ఇది స్వరజతిని కొంచెము బోలియుండును. స్వరములు గల్గి పల్లవి అనుపల్లవి గల్గి సాహిత్యము శృంగారభూయిష్ఠమై భరతానుసారముగ "దిరితిల్లానా" అను అన్యదేశీయగ్రామ్యపాట గల్గి ముక్తాయి తధిగిణతోం గల్గియుండును. ఇది వీణకు ముఖ్యము.

శబ్దము:—ఇది తాళము గల్గి భరతానుసారముగ సాహిత్యంబులు గల్గియుండును. ప్రస్తుతమున శబ్దము కొలుపుటయని వాడుకలో గలదు. మృదంగగతులను వాచా అనుకరించుట యగుచున్నది. దీనినే కొనగోలు అనియు భరతము కొలుపుట యనియుగూడ వాడుచున్నారు. ఇంకను వీటిసందర్భమున సంగీతరత్నాకరమున ప్రబంధాధ్యాయమున విశేషముగ వ్రాసియున్నారు. వాటియందు వృత్తాదులనుగూడ నిరూపించి అనేకముగ నుదాహరించి యున్నారు. గ్రంథాతివిస్తరభీతి నిట నింతటితో వీటివిషయము విరమింపబడును.



# గంగావతరణము



అచ్ఛద్యుతి దివివలనన్, విచ్ఛిత్తిని బొంది పొంది విశ్వేశుజటన్
గచ్ఛద జలచరయుక్తిన, విచ్ఛిన్నముగాఁగ గంగ పృథివిం బాఱెన్.

—శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము.

# విద్వాంసుని నిర్వేదము

సాహిత్య వర్ధనుడు

కలుషచరిత్రులైన క్షితికాంతుల స్వార్థలవంబుపొందెఁ బు
ణ్యులనుచుఁ బూర్ణసద్గుణసమున్నతులంచు నుతించినట్టి యా
బలితపు దుష్కృతం బడుగువాఱ శిరస్స్థలి సంతరింతు ని
ర్మలినమనస్కులైన సువిరక్తుల పాదపయోజ పాంసువుల్.

చ. తఱుఁగని ఘోరతృష్ణలకు దాసుఁడనై మృగతృష్ణలన్ జలం
బరయు వెడంగునట్లు ధనికాలయసీమలఁ జుట్టిచుట్టి బం
గరువును బోని జీవితపుఁగాల మశేషము రిత్తపుచ్చితిన్
దరళపుటైహికార్థములు తథ్యముగాఁ దలపోసి, యక్కటా!

సీ. గంగిరెడ్డి యొసంగు కనకాంబరములు తీవ్రామయంబుల తాప మాపఁగలవె?
కనకరా జొనరించు కడిఁదిసత్కారముల్, విస్రసాభరము తప్పింపఁ గలవె?
బసివినాథుఁడు గూర్చు వసుగృహక్షేత్రముల్, శోకమోహంబులఁ జోపఁగలవె?
కల్యాణవిభుఁ డీయఁగల సీమ లుగ్రమృత్యు విజృంభణంబు పోఁ ద్రోయఁగలవె?
తే. అకట! మున్నాళ్ల ముచ్చట కాసచేసి, స్థిర సుఖైకాధ్వముఁ బరిత్యజించినాఁడ!
వ్యర్థమయ్యె నధీతశాస్త్రార్థమెల్ల, కటకటా! నన్నువంటి వెంగలి కలండె?

సీ. ప్రతిఫల నిరపేక్షభావంబు తోఁప నం, తేవాసులకు విద్య నేర్పలేదు;
చదివిన నీతిశాస్త్రపు టర్థ మణువైన, స్థిరనిష్ఠ దగ ననుష్ఠింపలేదు;
వితతదేశక్షేమ రతినెల్లెడఁ జరించి, ప్రజలయూహాలఁ జక్కఁబఱుపలేదు;
చిరము నిల్చి జనాళి కరిది హర్షముగూర్చు, మేటికావ్యముల నిర్మింపలేదు;
తే. ఆత్మవైదుష్య సంస్థాపనార్థమైన, వీకటవాదార్భటులను జీవితము చెల్లె;
ఎఱిఁగి యెఱిఁగి మాయకును గింకరుఁడనైతి; కటకటా! నన్నువంటి వెంగలియుఁగలఁడె?

సీ. ధనికగేహములకు దారిచూపిన మిత్ర, లోభుఁడా! నీకుఁ గేల్మోడ్పు సుమ్ము;
పరగుణగ్రహణార్తి వలనఁ గాచిన వయస్యా! మత్సరుండ! జోహారు నీకు;
పెద్దలఁ గికురించు విద్యనేర్పిన దేశికుఁడ! మదుండా! యేటికోళ్లు నీకు;
జననిందలకుఁ దలఁకనిసిద్ధి నిడిన దేవా! కామ! యిదె నమోవాకశతము
తే. లేను స్వాత్మోద్ధరణదీక్ష నూని సద్గురూత్తము శుభాంఘ్రికడ కేఁగుచున్నవాఁడ;
మనకు నేఁటికిఁ జిరకాలమైత్రి తీఱె; పోవ సెలవిత్తురే నాకుఁ బూజ్యులార!




గన్నవరపు సుబ్బరామయ్య గారు

౧

ప్రసేనజిత్తు కోసలములకు రాజు. అతని రాజధాని శ్రావస్తి. అతనికి బుద్ధుని యెడ గాఢమగు భక్తి కలదు. బుద్ధునకు దగ్గర చుట్టములగు కపిలవస్తుశాక్యులలో నొకరి కన్యను బెండ్లాడి బౌద్ధసన్న్యాసుల విశ్వాసమునకుఁ బాత్రుఁడయి తన్మూలమున బుద్ధదేవునిఁ దనభవనమునకుఁ గొనిపోయి నిరంతరముఁ బూజించుచుండ నతఁడు తలఁచెను. వెంటనే "మీలో నొకరికూఁతును నాకుఁ బెండ్లిచేయునది" అని శాక్యులకు దూతలచే వర్తమాన మంపెను.

శాక్యులు పంచశతసంఖ్యాకులు. ఉత్తమ వంశసంజాతులు. ధీరులు. వారిరాజధాని కపిలవస్తునగరము. పరాక్రమవంతుఁ డగు ప్రసేనజిత్తు శాక్యులయెడ ద్వేషించియుండెను. మఱియు నాతఁడు పుట్టువున శాక్యులకు సమానుఁడుకాఁడు. శాక్యులు తమతో సమానులు కానివారికిఁ దమకన్యల నిచ్చునాచారము గలవారు కారు. ప్రసేనజిత్తు పంపిన వివాహ వృత్తాంతము వారికి గొప్పచిక్కును దెచ్చి పెట్టినది. ఇటు ఆచారభంగము; అటు బలవద్విరోధము. ఏమిచేయుదురు? వారొక సభ గావించిరి. దీర్ఘముగ నాలోచించిరి.

అంతఁ బ్రధాని మహానాముఁడు "నాకు దాసియందు జనియించినకన్య యొక్కతె గలదు. ఆమె కడురూపసి. పేరు వాసభక్షత్రియ. ప్రసేనజిత్తాకన్యను వివాహమగుఁగాక!" యనెను. అందఱు నేకగ్రీవముగ నందుల కంగీకరించిరి.

శాక్యమహానాముఁడు బుద్ధభగవానుని పినతండ్రికుమారుఁడు. శాక్యులకునాయకుఁడు. అతఁడు తనకూఁతు నిచ్చెదనని ప్రసేనజిత్తుని చారులతోఁ జెప్పెను. వారీయుదంతమును దమరాజున కెఱిఁగించిరి. ప్రసేనజిత్తు సంతోషముతో "మేలు మేలు! అట్లైన నామెను వెంటనే తోడ్కొనిరండు. కాని యొక రహస్యము కలదు. శాక్యులు పరమవంచకులు; నీచజాతికన్యకను దెచ్చి తమపుత్త్రిక యని నమ్మించి మన కంటఁగట్టఁగలరు. కాఁబట్టి యాకన్య తనతండ్రితో నేకపాత్రమున భుజించినఁగాని మీరు నమ్మరాదు" అని మరలఁ దనచారులను శ్రావస్తికిఁ బంపెను. వారు పోయి మహానామునితో "అయ్యా! మీ పుత్త్రిక మీతోడ నేకపాత్రమున భుజించినఁగాని తోడితేవలదని మా రాజుగారియాజ్ఞ" యనిరి. మహానాముఁడు తనకూఁతుతో నేకపాత్రమున భుజించి వారిసంశయమును బాపి,

ఉచితరీతిని వాసభఖత్తియను వారలతోఁ శ్రావస్తినగరమునకుఁ బంపెను.

పెండ్లికూఁతురు శ్రావస్తి చేరెను. ప్రసేనజిత్తు మిగుల వైభవముతో నామెను బెండ్లాడి పట్టమహిషినిఁ గావించెను. కాలక్రమమున నామె గర్భవతియై యొకకుమారుని గనెను. ఆకుమారుఁడు విదూదభుఁడనుపేర దినదినాభివృద్ధిఁ గాంచుచుండెను. యుక్తవయస్కుఁడైన యాబాలుని విలువిద్య మొదలగు వీరోచితవిద్యలను నేర్పుటకై మాతామహునింటికిఁ బ్రసేనజిత్తు పంపెను. విదూదభుఁడచటికిఁ జేరిననాఁడే శాక్యబాలకు లందఱు నాతని 'దాసీపుత్త్రుఁడు, దాసీపుత్త్రుఁడు' అని గేలిచేసిరి; తిరస్కరించిరి; బౌద్ధదేవాలయమునుండియు, తమసంఘమునుండియు బహిష్కరించిరి. జవ్వనము మొలకలెత్తుచున్న యారాకుమారుఁడు శాక్యబాలకులచే నట్లవమానితుఁడై కోపముతో "నేను శ్రావస్తికి రాజునై గర్వితులగు నీ శాక్యులరక్తముతో నాసింహాసనమును గడిగెద" నని శపథము చేసి యుత్తరక్షణముననే తరలి శ్రావస్తిని జేరెను.

౨

శాక్యులమోసము మంత్రులవలనఁ బ్రసేనజిత్తునకుఁ దెలిసెను. శాక్యులదుర్నయమున కాతఁ డెంతయుఁ గుపితుఁ డయ్యెను. భార్యకును, కుమారునకును ఒసఁగియుండిన రాజచిహ్నములను గైకొని వారిని నిర్లక్ష్యభావముతో సేవకకోటిలోనివారివలెఁ బరిగణించుచుండెను.

దినములు కొన్ని చనినవి. ఒకనాఁడు బుద్ధభగవానుఁడు ప్రసేనజిత్తుని భవనమునకు విచ్చేసెను. అతఁ డామహాత్ముని యథోచితముగ సత్కరించి శాక్యుల దుర్నయమును, భార్యాపుత్త్రులపరిత్యాగమును విన్నవించెను. అతని పలుకులు విని "రాజా! శాక్యులదౌష్ట్యముచిత మని నే నంగీకరింపను. వారు కులీనయగు కన్యకను నీ కొసఁగియుండఁదగుదురు. కాని, మహారాజా! నాపలుకుల నించుక యాలకింపుము. వాసభఖత్తియ ఉత్తముఁడగు రాజునకుఁ బుత్త్రిక. మహారాజవగునీకుఁ బట్టపురాణి. విదూదభుఁడు నీకుమారుఁడు. సాంఘికజీవనమున వంశౌన్నత్యమును బరిగణించుటయందుఁ బితృవంశమును బాటింతురు. ఇఁక నీభార్యకుఁ దల్లి యెవ్వరైన నేమి? కాశీరాజగు కాఠవాహనుఁ డెవ్వఁడు? అతనికి తల్లి కట్టెలమ్మి జీవించుచుండినదిగదా! ఆమెను దెచ్చి వివేకవంతులగు పెద్ద లాతనితండ్రికిఁ బెండ్లి చేయలేదా? ఆమె యాతని పట్టపురాణి యయ్యెఁగదా! ఆమెతల్లి వంశము నెవ రెఱుఁగుదురు? నీవెఱ్ఱితలంపులు మానుము. నీభార్యాపుత్త్రులను యథాపూర్వముగ నాదరింపుము" అనెను. అమృతతుల్యములగు నావచనముల నాలకించి, కలఁక దేరి ప్రసేనజిత్తు సతీసుతులను రావించి మున్నటివలె మన్నించి యేలుకొనెను.

౩

కొంతకాలమునకుఁ బ్రసేనుఁడు శరీరయాత్రను జాలించెను. విదూదభుఁడు శ్రావస్తికి రాజయ్యెను. చిన్ననాఁటనుండి యాతని

హృదయమునఁ బొగలెగయుచున్న యవమానాగ్నిరగుల్కొనెను. గొప్పసైన్యమును వెంటఁగొని అతఁడు శాక్యులపై దండయాత్ర వెడలెను. బుద్ధుఁ డీవార్తను విని తనబంధుజనుల రక్షింపఁ దలఁచి విదూదభుఁడు సేనలతో వచ్చుచున్న మార్గమున నొక్కచో నెండి మ్రోడైయున్న చెట్టుమొదటఁ గూర్చుండి యుండెను. ఆచెంత దట్టమగు చల్లనినీడగల యొకమఱ్ఱి యుండెను. విదూదభుఁడు మార్గమున నున్న బుద్ధదేవునిఁ గాంచి చేరఁబోయి వినతుఁడై "మహాత్మా! సాంద్రశీతలచ్ఛాయల వెదచల్లుచున్న వటవృక్ష మటుండ నీ మండువేసవియం దీయెండినచెట్టు మొదలఁ గూర్చుంటి రేల? ఆచెట్టుక్రిందఁ గూర్చుండుఁడు; తాపశాంతియగు" ననెను. "రాజా! నాకై శాఖోపశాఖలతో వెలసి నామనశ్శరీరములకుఁ జల్లఁదనమునొసఁగుచున్న నావంశవృక్షమును నీవు వ్రేళ్లతోఁ బెకలించి నశింపఁజేయనున్నావు. ఇఁక నెక్కడియాశ్రమము? ఎక్కడిచల్లదనము? నావంశమే నాకుఁ జల్లదనము నొసఁగు వృక్షము. నాబంధువులే యావృక్షముయొక్క శాఖలు, వారి సేమమే నాకు దట్టమగు నీడ. కావున నా కితరాశ్రయమేల?" యని బుద్ధుఁడు పలికెను. విదూదభుని మనసు కరఁగెను. "తమ చుట్టములను ముప్పునుండి తప్పింప వీ రీపన్నుగడ పన్నిరి. నే నీదండయాత్రను జాలించినఁగాని వీ రిటనుండి కదలునట్లు తోఁపదు." అని తలపోసి బుద్ధునకు వందనములు చేసి సేనలను మరల్చుకొని యాతఁడు తన పట్టణమునకుఁ బోయెను. బుద్ధుఁడును ధనంతటఁ బోయెను. విదూదభునకు మనశ్శాంతి గుదురదయ్యెను. శపథ మాతనిని హృదయశల్యమువలె బాధించుచుండెను. రెండవమారు శాక్యులపై నాతఁడు దండయాత్ర వెడలెను. మరల బుద్ధుఁడు వారించెను. మూఁడవపర్యాయమున ట్లే యయ్యెను. తుదకు బుద్ధభగవానుఁడు తమంతఁ దెచ్చికొనినదాని ననుభవింపక తీరదని తలఁచి శాక్యుల సంరక్షణమును మానెను. విదూదభుఁడు నాలవపర్యాయము దండయాత్ర సాగించి కపిలవస్తు నగరమును ముట్టడించెను.

౪

శాక్యులు బుద్ధుని ఉపదేశము ననుసరించి, యుద్ధము చేయనొల్లక సత్యాగ్రహవ్రతమును బూనఁదలఁచి యందఱు సభ గావించిరి. ప్రధానియగు మహానాముఁడు సభను బరికించి యిట్లనెను. "మన మిక్కడ సభగూడుటకుఁ గారణ మందఱకును విదితమేకదా! విదూదభుఁడు పూర్వవైరమును బాటించి మనల ధ్వంసము చేయ నున్నాఁడు. మనపురమును శ్మశానవాటికఁ గావింప నున్నాఁడు. మన మాచారాభిమానములను వదలి యాతనిని శరణుసొచ్చితిమేని మనల నాతఁ డొకవేళఁ గాపాడవచ్చును. ఇట్టితఱిని గర్తవ్యమును నిశ్చయింప మిమ్ముఁ గోరుచున్నాను." ఇంచుకతడవు సభయంతయు నిశ్శబ్దముగ నుండెను. కొందఱిహృదయములు కోపభరమునఁ బీడితములై యుండెను. దీర్ఘనిశ్వాసములచేఁ గొందఱు ప్రక్కలు వ్రీలుచున్నట్లుండెను. కొందఱినేత్రములు కోపఘూ

ర్ణితము లయ్యెను. కాని యొక్కరైనను నాలుక కదల్పఁజాలక తమచూడ్కులను సేనానివంకకు నిగుడ్చి యూఱకుండిరి.

ధీరుఁ డగు సేనాని మెఱపు మెఱసినట్లు లేచి నిలువఁబడి నమ్రుఁడై పట్టాకత్తిపైఁ జేయి నిడి, "ప్రభూ! నా నాల్క నా ఖడ్గాగ్రమున నున్నది. నాపలుకులు శత్రుప్రహారములయందున్నవి. పెక్కేల? యోధాగ్రేసరులభాష మరణమే. తక్కినది దైవాయత్తము." అని గంభీరముగఁ బల్కెను.

ఆ పలుకులచే శాక్యులమనములు నూతనోత్సాహపూరితములై యుద్ధాభిముఖము లయ్యెను. "బళి! బళీ!! యుద్ధము, మరణము వీరకాంక్షితములు. యుద్ధమే యోధునిలక్ష్యము; రాజునానందము; ప్రజలయభిమానమును. తరలుఁడు; పోరుఁడు; జయింపుఁడు; కాదేని, వీరస్వర్గమును జూరఁగొనుఁడు" అనుపలుకులు సభయందు మాఱుమ్రోగునట్లు చెలరేగెను.

"కుమారులారా! పితృతుల్యుఁడగు గౌతముని యుపదేశవాక్యముల మఱచితిరే" అను గంభీరవాక్కు ఆకలకలమునణఁచి వెలువడెను. అందఱు నాశ్చర్యచకితులై యాపలుకులు పుట్టిన దిక్కునకు మఱలి మహానాము నెదురఁ బీతాంబరధారియై నిలిచియున్న యొక వృద్ధభిక్షునిఁ గాంచిరి. మఱియు నాతఁ డాకసము వంకకుఁ జూచుచు నిట్లుపన్యసించెను. "యోధులారా! శాంతి కవచమును ధరింపుఁడు; రాజా! శాంతింపుము; దైవనిర్దిష్టమును దప్పింప మానవులకశక్యము. యుద్ధమునకుఁ బోవుఁడు; మరణింపుఁడు; శాశ్వతమగు కీర్తికాయమునుగడించి స్థిరజీవనులుగండు; కాని మీరొక్కరినేనిఁ జంపకుఁడు; భీరులై పాఱిపోకుఁడు; ఓరిమితో జీవములను వీడుఁడు. అట్లైన దైవము మిమ్ముఁ బ్రేమించును. మీకు శాశ్వతానందము నొడఁగూర్చును" అని పలికి కూర్చుండెను. అతఁ డుపన్యసించుచుండ నతని శరీరమునుండి దివ్యమగు తేజస్సుదయించి చూపరకన్నులు మిఱుమిట్లు గొలుపుచుండెను. తరువాత మహానాముఁడు "మహాభాగ్యము! దేవతలారా! మేము ప్రారబ్ధకర్మానుగుణమగు ఫలము ననుభవింప సంసిద్ధులమై యున్నాము. అంతిమక్షణమున మామానసములు దుష్కార్యములనుండి మఱలునట్లు లనుగ్రహింపుఁడు. దేశముయొక్క క్షేమలాభములు మీయధీనములు. మాదేశమును, మాజీవితములను, మాసంతానమును మీకప్పగించుచున్నాము. యుద్ధములఁ జచ్చినవారును, అకాలమరణమును జెందినవారును లెక్కకు మిక్కిలిగఁ గలరు. మనుజులు, తామొరులఁజంపక, ఒరులచే దాము చచ్చుటకును, ఒరులయెడఁగల యసహ్యాభావమును ప్రేమభావముగ మార్చుకొనుటకును ఇచ్చగింతురేని, యుద్ధమెంత శీఘ్రముగ నాఁగిపోవదు? తన్మూలమగు భయ మెంతవడిగ నశింపదు? యోధుఁడు రణరంగమును బ్రవేశించినపిదపఁ దానైనఁ జచ్చును; శత్రువైనఁ జంపును ఇందేదియో యొకటి కాకమానదు. సోదరులారా! చావునకు భయమును జెందకుఁడు. ఉత్సాహముతో మృత్యుదేవికి స్వాగతము

నొసఁగి శాక్యుల యౌన్నత్యమును ప్రపంచ మునఁ జాటుఁడు." అని పలికెను.

శాక్యులందఱు మహానాముని యుపన్యాసమును విని జయవాదములతో నతని నభినందించిరి. అత్యుత్సాహముతో సత్యాగ్రహ వ్రతదీక్షను గైకొనిరి.

౫

విదూదభుని సేనలు కపిలవస్తును ముట్టడించెను. శ్యాముఁడను శాక్యవీరుఁడు తన మిత్రులను గొందఱను బురికొల్పుకొని శత్రుసేనల నెదిరించెను. ఉభయ సేనలకును యుద్ధము భయంకరముగ జరిగెను. తుదకు కోసలుల నోడించి శ్యాముఁడు జయమునుగాంచి కపిలవస్తు నగరమును జేరెను. పాపము! అతఁడు శాక్యులు కావించుకొనిన శపథము నెఱుగఁడు. శాక్యు లాతని నభినందించుటకుమాఱుగఁ దమ వ్రతమునకు విరుద్ధముగా యుద్ధముచేయుటచే దేశభ్రష్టుని సైతము గావించిరి. విదూదభుఁ డదియెఱిఁగి చెదరిన సేనలను గూర్చుకొని మరల కపిలవస్తు నగరమును ముట్టడించెను. శాక్యులతిసంరంభమునఁ జతురంగబలములతో నగరమును వెలువడి బారులుదీరి శత్రువుల కభిముఖులై నిలిచిరి. వారి యాయుధముల కాంతులచేఁ బరిసరారణ్యభూములు మిలమిల మెఱసినవి. కోసల సేనలనుండి భీకరశంఖ నాదములు, భేరీభాంకారములు, యోధుల సింహనాదములు చెలరేఁగి భీతిని గొలుపుచుండినవి. వీణావేణునినాదమునుబోలి వీనులకు విందుగూర్చు మధురస్వనము. శాక్యుల సేన యందుఁ బుట్టి మందమారుత తరంగముల యందల్లనల్లన నూఁగుచు వీతెంచెను.

మఱునాఁడు సూర్యుఁ డుదయాద్రి నలంకరింపకపూర్వము విదూదభుని సేనలు యుద్ధమునకుఁ దలపడినవి. వేలకొలఁదిగ నున్న శాక్యసైన్యము సుసన్నద్ధమై యించుకయైనఁ జలింపక రక్తమాంసవినిర్మితభిత్తివలె క్రూరాత్ము లగు శత్రువుల యెదుర నిలిచెను. ఆహా! శాక్యవీరుల ధైర్యము! సత్యాగ్రహము!!

విదూదభుని సేనలు శాక్యవీరులను జించి చెండాడుచుండెను. శాక్యులు ధీరహృదయులై తమప్రాణములను శత్రువుల ఖడ్గధారల కర్పించుచుండిరి. కాని శత్రుల నించుకేనియు నొప్పింప నొల్లరైరి. అదిగాంచి విదూదభుఁ డాశ్చర్యచకితుఁడయ్యెను. ఇట్లు రెండహోరాత్రములు కడచినవి. శాక్యులందఱు మూలముట్టుగ సమసిరి. యుద్ధరంగ మంతయుఁ పీనుఁగుపెంటలచేనిండెను. రక్తము ప్రవహించుచుండెను. కపిలవస్తు పరిసరప్రదేశమంతయు నతిఘోరముగఁ గాన్పించెను. కోసలసైన్యము చెక్కు చెదరకుండెను. దురాత్ముఁ డగు విదూదభుఁ డీయధర్మవిజయమునకు మిగుల మురియుచుండెను.

కోసలరాజు కపిలవస్తు నగరమును బ్రవేశించెను. పట్టణమంతయుఁ బాడువారి స్మశానవాటికవలె భయంకరముగఁ గనుపించెను. గృహద్వారములు వివృతములై యుండెను. గారుచీకట్లు గ్రమ్ముచున్న పొగనుండి పట్టణమంతయు నొక్కమాఱుగ రగుల్కొనినట్లు పెద్దమంటలు లేచినవి. ఆ కరాళాగ్నిజ్వాలలఁ

ప్రవేశించిమృతభర్తృకలగుశాక్యసతీమణులు తమ భర్తలకడకుఁ బోవుచుండిరి. పట్టణమంత యు ధ్వంసమయినది. శాక్యకన్య లేనూర్గురు మాత్రము తలిదండ్రులను గోల్పోయి వాపోవు చుండిరి. విదూదభుఁడు వారలను జెఱఁగొని దుర్విజయగర్వితుఁడై శ్రావస్తికిబయలు దేరెను.

## ౬

అతఁడు మార్గమునఁ దొలుతటి దండ యాత్రలయందు బుద్ధునిగాంచిన స్థలమును జేరి యచట సేనలను విడియించెను. దురాత్ముఁ డగు నాతఁడు శాక్యకన్యలను దన చెంతకు రప్పించి తన్నుఁ బెండ్లాడ బలాత్కరించెను. అభిమానధన లగు నా కన్యలు వానికోర్కిని దిరస్కరించిరి. దాసీ పుత్త్రుఁడగు నానీచుని బెండ్లాడుట కెంతయు నొల్లరైరి. మత్సరపిశాచగ్రస్తుఁడు, కామాంధుఁడు నగు నా పాపాత్ముఁడు కడుఁగుపితుఁడై యాకన్యకలఁ గాలుసేతులు నఱికి యొకగోతి యందుఁ బడవైవ నాజ్ఞాపించెను. హంతకు లుత్తరక్షణముననే యాతనియాజ్ఞను నెఱ వేర్చిరి.

ఈవృత్తాంతము నా చెంతనున్న బుద్ధ దేవుఁడు విని శిష్యులనుగూడి శాక్యకన్యలు పడియున్నగోతిని జేరెను. శిష్యులచేత వారిని వెలుపలకుఁ దీయించి వారికి వస్త్రములను బ్రసాదించెను. ప్రాణాంతదశనున్న యాయ నాథబాలికలకు బౌద్ధమతరహస్యములను బోధించెను. మఱియు బంధనకారణములగు నిచ్ఛాపంచకముయొక్కయు పునర్జన్మకారణ మగు మార్గత్రయముయొక్కయు, ఇష్టజన వియోగముయొక్కయు, జననమరణకారణ సూత్రముయొక్కయు, తత్త్వమును లెస్సగా వివరించెను. బుద్ధునిమహోపదేశముచే శాక్య కన్యల యజ్ఞానము నశించెను. అంతరాత్మలు పరిపూతములయ్యెను. అంత వారలు శాంత మానసలై శరీరయాత్రను జాలించిరి. అచ్చోట నొకస్తూపము వెలసినది. 'పంచశతశాక్య కన్యాస్తూప'మని దానికిఁ బేరయ్యెను.

## ౭

విదూదభునిశపథము చెల్లెను. మత్సరాగ్ని ప్రశాంతిఁజెందెను. కాని దుష్పాపఫలానుభ వము మిగిలియుండెను. విజయోన్మత్తుఁడై శ్రావస్తికిఁబోవుచు విశ్రాంతికొఱకు "అశిరవతీ" నదీతీరమున నాతఁడు విడిసెను. ప్రకృతికాంత యొక్క యుద్యానమో యనునట్టు లాచోటు కడురమణీయమై యాతని హృదయము నాక ర్షించెను. సేనలకు నిచ్ఛావిహారముకొఱకుఁ గొన్నినాళ్లు సెలవొసఁగెను. తానును దన రాణివాసము నచటికి రప్పించుకొనెను. తెప్ప లను సుందరముగ నిర్మింపఁజేసి వానియందుఁ బ్రియకాంతలనుగూడి యానదీజలముల విహ రించుచుండెను. నదీతీరముల యందలి వృక్షుల తాదులయందు విరియఁబూచిన పూవుల నుండి నెత్తావులఁ గొల్లగొనిన చల్లనిపిల్లగా లుల సోఁకుడులచే వారలు దేహములు మఱచియుండఁ గొన్నిదినము లట్లె కడచినవి. ఇట్లుండ నాకస్మికముగ బానలఁగ్రమ్మరించి నట్టు లొక్క పెనువానకురిసెను. గొప్పప్రవాహము వచ్చి నది పొంగెను. నదియందును, తీరములయందును విహరించుచున్న విదూధ

భున్ని, వాని సేనలను నా ప్రవాహము నిరవశేషముగ గొనిపోయి సముద్రగర్భమున దాఁచెను. దీనిచే నాతనిపాపము మాసెనేమోకాని యపకీర్తి కజ్జలముచే ముద్రితమగు చరిత్రము మాత్రము శాశ్వతముగ బ్రపంచమున నిలిచిపోయెను. అపుడు బుద్ధభగవానుఁ డిట్టులనెను.

"కూర్మి మనుజుఁడు కుసుమముల్ గోయుచున్న
మునిఁగి యానందవారిధి మురియుచున్న
మనము కామితమ్ములఁ దనివొనకమున్న
మరణ మాతనిఁ గొంపోక మాన దెట్లు
భీమజలధార నిద్రితగ్రామ మట్లు."

('సువర్ణమాల'లోని కథ కనువాదము.)



# విరహోత్కంఠిత

పండిత ఈ. భాష్యకాచార్యులు గారు

మలయజగంధబంధురము మారుతమెంతయు దుఃఖదంబు, కో
కిలకలకూజితంబు చెవి గాఁడెడి ముల్కులఁబోలె, నయ్యయో
తెలతెలఁగాయు వెన్నెలలుఁ, దేఁటులపాటలు ఖేదదంబులౌ,
నిల బ్రదుకంగ నెట్టులగు నిట్టి యుపద్రవరాశిముందటన్.

సీ. ఘనఘనాఘనముల ఘనగర్జితము విన్నఁ జిత్త మత్తలపాటుఁ జెందుచుండె
మెఱయుచుఁ గన్నుల మిఱుమిట్లుఁగొల్పెడి మెఱుఁగులఁ గన్న నా మేనువడఁకె
చల్లనిగాలిపై నల్లనవీచిన నుల్లము జల్లని పెల్లునదరె
తఱిగని పొరిగొనఁ దలఁచు మయూరంపు టఱిముఱిమాట నా గరువమణఁచె
నాథుఁ డంతనుండ నాకంపొసఁగుచున్న వీని కిప్పు డిట్టుల బెగడవలసె,
నేను జేసినట్టి యేవిరోధములేదు పక్షపాతబుద్ధి భావ్యమగునె.

ఉ. ఎట్టులొ యోర్చుకొంటి మది నిన్నిదినంబులనుండియైన నీ
కట్టిడిదైవమిప్పటికిఁ గాఱియఁ బెట్టఁగ నెంచుచున్నదే
నెట్టులసైతు నీవిరహమే వగ నీవగ నీఁగుదాన నా
యట్టి దుర్భాగ్యరాశి సుఖ మందుట మృందుటగా! తలంపఁగన్.




కాశీసోమయాజుల సుందరరామమూర్తి గారు, ఎం. ఏ.

(సంపుటము ౨, సంచిక ౫ తరువాయి)

## ఏడవరంగము

[సత్యవంతుని పర్ణశాల. ప్రవేశము-అశ్వపతి,అతని భార్య]

అశ్వ:—తిరగ్గా, తిరగ్గా, మనవాళ్ళ పర్ణశాల చేరినాము! కాని, ఈ రెండేళ్లలో వెనుకటి ఆనవాళ్లు లేకుండా ఎలాగుచేసినారో! అప్పుడువట్టిసన్న్యాసికుటీరములాగుండేది.

రాణీ:—ఇప్పుడు గృహస్థుగదా, క్రొత్తవి కట్టి రమ్యంగాచేసినారు. అయితే, ఇక్కడ ఎవరూలేరేమి? అమ్మా, అల్లుడూ ఎక్కడికో వెళ్లివుండవచ్చును; కాని మన వియ్యంకుడు, వియ్యపురాలు అంధులే, వారేరీ? గతించివుందురా?

అశ్వ:—నాకొకటి పొడగడుతూంది. నారదుడు చెప్పినది ఈదినమేగదా? సత్యవంతుడు అడివిలో ఎక్కడో ప్రాణమువిడిచి ఉండవలెను. మరి మనసావిత్రి సహగమనము మానదుగద? కాని, చేసేముందు తన అత్త మామలకది తెలియజేయడమవసరమని ఇక్కడికివచ్చి ఉండవచ్చును వస్తే "అంధులము, మాకు మరి దిక్కెవరే?"ని వారు కూడా ఆమంటలో పడిపోయి ఉండవచ్చును.

రాణీ:—అయి యుండవచ్చును.

అశ్వ:—కాని, ఆ అడుగులు చూడూ. ఒకటి చాలా పెద్దడుగులు, ఒకటి చిన్నవి. అమ్మా, అల్లుడూ ఆతోవను వెళ్లి ఉండవలెను; క్రొత్తడుగులు కూడాను. ఇప్పుడిప్పుడే వెళ్లి ఉండవలెను. మరి ఆవైపు చూడు. అవికూడా క్రొత్తడుగులే. సాధారణమైనవి. మన వియ్యపురాలూ, వియ్యంకుడూ వెళ్లిఉందురా? కాని, అనుమానములో అనుమానము,అంధులే, ఎలాగువెళ్లగలరు?

రాణీ:—మరివారుగాక ఎవరున్నా రిక్కడ? గట్టిఅనుమానమే!

అశ్వ:—మరి ఆలస్యమెందుకు? పిల్లజాడపట్టి పోదాము. చివరకు వారితోవే మనకున్నూ. అమ్మ ఏదో వరవడి పెట్టనే పెట్టినది.

రాణీ:—కాని, అటుచూడండీ! ఆప్రక్క గదిలో దీపమున్నట్టున్నది. త్రాడువిప్పి చూతాం? (తీసి) నాథా, చూడండిటూ, సావిత్రీదేవి విగ్రహం, ఘుమఘుమలాడుతున్న సాంబ్రాణివాసన, ఆక్రొత్త పువ్వులు,

ఆ అఖండదీపం, అమ్మ పూజచేసి ఉండవలెను, ఈదినము సత్యవంతునికి మృత్యువు రాకుండా చేయుమని.

అశ్వ:—దానికి సందేహమేమీ ?

రాణీ:—ఎన్ని గులాబీపువ్వులు తెచ్చినదండీ! ఎన్ని జాతులపువ్వులున్నాయో! అమ్మకు పువ్వులంటేప్రాణం! తల్లీ, సావిత్రి, నీవే కటాక్షించిన మాపిల్లపెట్టినదీపము, కన్నవారిదీ, అత్తింటిదీ, ఎప్పుడూ వెలిగేటట్లు చేయవా ? నీకసాధ్యమంటూ ఉన్నదా ? నీప్రేమకు మేరున్నదా ?

అశ్వ:—అన్నీ తెలిసి అమ్మ వానిని వరించినది, అల్పాయువనక, అరణ్యావాసమనక. మన కులదేవత కాపాడదా అని నిబ్బరముమీదనే అయి వుండవలెను.

రాణీ:—అంతే, అంతే. కాని, ఇల్లూ వాకిలీ ఏమిటండీ ఇంతశుభ్రముగా ఉంచినది! పర్ణశాలచుట్టూ ఎంత పువ్వులతోట వేసినారో! మావిళ్లూ, జీడిమావిళ్లూ పూతబట్టి ఎలాగువాసనవేస్తున్నవో చూడండీ! అమ్మ కెంతోయిష్టం ఆవాసనంటే! ఈ కాలములో, నేలకంటుతూన్న జీడిమామిడి కొమ్మమీద కూర్చుండి, మీది కొమ్మనుచేరబడి,ఉయ్యాల్లాగుకొమ్మఊపుతూ, పుస్తకం పట్టుకొని పగలంతా వుండేది, నావెర్రితల్లి! కొమ్మమీదకూర్చొని కోకిలస్వరంతో పాడుతే, ఉద్యానవనమంతా వినిపించేది, శ్రుతివేసినట్టు కోకిలలు రుతముచేస్తూంటే! నాకన్నవాడా, ఇవన్ని విడిచిపెట్టి వెళ్లిపోయినావా? మన మేడలూ, తోటలూ ఎందుకూ వీటిముందర? ఇక్కడ వేసవిలో మధ్యాహ్నముచలి వేయదా? మరొక పర్ణశాలవేసుకొని మనముకూడా ఇక్కడ ఉండిపోతే బాగుండుననిపిస్తూన్నది.

అశ్వ:—అటువంటిస్థలమే — వెళదాంపద. (సావిత్రియెదుట సాష్టాంగపడి నిష్క్రమింతురు.)

ఎనిమిదవ రంగము

[తాటిపంతెన – ప్రవేశము, అశ్వపతి, అతనిభార్య.]

అశ్వ:—ఈతాటిపంతెన బాబే వేసి ఉండవలెను. అంత అగాధం మీద ఒక్కడూ ఎంతేసిచెట్లు వేసినాడో! ఆ దానిమ్మ పళ్లకు బుట్టలు కట్టినాడు. అన్నిజాతులు ఫలవృక్షాలూ వేసినాడు. ఆపళ్లాలన్నీకప్పి ప్రశస్తమైన త్రోవవేసినాడు. పర్ణశాల మొదలు ఇంతదూరమూ త్రోవకు రెండు వైపులా సరువిడిమొక్కలు వేసినాడు. కాని, ఇటుచూడూ. ఇక్కడనాలుగుబారలు పెద్దడుగులే కానొస్తున్నవి. ఆపైని మళ్లీ ఇద్దరడుగులూ ఉన్నవి.

రాణీ:—ఆనాలుగడుగులూ అమ్మను చంకబెట్టుకొని వెళ్లిఉండవలెను. ఆపైని అమ్మ ముఖమాటంపడి దిగివేసిఉండవలెను.

అశ్వ:—దయామయుడు సత్యవంతుడు, చేసే ఉండును. ఏదో ఒకత్రోవ తొక్కనే తొక్కినాము; చివరవరకూ చూచితీరవలెను,

సావిత్రిమీద భారమువేసి. మనిషిపడు కొన్నట్టులేదూ ? ఏమి ?

రాణీ:—అవును, నాథా! మనిషే—సత్య వంతుడే కావలెను.

అశ్వ:—అనుమానమెందుకు? వేగముగిరా, చూస్తావేమి? పరుగెత్తు! అమ్మా, సావిత్రీ! (తెర)

తొమ్మిదవ రంగము

[ప్రవేశము అశ్వపతి, అతనిరాణీ, సత్యవంతునిశవము.]

అశ్వ:—(శవమువద్దకు వెళ్లి)— ప్రాణము లేదు, నారదుడు అబద్ధమేలచెప్పును?

రాణీ:—కాని, అమ్మేదీ? అమ్మా, సావిత్రీ, బాబయ్యా, నేనూ వచ్చినాము. ఎక్కడు న్నావు, తల్లీ! "—పలకవేమీ, నాయనా?

అశ్వ:—ఇదిమనకు ఈనాటి దుఃఖముకాదు. పెళ్లినాడే మొదలు. దినములు లెక్కపె ట్టుకొంటూ, తుదకు చూడవలసినదేమో చూచినాము!

రాణీ:—కాని, నాకన్నతల్లేదీ? నావరప్రసాదిని ఏదీ?

అశ్వ:—ఈదగ్గిర ఎక్కడో ఉండవచ్చును, సంస్కారప్రయత్నంచేస్తూ. అవిగో కర్రలు. బాబుకొట్టినవే అయి యుండవలెను. అగ్గికొరకుగాని వెళ్లినదాయేమి, అమ్మ?

రాణీ:—నాకడుపులోనే పెట్టినది ఆరని అగ్గి నాచిట్టితల్లి!, ఎక్కడైనా ముఖం తిరిగి పడిపోయినావా, అమ్మా? ఈ వేడుక చూపించడానికా రప్పించినావు, కన్న వాడా? ఇక నీసహగమనము చూడడము వేడుక ఒకటేనా బాకీ, నాయనా? ఈపాపిష్టికళ్లతో ఎలాగుచూచేది, తల్లీ? చూచి, ఎలాగు బ్రతుకుమన్నావు. సావిత్రీ? నీకేమి, ధీరవు, నవ్వుతూనే వెళ్లిపోతావు, మేమెలాగు భరించేది, తల్లీ? (మూర్ఛిల్లును.)

అశ్వ:—మూర్ఛిల్లినది! ఈకష్ట మొకటా నాకు? ఇక్కడెవరు పలుకుతారు?—అదుగో తెలివి వస్తున్నట్టున్నది!

రాణీ:—నాథా, మనమెక్కడున్నాము?

అశ్వ:—మన అందరిస్మశానములో! ఎక్కడా ఉందామని వచ్చినామా ఏమి ఇక్కడికి? భర్తతో సహగమన మన్నాడు. కాని నేడు తండ్రికి పిల్లతో—

రాణీ:—తల్లికికూడాను, రెండు సహగమనములూ ఒక్కమంటలోనే! ఎంతపనిచేసినావోయ్, తండ్రీ! అమ్మా, ఒక్కపిల్లవాణ్ణి, చిటికినవేలంత కందుని, భూమిమీద పడవేసి ఉందువా!

అశ్వ:—అమ్మా, సావిత్రీ! అంతా తెలిసుండి యింత ఆలస్యంగా వచ్చినామని కోపం వచ్చినదా? తల్లీ! అందరమూ కలిసే పోదామమ్మా, కైలాసానికి. రా, తల్లీ, వేగం, రా కాని, అమ్మ అగ్గి తేవడానికి పర్ణశాలకు వెళుతూంటే, త్రోవలో ఏదో—

రాణీ:—ఏదో ఏమిటి? ఇలాంటి అరణ్యంలో ఏవ్యాఘ్రాలయినా ఉంటాయి—ఏజంతువు

కడుపున పెట్టుకొన్నదో అమ్మను. (మూర్ఛిల్లును)

అశ్వ:—అన్నా, మాటమాటకీ మూర్ఛిల్లుతున్నదే! (శవమువైపు చూచి) వీరాధివీరా, ఈ పువ్వులెవ్వరు జల్లినారోయ్, తండ్రీ, నీమీద? స్వర్గానికి నీవంటివాడు వస్తున్నాడని, దేవతలిచ్చిన స్వాగతమా, నాయనా, ఈపువ్వులు? లేకుంటె ఇటువంటి పువ్వులేవీ ఈలోకములో? నా పిల్లకు మంగళసూత్రముకట్టి మమ్మల్ని తరింపజేసిన చేతులా యివి? తల్లిదండ్రుల సేవలో ఎప్పుడూ మెలగి స్వర్గమునకు మెట్లుకట్టిన చేతులా యివి? ఆనాడు నీకు పిల్లనియ్యడానికి వస్తున్నపుడు శత్రువుల మనుకొని విల్లెక్కుపెట్టిన చేతులా యివి? ఆవిల్లేనా, నాయనా, యిది? నీతల్లిదండ్రులు ఇంకా ఉంటే, ఆరుగురమూ కలిసే పోదాం, తండ్రీ! నీవు బ్రతికి ఉండగా, కలుసుకో—

రాణి:—అమ్మ యీభూలోకములోనూ లేదు, చచ్చిపోలేదు.

అశ్వ:—మూర్ఛలోనే పలవిస్తున్నది! కాని, ఆమాటలు నిజమై యుండునా? ఈమూర్ఛ పోవడ మెప్పుడు? పిల్లను వెతకడానికి వెళ్లడం ఎప్పుడు?

రాణి:—(లేచి కూర్చొని) మీరు చూచినారండీ, అమ్మను?

అశ్వ:—అటూ ఇటూ వెళ్లి వెతుకుదాము, లే. కాని, మనమువచ్చిన త్రోవనేగాని, మరెటూ అడుగులుకానరావు! అమ్మ ఏమయినది? వాయుమార్గాన్ని వెళ్లినట్టు ఎలాగు వెళ్లినదో? సముద్రములో నావ వెళ్లినత్రోవ వెతికినట్టున్నది. మనము అమ్మను వెతకబోవడము! అయినా ఇటూ అటూ పిలుస్తూ తిరుగుదాము.

రాణి:—మాకేమి దారికానరాకుండ చేసినావా, సావిత్రీ? (తెర)

## ప ద వ ర ం గ ము

[సత్యవంతునిశవము, సావిత్రి.]

సా:—(కొంచెము దూరమునుంచి) అదుగో, నాథ గాత్రశరీరము! (దగ్గరకువెళ్లి) ఓవనదేవతలారా, మీదయవల్ల మళ్లీనాకళ్లబడినది. కాని, పైనీ, చుట్టూ, ఈపువ్వులేలాగువచ్చినవి? ఈక్రొత్తదుగు లెవ్వారివి? వనదేవతలవా? వారువేసిన పువ్వులా యివి? లేక, ఇందాకాపడిన పుష్పవర్షమా? నవ్వుతూ పడుకొన్నట్టున్నది! ఎప్పుడూ మీనగుమొగమే చూచినాను. నవ్వుతోనే లెండి. (భర్త శరీరమును ముట్టుకొనును)అదుగో కదిలినారు! ఆహా! నాసావిత్రిదయ అపారము! ఎన్ని కన్నీళ్లు వచ్చినవో! ఏమీ, సుఖదుఃఖములకు ఈసాన్నిహిత్యము! వారు మృతినొందినప్పుడైనా ఇన్ని కన్నీళ్లురాలేదు! నేను కనబడకపోవడముచూచి ఏమంటారో, ఆపొదచాటునుండి వింటాను. వింటే, చెవుల పండువుగా, అప్పుడన్నమాటలే గదా వినవలెను? (దాగికొనును) అదుగో లేచి కూర్చున్నారు!

స:—ఏమిది! ఎక్కడున్నాను? ఈఅడివే మిటి? కైలాసంలోకూడా అడవులా? స్వర్గానికిపోయినా సవతిపోరుతప్పదన్నట్టు కైలాసానికిపోయినా అరణ్యం తప్పదా యేమి నాకు?

సా:—(తనలో) నాథా, కైలాసంచూచివచ్చి నారా? యము డననే అన్నాడు అక్కడు న్నారని- ఆకబుర్లువినాలి.

స:—(అటుఇటుచూచి) కాని, ఈఅడవి ఎప్పుడైనాచూచినానా? తెలిసినదానివలే ఉన్నది. తెలియడంయేమిటి? ఇక్కడ కొంత కాలములేనూ? కొంత కాలమేనా? నేనెరిగిన చెట్లుకావూ అవన్నీ?

సా:—చిత్రంగాఉంది!

స:—ఇంత సేపూ నేనుచూచి పరమానంద ముపొందిన పార్వతీ పరమేశ్వరు లేరీ? ఆ గాంధర్వ గానమేదీ? కళ్లుమూస్తే కైలా సం; కళ్లువిప్పితే, అడవి! (కళ్లుమూసు కొని)అదుగో శంకరుడు; పార్వతి అదుగో! (కళ్లువిప్పి) పువ్వులూ, వాటివద్దకాకులూ బాడిదచెట్టు, అదుగో! ఎటుచూచినా అడవే!—ఆఁ, ఆ వినిపిస్తున్నది ఏమిటి? పులియార్పుకాదూ? ఈధనస్సూ, ఈ బా ణములేమిటి? ఆ గొడ్డ లాకటి! ఎవరి వివన్నీ? న లుగు వైపులా తిరిగిచూస్తే, కని పిస్తాడేమో, వీటియజమాని? (అటూ ఇటూతిరుగును.)

సా:—ఏమదీ? నామాటలేదూ! నన్ను వెతుక్కొంటూ వెళతారనుకొంటే, తన నుతానే వెతుక్కొంటున్నారే! కాని, చూతాం; ఎప్పటికైనా ధోరణి నావైపు తిరుగుతుందేమో.

స:—(వచ్చికూర్చొని)ఈవిల్లెవరిదో చూతాం దీనిమీద పేరున్నదే! "సత్యవంతుడు"— ఆఁ! సత్యవంతుడా! ఎవడతడు?

సా:—వెర్రి కుదిరింది; ఇక రోకలి తలచుట్ట డమేబాకీ! నేను—

స:—ఈ చేతులెవ్వరివి! ఈశరీర మెవ్వరిది?

సా:—అది మరీబాగుంది!

స:—నాదివ్యశరీర మేదీ? (తనను గిల్లుకొ నును) గిల్లుతే నాకు నొప్పెత్తినదే!

సా:—బలే!

స:—ఈశరీరమునాదే! నన్ను నేనే గిల్లుకొ న్నాను! మరి "నేనం" టే? మహర్షులకు తెలుసుకోవడము కష్టమయినది "నేను" అంటే.

సా:—ఏరంతా ఈది ఒడ్డున మునిగిపోయి నట్టున్నది నాపని! ఇందుకా తెచ్చుకొ న్నాను యమునితో పోరాడి? "ఆయన్ను బ్రతికించుకోవడము కష్టమా, ఈ వెర్రి పోగొట్టడము కష్టమా?" అనిపిస్తున్నదే! కాని నాసావిత్రీ దేవి ఏమయినది, అవసర మయితే?

స:—ఇవన్నీ నేను ఎరిగినవేనా? ఆలాగే కొంచెము పొడగడుతూంది. కళ్లులేని తల్లిదండ్రు లున్నట్టూ, వారి సేవ చేస్తూ కా లము గడుపుతూన్నట్టు—

సా:—మార్గాన్ని పడుతూన్నది, దేవిని స్మరించేసరికి! ఇంకా—

స:—కొంచెముకాలము, అప్సరసలను మించిన—

సా:—అది నామాటేనా?

స:—మూర్తీభవించిన పవిత్రత, అసమాన పతివ్రత—

సా:—వేగముగా నాపేరుచెప్పి స్వర్గము జూరి వ్వండి—

స:—సాటిలేనిభార్యతో స్వర్గసౌఖ్యమనుభ వించినట్లు—

సా:—ఇప్పుడుగదా, చెవులూ, హృదయమూ ఉన్నందుకు సార్థకము!

స:—కాని, ఆమెపేరు? (నొసలుపట్టుకొని ఆలోచించును) జ్ఞాపకము రాదేమి పేరు?—పులియార్పు మళ్లీ! ఇటె వస్తున్నట్టున్నది! ఎందుకైనామంచిది గొడ్డలిచేతపట్టుకుంటె. (ఆలాగుచేయును)

సా:—ప్రపంచజ్ఞానము రావడము ఆరంభమయినది!—పులీ,గొడ్డలీ, పట్టుకోవడమూ. మరి వెళ్లి చూస్తాను. (వెళ్లి వెనుకనుంచి అతనిభుజములమీద చేతులువేయును)

స:—(ఉలికిపడి) ఎంతలో వచ్చిందో పులి! (దిగ్గునలేచి గొడ్డలిపైకెత్తి తిరిగిచూచును) ఇదేమిటిది? పులనుకొని తిరిగిచూస్తే, ఈ స్త్రీయేమిటి? ఎవరమ్మాయీ, నీవు? ఇప్పుడు పులిలాగు అరిచినది నీవేనా? నీవెక్కడనుంచివచ్చావు, ఆకాశంమీదనుంచి దిగబడ్డట్టు?

సా:—నేను అక్కడనుంచే దిగబడ్డాను. (తనలో) ఇంకా చెరుపూమరుపులోనే ఉన్నారు!

స:—ఎవరికోసం వచ్చినావు?

సా:—మీకోసమే.

స:—(తనలో) సరే, కైలాసంనుంచి వచ్చి ఉండవలెను. అక్కడ నన్నుచూచి నాకోసంవచ్చింది కాబోలు? లేకుంటే, ఇక్కడ యిటువంటి ఆకారమెక్కడిదీ? అయినా, కేవలమూ క్రొత్తమనిషివలె లేదు. నాతో నీకేమిపని, అమ్మాయీ?

సా:—తమర్ని వరించడమే పని

స:—ఇదేమిటిది ? నీపేరు ?

సా:—(తనలో) చెప్పివేయనా? చెప్పించనా?—మీరు మరిచిపోయిన పేరు.

స:—"మీరు మరిచిపోయిన పేరు" అన్నదానిపేరు?

సా:—మీ రెవరిపేరు మరిచిపోయినారని ఇప్పుడిప్పుడను కొన్నారో, ఆమనిషిని.

స:—నాభార్యపేరు మరచినాను. అది నీకెలాగు తెలుసును?

సా:—(తనలో) తమాష్ చేస్తాను.—సావిత్రిని ఆరాధించేవారికి—

స:—ఉండు! ఉండు! అది నాభార్యపేరని జ్ఞాపకముచేసినావు.

సా:—మీభార్యపేరు సావిత్రేనా?

స:—అవును.

సా:—ఎక్కడ నున్నది?

స:—ఏమో తెలియదు.

సా:—మంచి మనిషేనా?

స:—మంచిమనిషేమిటి? దేవతాసమానురాలు.

సా:—ఆహా:—అటువంటిభార్య ఏమయినదో తెలియదా? మీ రెక్కడనుండివచ్చినారు?

స:—కైలాసమునుండి.

సా:—(తనలో) జాగ్రత్తగా తీసుకోరావలెను త్రోవలోకి—మీభార్య కైలాసములోనే ఉన్నదా?

స:—నేనక్కడ చూడలేదుగాని అక్కడ ఉండదగినదే.

సా:—అలాగేం? ఆమనిషి ఆనవాళ్లేమైనా చెప్పగలరా?

స:—ఎవరు వర్ణింపగలరు ఆసౌందర్యమును, ఆగుణములను?

సా:—(తనలో) ఇంతవరకు ఓర్చినందుకు, వినవలసినదంతా వినివేసినాను. ఇకగుర్తు పట్టించి, ఆకైలాససౌఖ్యమును అనుభవించవలెను—నన్నెప్పుడైనా,ఎక్కడైనా చూచినట్టున్నదా? ఇంతసేపూ పెడముఖముపెట్టుకొని మాట్లాడుతున్నారు. ఇప్పుడు బాగాచూచి చెప్పండి—

స:—పరస్త్రీని ఎలాగుచూచేది?

సా:—పరస్త్రీ ఏమిటి, తమర్ని వరించడానికి వస్తే?

స:—(చూచి, తనలో) నాసావిత్రివలె ఉన్నది, మూడుమూర్తులూ— నీవలెనే ఉంటుంది.

సా:—నాథా, నేను తమసావిత్రినికానూ?

స:—నేను భూలోకములో ఉండి కైలాసమును కలలోచూచినానా? లేక కైలాసములో ఉండి ఇప్పుడు భూలోకము కలలో చూస్తున్నానా? కాని, కైలాసవాసులకుకూడా స్వప్నములు వచ్చునా? రావే.

సా:—బాగుంది, నాథా, అందుచేతనే తమరిప్పుడు కైలాసములో లేరు.

స:—నేను కైలాసము చూడడము మట్టుకు స్వప్నముకాదుసుమా! కళ్లకు కట్టినట్టుంది! (కళ్లుమూసుకొని) అదుగో పార్వతీ పరమేశ్వరులు!

సా:—అదీస్వప్నముకాదు, ఇదీ స్వప్నము కాదు- మీరు కైలాసమునకు పోయి, అక్కడనుండి ఇక్కడికివచ్చినారు.

స:—అదెలాగు? చనిపోయి ఇక్కడనుండి అక్కడికి వెళ్లడమంటె బాగుంది. కాని, అక్కడనుండి తిరిగీ ఇక్కడికి అలాగే రావడమేమిటి, ఎక్కడాలేనివింత!

సా:—తమకు రెండూ జరిగినవి. అదీ, ఇదీ ఈదినమే- మీకు యమదర్శనమయినట్టు జ్ఞాపకమున్నదా?

స:—ఉన్నది.

సా:—ఆతరువాతనే కాదూ తమరు కైలాసమునకు వెళ్లడం.

స:—మరేమి? ఆ తరువాతనే కాన్ని, నాకు యమదర్శనమైనట్లు నీకెలాగు తెలుసునూ?

సా:—నాతొడమీద తలఉంచి తమరుపరున్నప్పుడు కాదూ, యముడు కనబడడమూ?

స:—అయి ఉండ వచ్చును—అవునవును, అప్పుడే.

సా:—అప్పుడే నాకూ యమదర్శన మైనది. నన్ను కూడా మీతో తీసుకపొమ్మని ప్రార్థిస్తే, తమప్రాణములే తీసుకపోయినాడు. నేను ఆయన్ను వెంబడించి ప్రార్థించగా ప్రార్థించగా ముందు తమతల్లిదండ్రులకు కళ్లిచ్చి—

స:—నాతల్లిదండ్రులకుకళ్లిచ్చినాడా? ఆతరువాత! వేగము చెప్పు.

సా:—తుదకు తమకు ప్రాణమిచ్చినాడు. తమ శరీరమును నేను ముట్టుకుంటే ప్రాణము వస్తుందన్నాడు.

స:—ఆఁ!

సా:—నేను వచ్చి తమశరీరమును ముట్టుకొని, మీరు లేవగానే, ఆపొద చాటునుండి చూచినాను. తమరన్న మాటలన్నీ విన్నాను. తమకు పూచిన బాడిదచెట్టు యందు ఎప్పుడూ ప్రీతె! తమరు లేచి అటూ ఇటూ తిరగడమూ, తమర్ని తమరు గిల్లుకోవడమూ— అప్పుడు నాకు పట్టరాని నవ్వువచ్చింది సుమండీ—

స:—చాలు, చాలు, మరి ఆకాశంటి చెప్ప నక్కఱలేదు.

సా:—ఈయడవిలో నేనెక్కడనుండి వచ్చినానని అనుకొన్నారు వైతరణినుంచి రాకుంటె?

స:—పులియార్పు నీవూ విన్నావా?

సా:—వినడమేనా? భయపడి అటూ ఇటూ చూస్తే, దేనినో వెంటబడడం కనిపించినది. మీకంటె భయంలేదుగాని, నాకు వళ్లు ఝల్లుమన్నది. అప్పుడే—

స:—ఉండూ, ఉండూ! ఆపిలిచేది ఎవరూ, "సత్యవంతా, తండ్రీ, ఎక్కడున్నావోయ్? అమ్మా, సావిత్రీ, ఎక్కడున్నా?" అని?

సా:—గుర్తించలేరూ, నాథా?

స:—మాతండ్రిగారి మాటలుకావూ?

సా:—కాకుంటెమనిద్దరినీకలిపి పిలవడమేమి? అల్లరుగో, మా అత్తగారూ, మామామగారూ, అల్లాచెట్లమధ్యను:— మల్లీ చెట్టు చాటైనది!—

స:—కనిపిస్తున్నారు. ఈత్రోవనే వస్తున్నట్టున్నది—

సా:—మన అడుగుల జాడ బట్టి- నాథా! యముడు వారికి కళ్లివ్వడమేలేకుంటె, ఎలాగు?—

స:—అవునవును వారికి పోయినదృష్టిరాగా నాకుపోయిన ప్రాణమేలరాకూడదు? నా సావిత్రిని ఏమని కొని యాడగలను?

సా:—మనసావిత్రిని కొనియాడడము మాత వశమా?

స:—నిన్ను చూస్తూంటే నాహృదయము తల్లడిల్లుచున్నదే! ఏమిచేయడమో ఏమనడమో తెలియకున్నదే!

సా:—(తనలో) జననీ! సావిత్రీ! నాథర్తను నాకిచ్చినావా?

స:—నేను కైలాసమునుండి రావడమూ, అది చూచిన కళ్లతో ఈ అడివి చూడడమూ ఆరెండు అనుభవములూ కలిసి పోయినవి—చూచావ్రా? లోతులేనినీళ్ల అడుగున రాళ్లూ! చెట్లప్రతిబింబమూ కలిసి పోతవి. అలాగు—

సా:—పర్వత్ లో పులుపూ తీపీ కలిసిపోయి నట్లు—

స:—నీ అనుభవం నీకూ, నా అనుభవం నాకూ, స్ఫురించినవి. ఆరెండు అనుభవములమధ్య చాలా గాభరాపడిపోయి నాను. నీవు వాటిని వేరు చేసేవరకు—ఇప్పుడు మనస్సంతా తేటగానున్నది. సావిత్రి దయవల్ల(సావిత్రి, భర్తవంటిమన్ను దులుపుచున్నది.) నా వంటిమన్ను దులుపుచున్నావా, సావిత్రీ? దీని అర్థమేమిటో తెలుసునా?

సా:—తెలియడాని కేమున్నదినాథా? ఇక్కడ బాధచేత నేలమీద దొర్లినారు, మన్నంటినది. అది దులుపుతున్నాను.

స:—దానికంటె మంచి అర్థము చెప్పనా? ఈశరీరము ఈమంటిలో కలియకుండా నీవు చేసినావని, నీవు నా వంటిమన్ను దులపడము అర్థము.

సా:—నాథా, నాతలేమి, అంతపని చేయడానికి? మనసావిత్రీదేవి చేసినది.

స:—నీవు సావిత్రీదేవి వరప్రసాదినివికావ్రా?

సా:—అలాగే అంటారు మాతల్లిదండ్రులు—

స:—అంతకంటె నీవు సావిత్రీదేవి అవతారమై యుండవలెను. లేకుంటె, చనిపోయినవానిని బ్రతికించడమేమిటి?

సా:—లేకుంటె, మృత్యుంజయులైన తమ ధర్మపత్నిగా ఉండడానికి అధికారము ఎలాగుకలిగినది? సావిత్రి అవతరిస్తే, మృత్యుంజయుడూ అవతరించవలెను. విష్ణువు రాముడైనాడు, లక్ష్మి సీతయినది—అరుగో మాఅత్తమామలు! ఎంతలో వచ్చినారో!

[సత్యవంతుని తల్లిదండ్రులు కొంచెము దూరమున ప్రవేశింతురు.]

తండ్రి:—ఆమె ఎవరైయుండునో, అంత చక్కనిది?

తల్లి:—ఈవనదేవతా యేమి? లేక, పార్వతీపరమేశ్వరులు విలాసార్థము ఇక్కడ విహరిస్తున్నారా? (దగ్గిరకువచ్చును.)

స:—అమ్మాజీ, తమకుమారుడు నమస్కరిస్తున్నాడు. బాబాజీ, నమస్కారము!

తండ్రి:—ఏమి, నాకుమారుడు, సత్యవంతుడవా?

సా:—తమకోడలు నమస్కరిస్తున్నది.

తల్లి:—ఏమీ! నాకోడలవా? సావిత్రీదేవను కొంటిని! మాకుదృష్టి ఎలాగువచ్చినదో గాని, వచ్చినందుకు నిన్నుచూచి తరించి

నది. సావిత్రి అని పేరున్నందుకు, సావిత్రీ దేవివలె కనబడుచున్నావే, తల్లీ!

స:—కనబడడమే కాదమ్మాజీ: ఆమె అంశయే! లేకుంటె, మీకు కళ్లెలాగు తెచ్చినది? చనిపోయిన వన్నెలాగు బ్రతికించినది?

తల్లి:—ఏమీ, చనిపోయి బ్రతికినావా, కొడకా! మనసావిత్రి బ్రతికించినదా? మాకు కళ్లిచ్చినది, సావిత్రా? ఏమమ్మా?

సా:—అవునత్తయ్యా, మనసావిత్రేను.

తండ్రి:—నాకు నోట మాటరాకున్నది. ఏలాగు, తల్లీ! ఈవృత్తాంతం—కాని, అపిలిచేది ఎవరు, "అమ్మా, సావిత్రీ," అని?

సా:—మాతల్లిగారి మాటలవలె ఉన్నవి! కాని, ఇక్కడికెందుకు వచ్చినారు? మళ్లీ పిలుస్తున్నారు! ఇదుగో, అమ్మాజీ, ఇలా రండి, ఇక్కడున్నాను.(ఎదురుగా వెళ్లును.) (అశ్వపతి, రాణి ప్రవేశింతురు)అమ్మాజీ!—ఏమిటి, బాబాజీ కూడానా! వగర్తున్నారేమీ? నమస్కారము!

అశ్వ:—నీమాటవిని పరుగెత్తి వచ్చినాము. తల్లీ—హా, అదుగో, నాతండ్రి, సత్యవంతుడు!—ఇందాకావస్తే—నేను ఆ ఘాట అనలేను. బావగారూ, నేను, అశ్వపతిని, నమస్కరిస్తున్నాను. (వారిద్దరూ ఆలింగనము చేసుకొందురు.)

సత్యవంతునితండ్రి:—బావగారూ, నాకిదంతా, స్వప్నమో, ఇంద్రజాలమో తెలియకున్నది!

అశ్వ:—నాకూ అలాగే ఉన్నది! అమ్మా, నారదుడు చెప్పినది ఈదినమే అని, మీ అందరినీ చూతామని వచ్చినాము. అలాగు జరిగినది! మేము చూచినాము—నీవు కనిపించకుంటె వెతుక్కొంటూ తిరిగి తిరిగి వచ్చినాము—'ఇదంతా, ఏమిటమ్మా, ఒక్కమాటలో చెప్పూ, నాయనా.

సా:—యముని, నేను వైతరణి అవతల ఒడ్డువరకూ వెంటబడి ప్రార్థించగా, మనకుల దేవత ఆజ్ఞానుసారముగా, మా అత్తమామలకు కళ్లివ్వడమూ, మీకు కోరినందరిని కుమాళ్లను ప్రసాదించడమూ, నాకు పతిభిక్షపెట్టడమూ, నాకూ కుమాళ్లు కలుగుతారని శలవియ్యడమూ జరిగినది. నేను యమునివెంటబడి తిరుగుచుండగా మీరిక్కడికి దయజేసి ఉండవలెను. ఇంతట నేనువచ్చి మీఅల్లుని శరీరము ముట్టుకోవడమూ, వారు మృత్యుంజయులై—

అశ్వ:—చాలునమ్మా, చాలును. నీవు సావిత్రీదేవిమీద భారమువేసి నీమనోహరుని చెట్టబట్టినావని అనుకొన్నాము.

సా:— సరిగా అనుకొన్నారే, బాబాజీ!

అశ్వ:—మేము మారాజ్యమును,మీమామగారి రాజ్యమును మీకిచ్చి—

సత్యవంతునితండ్రి:—బావగారూ, ఇప్పుడు జరిగినవాటికి తీసిపోదే, తమరు శలవిచ్చినదే నిజమయితే రాజ్యభ్రష్టుడనై —

అశ్వ:—మేము సావిత్రిని వెతుకుతూంటె, తమమంత్రి వీరసేనుడు, పరివారముతో కనిపించి—

సత్యవంతునితండ్రి:—వీరసేనుడా? చిత్తం.

అశ్వ:—వారు తమశత్రువులను గెలిచి, తమ సాళ్వదేశము తమకు సంపాదించి, తిరిగి తమర్ని పట్టాభిషిక్తులుగా చేయడానికి వచ్చినారు. నేను తమపర్ణశాలకు పంపించి వేసినాను.

సత్యవంతుని తండ్రి:—ఏమి, పరమేశ్వరుని విలాసము! కాని, నాకు రాజ్యమేల, బావగారూ, సావిత్రి, బాబయ్య ఉండగా? వారిద్దరికీ పట్టాభిషేకముచేసి, చిరంజీవి మాకొరకు కట్టి మాయిద్దరినీ, శిశువును తల్లి కాపాడినట్టు, కాపాడిన ఆపర్ణశాల లోనే, యమునిసాధించిన ఈసాధ్వీమతల్లి నిలిపిన సావిత్రీదేవిని పూజిస్తూ, ఉండడమే నా కోరిక.

సత్యవంతునితల్లి:—నాకోరికా అంతే.

అశ్వ:—నారాజ్యభారముకూడా చిరంజీవి కిచ్చివేసి, తాను పునరుద్ధారణైన ఈ చోటనేకూర్చుండి, తపస్సుచేసుకొంటాను.

స:— మాకు మాబాబయ్యగారు రాజ్యమప్ప గించినట్టు, తమరుకూడా మాబావకు మద్ర దేశ మప్పగించిన తరువాత మాటగాని ఇప్పటిమాటకాదు.

సత్యవంతునితల్లి:—అంతేనా? మాపౌత్రునికి తమపౌత్రి నిచ్చి వివాహముచేసిన తరువాతమాట.

సత్యవంతునితండ్రి:—మనమందరమూ, వాచామగోచరమైన ఇంత ఆనందముపొంది తరించిన ఇక్కడే, వెంటనే, మనసావిత్రీ దేవిని కొనియాడి పర్ణశాలకుపోదాము- ఏదీ, తల్లీ, సావిత్రీ, కానీ:—

అందరూ మోకాళ్లబడి సావిత్రీదేవిగూర్చి పాడుదురు.— (తెర)

[నటకుల కిష్టమైనది ఏదైన దేవిస్తోత్రము పాడవచ్చును.]



# అ భి వం ద న ము

రాచర్ల తిప్పయ్య—సాహిత్య సరస్వతి

శ్రీలభరితహృద్య సంయుగమంబు వచించు, పరభృతగాన ప్రవాహమందు
అలరు కెందామరలందు ఝుంఝుమ్మని, రొదసేయు మెలదేటి కదుపులందు
అరవిరి మొగల విరియించి పరిమళం,బులగ్రోలు శీతలానిలమునందు
ఎలమావిపూపపిందెల మెక్కి మనసార, నలరు చిక్కలముద్దు పలుకులందు
భవ్య కమనీయవన సుసౌభాగ్యమందు, వెలుఁగిడ్చుదయించుచున్న లేఁజిగురులందు
పెక్కుచందంబులన్ దాండవించునట్టి, ప్రణయదేవత కిదే యభివాదనంబు.




జి. జాషువగారు

సరస రసాల నూతన కిసాలయ భోజన మారగించి సుం
దరతర మల్లికాకుసుమ ధామముల న్మకరంద నిర్ఝరాం
తరములఁ దానమాడుచు లతాచయడోలల నూఁగుచున్ మనో
హరముగఁ గూయుచుందువుగదమ్మ, వసంతమునందుఁ గోకిలా !

చ. తరళసమీరడింభములు దాఁకి మరందముఁ జిందు మేలిక్రొ
వ్విరులకుఁ దేఁటిముత్తములు పేరెముఁ లెత్తెడుచోటఁ బూవు జ
ప్పరములచాయల న్విమలవారి రహించెడుచోట హాయిగాఁ
దిరుగుచుఁ గూయుచుందువుగదే ! మధుమాసమునందుఁ గోకిలా !

చ. దరవికచప్రసూనముల తావుల ప్రోవుల నీను సన్నతె
మ్మెరలుఁ బటీరము న్గొమరు మించు కురంగమదంబుఁ బచ్చక
ప్పురమును బుద్ధి కింపగునె ముం దొకమాటు భవన్మనోహర
స్వరమధురాంబుధిన్ బరవశత్వము నందిన నమ్మ, కోకిలా !

చ. విరిసినబొండుమల్లియల వీథులఁ బుప్పొడితిన్నెలందు బం
భరతరుణీమణు ల్జిలుఁగుపాటలు వాడుచుఁ దోడుగా వనేం
దిర నలరింతువో ! మధునిఁ దియ్యనిపల్కుల సన్నుతింతువో ?
విరహుల నేచ మన్మథుని బిల్చెదవో యెలుఁగెత్తి కోకిలా !

చ. హరిణకిశోరము ల్ఘనవనాంతర కుంజవిశాలిసీమల
న్దిరుగుట మాని కంచుకిత దేహము లొప్పఁగ మోదబాష్పము
ల్గురిసెడు గందపుందరులకుం బెనఁగొన్న భుజంగపాళి య
బ్బురముగ మూర్ఛవోవుఁగదె మోహనగానముచేతఁ గోకిలా !






## ౧. పార్వతీభాయి

కావున నుచితములగు నా
కావెంటం గొలిచి తిరుగునప్పుడు మితభా
షావిరచనమును వ్రతసం
భావనమును గౌరవంబుఁ బాపభయంబున్.

—భారతము.

గాంధినగరమున పర్ణశాలలలో విడుదల లేర్పఱుచుకొని దేశీయమహాసభాసభ్యులును ప్రేక్షకులును నిద్రావస్థయం దుండిరి. పగలెల్లను క్రొత్తక్రొత్త విషయములు చూచుటను, చిత్రములగు నుదంతములు వినుటను, నడయాడుట నుండెడివారికి నిద్దుర వేగముగనె లభించుచుండును. కాని సుషుప్తి కఱవగువారు లేకపోలేదు. మైమఱచి నిద్రించువారిసొత్తుల నపహరింపఁ జూచువారును, శ్వాసకాసాది వ్యాధులకు లోనగువారును, కంటికిఁ గూర్కురాక, గడియలు లెక్కపెట్టుకొనుచు, రాత్రి గడపుదురు. ఇంక నేదైన గాఢమనోవ్యథచేఁ బీడింపఁబడువారికి, రేయుం బవల్లొక్కటియె. వేదాంతులమనస్సువలె, వారిదియు దేశకాలనిమిత్తముల నతిక్రమించి, లక్ష్యమందు సుస్థితమై, చలింపకుండును!

కూర్కులేని కన్నుఁగవగల పార్వతీభాయి పైఁ బేర్కొనఁబడినవారిలో నెవ్వరని నిర్ణయింపఁగలము? ఆమె యేదేశపు చేడియయో కలసిమెలసి యుండు స్త్రీప్రేక్షకులును, ఐచ్ఛికసేవకురాండ్రును నే చెప్పలేకున్నారు! పార్వతీభాయియొక్క స్వచ్ఛమగు తెలుఁగునుడికారమును బట్టి యామె యాంధ్రస్త్రీ యని నలుగురును దలపోయుచున్నను, హిందీమాటాడుట మొదలుపెట్టినా, ఆమె కంఠము మాఱిపోయి, ఏయుత్తరదేశపు వనితయో యని వినువారు తలంపకపోరు! ఇదిగాక, యామె తెలుఁగు స్త్రీలవలె నగలుపెట్టుకొనక, సామాన్యముగ మేలుముసుఁగు వైచికొని మితభాషిణియై యుండును. దీనినిబట్టి యీయువిద ప్రయాగప్రాంతపు కాంతయని కొందఱును మహారాష్ట్రమానిని యని మఱికొందఱును నూహించుచుందురు.

ఈవరవర్ణిని వయసెంతయో చెప్పుట సులభము కాదు. స్త్రీలవయోనిర్ణయము చేయుట లోకములో పురుషుఁడు విడఁదీయఁగల కఠినసమస్యలలో నెల్ల కఠినమైనది! మేధావంతులగు మామిత్రులొకరు దీర్ఘాలోచనము చేసి, యొకానొక స్త్రీ యామె కొమరితయంత లేఁబ్రాయంపు నెలఁతయని నిర్ధారణచేసిరి! ఇంకొక బుద్ధిమంతుఁడు మాతను బుత్రికయనియును, పుత్రికను మాతయనియును దలపోసి, పిమ్మటవారితో జరిగిన సంభాషణమునఁ దన పొరపాటు గ్రహించి తత్తరపడసాగెను! కోమల ముఖకాంతినిబట్టి పార్వతీభాయి యౌవనస్థయని పరిగణింపవలసియున్నను, ఆముదిత ధరించెడి మొఱకు వస్త్రములు, వైరాగ్యనిష్ఠయును, ఆమహిళామణి ముప్పదివత్సరముల స్త్రీయని నలుగురకు స్ఫురింపఁ జేయుచుండును.

పార్వతీభాయి మితభాషిణియు విరాగిణియునని యనుకొందమా? కాదుకాదు. ఆమెలఁత మితభాషిత్వము, వృథాప్రలాపముల దెసకుఁ బోకుండ నాలుక నాఁపనేర్పఱుచుకొన్న నియమబంధనమెకాని, ఆపన్నుల నోదార్చునపుడును, దుష్టులకు హితబోధన చేయునపుడును నోరాడకుండఁ జేయు ప్రతిబంధముగాదు. ఆవెలఁది వైరాగ్యమంతయు, మనసును క్షుద్రవిషయముల దెసకుఁ బోనీకుండఁ జేయునదియెకాని, పరులకష్టములకుఁ దాను వగవకుండునట్టును, వారి యానందమునఁ బాల్గొనకుండునట్టును చేసెడి సంకిలిగాదు!

జవ్వనులగు సాధారణైచ్ఛిక సేవకురాండ్రవలె పార్వతీభాయి, చూపరకనుల నాకర్షించుటకై మెఱయుచుండు డవాలిని తెల్లనిచీరమీఁద భూషణప్రాయముగ

ధరించి యిటునటు తిరుగుచుండునట్టిదిగాదు. మెడలో వైచుకొనిన రంగుగుడ్డపట్టి తానుజేయవలసిన యుత్తమ ధర్మములు దనకు సర్వదా స్ఫురణకుఁ దెచ్చుచుండెడి గుఱుతనియె యామె భావించును. తన యధికారౌన్నత్యము, మానవసేవచేయు తనకవకాశములు గల్పించు నొక యుపకరణ విశేషమని తలంచు నాకుదలి, అవిచూచుకొనియేల మిడిసిపడుచుండును? మహాసభ జరుగునంతసేపును, పార్వతీభాయి, స్త్రీప్రతినిధులయొక్కయు ప్రేక్షకురాండ్రయొక్కయు సేవయందె కృషిసల్పును. చోటు దొరకక యల్లాడుచుండెడి స్త్రీ కనుపట్టినతోడనె, యామె కూర్చుండుటకుఁ బార్వతీభాయి యిరవు గల్పించును. నోరాఱిపోవు బాలికకా పుణ్యవతి మంచినీరు దెచ్చి యిచ్చును. పోరు పట్టియేడ్చి తల్లిని సభలోని ప్రసంగము విననుండఁజేయు శిశువు, పార్వతిభాయి యెత్తుకొనినతోడనె సేదదేఱును. ఎపుడు పార్వతీభాయి నోట రెండుమెతుకులు వేసికొనునో యెవరును గనిపెట్టలేరు. ఇఁక భోజనశాలలోనికి వచ్చెడి భామినుల కుపచారములు చేయుటకె యామె కరములు వినియోగపడుచుండును. రాత్రులందు ఐచ్ఛికసేవకురాండ్రు ప్రేక్షకులవలెనే హాయిగ నిదురించుచుండినను, పార్వతీభాయి మాత్రము తాను విశ్రమించనట్లుండియు, కన్నుల నంపటి సంరక్షణ మారయుటకె విప్పియుంచును.

దేశీయమహాసభ కాకినాడలో జరిగిన దినములలో పార్వతీభాయి కన్నులు రాత్రులు నిద్దుర నెఱుఁగకుండుటకుఁ గారణము పూర్తిగఁ దెలిపితిమా? లేదు లేదు. జీవితము పరోపకారము చేయుటకె యేర్పడిన దీక్షాకాలమని గుర్తెఱిఁగినవారు, జనులసుఖదుఃఖములు తమవనియె భావించుచుందురు. సామాన్యుల హృదయముల సర్వదా యాకర్షించెడి యాహారవిహారాదికములు, పరోపకారపారీణులకుఁ దృణప్రాయములు. వారికిఁ బ్రియమగు భోగములును లేకపోలేదు. ధర్మనిర్వాహణమే వారి కత్యంత సంతోషకారణము. పగలెల్లను కార్యదీక్షలో డస్సి, రాత్రి యొకింతసేపు నిద్రావస్థలో సేదదేఱ శరీర మెంత యపేక్షించినను, స్వామికార్యాచరణమున రేయుంబవళ్లలో భేదము గల్పింపఁగూడదని పార్వతీభాయి తనదేహమునకు హితబోధ చేయుచుండును! కలుషురుండు పగటిపూఁట సహాయ మంత గొప్పదిగా నెన్నక, చీకటిచేతను, నిద్రచేతను జనుల పరులఁ దమ్ముఁ దెలియంగకుండఁజేయు రాత్రిపూఁటయే పార్వతీభాయి జాగరణము చేయఁబూనెను!

పాఠకుఁడా! పార్వతీభాయి యాకారమును జాగరూకతతోఁ బరిశీలింపుము. 'ఏమి! యాకలికి కన్నులలో కింత చెమర్చుచున్నవే! నీటి బిందువులు కనుకొలుకులనుండి రాలుచున్నవి. లోకసేవయే జీవితంపు పరమార్థముగ నిశ్చయించుకొనిన యాకాంతకు సొంతకష్టములున్నవా? పరమ విరాగిణియు, పవిత్రశాంతమూర్తియునగు పార్వతీభాయి మనస్సు నిటు గలంపఁగల పూర్వపు పాపకృత్యములేమైన నామెతలంపునకు వచ్చినవా?

ఔను. పార్వతీభాయి తనపూర్వపు సంగతులోకింత జ్ఞప్తికి రాఁగా పరితపించుచున్నది. తరతరములనుండి భూగర్భస్థముగుటవలనఁ గడుంగడు కాఠిన్యమును దాల్చిన నేలబొగ్గు వేలకొలఁది సంవత్సరములకుఁ బూర్వమొకప్పుడు, కోమల పత్త్రిపుష్పలతాభరితమైన మనోహర వృక్షమే! లఘువైన యంగారపదార్థము నేల పాదుకొని చిరకాలమునకుఁ బిదప కఠినతమమగు వజ్రముగఁ బరిణామ మొందుచున్నది! పార్వతీభాయి పూర్వపు వృత్తాంత మెఱుంగనివారికి, పార్వతీభాయి నిక్కంపుఁ బ్రకృతియే తేటపడనేరదు!

## ౨. పార్వతీ విశ్వనాథులు

చ. ఇది గడుముద్దరాలు పను లేమియుఁ జేయఁగనేర దెంత
యున్. —భారతము.

విశాఖపట్టణమండలమందలి నేరడువలస జమీందారు దివానగు సింహాచలముగారు పార్వతి జనకుఁడు. అధికలోకానుభవముగల దివాను, తన యేకైక పుత్త్రికయగు పార్వతికి మంచివరుని వెదకుటకై కృషిసల్పి, తన యల్లునికడ నుండవలసిన ముఖ్యలక్షణములు విద్యాధికతయు, గుణాధికతయు నని నిర్ధారణచేసికొని, అట్టి యువకుఁడు లభించినయెడల భాగ్యభోగముల కేమియు వానికిఁ గొఱంతలేకుండఁ జేయ సమకట్టెను. ఇటులుండఁగా, ఆనాఁడు పట్టపరీక్షలో విజయము నొంది సుగుణములచే నొప్పారెడి యువకులలో విశ్వనాథము పేరెన్నిక గాంచియుండుటచేత, అతని వివాహము దూరస్థమగు కొండపేటి

సీమయు, అతని తలిదండ్రులు సామాన్య స్థితిమంతులు నైనను, సింహాచలముగారు పార్వతిని విశ్వనాథమున కిచ్చి పరిణయము జరిగించిరి. అది యేమి కాలవిపర్యయమో కాని, యీక్రొత్తసంబంధము, ఉభయ కుటుంబముల వారిని నూతనస్నేహమునఁ గలుపుసూత్రమగుటకు మాఱుగా, వారి కిదివఱకు లేని వైరములఁగల్పించు దుష్టమంత్ర ప్రయోగమయ్యెను! అగర్భశ్రీమంతురా లగు కోడలు తమ గృహమును లక్ష్మీయుతముగఁ జేయునని సంతసింపవలసిన కొండవీటివారు తమ క్రొత్తబంధువుల కలిమికిఁ గంటకించుకొనసాగిరి!

పుట్టినింటివారిసిరి చూచుకొని కోడలు తన్నుచిత రీతి గౌరవింపదని యత్త సణుగుకొనుచుండును. మామ భాగ్యమునఁ బుత్రునకు తన సంగతి దివిటీక్రింద దీపమగునని తండ్రి యంగలార్పఁ జొచ్చెను. జననీజనకు లహర్నిశమును జేసెడి విపరీతబోధనములు క్రమక్రమముగఁ దలకెక్కిన విశ్వనాథము, భాగ్యవంతుఁ డగు మామవలనఁ దనకుఁగలుగఁబోయెడి ధనగౌరవములు, విద్యాసౌందర్యములుగల యర్ధాంగివలనఁ జేకూఱెడి సౌఖ్యసంపదలును పరిగణింపక, అత్తవారియెడల నకారణ వైరభావమును బూనియుండెను.

ఇంకఁ బార్వతి తల్లిదండ్రులన్ననో, విద్యాబుద్ధులం దగ్రగణ్యుఁడగు నల్లుఁడు లభించెనను సంతోషము పెండ్లియుత్సవములతోనే యంతరించిపోఁగా, తమవియ్యాలవారి పేదఱికమును గుఱించియే యనుదినమును దలపోయుచుండిరి! కొండవీటిసీమ నిఁకఁ దమకూఁతురు కొండవీటిచేఁద్రాడువలెఁ దుదిలేని దారిద్ర్య మనుభవించునని తల్లి పలవించుచుండును. సకలైశ్వర్యములతో సుకుమారముగఁ బెరిగిన తన ముద్దులకూఁతు రిక మోటు పడమటి వారియింట కటకటఁబడునని తండ్రి వగచెను. అత్తవారిని గొంచెపఱుచు నిట్టి క్రిందుదనపు మాటలు వినుచుండిన పార్వతి, యట్టి నిఱుపేదల యింటికాఁపురమును గంటకసదృశముగ భావించుట అక్కజము గాదు!

## 3. పతిసతుల సంభాషణము

“అలుకం జెందిన యట్టి కాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే?”

పారిజాతాపహరణము.

ఒకనాఁటిరాత్రి విశ్వనాథము సేరెడువలస పట్టణమందలి మామగృహమున కుర్చీలోఁ గూర్చుండియుండెను. సకలవైభవములతో నాసౌధమొప్పుచున్నను అతని హృదయము తన కొండవీటిసీమ కుటీరమునందె లయించియుండెను. తనవిద్యాప్రజ్ఞల కనువగు నుద్యోగ మిప్పించుటకు మామ సిద్ధముగనున్నను, నూతనముగఁ దానారంభించిన యుద్యమములవంకకే యాతనిదృష్టి వాలుచుండెను. పూర్వము తనయత్తవారినిగుఱించి తనయింటఁ జెప్పుకొనునంత ఘోరముగ నచటి పరిస్థితులు లేకున్నను, స్వగృహమందలి స్వతంత్రజీవనమునందే యాతఁడపేక్ష గలిగియుండెను. అత్తమామలు ప్రత్యక్షరాక్షసులుగాక తన శ్రేయోభివృద్ధులు గోరుచుండెడి సుజనులేయని యతఁడు గ్రహించినను, వానిమనస్సు తలిదండ్రులయొద్ద సుఖజీవనమునకే మఱలెను. విద్యారూపసౌభాగ్యములతో నలరారెడి భార్య ఎంతటి వినయవిధేయతలు గల సాధ్వియైనను, సకలైశ్వర్యములుగల మామయింటఁ గాఁపురముకంటె, స్వగృహమందలి నిరాడంబర జీవనమె మేలని యతఁడు తలంచెను!

ఇట్టియూహలలో మనస్సు మగ్నమై యుండుటచేతనే, ఇపుడు లోనికివచ్చి నిలువఁబడినభార్య యాకారము కన్నుల కొకటిరెండునిమేషముల వఱకును విశ్వనాథమునకు గోచరముకాలేదు. అంతఁ దనయెదుట సౌందర్యదేవత యపరావతారమువలె నిలిచియున్న సతీతిలకమునుగూర్చి యిదివఱకుఁ దమవారు చెప్పుకొను సంగతులు స్ఫురణకు రాఁగా వానికి విస్మయము గలిగెను. లావణ్యమునకుఁదీసిపోని సౌజన్యము, ఆపాదమస్తకమును ఆ కాంతయం దాతని కనులకుఁ బొడగట్టెను. “ఆహా! ఇట్టివిగదా లోకములో భ్రమప్రమాదములు! పూలమాలను జూచి పామనుకొనునట్లు జను లితరులనుగూర్చి యపవాదములు నుడువుదురు! ఈ లలనామణి సుగుణములు మెచ్చుకొననివా రెవరుందురు? ఇది ముఖ్యముగఁ గనిపెట్టియానందింపవలసిన నా జననీజనకులె, పార్వతిని గుఱించి విపరీతాభిప్రాయ మూఁదియున్నారు!” అని యతఁడాశ్చర్యపడెను. అంతట భార్యాభర్తల కీసంభాషణము జరిగెను.

విశ్వ:—“పార్వతీ! మీ జననీజనకులు సజ్జనులగుట కెంతో సంతోషించుచున్నాను.”

పార్వ:—"రాక్షసులనుటకు వారు కొండవీటి సీమవారు కారులెండి!"

విశ్వ:—"ఇదివఱకు మీవాళ్లు దుష్టులనియే నే దలంచితిని గాని, యిప్పుడు నిజము తెలిసినది. కొండవీటి సీమలోఁగ్గూడ సౌజన్యము నీ కన్నుల కగపడఁగలదు. లోకప్రతీతిచేఁగాక యనుభవముచేతనే మనము ఏవిషయమేని నమ్మవలయును."

పార్వ:—"అలాటి యనుభవము నాబోటివాళ్లకు సాధ్యమా?"

విశ్వ:—"నా యుద్యోగమునకై మీ తండ్రి యెంతో పనిచేయుచున్నారు గాని, స్వతంత్ర జీవనమునందే నాకు వాంఛ."

పార్వ:—"ఎవరును నెనుకటిగుణము మానలేరు! మీకు మీ దేశమునకు వెళ్లిపోవలయునని యున్నదా?"

విశ్వ:—"నేనొక్కఁడనె కాదు, మనమిద్దరమును! అక్కడ లోకోపకారకరములగు పనులు మనమెన్నియో చేయవలసియున్నది. మీ పుట్టినింటిలోవలె నైశ్వర్యములు లేకున్నను, నిజమగు సంతృప్తిని సంతోషమును బొందఁగలము!"

పార్వ:—"అలాటి ప్రదేశములలో మీరు సుఖించిన సుఖింతురుగాని, నే నుండలేను!"

విశ్వ:—"మా యింటికివచ్చుటకు నీకేమి కష్టమో చెప్పుము?"

పార్వ:—"మీది మారదేశము. నిర్జలప్రదేశము. నిర్దయాత్ముల యావాసము!"

పార్వతి యిట్లు మాటాడుచుండఁగ విశ్వనాథ మెన్నఁడును వినలేదు! ఆమెలఁత మితభాషిణియు శాంతస్వభావురాలనియు నాతని తలంపు. ఐనను, ప్రసంగధోరణిని మెల్లమెల్లగ నాకాంతకుఁ గోపము హెచ్చి ఆ సుందరవదనమునందలి పసిఁడివన్నె యరుణకాంతియై, ప్రియునికోపము నాశ్చర్యముగ మార్పఁగా, మందహాసముతో విశ్వనాథము, "పార్వతీ! ఏల యిట్లు మమ్మందఱిని చుట్టబెట్టి చెండాడుచున్నావు!" అని యామెను శాంతిపఱుప నెంచి చేయి నిమురుచు, "కోమలీ! ఈహస్తమునకుండు మృదుత్వము హృదయమునకు లేకపోవుట ఎంతచిత్రము!" అని పలికెను.

పార్వ:—"ఈమృదుత్వమునకుఁ గఠినత తెచ్చిపెట్టవలయునను వారిదయ యంతచిత్రము!"

విశ్వ:—"నీకోపమునకుఁ గారణమువిప్పి చెప్పుము?"

పార్వ:—"కష్టము లెఱుఁగక పెరిఁగిన నేను మీ దేశమున గాసిఁబడఁజాలను. లేమియు శ్రమయు నాకు ఆగర్భశత్రువులు!"

విశ్వ:—"అట్లైన, మాతల్లి మాటలు నిజమే. ఆ ముసలామె కిదియే తుదిదెబ్బ!"

పార్వ:—"ముసలామె యేమైననుసరే! నేను మీ దేశమున నడుగుపెట్టఁజాలను!"

## ౮. పార్వతి మనోనిశ్చయము

"నెన్నుని గుఱించి యిటుఁ దప మున్నదాన!"

—ఉత్తరరామాయణము.

మఱునాఁడు నేరేశువలస పట్టణమున, దివానుగారియల్లుఁడు ఎవరికిని జెప్పక వెడలిపోయెనని జనులు చెప్పుకొనిరి. మామగారింటనుండ నిష్టములేక లేచిపోయెనని కొందఱు, భార్యమీఁదఁ గోపపడి యిలు వెడలెనని మఱికొందఱు నూహించిరి. పార్వతి దుశ్శీలయని యెవ్వరనఁగలరు? ఐనను, ఆగర్భశ్రీమంతురాలనని యామెకొక గర్వము. సంపద మంచిదే. పరిశ్రమము చెందినవారికి మాత్రమేయది మేలుచేయును. ఇతరులకది దారిద్ర్యమునకంటె నధికముగ చెఱుపుచేయును. కలిమి కష్టమునకోర్వదు. కోపమునకుఁ బుట్టినిల్లు. గర్వము నుగ్గుపాలతోఁ బెంచును. చింతచచ్చినను పులుసుచావదన్నట్లు భాగ్యము నశించినను, తత్సంపర్కదోషమున సంక్రమించిన దురాగ్రహాదిదుర్గుణములకు జనులు అగ్గమై యుందురు. ఐశ్వర్యమా! నీవిచ్చెడి సౌఖ్యములు క్షణభంగురములైనను, నీవు కొనివచ్చు దుర్వ్యసనములు శాశ్వతములు! వానిబారినుండి తప్పించుకొనుటే దుస్తరముగఁ దోఁచునపు డిఁక వాని నిర్మూలనము చేయఁ గడఁగుట యెట్టి దుస్సాధ్యమగు కార్యము!

ఇఁకఁ బార్వతి మనఃపరిస్థితు లెటులున్నవో కొంత పరిశీలింతము. మఱునాఁటి యుదయమున పడక విడిచి

## పార్వతీ తపస్సు.



ధూళిపూసిన నింత వాడమెడుఁ దను కాంతి, తొడుప నెంతటి మెఱుం గడరియున్నొ
వంది కందిన నింత వఱలెదు ముఖరోచు, లెలమిన నెంత సల్లలిత మగునొ
పాలయింపకయు నింత వెలిఁగెడుఁ జూడ్కుల,ల్లార్చిన నెంత రమ్యంబులగునొ
జడలు గట్టియు నింత సక్కనైనది వేణి, దీర్చిన నొఱు లెంత ప్రదేణి యగునొ
యూడ విడిచిన మేఁదీగ యింత నయము, గలిగి యున్నది వాలిక కలిగెనేని
నెంత నవకమై యుండునో యింతి కనుచు, శివుఁడు గిరిరాజసుత విశేషించె నర్థి.

—నన్నెచోడుని కుమార సంభవము.

లేమనప్పుడు పార్వతీవీనులకుఁ గడచినరాత్రి భర్తతోడి తన ప్రసంగము వినవచ్చుచున్నటు లుండెను. సంభావణ మాకస్మికముగ నిలిచిపోవుటకుఁ గారణమేమా యని యావిడ యాశ్చర్యపడెను. పతి యాగ్రహమె దీనికిఁ గారణమని కొంతతడవువఱకు ఆసుందరికి స్ఫురించలేదు. తాను గట్టకడపట వచించిన పరుషవాక్యములు ఆయనకుఁ గోపము తెప్పించెనని యిప్పు డామె తెలిసికొనెను. మాననీయమగు జననిగుఱించి పుత్రునియెదుట కఠోరమగు నిట్టిమాటలాడుట తప్పిదమని యా కాంత గ్రహించెను. చీఁకటియుండఁగనే యెప్పుడో యిలు వెడలిపోయిన పతి, ప్రొద్దెక్కినను రాకుండుట మాఱి, తన దుడుకుదనమె దీనికి గారణమని పార్వతి కిపుడు బోధపడెను. అదివఱకు విచారమెఱుఁగని యామానిని మనస్సు ఆదినమున వ్యాకులత పాలయ్యెను. "అత్తకేమైనను నాకేమి?" యను తనమాటలు పార్వతి చెవులకుఁ బలుమాఱు దవులుచున్నటు లుండెను!

ఆదినమునసెకాదు మఱునాఁడును విశ్వనాథ మింటికి రాలేదు. తపాలజవా నంత యొకయుత్తరము తెచ్చి యిచ్చెను. అది పార్వతి పేరవచ్చెను. మిక్కిలి తత్తరపాటుతో నామె దానిని విప్పిచూడఁగా నం దిటులుండెను.

రెయిలుమార్గము.

చి. సౌ. పార్వతికి,—

నీశ్రేయస్సును గోరియె నీకీయుత్తరము వ్రాయుచున్నాను. ధర్మాచరణ మింకొకసారి నీకు జ్ఞప్తి చేయుచున్నాను. సరియైన యనుతాపమే ముందుదారి చూపి నీకు సంసారసుఖము నీయఁగలదు. నాపరదేశవాసదీక్ష నీసాన్నిధ్య సంప్రాప్తివలననే పరిసమాప్తి నొందఁగలదు. పాదము దేశాటనమునందున్నను, మనస్సు నీయభివృద్ధినే కాంక్షించుచుండు 'నీహితుఁడు—విశ్వనాథము.

నాఁటిరాత్రి తన మేరపాటువలన పతి కీనిర్బంధ దేశసంచారము సంభవించుటకాయింతి యెంతయు వగచెను. పరిస్థితు లిట్లగునని యాకెకెి కలలోనైన ననుకొనలేదు. సాంసారిక సౌఖ్యమున కువ్విళులూరుచుండిన యాచెలువకు పతివియోగమునకు జెప్పనలవిగాని యాశాభంగము గలిగెను. తన మనోవ్యాధను నెటులో మామయింటఁ గాపురమున కొడఁబఱుపఁగలనని యాయంగన యనుకొనుచుండెడిది. తనపలుకులకు పతి యింత యలుగుననియును, వానియలుక యిట్లు పరిణమించుననియును, ఆచాన యనుకొనలేదు. బాల్యమునుండియు నిరంకుశప్రవృత్తియు, సుఖాపేక్షయు జీవితధర్మములుగఁ దలంచుచున్న యాచేడియ, ఈప్రాతికూల్యమువలన భగ్నమనోరథయై, లోకములో నెవ్వరికిని గష్టములు తప్పవని తెలిసికొనెను.

చిరకాలమిత్రమగు సుఖాపేక్ష నొక్కపెట్టునఁ గోసివైచుట ఎవ్వరికిని సాధ్యముకాదు. ఆరాత్రి నిద్రయందును పార్వతి మనమున కలవర మతిశయించి యుండెను. మఱునాఁటి సాయంకాలము తిరిగి తపాల జవాను తెచ్చిన యుత్తరమొకటి పతికి వ్రాయఁబడి యుండుటచేత, పార్వతి యది విప్పి చూడఁగా, అందు కొండవీటిసీమ వర్తమానములుండెను. కుమారుని కష్టములకుఁ దల్లి బెంగపెట్టుకొని మంచమెక్కి యుండుటయు, విశ్వనాథము గ్రామాంతరము పోవుటచేత నతఁ డచట నారంభించిన కార్యములకు భంగముగలుచుండుటయు, వార్ధక్యదశనుండిన మామ వీనినెల్ల సమర్థింపనేరక, ఒంటరిగనైన వేగముగఁ దనయుని యింటికి రమ్మనికోరుటయు దానియందు వ్రాయఁబడి యుండెను. ఆమానిని మనోనేత్రమున కీజాబులోని సంగతులు తనకర్తవ్యము నొకపెట్టున మెఱుపుమెఱసిన చందమున స్ఫురింపఁజేసెను; అరహస్యమును గ్రహించిన యాసాధ్వి, సందియములు తొలఁగిపోయి, ఆనందభరితయయ్యెను. కష్టమా! ఇట్టిసహాయకారివగు నిన్నేలజనులు నిష్కారణముగ నిందింతురు?

దివానుసింహాచలముగారు సాయంకాలము ఉద్యోగస్థానమునుండి వచ్చినవెంటనే కుశలప్రశ్న చేయుటకై, కొమార్తెగదిలోనికిఁబోయి, యామె చాలసందడిఁ బడుచుండుట కచ్చెరువొందిరి. ఎచటికో దూరప్రయాణము చేయుటకై పార్వతి మూటయు ముల్లెయుఁ గట్టుకొనుచుండెను. వలదని తలిదండ్రు లెంతచెప్పినను పుత్రికవారిమాట వినక, యారాత్రి పయనమయ్యెను.

## ౫. ధర్మాచరణము

క. ఆవెలఁతనేయుసువినయ

సాకుగ్రిని మృదుగభీర సంభావణలఁ

మామయు న త్తయు సంతో
షామృతమునఁ దేలి రంతరంగములఁ దగన్.

మహాభారతము.

మనుజు లీలోకమున నిర్వర్తింపవలసిన యుత్కృష్ట కార్యములలో నెల్ల ధర్మాచరణమే యుత్కృష్టమైనది. విధినిర్వహణము తనను సేవించువారిని, తక్కిన ధర్మముల వలె లేనిపోని తర్కమీమాంసలకు లోనుచేయక, వారికి నిస్సందేహమగు తరణోపాయమును జూపించును. కష్టములను పలాయితము గావించును. తనభక్తులకు సౌఖ్యము నొడఁగూర్చి, స్వర్గమును భూతలమునఁ బాదుకొల్పును. విధికార్యనిర్వహణమునకుఁ దొడంగినకాళ్లకు ముండ్లు గ్రుచ్చుకొనవు. దుస్సహములైన ప్రచండభానుకిరణములు శీతకరుని చలువవెలుఁగులై హాయినొసంగును. దుఃఖజనకమగు పరిస్థితులు, సిగ్గుచేఁ దలవంచుకొని ధర్మాచరణదీక్షఁ బూనువారి కడనుండి, తొలఁగిపోవుచుండును.

కొండవీటిసీమయందలి మామగారి గృహముపార్వతి సొచ్చి యిప్పటికిఁ గొన్ని నెలలైనది. క్రొత్తగా వచ్చిన దినములలో పార్వతినందఱును జాలిముఖముఁ జూచుచుందురు. ఈభాగ్యవతి మూలమునఁగదా తమ ముద్దులకొమరుఁడు పరదేశముల పాలయ్యెనని యత్తమామ లీసడించుచుందురు. ఈసుందరికిని దమకును రూపవిద్యాభాగ్యములందుఁగల తారతమ్యమునుబట్టి సవయస్కలగు యిరుగుపొరుగు చేడియలు పార్వతియనిన పెడమొగము పెట్టుచుందురు. ఆనాతిధరించు మిలమిలమెఱయుసీమనూలు చీర కాంతులు, మొఱకు కోకలుగట్టుకొండవీటి కోమలులకన్నులకు నూదులవలెఁ దగిలెను. ఈవిశాఖపట్టణపు సుందరి ధరించునగలును, వాడు సబ్బులు సుగంధద్రవ్యములును, అపల్లెటూరి యిల్లాండ్రకేమియు నచ్చక, పార్వతి తన వైశ్వర్యమును జూచుకొని విఱ్ఱవీగు వగలాడియని వారు భావింపఁ జొచ్చిరి!

పార్వతి మనస్సునందెట్టి పరిపాకము గలుగుచున్నదో యాసుదతులకేమి తెలియును? పార్వతి యంతగ నెవరితోను మాట్లాడు బాలకాదు. తనదురవస్థకు లజ్జపడి యామానిని మఱింత మితభాషిణియయ్యెను. నిలుకడ మీఁద పార్వతి నిజస్వభావము వారికిఁ దెలిసినది. తనకుఁ గోడలుచేయు సపర్యలు కడుపునఁ బుట్టిన కూతురైనఁ జేయదని యత్తచెప్పసాగెను. వ్రాఁతకోఁతలందును, కుటుంబకార్యనిర్వాహకత్వమునందును, పార్వతి మామకుఁ గుడిభుజమయ్యెను. ఆపుణ్యవతి తమ యిలుసొచ్చినప్పటినుండియుతిరిగి పాడిపంటలయందు తమకుఁగొఱంతలేకున్నదని యాగృహస్థులు గ్రహించిరి. పార్వతి యత్తయొడఁ గనపఱుచునత్యాదరమువలననే, కాటికిఁగాళ్లుచాఁపుకొనిన యాముదుసలి ముత్తైదువ, మరల యౌవనవతియగుచున్నదా యనునట్టుగ మిసమిసలాడఁ జొచ్చెను! ఆమె కిపుడు పార్వతి బహిఃప్రాణము. తమకుఁగోడలే కొడుకు కూఁతురనని యావృద్ధాంగన నలుగురికిని జెప్పుచుండును. అరవిందమువలె నున్నదనము నరుణకాంతియు గలిగియుండు పార్వతి పాణితల మిపుడు, ఇంటిపనులు నిర్వర్తించుట చేత గట్టిపడుట కత్తయెంతయు వగచి, కష్టపుపనులు చేయవలదని కోడలి నివారించి, అవి తానే చేయుచుండును. తమకోడలు సత్కులమున జనించిన యోగ్యురాలని గ్రహించి యామె తమ వియ్యము వారిని గౌరవింపనారంభించెను.

గృహకృత్యములు చూచుకొనుటయే కాక, భర్త యాప్రదేశమం దారంభించిన ఘనకార్యములు కొనసాగింపవలయుననియు పార్వతి యాశయము. విశ్వనాథము గ్రామమున లేకుండుటచే క్షీణింపఁదొడఁగిన రాత్రిపాఠశాల హిందీప్రచారములను పార్వతి పునరుద్ధరింపఁ జూచెను. ఖద్దరువస్త్రనిర్మాణమునకుఁగూడఁ బ్రోత్సాహము కలిగించెను. తనకదివఱకుఁ దెలియని నూతనోద్యమములందుఁ జొచ్చుట కాసుందరి వెఱఁగందక, తనప్రియునకుఁ బ్రియమగు సత్కార్యములు దనకును నాదరణీయములే యని చెప్పెను. మృదునను చీరలు ధరించుచుండిన యామృదులాంగి, తన ముద్దునుసు చీరల నిపుడు మూలవైచి, ముదుగుస్వదేశవస్త్రములు గట్టుటకుఁ గొంకకుండెను. హిందీభాషాపరిజ్ఞానములేని యాబాల, ఆ గ్రామవాసినులకుఁ దానే యాభాష నేర్పఁబూను టెంతటి సాహసము! తాను జెప్పినచొప్పున నాచాన చేయఁగలుగుట యందలి రహస్యమేమనఁగా, స్వయంకృషిచే ప్రాతఃకాలమునఁ దాను హిందీ నేర్చుకొనుచు, మధ్యాహ్న సమయమునఁ దమయింటికివచ్చు బాలల కామె పాఠము చెప్పుచుండును. తనకుఁగల యభినివేశమువలన నట్టి నూతనోద్యమములును

చిరకాలానుభవముగల వారివలె నాసాధ్వి సాధింపఁ గలిగెను. వేయేల? ఆప్రాంతములందు వ్యాప్తిలోనున్న యున్నతోద్యమములలోఁ బార్వతి పాల్గొనుచు, దేశసేవకురాండ్రలో నొకతెయని యామెయు పరిగణింపఁబడుచుండెను.

• •

ఇట్లు క్రొత్తప్రదేశమునఁ గ్రొత్త యుద్యమములలో విమగ్నయైయున్న పార్వతి యొకవిధముగ క్రొత్త మానిసి యయ్యెననియే చెప్పవచ్చును.

ఈనూతనజీవితమున పార్వతి కెంతో మేలు కలిగెను. ఇట్టిమార్పు లేక, జననీజనకులయొద్దనే యాబాల దినములు గడుపఁ దెంచినయెడల, దినమొక యేఁడుగా నామెకుఁ గాన్పించియుండును. పరోపకారదీక్షయే, మనఃక్లేశ నివారకమును, ఆత్మోజ్జీవన సమర్థమును! కావుననె తాను ధన్యజీవితనని పార్వతి యిపుడు తలంచి, యీపరిణామమునకుఁ గారణమైన కాలమును, కాలాధిపతియగు నీశ్వరుని వినుతించుచుండును.

ఐనను, ఒక్కొకప్పుడు పార్వతికి వర్ణింపరాని దుఃఖము పొంగిపొరలివచ్చుచుండును. లోకమునఁ దానొంటరిగ నుంటినని యాయబల భీతి నొందుచుండును. తలిదండ్రులు దూరమున నుండుటయు, పతిని వీడి దినములు గడుపుటయును—ఇవి యాయంగన కెంతో దుస్సహములుగ నుండెను. పతి ప్రవాసమునకుఁ దానే కారణమని తలంచినపుడామానిని మనోవ్యథ యధికమగుచుండెను. అత్తను గూర్చి తా నానాఁడాడిన యన్యాయపుబలుకున కాయింతియెంతయు వగచి, ఆఘోరపాపమునకు పరితప్త యగుచుండును.

నిరతము కార్యదీక్షతో నుండు పార్వతి యిట్టి గూఢదుఃఖమునకు లోనగుచుండునని యెవ్వరికిఁ దెలియును? దుఃఖ ముప్పొంగినపుడు, ఆబాల తనగదిలోని శయ్యమీఁదఁ జేరి, శమనమైనపిదప వెలికివచ్చును. ఒకానొక దినమున పార్వతి యిట్లు శోకవార్థియందు మునిఁగియుండఁగా అత్త యామెదగ్గఱకువచ్చి, "అమ్మా! నేఁడు నీవేమి యిట్టులున్నావు?" అని యడుగఁగా పార్వతి సత్యము చెప్పవలసివచ్చెను. అంతఁ దనకొమరునివిషయము జ్ఞప్తికివచ్చిన యత్త కోడలితోఁ గలిసి శోకించెను. కాని, తనపుత్రుఁడు అనతికాలములోనె యిలుసేరఁగలఁడని చెప్పి యత్త కోడలి నోదార్చి, ఆమానిని మనస్సు దుఃఖవిషయములందుఁ జొరకుండు నుపాయ మారయుచుండెను.

దేశీయమహాసభ, ఆంధ్రదేశ కేంద్రస్థానమగు కాకినాడను జరుగనున్నదని తెలిసి, పార్వతి, యచటికేగి సభాదినములలో నచటికేతెంచు మహనీయుల సేవజేసి ధన్యత నొందఁ గోరుచున్నానని చెప్పినపుడు, ఇట్టి వ్యాపృతి వలననైనఁ గోడలిమనసు దుఃఖ విషయములు మఱచుట కలవడునని యత్త తలపోసి, యామె పయనమునకు సమ్మతించెను.

## ౬. ఉంగరము దొంగతనము

క. తక్షకుఁ డీ కుండలము ల
పేక్షించుచునుండువాఁ డభేద్యుఁడు మాయా
దక్షుండు, వారివలన, సు
రక్షితముగఁ జేసి చనుము రవినిభ తేజా!

—భారతము.

పార్వతి కాకినాడపురమున నడుగిడుటకుఁ బూర్వమె, ప్రచ్ఛన్నయై యటనుండఁగోరి పేరును వేషమును గొంతయు మార్చుకొనెను. అన్యదేశపు స్త్రీయని తెలుఁగువారు తలంచి, తనను లేనిపోనిప్రశ్నములు వేయకుండుటకై తా నీమార్పుచేసికొంటినని పార్వతి యనుకొనుచుండెడిది. కాని యాముదితకుఁ దెలియకయే వేఱొక యుద్దేశముకూడ నామె మానసమున నుండెనేమో!

ఒకనాఁడు ప్రాతఃకాలమున బంగరులేయెండలో తమదుస్తులు మెఱయుచుండఁగ, దేశీయైచ్ఛిక భటులు గాంధినగరమధ్యమున స్థాపింపఁబడనున్న జాతీయపతాకాస్తంభము చుట్టును జేరియుండిరి. పతాకస్థాపనమహోత్సవము దర్శించుటకై వేలకొలఁది జనులు బారులుదీరి నిలుచుండిరి. ముందరిబాట నిరుప్రక్కలను స్త్రీలు చేరియుండిరి. వీరిలోఁ బార్వతీభాయి యొకతె. అంతసేనానియగు జవహర్లాలుగారి హిందీయుపన్యాసమును తెనుఁగువారి యుపయోగార్థము భాషాంతరముచేసిన యొక యువకుని కంఠస్వరము తానెపుడో విన్నట్టుగ పార్వతికిఁ దోఁచెను. కొంతసేపటికి స్ఫురణకువచ్చి, యాయువకుని వైపున కాసుందరి దృష్టి నిగుడింపఁగా, గడ్డము మీసమును దట్టముగ నావరించినవదనమామెకు చక్షుర్గోచరమయ్యెను.

కాని, విశ్వనాథమునకంటె నీతఁడు పొడుగుగనుండిన వేఱొకపురుషునివలెఁ దోఁచెను. "ముఖమునుబోలు ముఖ ముండురీతి నేకంఠమును బోలుకంఠము నుండదా?" యని తన్నుఁదా ప్రశ్నించుకొని, పార్వతీభాయి, తత్తరపడెడి తనహృదయావేగమును శమింపఁజేసికొనెను. ఆజనసమూహముననొకవేళ తనప్రియుఁడుండినను ఆయననుగనుఁగొనుటెట్లని యామె యధైర్యపడెను. మానవసేవాదీక్షచే నాకోమలి హృదయము బంధింపఁబడి యున్నను, కన్నగవమాత్రము ప్రియుని సుందరాకార సందర్శనముకొఱకు అపుడపుడు జనసమూహము నారయుచుండునని మానమ్మకము.

కాకినాడలో పార్వతీభాయికిఁ గలిగిన యొకటి రెండనుభవములను గుఱించి యిచటఁ గొంత ప్రస్తావించెదము. మొదటిదినములలో స్వేచ్ఛికసేవకులు సేవకురాండ్రును, గంటికి ఱెప్పవలెఁ సొమ్ము సహార్నిశము గాచుచుందురని యూహించి ప్రేక్షకులు పగలేమఱియుండుటయు రాత్రులు మైమఱచి నిదురించుటయుఁ గనిపెట్టి, చుట్టుపట్టులనుండియు, విదేశములనుండియు,వచ్చిన చోరశిఖామణులు ఇచ్ఛావిహారము సలుపుచుండిరి. కనుమూసి కనుతెఱచునంతలో ప్రజలు తమ సొత్తును గోలుపోవుచుండిరి. తమవస్తువులు క్షణమాత్ర వ్యవధానమున మాయమగుచుండుట కాశ్చర్యపడి, జనులు తమదగ్గఱనున్న నిరపరాధులమీఁదనే నిందమోపుట కారంభించిరి. ఇట్టి యపనిందలుమోప వెనుదీయకుండువారిలో స్త్రీప్రేక్షకులును గలరు. వీరమ్మమీఁద వెంకమ్మయు,సూరమ్మమీఁద పేరమ్మయు లేనిపోని సందియములుపడి, దేశీయ మహాసభాతీర్థయాత్ర చేసినందుకు ఫలముగా, సొమ్ము గోలుపోవుటకుఁదోడు,ఆజన్మవిరోధములు సంపాదించుకొని పెక్కండ్రు ఇలుసేరిరి! ఏయమ్మ సింగారము గుఱించి యాయమ్మచూచుకొనునుగాని, పరుల సొమ్ము భద్రపఱుపవలయు ననుచింతగలవారు లేకుండిరి. పార్వతీభాయి జాగరూకతగల కన్నులు చిట్టి దొంగతనము లట్టె పట్టుకొనుచుండుటనుబట్టి, యామె విహరించుచెస దొంగతనము లంతగఁ దలచూపకుండెడివి.

పగలెల్లో పెద్దసొమ్ములన్న స్త్రీలు గాపాడుకొనగలుగుచుండిరికాని, రాత్రులు వారేమి చేయఁగలరు? ఒకనాఁటిరాత్రి స్త్రీప్రతినిధులుండు పెద్దగదిలో గంద ఱు విశ్రమించి యుండిరి. గదికిగదికి నడ్డముగ దడులు తడకలు నుండుటచేతను, తడకలే తలుపులుగ నమర్పఁబడి యుండుటవలనను, చోరుల బారినుండి లోనివారి కంత రక్షణము లేకుండెను. మినుకుమినుకుమను విద్యుద్దీపములు జనులకంటె చోరులకే యొక్కువ తఱి సహాయకరము లగుచువచ్చెను. చప్పుడైన, ముందరివాకిటు దగ్గఱకుఁ బార్వతీభాయి పోయి యుండుట గనిపెట్టి, వెనుకవాకిలి తడకసందునుండి యొకచోరుఁడు చేయిపోనిచ్చి, అచట మంచముమీఁదఁ బండుకొనియున్న స్త్రీనగను దీసికొనఁబోయెను. ఇది కనిపెట్టి పార్వతీభాయి వేగమె యచటికేఁజని, నగమీఁదఁజేయిడిన దొంగచేతి నదిమిపట్టెను. చోరుఁడంత నిద్రించు స్త్రీనగను వదలివైచి, పార్వతీభాయి చేతిని బట్టుకొని, వ్రేలియుంగరమును సంగ్రహించి పరుగిడెను. తనవస్తువుపోయినను,పరులసొమ్ము భద్రమయ్యెనని పార్వతి సంతసించెను. దొంగకై వెతకిరికాని, వానిజాడ గానఁబడలేదు.

తాను బోఁగొట్టుకొనిన సొమ్మధికమైన విలువగలది గాకున్నను, పాపము, పార్వతీభాయి యారాత్రి యుఁ బిమ్మటయు ననేకపర్యాయములు తన వట్టివ్రేలిని జూచి దైన్యమునొందెను. పరులచేఁ జిక్కిన యాయమూల్యమగు నుంగర మిఁక దొరకదని గ్రహించి పార్వతి మిక్కిలి విషాద పడెను.





# గోకులము - ప్రణయోన్మాదము

కాశీ వ్యాసాచార్యులు గారు

స్వామికార్యార్థసాధన చతురుఁ డతుల
శక్తిసామర్థ్యయుతుఁడు, వసంతుఁ డెలమిఁ
జెంత నడువంగ గోకుల ప్రాంతములకు
చైత్రయాత్రార్థమై పంచశరుఁడు వెడలె.

ఉ. గోకుల సన్నిధానమున
కున్ మునుముంద వసంతు డేగి త
త్ప్రాకట యామునస్వాద
భంగతరంగరవంబు వీనులన్
సోకిన నాలకించి బహు
శోభనమౌ తదుపాంతదేశమం
దే, కడువేగ దండువిడి
యింపుఁగఁ బూనె మనంబులోపలన్.

చ. పటుతర శక్తి యుక్తి గుణ
భాసురులైన తదీయయోధు ల
ప్పట నిజనాథు మానసిక
భావ మెఱింగి స్వకీయకార్యలం
పటులయి తత్క్షణంబ పరి
పంథుల చిత్తములన్ గలంప న
వ్పటుఁ దమకార్య మూనిరి
నిజప్రతిభావిభవంబు పెంపుకాన్.

మ. రసహీనాధిక ధూళిధూసరవిన
ప్రమ్లాన జీర్ణశథ
ద్వసనానీకములన్ ద్యజించి విటపి
వ్రాతంబు లాతావునం
దసమానారుణపల్లవాంబరము లా
హ్లాదరిబునన్ దాల్చి ని
ర్చె సమంతంబుల నూత్నవైభవము
శాశిభూతమై యొప్పఁగన్.

గీ. రమ్యకేసరపులక వర్షములతోడ
సరసకోరకమృదుతరోష్ఠములతోడఁ
డరుణపల్లవరుచిర పాదములతోడఁ
బొలిచె నాతావున నశోకభూరుహములు.

చ. కలుషవిహీన నూతనవి
కస్వర కోమలకాంతి మోములన్
జెలఁగ మహోన్నతాకృతులచే
నలరారుచుఁ గోకిలావళీ
కలనినదంబు లొప్ప సహ
కారచయంబులు స్వీయహస్తశా
ఖల నిలువెల్ల సాచి సహ
కార మొనర్పఁగఁబూని నత్తఱిన్.

సీ. సహకారపల్లవాస్వాదకషాయకం
ఠములఁ గోయిలలు పాడంగఁ దొడఁగె
బహుళపుష్పమరందపానమాద్యద్భృంగ
మందరస్వనము లందందుఁ జెలఁగె
నీలాభ్రసదృశతమాలవృక్షోన్ముఖ
కేకినినాదముల్ చౌకళించెఁ
తరుషండమండలాంతరశుకాదిద్విజ
శ్రుతిహితగీతికాశోభ దనరెఁ
గీ. తర్జురవివర్ణపల్లవాధరము లమర
నధికరుచిఁ దనరు లతాలతాంగు లెల్లఁ
బుష్పవతులౌట మదిఁ బొంగి పొరలి ప్రకృతి
జనని, యొనరించె దిసల వసంతపూర్తి.

చ. స్మరతపనజ్వరార్తహరి
శాంతికినై తదరణ్యభూములన్
దరళనికుంజపుంజము
లుదారతనై జములైన చల్వపం

విరుల విధంబునన్ నెగడి
నిర్మలకోమలపుష్పశయ్యల
చ్చేరువుగ దిద్దెఁ జిత్తములు
చిందఱవందఱ చెంద నందునన్.

గీ. భ్రమరరాజంబు, తనప్రియురాలితోడ
మల్లికాకుంజపుంజసీమలకుఁ జేరి
పటుతరాసక్తిఁ గుసుమమైకపాత్ర మంద
తనివితీరంగఁ దా మరందంబుఁ గ్రోలె.

చ. హృదయగతాభిలాషఁ జకి
తేక్షణపంక్తుల పల్లిగొల్పుచున్
మృదుతరబాలఘాసముల
మెక్కుచు, శ్యామలశాద్వలంబులం
దదటున సంచరించుహరి
ణాంగన డాయుచు నొక్కలేడి య
య్యదనున నాత్మశృంగమున
నల్లన గీరెఁ దదీయకాయమున్.

సీ. తనసతితోఁ గపోతము వృక్షకోటరాం
తరమున గుసగుసల్ జరుపఁదొడఁగె
కీరంబు సహకారభూరుహంబునఁ గాంత
తోడ సల్లాపంబు లాడఁగడఁగె
పాలఁతిచెక్కిళ్లపై ముద్దులాడుచు శారి
కలు జంటజంటలై మెలఁగఁ దొడఁగె
పతివిరహంబు సైఁపక చక్రవాకియుఁ
బ్రియునకై దినమంది వెదకఁ గడఁగె

గీ. వింతవింతలఁ జెలఁగు వసంతపూర్తిఁ
గనులఁ గాంచంగ గోకులంబునఁ దనరెడి
గోపగోపీజనంబులకును మనంబు
నందు నూతనభావంబు లంకురించె.

సీ. నెఱికురు ల్సవరించి నిలువుపాపటఁ దీర్చి
యోరకొప్పుల సొంపులొలుకువారు
తళతళలాడుమోములఁ గుంకుమము దిద్ది
ముక్కునత్తులకాంతి మొనయువారు
చేతిగోటులపైని చిలుమువాయఁగ రుద్ది
పట్టెగాజులఁ బెంపువరలువారు
గొల్లఁడు సంతలోఁ గొన్నచీరెలఁ గట్టి
కుడిపైఁటలఁ బసందు గొలుపువారు

గీ. వెలుకునడకలకలిమిచే వెలయువారు
పూట కొకక్రొత్తయందంబు సాటువారు
పలుతెఱంగుల ముస్తాబు సలుపువారు
వెలయుచుండిరి పొంగొల్లవెలఁదు లచట.

చ. పనిగలదానిరీతి, యొక
భామిని వేమలు నందునింటికిన్
జని, యటఁ గృష్ణుఁ డెందు
నయినన్ గనవచ్చినఁ జూచి "నందనం
దన! కలదా? యశోదసద
నంబున" యంచిటు ప్రశ్నలేమియో
పొనరిచి, రాకపోకలను
బ్రొద్దులు పుచ్చుచునుండె నొక్కటన్.

చ. పురమునఁ బాల నమ్ముకొనఁ
బోయిన భామ యొకర్తు వీథులం
బరిగెడివేళఁ గృష్ణుఁ డెదు
రైనను సంబరమంది "ఓయి సుం
దర! యిదె పాలనిచ్చెదను
ద్రాగెదవా?" యనివానితోఁ బరా
మరిసల సల్పఁజొచ్చెఁ బలు
మాటలు మారునిబారి వీఁటుమన్.

చ. కడవను వెన్నముద్ద లిడి
కాంత మఱొక్కతె యేటినీటికై
వడిఁ జని వత్తునంచుఁ దన
వారలతో వచియించి చెంగటన్,
గడనొని, యాలమందలను
గాసెడి కృష్ణుని డాసి, వాని క
య్యెడ నిజవస్తుసంతతుల
నెల్ల సమర్పణచేసి వచ్చెడిన్.

ఉ. కాటుక నొక్కకంట నిడి
కాంత యొకర్తుక యింతలోన నా
బాటనె, నందనందనుఁడు
వచ్చుచు నుండెనటంచు నెవ్వరో
సాటఁగఁ బ్రాంగణంబునకు
సాగుచు రెండవకంటిమాటరయే
మాటుపడన్ జరించెడిఁ బ్ర
మాదమునన్ జనులెల్ల నవ్వఁగన్.

చ. పులివలె నక్త తన్నుఁ గని
 పొంచి మెలంగఁగ నొక్కకొంత, వె
ల్వల వడి గొల్ల సుద్దులను
 బాడుచుఁ గృష్ణుఁడు ఘోష వానినే
తలఁచుచు నిస్పృహోత్కఘుయి
 తత్సమయంబున నక్త పల్కు ఫ
ఋక్కులకును దాఋమాఋ పలు
 కుల్ పలుకంగఁ దొడంగె నార్తితోన్.

గీ. దినదినంబున కొకరీతి మనములందుఁ
ప్రణయోద్దీపకవస్తు సంభారములను
బాదుకొల్ప వసంతుఁ డప్పట్టునందు
నొడరి యౌవన మూనఁగా నొక్కనాఁడు.

గీ. హాసచంద్రిక లమరు నాస్యంబుతోడఁ
గామినుల హృదయము నీరుగా నొనర్చు
తుహినకరములతోడఁ జంద్రుండు దోఁచి
ఁరుల 'పయోముఖ విషకుంభ' మటులఁ జెలఁగె.

చ. కనుఁగొని రేపెలుంగు వ్రజ
 కాంతలు హృత్సరసిన్ జనించు నా,
ప్రణయతరంగడోలికల
 పై నిజమానస రాజహంసముల్,
గొనకొని యూఁగులాడ యదు
 కుంజరువిగ్రహ మెంచె యూఁతగాఁ,
గొని, యొటులో చరించిరి, య
 గోచరసర్వవిధానలై యటన్.

ఉ. గొల్లత లంతఁ జిత్తమునఁ
 గోర్కులు గుబ్బటిలంగఁ బొంగుచున్
నల్లని గొల్లవాని నయ
 నంబులఁ జూచెడిభాగ్య మెప్డు సం,
ధిల్లునొ? యాత్మకాంతు రొటు
 దీరునొ? యంచుఁ దపేకదృష్టితో,
నుల్లములన్ దలంచి క్షణ
 మొక్కయుగంబుగఁ బుచ్చుచుండఁగన్.

శా. అంతర్నాడికలందు నూతనవికా
 సాంకూరముల్ రేఁగి త,
త్ప్రాంతస్థావరజంగమంబులకు, మో
 హావేశముల్ గూర్చునే, కాంతో
ల్లాసితయామునీతటలతా
 గారంబునం దొక్కచోఁ,
జెంత న్మోహనవేణుగీతి వినవ
 చ్చెన్ శ్రోత్రపేయంబుగన్.

గీ. అనుపదమె దివ్యవేణుగీతామృతంబు
భువనభోంతరములు నిండి, పొంగిపొరలఁ
బుడమిఁ బడియున్న యెండిన మోడులేని
తృణములోపలఁ జిగురింపఁగాఁ దొడంగె.

చ. నెమరుల వేయుచున్ సగము
 నిద్దురఁ దూఁగెడి గోగణంబు, సం
భ్రమమున నట్టె లేచి, పలు
 మాఱులు దిక్కుల నిక్కిచూచి, శ్రో
త్రముల నిగిడ్చి, కంఠగత
 రజ్జుల భగ్న మొనర్చి, తన్నినా
దమునకు నూటిగా ద్రుతేగ
 తంబులఁ బాఱఁగఁజొచ్చె వెంటనే.

మ. ఘనవంశీనినదంబు వీనులకు సోఁ
 కన్, మన్మథాస్త్రోర్ఘటీ
జనితోన్మాదమనస్కలై విగత ల
 జ్జాసజ్జలై గోపికా
వనజాతేక్షణ లన్యకృత్యములఁ బో
 వన్ద్రోచి శ్రీకృష్ణ మో,
హనరూప ప్రతిభాశుభాకృతి ది
 దృక్షాయత్తలై యత్తఱిన్.

క. స్వరసాహాయ్యముఁ గొని త
త్తరుణీమణు లంత నిజసదనముల విడి యా
మురహరుజాడలఁ గనుఁగొనఁ
దరలిరి ఒక్కొక్క రొక్కదారిని గొనుచున్.





# * జైనుల మతకథలు

## ౧ భట్టాకలంకుడు—జ్ఞానోద్యోతినీ కథ

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు

శ్లో. రత్నత్రయ పవిత్రాణాం మునీనాం గుణశాలినాం
వందేహం బోధసింధూనాం పాదపద్మద్వయం సదా.

పూర్వం మన యీ భారతవర్షంలో మాన్యఖేటమని ఒకపట్నం ఉండేది. దాన్ని పాలించేరాజు శుభతుంగుడు. పురుషోత్తముఁ డతనికి మంత్రి. మంత్రి పురుషోత్తమునికి పద్మావతి యనేభార్య ఉంది. ఆదంపతులకు ఇద్దరు కొడుకులు. ఒకడు అకలంకుడు. రెండో వాడిపేరు నికలంకుడు. ఈ పిల్లలిద్దరూ మంచిస్ఫుర ద్రూపులు. ఒక్కరూపమే కాదు. ఆపిల్లల గుణాలు కూడా తల్లిదండ్రులను ప్రసిద్ధికి తెచ్చినవని పెద్దలంటారు.

జైనులకు మతసంబంధమైన వ్రతాలన్నా ఉపవాసాలన్నా చాలా శ్రద్ధాభక్తులు ఉంటవి. ఎన్ని అవాంతరాలు వచ్చినా వాళ్లు మతనియమాలను ఉల్లంఘించరు. అందులోనూ పురుషోత్తముడిలాంటి వారివిషయంలో చెప్పవలసిందేలేదు. ఒకమాటు చిత్రం జరిగింది. ఏమంటే— అష్టాహ్నికాపర్వం వచ్చింది. అష్టాహ్నికాపర్వం అంటే ఇప్పుడు మనం నవరాత్రాలు చేస్తున్న మోస్తరుగా ఆకాలం వారి మతాచారముల ననుసరించి వారిదేవతను ఎనిమిదిరోజులు విశేష శ్రద్ధాభక్తులతో పూజాపురస్కారాలుచేసి సేవించే పండగ. ఈ పండగ ఎనిమిదిరోజులున్నూ నందిక్షేత్రంలో గడిపితే బాగుంటుందనీ, రవిగుప్తుడనే జైనముని చాలా మతరహస్యాలు తెలిసినవాడు అక్కడ వున్నందువల్ల ఆయనతో కలిసిమెలసి తత్వజిజ్ఞాసచేసి తరించవచ్చుననీ పురుషోత్తముడు ఆలోచించి తనభార్యను పిల్లలను తీసికొని నందిక్షేత్రం చేరినాడు.

రవిగుప్తుడు ధర్మార్థమై శరణుజొచ్చిన పురుషోత్తమునికి కుటుంబంతోసహా ఆదరసత్కారాలుచేసి. ఆ యెనిమిదిరోజులు బ్రహ్మచర్య నియమం ఏర్పాటుచేసి ధర్మోపదేశమును చేశాడు. లోకంలో ఎన్నెన్నిమతాలు ఉన్నాయో, వాటివాటి ప్రస్థానములలో గల భేదాలు ఏలాగంటివో మొదలయిన విషయాలు పండువలిచి చేత బెట్టినట్లు విశదంగా చెప్పి సమన్వయము చేసినాడు. తత్రాపి జైనమతపు ఆధిక్యతనూ అహింసా తత్వాన్ని చక్కగా చెప్పినాడు. పురుషోత్తముడు ధన్యోస్మిఅనుకొన్నాడు. ఇట్లా జరిగే ఈమధ్యలో రవిగుప్తాచార్యుడు బ్రహ్మచర్యవ్రత ప్రాశస్త్యమును వర్ణించడం తటస్థించింది. అసలే రవిగుప్తుడు గొప్పజ్ఞాని. ఆపైని సమస్తమతాలకూ సమస్తవిజ్ఞానాలకూ సమస్తసద్భావాలకూగనియైన జైనమతమువందలి బ్రహ్మచర్యవ్రతము నవలంబించడంలో ఆయన పెట్టినపేరు.

---

* ఈశీర్షికలో వచ్చుకథలు జైనుల మతగ్రంథములగు ఆరాధనాసారము, సమయసారము మొదలగువానినుండి ఉద్ధరింపబడుచున్నవి. కావున చారిత్రిక దృష్ట్యా రాగల విప్రతిపత్తులకు అనువాదకుని కట్టిబాధ్యతయును లేదు. ఈ విధంగానే బౌద్ధులయొక్కయును శైవులయొక్కయును మతకథలుకూడా సాధ్యమైనంతత్వరలోనే ఆంధ్రంలో పరివర్తించి ప్రకటింపవలెనని యున్నాను. ఇట్టికథలన్నీ వాఙ్మయంలో వుండదగినవని నాభావము. (పం. ఆ. శా.)

ఆచార్య రవిగుప్తుడు చేసిన బ్రహ్మచర్య ప్రశంసను విని పరవశుడై పురుషోత్తముడు గురుపాదుకలు ముట్టుకొని తానున్నూ తనపుత్రులున్నూ బ్రహ్మచర్యం అవలంబిస్తామని శపథంచేశాడు. కాని ఒకచిత్రం జరిగింది. పురుషోత్తముడు తాను ప్రమాణం చేసేప్పుడు ఎన్మిది రోజులనే నియమాన్ని భావించాడు. అతనికుమారులకు ఈ తిరుగడు తెలియనందున ఆజన్మమూ బ్రహ్మచర్యం ధరిస్తామనుకొన్నారు. తర్వాత అష్టాహ్నికాపర్వం ముగియగానే పురుషోత్తముడు తనకుటుంబంతో స్వస్థానానికి వచ్చి చేరి పిల్లలకు పెండ్లిప్రయత్నాలు చేశాడు. కాని ఆపిల్లలిద్దరూ ఎన్ని చెప్పినా వినక తమ్మనియమాన్ని సాగించుకొన్నారు. కేవలం నియమాన్ని సాగించుకోవడమే కాకుండా లోకయాత్రా నిర్వహణానికై కావలసినట్టి వ్యాపారములు వృత్తులు మొదలగువాటినికూడా వదలి సర్వదా విజ్ఞానమును ఆర్జింపసాగినారు. సమస్తశాస్త్రాలూ చదివిరి. వీలున్నంతవఱకు సమస్తమతములందలి తత్వములను తెలిసికొన్నారు. కాని ఒక్క బౌద్ధమతంలోగల విశేషాలుమాత్రం చక్కగా తెలిసినవి కావు. కాని బౌద్ధమతం నేర్చుకోవాలె అనేశ్రద్ధ వీరికి అపరిమితంగా ఉన్నది.

ఆకాలంలో మాన్యఖేట నగరంలో బౌద్ధధర్మాలను చక్కగాచెప్పగల బౌద్ధవిద్వాంసుడు మఱియొవ్వరున్నూ లేరు. కనుక ఈసోదరు లిద్దరూ మారువేషాలతో మహాబోధిస్థానంలో వుండే బౌద్ధధర్మాచార్యునొద్దకు విద్యార్జనకై వెళ్లిరి. ఆయాచార్యుడును వీరినిలోలు దొల్త చక్కగా పరీక్షించి విశ్వాసము కుదిరిన పిమ్మట తక్కిన విద్యార్థులతో బాటు మతగ్రంథాలను చదివింప సాగెను. ఇట్లా వుండగా ఒకనాడుజరిగిన చిత్రమేమంటే : బౌద్ధగురువు నూరు నూటయేబదిమంది శిష్యులను చుట్టుపెట్టుకొని బోధ చేస్తున్నాడు. అప్పుడు సందర్భానుసారంగా జైనమతమునందలి సప్తభంగీసిద్ధాంతం చర్చలోకి వచ్చింది. బౌద్ధ గురువు చాలా చతురుడున్నూ కుశాగ్రబుద్ధిన్నీ అగును. అయితేనేమి? పాఠం సందర్భంలో అపపాఠంపడ్డది. దాన్ని సంప్రదాయంలో సమన్వయం చేశామంటే దిక్కుతోచడం లేదు. చాలా సేపటిదాకా తికమకలుపడి బౌద్ధగురువు మధ్యవిశ్రాంతి కని పేరుపెట్టుకొని పాఠం ముగించి వెళ్లిపోయినాడు. వెంటనే శిష్యులుకూడా వెళ్లిరి. కాని అకలంకుడుమాత్రం అక్కడనే ఉన్నాడు. తాను బౌద్ధగురువు తిరపాను కని పెట్టియున్నందుచేత, ఎవ్వరూ లేకుండాచూచి ఆ సప్తభంగీలక్షణంలో పంక్తిని దిద్ది సమన్వయముచేసి వెళ్లినాడు. తరువాత మఱల కొంతసేపటికి పాఠం ఆరంభమయింది. మొదట తలాతోకా కనపడని పంక్తిలో ఇప్పుడు బౌద్ధగురువుకు అద్భుతముగా పదార్థస్ఫురణ కలిగింది. హఠాత్తుగా అట్లు తనకు ఆవిషమస్థలంలో సంశయ విచ్ఛిత్తి అయినందుకు ఆయన ఒకమోస్తరుగా సంతోషించాడు. కాని హృదయంలో ఆందోళనం బయలుదేరింది. ఈ పంక్తిని నాశిష్యులలో ఎవరో దిద్దినమాట వాస్తవమే. లేకపోతే మొదట విషమంగా వున్నదికదా ఇంతలో ఎట్లా సాధువైంది? అందులోకూడా జైనమత సాంప్రదాయంలో ఆరితేరినవారెవరైనా అయితేనేకాని దీన్ని సమన్వయంచేయలేరు. నాశిష్యుల్లోనే ఒకవేళ ఎవరైనా ప్రచ్ఛన్నంగా జైనులున్నారేమో? జైనులకూ బౌద్ధులకూ సహజద్వేషం గదా. కాబట్టి ఈ విషయము పరీక్షచేసి తెలిసికోవాలె, అనుకొని ఒక్కొక్కరిని పిలిపించాడు. జైనదేవతావిగ్రహము నొకదానిని తెప్పించి శిష్యులనందరిని ఆవిగ్రహాన్ని కాళ్లతో దాటిపోవలసినదని ఆజ్ఞ యిచ్చినాడు. అట్లే అందరూ చేశారు. క్రమంగా అకలంకుని వంతు వచ్చింది. అతడు దారము నొకదానిని చేత అడ్డుగానుంచుకొని దాటెను. బౌద్ధగురువు ఈవిషయాన్ని కనిపెట్టలేదు. తర్వాత ఇంకోనాడు విద్యార్థులందరూ నిద్రపోతున్నారు. బౌద్ధగురువుమళ్లా పరీక్షింతామనుకొని, మంచికంచుపాత్రలు మూటగట్టి, గాఢమైననిద్రలో వారుండగా, ఆసమీపములో క్రింద దొర్లింపజేశాడు. గణగణగణగణగణమని చప్పుడు మహాభయంకరంగా వినబడడంతోటే, విద్యార్థులందరూ కలతనిద్రలో లేచి, ఆమహావిపత్తేదో తెలియక తమతమ మతదేవతల ధ్యానముచేయసాగిరి. అకలంకనికలంకులుగూడా జినదేవతలకు ప్రీతిగా పంచనమస్కారమంత్రమును పఠింప మొదలుపెట్టిరి. ఈసంగతంతా బౌద్ధగురు వేర్పరచిన గూఢ చారులు కనిపెట్టి, వారిద్దరిని తీసుకోపోయి, బౌద్ధగురువు ఎదుట నిలిపినారు. ప్రచ్ఛన్నవేషంతో తమమతాన్ని నాశనంచేయుటకు వచ్చినద్రోహులని

నమ్మి తెల్లవారుదనుక జాగ్రత్తగా కాపాడి ఆపైని వారిని ఉరిదీయవలసిందని ఆజ్ఞయిచ్చెను.

తర్వాత అకలంకనికలంకులు ఇద్దరూ చాలా పరితాపపడ్డారు. చేసినపరిశ్రమ అంతా బూడిదలో పోసిన పన్నీరైందనుకొన్నారు. ఇట్లా అనేకవిధాల ఆలోచించుకొని కావలివారు కాస్త కన్నుమూయడంతోటే పారిపోవడానికి ఆరంభించారు. తెల్లగాతెల్లవారిందాకా ఎవ్వరూ కనుక్కోలేదు. తెల్లవారగానే పిట్టలు జారిపోయినవంటే జారిపోయినవనుకున్నారు. అయినా బౌద్ధగురువు మాత్రంవదలక గుఱ్ఱపుసవారీతో వెంటబడ్డాడు. ముందు ప్రాణాలమీది ఆశలుగూడా వదలుకొని అకలంకనికలంకులున్నూ వారివెనక బౌద్ధసైనికులున్నూ ఆోప్పుతూ పరుగెత్తుతున్నారు. చివఱకు ఇక పరుగెత్తలేక నికలంకుడన్నాడు—"బాబూ! నాకెల్లాగూ జీవితం ముగియవచ్చినట్లు తోస్తున్నది. కాబట్టి నాకు ఒక్కవిధం తోచింది. అదితప్ప వేఱేదిక్కులేదు. నీవు మంచిబుద్ధిమంతుడివి. సమర్థుడివికూడాను. ఎప్పటికైనా నీవు అంటూ బ్రదికివుంటే జైనమతాన్ని ఉద్ధరిస్తావు. కాబట్టి నీవు వెంటనే-అదిగో! ఆకనబడుతూన్న సరస్సులో మునిగిపోయి కొంతసేపు ప్రాణములను స్తంభింపచేసికో. ఇంతలో నేను మామూలుగానే పరుగెత్తుతుంటాను. శత్రువులు నాపైబడి వారిపని ముగించుకొని వెళ్తారు. వారు వెళ్లిన తర్వాత నీవు తప్పించుకొనిపో." అకలంకుడు ఈమాటలు విని గత్యంతరంగానక అల్లాగే చేశాడు. నికలంకుడు మఱికొంచెంమార్గం పరుగెత్తాడు. ఇంతలో అక్కడ చాకలియొకడు ఈపరుగెత్తడాన్ని చూచి ఏదో ఉపద్రవం వచ్చిందని వాడుగూడా నికలంకుడివెంట పరుగెత్తాడు. బౌద్ధులున్నూ ఇంతలో వారినిపట్టుకొని తలలు నరికితీసికోపోయి తమగురువుకు సమర్పించారు. మొత్తం రెండు తలలూ తనకంటబడంగానే బౌద్ధగురువు ప్రాణంకుతిలపడ్డది. పాపాత్ములకు చెయ్యరానిపని అంటూవుందా? కనుకనే నేమిదత్త బ్రహ్మచారి అన్నాడుగదా.

శ్లో॥ కిం నకుర్వంతి భోలోకే పాపినః పండితాఅపి,
జినధర్మవినిర్ముక్తా స్సదా మిథ్యాత్వ దూషితాః
యేషాంశ్రీమజ్జినేంద్రాణాం ధర్మశ్శర్మ శతప్రదః
లేశతోపి నహ్యలోకే తేషాం కాకరుణాకథాఃఅని.

తరువాత మఱికొంతసేపటికి అకలంకుడు సరస్సులోనుండివెలుపలికి వచ్చాడు. కొంతసేపు విచారపడి ఇంతలో నికలంకుని మాటలుతలచుకొని సమాధానపడ్డాడు. చివఱకు మనస్సు దిటవుచేసికొని దక్షిణంగా బయలుదేరి నడుస్తూనడుస్తూ కొన్నాళ్లకు కళింగదేశంలోకి వచ్చిచేరాడు.

కళింగదేశాన్ని ఆకాలంలో హిమశీతలుడనేరాజు పాలిస్తున్నాడు. ఆయన రాజధాని రత్నసంచయ మనే పట్నం. హిమశీతలుడి భార్యపేరు మదనసుందరి. ఈమె చాల విద్యావతి. ఆస్త్రీకురాలు. తత్రాపి జినపాదపద్మారాధనతత్పరురాలు. ఈమె క్రొత్తగా జైనమందిరాన్ని ఒకదాన్ని కట్టించింది. శాస్త్రోక్తరీతిని ప్రతిష్ఠాదులన్నీ మహావైభవంతో జరిపినట్టి పుణ్యాత్మురాలు. ఇట్లావుండగా ఏమిజరిగిందంటే—ఫాల్గుణమాసంలో శుద్ధ అష్టమినాడు జినేంద్రస్వామికి ఉత్సవాలు వచ్చినవి. ఊరూరిప్రజా దేశదేశప్రజా ఆ వుత్సవానికి వచ్చారు. పండితులు వచ్చారు. పామరులు వచ్చారు. నానావిధాలవారు వచ్చారు. వీరందఱితోపాటు జైనపండితులుగూడా అనేకులు వచ్చారు. జైనపండితులలో ముఖ్యంగా మతవిషయంలో ప్రచారంచేసే మునిసంఘంకూడా చాలామంది వచ్చారు. పట్టంఅంతా ఆనందంతో కళకళ్లాడిపోతున్నది.

హిమశీతలుడివద్గఱ సంఘశ్రీ అనే బౌద్ధపండితుడొకడున్నాడు. ఆయన చాలా దిట్టంమంచివాడ ప్రౌఢిమగల పండితుడుకూడా ఔను. అయితేనేమి? ఆయనకు ఎంత పాండిత్యం వుందో దానికి ఇబ్బడిముబ్బడిగా అసూయ. పరమతాసహనం—ఇత్యాదులగు సుగుణాలు అనేకంగా వున్నాయి. కాబట్టి ఆయన ఏంచేశాడంటే మదనసుందరిరాణిగారుచేయించే ఈ జైనోత్సవాలలో రథోత్సవాన్ని రాజుగారితో చెప్పి ఆపుదలచేయించాడు. కారణం ఏమిచెప్పాడంటే—జినస్వామికి రథోత్సవం చేయించడానికి శాస్త్రాలు ఒప్పుకోవు. ఏమంటారా? ఇదిగో వినండి.

"రథయాత్రాన కర్తవ్యాజినేం ప్రత్యకదాచన,
జినస్యశాసనాభావాత్"—అని కారికవుంది. ఈకారికప్రకారము రథోత్సవం జరపడానికి వీలులేదు. కాదు

జరిగించాలె అంటారా. ముందు నాతో శాస్త్రార్థం చేయండి. నన్నుగెల్చి నాచేత వప్పించుకొని ఆ తర్వాత చెయ్యవలసిందే గాని అందాకా కూడదు— అని అన్నాడు.

రాజుగారికి సంఘశ్రీ ఎంతచెపితేఅంతా. ఆయన నంది అంటే నంది. పందిఅంటే పంది. అతన్ని తోసి వేసే సాహసం రాజుకు లేదు. ఈసంగతి సంఘశ్రీకిగూడ బాగా తెలుసు. కనుకనే బాగా నిలువదొక్కి ఉంచాడు

ఏమైతేఏమి? చివఱకి రథోత్సవం సాగలేదు. మదనసుందరి బాగా పట్టుపట్టింది రథోత్సవం సాగించి తీరుతానని. రాజుగారిని చేతిలో పెట్టుకొన్నాడుసంఘశ్రీ. కేవలం ఇంతమాత్రంతో పోకుండా ఆ ఉత్సవానికివచ్చిన పండితసంఘానికి బాగా విశదమయ్యేట్టుగా 'ఎవరైనా సరే పండితుడంటూవున్నట్టయితే రాండి. నన్నుముందు జయించండి. అభీష్టం తీర్చుకోండి. లేదా నోరుమూసి కొని వెళ్లండి. అని' చాటింపచేశాడు. పాపం ఆపండితులందఱూ ఏంచెయ్యగలరు. అతని నోటికివెఱచి ఊరుకొన్నారు.

పాపం. రాణిగారి అవస్థ చెప్పతరంగాదు.ఆమెకు ఉండే ఆస్తికత్వం దైవభక్తి అసామాన్యములు. అయితే మాత్రం ఏంచేస్తుంది. రాజుగారినడుకుపోయి ఎట్లాగైనా తనకార్యం గట్టెక్కచెయ్యమని వేడింది. ఆయన తన అశక్తతను ప్రకటించి యూరకొన్నాడు. అప్పుడామె ఉద్విగ్నహృదయంతో జైనదేవాలయానికిపోయిఅక్కడ వుండే పండితులతోమళ్లా సంప్రతించింది. ఏమి మహాత్ముల్లారా!—మఱి ఇంతప్రయత్నమూ వృథాయేనా?గత్యంతరం ఏమైనాఉందా? అని అడిగింది. ఆమెమాటలకు ఆ పండితుల్లో పెద్దలంతా విచారం సూచిస్తూ అన్నారు. అమ్మా! మీమాటలు మమ్మల్ని నీరుచేసివేస్తున్నవి అయితేఏంచెయ్యాను?గత్యంతరం కనపడటం లేదు. ఈకోరతామకు కోరలు పెరికివేయించగలవాళ్లు బహుశః మాన్యఖేటం ప్రాంతాలలో ఉండవచ్చు. మనం ఎవరినైనా అక్కడికిపంపిస్తేనో.

మదనసుందరి—(ఉస్సురుమంటూ) 'శ్లో. సర్వో ప్యస్తకోపాంతే యోజనానాం శతేభ్యపక'—అన్నట్టుగా కరవడానికి సిద్ధమై పాముతలకెక్కి కూచుంటున్నది. ఇప్పుడెవో ఇంకోతుఱానికో కాటుతప్పదుగదా. ఇకప్రతిక్రియ చేయవలసిన వైద్యులను చూతామా! వందలకొలది ఆమడలదూరంలోమాట—అన్నా! ఏమి చిత్రమూ!!

అంటూ ఆమె జినమందిరంప్రవేశించి— "ఎప్పటిదాకా సంఘశ్రీకిగర్వభంగంకాదో, ఎందాక పవిత్రమైన రథయాత్ర జరగదో ధర్మప్రభావనకలగదో అందాక నేను భోజనాదులన్నిటిని వదలివేసి ఇక్కడినుండి కదలనే కదలను"—అని ప్రాయోపవేశం చేసికూచొని పంచనమస్కారమంత్రాన్ని జపిస్తూన్నది. ఇట్లా రెండురోజులు జరిగిపోయినవి. మూడోనాడు అర్ధరాత్రి అయ్యేసరికి చక్రేశ్వరీదేవి ఆమెకుప్రత్యక్షమై"అమ్మాయీ,మదనా! ఎందుకింత ఉద్వేగంపొందుతావు. లే. నామాట విను. రేపు ఇక్కడికి అకలంకుడనే పండితుడు రాబోతున్నాడు. ఆయన నీప్రతినలనన్నింటిని నెరవేరుస్తాడు.' అని చెప్పి అంతర్ధానమైపోయింది.

తర్వాత అనుకున్నట్టుగానే మర్నాడు అకలంకుడు వచ్చాడు. మదనసుందరి తెల్లవారకముందే ఆయనకోసం నాలుగువైపులకు నల్గురినిపంపి అకలంకుని రాకనుకనిపెటుతూ నేవుండి, ఆయనరాగానే తాను ఎదురుగాపోయి సమస్తోపచారాలతో పూజచేసి తీసికొనివచ్చింది. అకలంకుడు తనకెదురుగా వచ్చినవారినందరినీ ధర్మవృద్ధిని ప్రశ్నించగా వారందరూ ప్రకృతపుస్థితిని చెప్పుకొన్నారు. రాణిగారు చాలాదీనభావంతో ఉండటాన్ని చూచి భట్టాకలంకుడన్నాడు"అమ్మా ఎందుకు పరితాపపడతారు? ఈసంఘశ్రీ లెక్కఏమి? సాక్షాత్తు బుద్ధుడే మళ్లా అవతరించివచ్చినా సరే వాదంలో డొక్క బద్దలు చేస్తాను. మీరు భయపడవద్దు" అని తర్వాత అకలంకుడు సంఘశ్రీని వాదానికిరమ్మంటూ వాదపత్రికపంపినాడు. హిమశీతలుడు దర్బారుతీరివున్న సమయంలో ఆపత్రిక పోయిచేరింది. సంఘశ్రీ ఆపత్రికయొక్క పోహణచూచి హడలిపోయినాడు. అయినాపైకి బెట్టుగానే వున్నాడు తర్వాత హిమశీతలుడు భట్టాకలంకుణ్ని పిలిపించి సంఘశ్రీతో వాదించడానికి ఆజ్ఞయిచ్చాడు.వాదం ఆరంభమైంది. శరపరంపరగా పోతున్నది అకలంకుడివాదపద్ధతి. సంఘశ్రీకి అంతుపట్టడంలేదు. అయినాయుక్తి ముండావాడు గనుక ఏంచేశాడంటే — "అయ్యా! ఈవాదం ఇట్లా

పూటా అరపూటాతో తేగేదిగాదు. ఒకనియమంగా కొన్నిదినాలు జరగవలసివుంటుంది. కాబట్టి రేపటి నుండి ఒకనియతంగా వాదం ఆరంభిస్తాము—" అని చెప్పాడు అకలంకుడుకూడా ఒప్పుకొన్నాడు. ఆనాటికి సభ ముగిసింది.

సంఘశ్రీ సభలోనుండి ఇంటికి పోతూనే తన ఉపాసనా దేవత అయినతారాదేవిని ధ్యానించాడు. కొంత సేపటికి ఆమె ప్రత్యక్షమైంది. సంఘశ్రీ జరిగినవిషయం అంతాచెప్పి వాదంలో తనకు బదులుగా వచ్చి వాదించమని ఆమెను కోరినాడు. తారాదేవిచెప్పింది. నాయనా సంఘశ్రీ! నేను ప్రత్యక్షంగా సభలోకిరాను. నీవు తెర ఒకటి అడ్డంకట్టించుకొని అందులో కూచోని క్రొత్త ఘటాన్ని ప్రతిష్ఠించి నన్ను ఆఘటంలోకి ఆహ్వానించి వాదము ఆరంభిస్తివా, నేను తెరలో నీకుబదులుగానుండి వాదిస్తాను. అయితే రెండునియమాలున్నాయి. వాద మధ్యంలో తెరతొలగినా, లేకచెప్పినదాన్ని మళ్లాచెప్పవలసి వచ్చినా, నేను అంతర్ధానం పొందుతాను" సుమా! అని. సంఘశ్రీ సరే అన్నాడు.

మఱునాడు రాజసభకు పోతూనే హిమశీతలుడితో చెప్పి సంఘశ్రీ తెరగట్టించుకొని తాను తెరలో కూచోని దేవిని ప్రతిష్ఠచేసి వాదానికి ఆరంభించాడు. సంఘశ్రీకి బదులుగా తారాదేవి కలశంలోనుండి దివ్యస్వనముతో వాదించడం ఆరంభించింది. అకలంకుడుకూడా మంచి కంఠస్వరముతో అద్భుతమైన ప్రతిభతో ప్రతివాదం ఆరంభించాడు. పిడుగులు పడినట్టి వాగ్ధోరణితో మెఱపులవలె మెఱిసే యుక్తిప్రత్యుక్తులతో వారి వాదం నడుస్తున్నది. ముందు క్షణికవాదం నడిచింది. తర్వాత అనేకాంతమతముపన్యస్తమైంది ఇట్లాఅనేకవిషయాల మీద శాస్త్రార్థాలు జరుగుతున్నవి. ఒకరి ప్రతిభకంటె ఇంకొకరిప్రతిభ మించుతున్నది. ఒకప్పుడు బౌద్ధులపక్షంలోనూ ఇంకొకప్పుడు జైనులపక్షంలోనూ జయ జయ ధ్వనులున్నూ ధన్యవాదాలున్నూ బయలు వెడలుతున్నాయి. ఇట్లా ఒకరోజా రెండురోజులూ కాకుండా ఆరు నెలలు వాదం జరిగింది. తెరపి తెంపి కనబడడంలేదు. అకలంకు డొకనాడు—'ఇన్నాళ్లు వాదించినా అంతు తేల లేద్దు. సంఘశ్రీ చదివిన చదువంతా ఎంత? చద్దిభోజనానికి గూడా చాలుతుందో చాలదో కదా! అయితే నేమి? ముక్కుగూరనీయకుండా చేస్తున్నాడు. ఇక గతేమి? అనుకొన్నాడు. చాలాచింతపడ్డాడు. ఆచింతలో నేకన్ను మూసినాడు. ఇంతలో అతనికి అతని కులదేవతయైనచక్రేశ్వరీదేవి దర్శనమిచ్చి, జరిగినకథ అంతా చెప్పింది. చివఱకు తారాదేవిని పరాభవంచేసి పంపవలసిన యుక్తినికూడా అతనికి చెప్పింది.

మర్నాడు పొద్దున్నే నిద్రలేచి కాల్యకృత్యములు తీర్చుకొని, స్వప్నవృత్తాంతాన్ని సగంసగం నమ్ముతూ, అనుభవజ్ఞానమును సంస్మరిస్తూ తెంపుచేసికొని, ఆరోజుతో, తానో, లేక సంఘశ్రీయో ఎవరో ఒకరు పరాజయం పొంది తీరాలసిందే అని దృఢసంకల్పంచేసికొని, సభకు వెళ్లి కూర్చున్నాడు. మామూలుప్రకారం సభవారంతా రాజుతోసహా తీర్చికూర్చున్నారు. వాదం ఆరంభమైంది. ఇదివఱకు ఎప్పుడున్నూ పూర్వపక్షం తెరలోనుండి సంఘశ్రీవైపున వచ్చేది. ఈమాటు అట్లా గాకుండా అకలంకుడు తానే ఆరంభించాడు. పూర్వపక్షం ముగియగానే తెరలోనుండి అనువాదం ఆరంభమైంది. అనువాదంచేసి తనప్రశ్నకు సమాధానం చెప్పిందాకా వూరుకొని, అకలంకుడు—"ఏదీ? అనువాదం మళ్లా చెయ్యి" అని గద్దించాడు. ఆగద్దింపు పిడుగులు పడ్డట్టున్నది. సరి ఆదెబ్బతో జవాబులేదు. ఒకమారు-రెండుమార్లు-ఇట్లాగద్దించి, జవాబురాకపోయ్యేటప్పటికి, గుభాలునలేచి అకలంకుడు ఆపరదానుచించిపారవేసి-ఆయావేశంతో తారాదేవిని ఆహ్వానంచేసి ఉన్నఘటాన్ని రెండుముక్కలయ్యేట్టు కాలితో తన్నినాడు. తారాదేవి అంతర్ధానం అయింది. సంఘశ్రీ తెల్లపోయ్యాడు. నోరు పడ్డది. మాటలేదు. అప్పుడు అకలంకుడు ఏంచేశాడంటే—

మహాప్రభూ! ఈభవ్యలోకమున్నూ దేవరవారు తామున్నూ చిత్తగిస్తున్నారుగదా సంఘశ్రీచేసిన కృత్రిమాన్ని? అయ్యా ఈవిషయాన్ని నేను మొదటే ఎఱుగుదును. అయినా కానీ ఇతగాడివాదం ఏపాటిదో తమకు చూపించేందుకే ఇన్నాళ్లున్నూ నేను ఓపికపెట్టాను. ఈకుత్సితుడు లోకాన్ని మోసంచేయుడానికి వాదానికి తెరగట్టించుకొన్నాడు. ఇన్నాళ్లు వాదంచేసింది దేవి

తారాభగవతిగాని వీడుగాదు. నేను జ్ఞానోద్యోతనమునకై ఇన్నాళ్లు వాదంచేశాను. సంఘశ్రీ అనఁగా ఎంతండీ. బిచ్చం-సాక్షాత్తు బృహస్పతివచ్చినా లెక్కయేమి? అయితే ఇదంతా అహంకారంతో చెప్తున్నా ననుకొంటారు కాఁబోలు.

శ్లో. నాహంకారవశీకృతేన మనసా
　న ద్వేషిణా కేవలం,
నైరాత్మ్యం ప్రతిపద్య నశ్యతి జనే
　కారుణ్యబుద్ధ్యామయా;
రాజ్ఞశ్శ్రీహిమశీతలస్య సదసి
　ప్రాయోవిదగ్ధాత్మనో
బౌద్ధౌఘా న్స కలా న్విజిత్య సుగతః
　పాదేన విస్ఫాలితః.

—నేమిదత్తుని కావ్యమునుండి.

[నేను 'నాయంతటిపండితుడూ వాదీ ఇంకొడున్నాడా' అనే అహంకారానికి గురియైన మనస్సుతో ఇక్కడ వాదానికి ఆరంభించలేదు. మరేమంటే, విజ్ఞుడున్నూ, మంచిప్రతిభగలిగి తానుత్తీర్ణుడై లోకము నుత్తీర్ణుల చేయగల ఒకపండితజనుడు ఈవిధంగా నైరాత్మ్యమును (అనగా నాస్తికత్వమును) పొంది చెడిపోతున్నాడే అనేకరుణతో మహారాజగు హిమశీతలుని సభలో వాదివిజయమునకుఆరంభించితిని. సాధ్యమైనంతవరకుఇక్కడ ఉన్న-విదగ్ధులనిపించుకొన్న- బౌద్ధులనందఱిని జయించి, పెంకిబుద్ధితోవాదమునకు డీకొన్న బౌద్ధునికాలదన్నితిని.]

అని తనప్రతిజ్ఞను వినిపించినాడు. తర్వాత అది మొదలుకొని హిమశీతలుఁడు తన యాస్థానములో ఉన్న బౌద్ధపండితులనందరినీ వెళ్లగొట్టి, తనవారూ తానూ జైనమతము నాశ్రయించినారు. పండితోత్తముడైన ఆ అకలంకుని నానావిధములయిన పూజలచేతను పూజించినారు. అనేక రత్నాభరణాలు సమర్పించినారు. మహారాణి మదనసుందరి భట్టాకలంక దేవునికి మహావిభవముతో విజయోత్సవమును చేయించినది. పండితు లనేకులుప్పొంగి అతనికి బ్రహ్మరథమును పట్టిరి. భట్టారకుడగు అకలంకదేవుడును అతివిభవముతో మానమువహించియూరకొనక నిత్యమును తనయొక్క దివ్యములగు జ్ఞానోపదేశములచేత ననేకులను శిష్యప్రశిష్యులను సిద్ధపఱచి దేశదేశాంతరములందును జినదేవునియొక్క ప్రభావప్రకర్షతలను భవ్యజీవులకు సుగమములుగా నుండునట్టులు అనుగ్రహించుటకై ఏర్పాటుచేసినాడు. తాను అజరామరణమును, అనితరసాధారణమును, అనేకకోటిబ్రహ్మకల్పములకైనను శాశ్వతముగానుండు కీర్తిని పొంది సుఖించెను. కాబట్టి భవ్యాత్ములగు పెద్దలెల్లరును భట్టారకాకలంక దేవుడుఏవిధంగాజ్ఞానోద్యోతనమునొనర్చి వాసినిగాంచెనో ఆవిధముగానేతమతమపవిత్రజీవితములను జ్ఞానప్రభావనకై వినియోగించి ధన్యులు కాగోరెదను.

శ్లో. సజయతి జినదేవోదేవదేవేంద్రవంద్యః
　త్రిభువనసుఖకారీ యస్యజ్ఞానప్రదీపః;
　గుణగణమణిరుద్రో బోధిసింధుర్మునీంద్రో
　దిశతు మమ శివాని శ్రీప్రభాచంద్రదేవః.

ఇది జైనులమతకథలలో-శ్రీమద్భట్టారకాకలంకదేవునియొక్క జ్ఞానోద్ద్యోతిని యన్నకథ-ముగిసినది.

---

# పేరి శాస్త్రేణ ధీమతా

పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

ఫణిరాజ వాక్యగుంభము లెల్లఁ దుదముట్ట, నేర్చి మించిన పాణినీయులార!
　పంచవాదమ్ము లాబాధాంతముగఁ దర్క, శాస్త్రమ్ముఁ జదివిన జాణలార!
పూర్వమీమాంస సంపూర్తిగా జన్మంబు, లాచరించెడు సోమయాజులార!
బాదరాయణసూత్ర పారంపరీ నిరుద్ధస్వాంతు లైన విద్వాంసులార!
శక్తి లేకుండఁగాఁ గవిసంఘమందుఁ, జేరఁబోకుఁడు "పేరిశాస్త్రేణ ధీమతా" యటందు రకట! ధీమతాపదమున, కవల వల పేరిశాస్త్రిణా యనఁగలేక.



# కర్ణాట సీమ

దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు

పిడిచుట్టుగాఁజుట్టి నడికట్టు బిగఁగట్టి ముదుకకోకలుగట్టు పూవుఁబోండ్లు
చల్లాడములు దోఁడ్గి నల్లకంబడులంసములవ్రేలఁ దిరిగెడు మోటు'గాండ్లు'
భోజనశాలల పొంతనే పసులవిణ్మూత్రంపుకంపులు [1] మూఁతయిండ్లు
సందుగొందుల సరాసరిగఁ బోవఁగ వీలు పడని యాయెద్దుల బారుకాండ్లు
[2]గొప్ప తిరుగండ్లు; నిఱుకులౌ కుఱుచబండ్లు, [3]సన్నఁదగుదిండ్లు; చిలుము కంపెనయుమధ్వ
గిండ్లు; [4]శిథిలంబు లూరవాకిండ్లు; సీదు, ప్రాక్తనతఁ దెల్పునమ్మ! కర్ణాటసీమ!

1 మూఁతయిల్లు :— కన్నడ దేశమున గృహనిర్మాణమున నొక విశేషము కలదు. సామాన్యముగా నేపాటిగృహస్థయినను మిద్దె యేకట్టును. మిద్దెముందరివైపున, విలువగల స్తంభములతో, పనితనముగల పైకప్పుతో, చక్కని చిత్తరువులతో, శృంగారమగు పంచపాళి నిర్మింపబడును. అందు సింహద్వారమున కిరుప్రక్కలను మిగుల నున్నతములగు రెండు వేదిక లమర్పబడియుండును. ఆ యిలుతేనికి గల ధనధాన్యాదికము లా వేదికల గర్భముల దాపబడును. ఆగచ్చుటరుగులమీద మిగుల పొడవులయిన,

2 గొప్ప తిరుగలి:—ఈ తిరుగలి యడుగుటాయి భూమిలో పాతివేయబడును. బలశాలురగు నలువురుపురుషులు కలసిగాని యీ తిరుగలితో విసరజాలరు. ఎనుబది సంవత్సరముల వయస్సుగల యొక ముదుసలి తన సామర్థ్యమును చెప్పుచు, తనయింట నున్న తిరుగలిని చూపి "స్వామీ! యీతిరుగలితో కుంచెడురాగులను నేనొక్కఁడనువిసరే వాడిని. ఇప్పుడు నాకొడుకులు నలుగురు కలసియు విసరజాలకున్నారు. మా కాలమునకు యీకాలమున కెంతటి భేదమో చిత్తగించండి" యనెను.

(అను) దిండు వేయబడి యుండును. గృహభర్త కదియే కచ్చేరి సావడి. అంతట సింహద్వారమున లోనికి పోతిమేని ఆతనికిగల పశువు లన్నియు నందు కట్టబడియుండును. ఎద్దులు, ఆవులు, బఱ్ఱెలేకాక, గుఱ్ఱములును, గొఱ్ఱెలును, మేకలును అందేయుండును. వాని మలమూత్రములకంపులతో గలసి గేదెలకుడితి నీరు ముఱిగి దుస్సహమగు దుర్గంధమును గొట్టుచుండును. ఆప్రదేశమున కెట్టయెదుట మిట్టమీద కనుబడునదియే వంటయిల్లు. భోజనము సేయువారికిని పశువులకును రెండుగజముల దూరముండునని నేను జెప్పజాలను. అందే పడుకగదియును. ఇంతయింటికిని (మొదటి)

సింహద్వార మొకటియేకాని మఱిద్వారము లేదు. కిటికీయైన నుండదు. తుదకు వంట యింటి పొగ ధారాళముగా బోవుటకు సందు నులేదు. ఇంచుక వెలుతురునకయి, యింటి కప్పు ప్రదేశమున, నొకటి రెండు గవాక్షము (ఎద్దుకన్నంతవి) లుండిన నుండును. సంపన్న గృహస్థుల భవనములును యీపద్ధతినే యుం డును. కాని యిపుడిపుడు కట్టబడుచున్న మేడలు మాత్ర మీ అనారోగ్య పద్ధతినిగాక మిగుల నాగరక పద్ధతిలో కట్టబడుచున్నవి.

4 ఊరవాకిలి :— కర్ణాట సీమలోని అనేకగ్రామముల కీయూర వాకిలిగలదు. ఊర వాకిలియనఁగా ఊరికంతయు నొకటే వాకిలి. ఆయూరివారికి రాకపోకల కదియేమార్గము. దొంగయయినను దొరయయినను ఆవాకిట వచ్చిపోవలసినదే. ఆవాకిలి మిగుల విశాలము గను, బలిష్ఠములగు ద్వారబంధములతోను దుర్భేద్యములగు రెక్కతలుపులతోను అమ ర్పబడియుండును. ఆవాకిలి ప్రదేశ మొక పెద్ద మిద్దె. అందు రెండు వైపులను రెండు అరు గు లుండును. గ్రామాధికారులు అందు గూ ర్చుండి తమ వ్యవహారములను జరుపుచుం దురు. పురాణములయినను హరికథలయినను ఆ ప్రదేశమున జరుగవలసినదే. ఉబుసుపోకకు చీట్లపేక లాడుకొను యువకులకును తగినచో టదియే. అది యిది యననేల ఏ వినోదము జరిగినను, ఏ ప్రదర్శనము జరిగినను ఆవా కిట జరుగవలసినదే. ప్రొద్దు క్రుంకగనే—వృద్ధ ములగు గడియ మ్రానులతో ఊరవాకిలి మూయబడును. కొన్ని గ్రామములలో వెట్టి తలారు లావాకిటఁ బండుకొనుటయు గలదు.

ఇంటికంతయు నొకటేద్వారము; ఊరి కంతయు నొకటేవాకిలి; ఈపద్ధతి యీసీమ కేల గలిగెనని విచారింపగా "పిండారీల దోపిడీ తళ్లకు తట్టుకొనలేక ఆబాధనుండి తప్పించు కొనుటకై గృహములను, గ్రామములను ఇంత బందోబస్తుగా కట్టవలసివచ్చె"నని తత్రత్యుల వలన తెలిసినది. ఏమయినను "ఊరవాకిలి పద్ధతిమాత్రము" ఇప్పటికిని ఏ సీమనైనను అవశ్యాచరణీయమే.

# ప ద ని

శ్రీమాన్. దూపాటి కొండమాచార్యకవి గారు ["మణిమాల"నుండి]

ప్రంకముసఁ బుట్టియును లోక బాంధవునికి
ప్రియముఁగూర్చెడుదానవై విశ్వజనని
కాలయమవోచు వెలసితి వమ్మనీవు!
కులమదేల! ప్రధానము గుణమగాదె!
ఆత్మనాథుండు కనఁబడు నంతదనుక
వరమనోహరగాత్రివై వరలుచుందు!
అతఁడు దృగ్గోచరముగాని యపుడు నీవు
కనులవిప్పక యోగివై గ్రాలుచుందు!

కం. పరపురుషుని గనఁబోవక
నిరతము నీనాథుఁగూర్చి నెమ్మనమందున్
స్మరియింపుచు విలసిల్లెదు
పరమపతివ్రతవు తల్లి ప్రణతులొనర్తున్.

# తంజావూరు

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

చెదరనిశిల్పముల్ చెలఁగు తంజావూరు, సౌధంబులను జూచు సమయమందు
నామావశిష్టమై భూమిలోఁ గలసిన, కాకతీయ గృహాళి గాంచునపుడు
భిన్నభిన్నంబులై శృంగారముగ నొప్పు, హనుకొండకోవెల లగయునపుడు
ఒంగోలు రాజులయున్నతి నెఱిఁగించు, ఎండ్లూరికోటలో నేగునాఁడు.

గీ. ఎవనిహృదయంబు రెండుగానవియకుండు, ఏరసికుకంట నీర్ ప్రవహించకుండు
తావక పురాతనవిభూతిఁ దలఁచి తలఁచి, సంతపించుచునుంటి తంజాపురంబ!

సీ. మాపెద్దలిచ్చట మానవాధీశుల, కాశ్రితులని చెప్పనట్టివారు
తెలుఁగు నాయఁకుల రోజులలోన మాపూర్వు, లేతెంచిరని వచియించువారు
మా మహారాష్ట్ర సామ్రాజ్యంబునం దిట, నిలచిపోతి మటంచుఁ బలుకువారు
దాపున మాయూరు భూపతుల్ మావారి, రప్పించి రిటకని చెప్పువారు

గీ. ఎందఱో పరదేశస్థు లిచటగలరు, మున్ను గాయకులకుఁ గవిముఖ్యులకును
వేదవేదాంగ విదులకు విడిదివగుచు, శ్లాఘ గనియుందువమ్మ! తంజాపురంబ!

సౌధము

సీ. చోళరాజులు తమసొత్తని లోనఁ దలంచి నిన్ గూర్మి ప్రేమించునాఁడు
ఆంధ్రనాయకులు స్వీయంబని దృఢముగా, భావించి నిన్నుఁ గాపాడునాఁడు
ప్రబలులయిన మహారాష్ట్రులు తమకొక, కాణాచియని నిన్నుఁ గాంచునాఁడు
ఆంగ్లభూపతులు స్వాయత్తంబుగాఁ గఁ జేసికొనియు నిన్నుపేక్షించునాఁడు

గీ. నొక్క రీతిగనుంటివి పెక్కు వికృతు, లిలను భౌతికసృష్టికిఁ గలుగుచుండ
మార్పు లెఱుఁగకయుండు బ్రహ్మంబుమాడ్కి, రాజధనమ! తంజాపురీ రాజగృహమ!

సీ. ఆరాజు లానాఁడు పేరోలగం బుండి,రని చెప్పుకొనెడి మహాగృహములు
ఆనాఁటి నృపతుల యాయుధాగారంబు, లని చెప్పుకొనెడి సౌధనిచయంబు
ఆమహాప్రభువుల యాదరంబందిన, వని చెప్పుకొనెడి దేవాలయములు
ఆమన్నదొరల మహాయంత్ర సౌధంబులన్ని చెప్పుకొనెడి దీర్ఘనిలయములు

గీ. ఆపనులు స్వప్నవార్తలై యరిగినను శి,లాక్షరంబులపగిది చిహ్నంబు లగుచు
నేఁటికిని గానవచ్చెడి నీమహావ్యరణమునంతుఁ దంజాపురీరాజగృహమ!

రఘునాథవిలాసహాలులోని ప్రతికృతి

సీ. ఎంతగానెంచితో యీసరస్వతిమహల్, వర్ధమానంబు గావలయునంచు
ఎంతగా మురిసితో యీపుస్తకాగార, మగణితవృద్ధికిఁ దగునటంచు
ఎంతగాఁజూచితో యీప్రాచ్య విద్యామహావైభవస్థితి నాత్మయందు
ఎంతగా నెమకితో యీపొత్తములకునై, శ్రద్ధతో నెల్లదేశంబులందు

గీ. బళిర! తావక భారతభారతీ ప్ర,భావ విజ్ఞానపూర్వక ప్రబలభక్తి
పూజ్యతమమౌట వేనోళ్లఁ బొగడఁదగదె? ఆర్య! శ్రీశరభోజీ మహాత్మవర్య!

## రతి విలాపము



పరవశయై పడి రతి సెచ్చెరఁ దెప్పిఱి లేచి చూచి శిఖిపాడవు నిజే
శ్వరు పాడవుఁ గాన కచ్చటఁ, బురుషాకృతి నున్న భస్మపుంజముఁ గాంచెన్.

—నన్నెచోడుని కుమారసంభవము.




# కన్యాచౌర్యము

"సంఘసంస్కారి"

౧

నాకు చిన్నప్పటినుంచి అపరాధపరిశోధనలంటే ఎక్కువ యిష్టంగా ఉండేది. ఆవిషయమై ఎవరన్నా కబుర్లుచెప్పుకుంటూ ఉన్నా లేకపోతే అపరాధపరిశోధకనవలలు కనుపించినా యితరవిషయాలన్ని మరచి పోయి నామనస్సంతా వాటిమీదనే ఉంచే వాణ్ణి. నేను పెద్దక్లాసులలోకి వచ్చినప్పుడు పరీక్షముందుకూడా ఆంధ్రప్రచారిణీ వారు ప్రచురించిననవలలను, ఆంగ్లభాషలో కానం డైలు, మారిసు లెబ్లాన్కు వ్రాసినకథలను చదువుతూంటే నాస్నేహితులు పరీక్షలసంగతి మరచి పోతున్నానని నన్ను మందలించుచూ ఉండేవారు. మా హాస్టలులో ఏమైనా చిన్న దొంగతనాలు జరుగుతూంటే 'ఏమోయి డిటెక్టివ్! వార్డెనుగారింట్లో కోళ్లుపోయినవట; ఫలానా గదిలో పౌడుండబ్బి పోయినదట; నువ్వా దొంగను పట్టుకోనకపోతే చాలాకష్టం.' అని నన్ను వేళాకోళంకూడా చేస్తూ ఉండేవారు. కాని నేనుమాత్రం వారిని లెఖపెట్టేవాణ్ణి కాదు.


"ఏమోయి యివ్వాళ......వాగ్వాదం విన్నావుకాదు"

౨

ఇట్లా ఉంటోండగా ఒకనాడు సాయంత్రం కాలేజీనుంచివచ్చి నా గది ముందర పడకకుర్చీలో కూర్చుని ఏదో ఆలోచించుకొనుచుండగా నా మిత్రుడు సుబ్బారావె వచ్చాడు. ప్రక్కన ఉన్న కుర్చీ నొకదానినిదగ్గరకు లాగి అతన్ని దానిమీద కూర్చుంకమని "ఏమోయి యివ్వాళ క్లాసులో మనమాస్టరుగారికి పిల్లలికి జరిగిన వాగ్వాదం విన్నావు కాదు" అన్నాను.

"ఆ సంగతి కేంగాని బజారులో పోలీసుస్టేషనుదగ్గర ఒక వింతవిషయం నాచెవిని పడింది" అన్నాడు. పోలీసు స్టేషన్నూ,వింతవిషయం,అనగానే అంతవర

దాక అలసటవల్ల మందరిగా పడుకున్న వాడిని గభుక్కున లేచి "ఏమిటది" అని నామిత్రుణ్ణి అడిగాను.

సుబ్బారావు ఒకవేళాకోళపు నవ్వు నవ్వాడు. కాని విన్నదాన్ని అంతా చెప్పమని సుబ్బారావుని నొక్కి అడిగాను. అంతగట్టిగా అడుగుతూంటే బాగుండదనుకున్నాడో ఏమో సుబ్బారావు కథ మొదలు పెట్టాడు.

"ఈవూళ్లోకల్లా భాగ్యవంతులైన కనకం చిట్టి రామయ్యగారింట్లో నిన్నరాత్రి రెండు ఝాములవేళ ఒకవింత దొంగతనం జరిగిందట. నిన్న వారిమూడోఅబ్బాయి పుట్టిన దినమట. డబ్బున్న వాళ్లిళ్లల్లో అటువంటి పండగలు వైభవంగా చేయటం ఆచారం గనుక, చిట్టిరామయ్యగారుకూడా ఆచార విరుద్ధం లేకుండా మిత్రులనందరిని ఆహ్వానించి మేళతాళములతో, కాకులవలె మూగిన వైదిక బృందానికి భూరిసంభావనలతో, పదిమంది చెప్పకొనేటట్లు బీదసాదల సంతర్పణతో తగు రీతిని కొడుకు పుట్టినరోజుపండుగను చేసారట. పగలల్లా చేసిన పనిభారంవల్ల కాబోలు ఆరాత్రి వారందరు తొమ్మిదిగంటలు కొట్టక మునుపే నిద్రపోయినారట. దాసదాసీజనం కూడా యజమానులకు వుండే గాఢనిద్రలో మునిగిపోయినారట. ప్రతిదినం అందరు పండుకొనిన తరువాత చిట్టిరామయ్యగారు అన్ని తలుపులు బాగుగా మూసియున్నవో లేవో, ఆడవారందరు నగలన్నిటిని తీసి జాగ్రత్త చేసిరో లేదో చూచి పరుండుట మామూలట. కాని,పాపం, పగలుపడినశ్రమవల్ల ఆయనకు ఒళ్లుతెలియక రాత్రిభోజనంకూడా మానేసి గ్రహచారవశాత్తు యింటిగొడవే మరచిపోయి పడకటింటికి వెళ్లిపోయినారట. వారి పెద్దఅమ్మాయి పదహారేండ్లది,—అందంగా కూడా ఉంటుందట,—తమ్ముడి పుట్టినపండగ గనుక సహజసంతోషంవల్లను, మంగళహారతి పళ్లెం పట్టినప్పుడు తండ్రిగారొక పెద్దకాసైనను యివ్వకపోతారన్న సంతోషంవల్లను కాబోలు, చక్కగా అలంకరించుకొని ఇల్లంతా తానేమై మసలిందట. రాత్రికాగానే అందరితోపాటు రెండుమెతుకులుతిని,—చిన్నపిల్లకాదటోయి,—నిద్రకూరుకొనిరాగా నగలను తీసి దాచకుండగనే రెండవ అంతస్థులో తూర్పుదిక్కుగా తోటకు ఆనుకొనియున్న గదిలో లోపల గడియవైచుకొని పండుకొన్నదట. ఆరోజున అమావాస్యఅగుటచేత చీకటి దట్టంగా పట్టియున్నదేమో, చిట్టి రామయ్యగారి గుట్టుమట్టు తెలిసినవాడెవడో తోటలోనుంచి ఆ అమ్మాయి పడుకున్నగది కిటికీగుండా లోపలికి ప్రవేశించి—చెప్పటం మర్చిపోయినాను, ఆ అమ్మాయిపేరు సుబ్బలక్ష్మమ్మట—సుబ్బలక్ష్మమ్మ ఒంటిమీది నగలు చాలనుకున్నాడో ఏమో, ఇంటిలోపలి భాగానికి చొరబడకుండా నగలను పిల్లతో సహా తీసికొని పారిపోయినాడట. తెల్లవారి ఏడు గంటలైననూ సుబ్బలక్ష్మమ్మ లేవకపోవటంచేత పరిచారికలు తలుపుగొట్టిరట. జవాబులేదు. ఆసంగతిని చిట్టిరామయ్యగారితో చెప్పగా ఆయన వచ్చి పిలుపునకు పలక్కపోవటంచేత ఆత్రంతో తలుపును గట్టిగా త్రోసిరట.

గడియ ఊడి తలుపులు తెరువబడినవి. సుబ్బలక్ష్మమ్మ గదిలో లేదు. అసలే కొంటిదికాబట్టి ఏ మంచం క్రిందనన్నా దాక్కుందేమో అని మంచం క్రింద నలుమూలలచూచారట. ఎక్కడను లేదు. ఇంతట్లో ఇంటిల్లుపాదిగ గదిలో ప్రవేశించారట. ఏడుపులు పెడబొబ్బలు. పోలీసువారికొరకు వార్తలు వెళ్లగా వారు వచ్చి అంతా పరీక్షించి కావలసినసంగతులను చిట్టి రామయ్యగారివలన తెలిసికొని సుబ్బలక్ష్మమ్మ నగలకోసం ఆశపడి చిట్టి రామయ్యగారి ఆచోక తెలిసినవాడెవడో ఆపనినిచేసి యుండునని ఊహించి ఊరి నలువైపులకు భటులను పంపిరట. నేను పోలీసుస్టేషనుదగ్గర జనంగుంపులు గుంపులుగాఉండగా వెళ్లి భోగట్టా చేయగా ఇలా చెప్పారు. సంగతియిది. ఇక నువ్వేమిచేస్తావో. నాకు చూడబోతే దీని కిటుకు బైటికి తీయడానికి నీవొక్కడవే సమర్థుడివిలాగ కనబడుతున్నావు. ఇన్నాళ్లనుంచి పరీక్షలన్నమాటైనా లేకుండా డిటెక్టివు నవలలను చదువుచున్నందుకు చిట్టి రామయ్యగార్ని ఒకదరికి చేర్చాలి. ఆయన చూడబోతే ముసలివాడు. ఈకష్టంవల్ల బాగా కృశించిపోయాడు. అన్నిటికంటె ముఖ్యం పేరొక విషయం సుబ్బలక్ష్మమ్మకు యింకా పెళ్లి కాలేదట. కులాభిమానంచేత యీవిషయంలో నీవు శ్రమపడితివా—పరీక్షమాట దేవు డెరుగును—కాని, చిట్టి రామయ్యగారు సుబ్బలక్ష్మమ్మను యిచ్చి నీకు పెళ్లి చేస్తారు. సుబ్బలక్ష్మమ్మ అందమైనదని అదివరకేచెప్తినా. పైన నీయిష్టం." అని, హాస్యధనపువాలుకాన్న ఎక్కువకలవాడేమో సుబ్బారావు నవ్వుతూ చమత్కారంగా ముగించాడు.

సుబ్బలక్ష్మమ్మ ఏమైయుండునా, అన్న ఆలోచనలో పడ్డానుగాని, ఆవిషయంలో అంత దీర్ఘంగా ఆలోచిస్తూన్నట్లు కనబడితే కొంటి అని సుబ్బారావు ఏమనుకునిపోతాడో భయంచేత కొంతవరకు కప్పిపుచ్చాను. కొంచెంసేపు మాట్లాడి అతని త్రోవని అతను వెళ్లాడు.

3

మాహాస్టలుకు దగ్గరగానే రైలుస్టేషను ఉంది. పదిమంది కూడేచోటుగదా క్రొత్తవిషయాలు ఏమైన తెలుస్తాయేమో అని అక్కడకు వెళ్లాను కాని ఉపయోగం లేకపోయింది. వెంటనే హాస్టలుకువచ్చి భోజనంచేసి గదిలో పడుకున్నాను. సుబ్బారావుచెప్పినసంగతులను ఒక్కొక్కటిగా జ్ఞాపకంచేసుకుంటూ తర్కించ మొదలుపెట్టాను. దొంగ యింటిలోపలి భాగానికి వెళ్లకుండా సుబ్బలక్ష్మమ్మ గదిలోనుంచి తిరిగి వెళ్లిపోవటం అనుమానంగా కనుపించింది. వాడు నిజంగా డబ్బుకే ఆశపడి వచ్చాడా, అట్లైతే యింటియితరభాగాలకు వెళ్లకుండా ఉండుట ఎందులకు? దొంగలకు ఆశాపరిమితి అంటూ ఉండదుగదా. ఈరోజులకిది మామూలును; తరువాతిమాట వేరొకసమయమందున చూచుకుందామన్న ఆలోచనకలగటం దొంగలస్వభావానికి విరుద్ధం. పోనీ,సుబ్బలక్ష్మమ్మ గదిలోనుంచి, యింటిలోపలికి వెళ్లటంకష్టమా? గది గడియతీసినంతమాత్రాన యిల్లంతయు తిరిగి చక్కపెట్టవచ్చునే. అదీగాక, అలికిడివలన ఎవరైన మేలుకొంటే పారి

పోయెనందమా ? ఆరాత్రి యింట్లో ఎవరు లేనట్లే. అందరుకూడా ఒళ్లుమరచి నిద్రపోతున్నారు. ఇకను యింట్లో ప్రవేశించటానికి రెండవ అంతస్తుపైనున్న సుబ్బలక్ష్మమ్మ గది లోనుంచి ఎందుకుపోవాలి. అన్నిటికంటె ఇది సులభమార్గమా? ఒకవేళ సులభమనియే అట్లా చేసాడనుకున్నా మొదట ఊహించుకున్నట్లు ఇంటి ఉపరిభాగానికి పోకుండా ఉండటం ఎందులకు? అని ఈవిధంగా పరిపరి విధాల ఆలోచించాను. దొంగ డబ్బును తస్కరించటానికివచ్చి యుండడని తాత్కాలికంగా ఒకసిద్ధాంతం చేసుకున్నాను. బహుశః సుబ్బ లక్ష్మమ్మను ఎత్తుకొనిపోవుటకే ఆ రాత్రి దొంగ చిట్టిరామయ్యగారి యింట ప్రవేశించియుండునని కూడా ఒక ఆలోచన పోయింది. రాత్రి బాగా నిద్దరపట్టలేదు. పైగా పోలీసువారి సిద్ధాంతానికి విరుద్ధంగా ఉండటంవల్ల నాద నిజమేమో అనుకున్నాను.

## ౪

తెల్లవారినది; ప్రాతఃక్రియలు నెరవేర్చుకొని కాఫీతాగి, దుస్తులనువేసికొని చిట్టిరామయ్యగారి యింటికి వెళ్లాను. క్షాలికనక ఆయన కొచ్చిన ఆపత్తుకు సానుభూతిని కనపరుస్తూ మాట్లాడుతూ దొంగతనం జరిగిన గదికి యిద్దరం వెళ్లాం. గదిలో ఒకమూల దోమతెరవేసిన డబుల్ కాటున్నది. కిటికీకి ఆనుకొని ప్రక్కగా ఒకబల్ల ఉన్నది. దానిమీద బంకించంద్ర చటర్జీ వ్రాసిన రెండు నవల లున్నవి. అందులో ఒకదానిని చేతులోపట్టుకొని పుటలు తిరగేస్తూ "మీ అమ్మాయి చదువుకొనేదా" అనగా చిట్టిరామయ్యగా 'రవు' నన్నారు. గదిలో వేరొకమూల టేకుకర్రతో చేసిన డ్రాయరొకటి కలదు. దానిని చూచి దీని తాళములేవైనా పగలగొట్టబడ్డవా అనగా లేదని జవాబువచ్చింది. దొంగతనం విషయమై ఇంకేమైనా విశేషాలున్నవా అని ప్రశ్నింపగా "ఏమీ లేవు నాయనా! ఆ దొంగముండకొడుకు నగలను అన్నిటిని సావకాశంగా తీసుకొందామని పిల్లను ఎత్తుకొనిపోయినాడేకాని దానివంటిమీద ఉన్న వాటిలోకల్లా పెద్దదైన కట్టకాసులపేరు మంచంమీదనే పడిపోయినది. ఇంతకు మా దురదృష్టంకాకపోతే ఎప్పుడూ అలవాటు లేనిదీ లోపలగడియ వేసుకోవటం ఎందులకు? తలుపులు తెరచివుంటే ఎవరికైనా మెళుకువ వచ్చేదేమో" అని కంట తడిపెట్టుకున్నారు. ఆయనను ఓదార్చి పోలీసువారికి ఆచోకీ చిక్కలేదా అన్నాను. "లేనట్లే. నిన్న వారీ గదిని సోదాచూడగా ఒక జేబురుమాలు మాత్రం కనుపించింది. దాని అంచున "చిం. రా." అను పొడి అక్షరములున్నవట. అదేమైనా ఉపయోగంగా ఉంటుందేమో అని, వారు పట్టుకెళ్లారు" అన్నారు.

జేబురుమాలు, దానిఅంచున "చిం. రా." అని వినగానే అపరిమితమైన ఆశ్చర్యంకలిగింది. ఎందుకందురా? గదిలో బల్లమీద చూచిన పుస్తకంమీదకూడా "చిం. రా." అను అక్షరములేఉన్నవి. ఆ జేబురుమాలు వారియింట్లో ఎవ్వరిదికాదని చిట్టిరామయ్యగారు గట్టిగా

చెప్పారు. మొదట నాకేమి తోచిందికాదు. ఈ జేబురుమాలు కనకదొంగదే అయినఎడల వాడు సుబ్బలక్ష్మమ్మకు చిరపరితుడే అయి వుండునని అనుకున్నాను. ఇంకా ఆదొంగ యింటిలో ప్రవేశించటంలో ఉద్దేశం ధనాపేక్ష కాదని స్థిరపడింది. ఎలాగా, ద్రవ్యాపేక్షయే మైనట్లైతే కట్టకాసులపేరు క్రింద పడనీయడు. పొరపాటందామా, అమూల్యము లగు వస్తువుల విషయంలో వాటిని దొంగిలించుకుందామని వచ్చినవాడు పొరపాటు పడడం అసంభవం. నిన్నరాత్రి నాతాత్కాలిక సిద్ధాంతం బలపడింది. వింతదొంగతనంలా కనిపించింది. దొంగను ఏవిధానన్నా పట్టుకోవాలని కుతూహలం కలిగింది. అప్పటికే 10 గంటలైంది. భోజనంచేసి మళ్లావద్దామని హోస్టలుకు వెళ్లిపోయాను.

భోజనంచేయగానే చిట్టి రామయ్యగారి యింటికివచ్చిచేరాను. ఆయన చుట్టకాల్చుకుంటూ మేడమీద హాలులో పత్రిక చదువుకుంటూ కూర్చున్నారు. నన్నుచూచి ప్రక్కన కూర్చోమని సంజ్ఞచేసారు. పదినిమిషాలు, సంభాషణ ఏలా మొదలుపెట్టవలసినది తెలియక, మాట్లాడకుండాకూర్చున్నాను. చివరకు 'పత్రికావిశేషాలేమిటండి' అని ప్రశ్నించగా "అన్నివిశేషాలకన్నా నాకూతురు విషయమే నాకు ఎక్కువగా ఉన్నది. వచ్చే మాఘమాసంలో పెండ్లి చేతామన్న తలంపుతో ఉన్నాను. విధి ఇట్లాఉంటే మన కోర్కె లెక్కడసాగుతాయి?" అన్నారు.

సంభాషణ అనుకూలంగానే వెడుతూన్నందుకు సంతోషించి "అమ్మాయికి 16 యేండ్లు టగా. పెండ్లి యింకను చేయలేదా" అని కొంచెం ఆశ్చర్యంతో అడిగాను.

"లోకమంతా అల్లాగే అంటున్నారు. అందులో నాలో ఏమిలేదు. మా అమ్మాయి పాశ్చాత్యవిద్యాభ్యాసం చేసింది. పెళ్లి అంటేను, మనసంఘమతాచారాలంటేను నూతనోద్దేశాలు గలది. వర్ణాశ్రమధర్మం మన దేశాభివృద్ధికి నిరోధకంగా ఉందని నాతో ఒకటి రెండుసారు లంది. ఎవరి వివాహవిషయంలో వారియిష్టమే జరగాలిగాని వేరొకరు ఎంత ఆప్తులైనా జోక్యం గలగ చేసుకొనగూడదు అని సహజయుక్తితో సూచిస్తూ ఉండేది. ఇవన్ని నేను గ్రహించి యుక్తవయస్సు దాటినా కొంతకాలంపాటు పెళ్లి చెయ్యకుండాఉంటే అభిప్రాయాలు మారుతాయేమో అని ఇంతవరకు ఆపాను. స్కూలు ఫైనలు ప్యాసుఅవటంతోనే చదువు మానిపించాను. స్వసాంప్రదాయాన్ని పాటించటం మంచిదని బోధిస్తూ ఉండేవాణ్ణి. నేనూ మన ఆచారాల్లో కొంతమార్పు కావాలన్నవాళ్లల్లోవాడినేకాని లోకానికి వెరిచి నా అభిప్రాయాన్ని కప్పిపుచ్చాను.

నాకు కొంచెం నవ్వొచ్చింది. ఆపుకోటానికి ప్రయత్నించాను. కాని చిట్టిరామయ్యగారు గ్రహించి "నాసంగతి నాకేనవ్వొస్తోంది. కాని నాహృదయములో బరువును కొంత తగ్గించుకోటానికి నీతో యీచరిత్ర అంతా చెప్పుతున్నాను" అన్నారు.

"అచ్చే అందుకుకాదండి నే నవ్వింది. అందరిలాగా చిన్నప్పుడే ఏశుంఠకో మీ అమ్మాయిని కట్టిపెట్టకుండా, చదువుచెప్పించి పెద్దదాన్ని చేసినందుకైనా కృతజ్ఞత లేకుండా మీమాట త్రృణీకరించిందే" అని నవ్వొచ్చింది అన్నాను.

"నేను అప్పుడప్పుడు తలిదండ్రుల మాట ఏవిషయంలోనైనా సరే వింటూండవలెనని మనపూర్వులు మనకంటె తెలివిగలవారని మా అమ్మాయితో చెపుతూ ఉండేవాణ్ణి. నా ఉపదేశంవల్ల శాస్త్ర దార్లో పడుతూందను కున్నాను. ఇంతలో మాపాలిటి యముళ్లాగ మాఅమ్మాయికి ఒక స్నేహితుడు దాపరిం చాడు. మొదట 'ఎవరో యీప్రూరి కాలే జీలో బి. ఏ. చదువుతున్నాడట. చదువు ఏలాగా మానిపించానుగదా యింటిదగ్గర ఏవో రెండు యింగ్లీషుముక్కలు చెపుతాడని అమ్మాయి సరదాపడుతూందని మా ఆవిడ చెపితే సరే అన్నాను. వాడు రావటం మొ దలుపెట్టినప్పటినుంచీ అమ్మాయి మళ్లీ పెడ త్రోవ తొక్కటం ప్రారంభించినట్లు నాకు కన బడ్డది. అంతాఎందుకు ఒకనాడు అమ్మాయి గదిముందరినుంచి నేను వెడుతూండగా 'మన పూర్వులు పిల్లలు గర్భంలో ఉండగానే తాం బూలాలు పుచ్చుకొనేవారట' అని చెప్పి వాడు అమ్మాయిని నవ్విస్తున్నాడు. ఆరోజు నుంచి వాడిని సాగుమ్మంలో అడుగుపెట్టనివ్వ లేదు. ఇష్టంవచ్చినట్లు వెళ్లనిస్తే పాకంముదిరి పోతుందని మాఖమాసంలో ముహూర్తం పెట్టాను. మాకర్మం యిలాప్రుంటే వెళ్లి ఎట్లా సాగుతుంది కనక" అని చెప్పుచుండగా పోలీసు సబిన్‌స్పెక్టరు వచ్చినట్లువిని చిట్టిరామయ్యా గారు వెళ్లిపోయినారు.

సుబ్బలక్ష్మమ్మ గదిలోని నవల అక్కడ దొరికిన జేబురుమాలు ఆ బి. ఏ. కుర్రవాడి వా అని ఆలోచనపోగా వెంటనే కాలేజీకి పరు గెత్తి రైటరునడిగి బి. ఏ. క్లాసు హాజరు పట్టీని తీసికొని పేరుతరువాత పేరుగా చూస్తుం డగా 'చింతలధొడ్డి రాజేశ్వరరావు' అని ఒక పేరు కనుపించిది. 'చిం. రా.' అను పొడి అక్ష రములకు యీపేరు తగియుండటం, ఆపేరుకు ఎదురుగా నిన్న, యివ్వాళ హాజరుగుర్తు లేక పోవటం అనుమానంగా కనిపించింది. చిట్టి రామయ్యగారి మాటలవలన సుబ్బలక్ష్మమ్మకు రాజేశ్వరరావుకు ప్రేమతోకూడిన స్నేహం ఉన్నట్లు తేలినది. సమయం మించబెడితే మాఖమాసంలో పెళ్లైపోవునేమో అని యిద్దరు ఆలోచించుకుని చేసినపని ఆరాత్రి జరిగిన దొంగతనమా అన్న ఊహ నాకు తోచింది. రైటరు సహాయంవల్ల పెద్ద రిజి ష్టరు తీయించి రాజేశ్వరరావు చిరునామా కోసం చూచాను 'చిం. రాజేశ్వరరావు వాడపిల్లి, గోదావరిజిల్లా' అని వున్నది. దానిని నాడైరీలో ఎక్కించుకొన్నాను. ఏది ఎట్లా ఉన్నా ఆప్రూరు వెళ్లి రాజేశ్వరరావు విష యం కొంత భోగట్టా చేయటానికి వాడపిల్లి వెళ్లటం నిశ్చయించాను. అక్కడకు వెళ్లే ముందర సుబ్బలక్ష్మమ్మ రూపరేఖలనుగురించి తెలిసికొంటే బాగుండునని చిట్టిరామయ్యా గారి నౌకరులను అడిగితే ఆమెయింటికి వెళ్లి

ఫొటోను ఒకదానిని నాకిచ్చారు. దానిని తీసికొని హాస్టలుకు వచ్చాను.

భోజనం అయినతరవాత వాడపిల్లికి దారి కనుక్కుందామని ఆచుట్టుపట్ల ఊళ్లన్నీ తెలిసిన మా హాస్టలు వంటవాడి దగ్గరకు వెళ్లాను. వాడుమంచి తెలివైనవాడు. బ్రిటిషు సామ్రాజ్యానికి ప్రధాన మంత్రిగా వేస్తే బాల్డ్వినుకన్నా బాగా రాజ్యంచేస్తాడని పిల్లలంతా అంటూవుండేవారు. 'వాడపిల్లి యెక్కడుంది గంటయ్యా' అని అడిగినప్పుడు వాడు నన్ను చేసినక్రాసుకు ఆగలేకపోయాను. ఎల్లాగైతేం, దారిని కనుక్కొని మరునాడు ప్రయాణం పెట్టాను.

౬

తెల్లవారగట్లే లేచి మామూలు పన్లైన తరువాత నాతోలుసంచిలో రెండు గుడ్డలు కొత్తగావచ్చిన 'భారతి' పత్రికను, సుబ్బలక్ష్మమ్మఫొటోను పెట్టుకొని బయలుదేరాను. సాయంత్రము ౫ గంటలయేసరికి వాడపిల్లి చేరాను. కొంచెం నీరెండ ఉంది. బండిని తిన్నగా చింతలదొడ్డి రాజేశ్వరరావుగారి యింటికే పట్టించాను. వాకిటనున్న నౌకరు నన్ను చూచి "అయ్యగారు అమ్మగారు తోటలోకి సికారికెళ్లారు, బాబు" అని తోటవేపు చూపించాడు. నాసంచిని వాడిదగ్గిర పెట్టి తోటలోకి నిమ్మళంగా ప్రవేశించాను. తోటంటే మరేమిలేదు దట్టంగా చింతచెట్లు పెరిగిఉన్నాయి. రాజేశ్వరరావుగారి యింటిపేరు సార్థకనామమే అనుకుంటూ తోటలో ఇటుఅటు చూచాను. దూరమునుంచి రాజేశ్వరరావుగారు ఒక ఆడమనిషి చేతులలో చేతులువేసుకొని నావైపే వస్తున్నట్లు కనిపించింది. ప్రక్కనఉన్న ఒకచెట్టుచాటున దాగి ఆత్రంతో వారివైపు చూస్తున్నాను. వారు చూపుమేరలోకి వచ్చారు. రాజేశ్వరరావుగారు నాగరిక విద్యార్థుల్లాగ పెద్దగాలివేస్తే పడిపోయేటట్లుగాక దృఢంగా ఉన్నాడు. మనిషి పొడగరి. పొడుగుకు తగిన లావు తలకు కొంచెంగా క్రాపింగు కళ్లకు జోడూ లేకుండాపోలేదు. ఖద్దరు కంఠెమెడచొక్కా తొడుగుకొని బోడసరం ఖద్దరుపంచెనే కట్టుకున్నారు. కాళ్లకు రంగూను స్లిప్పరులు ఉన్నవి. చేతిలోని బెత్తంతో విలాసంగా క్రిందకొడుతూ ప్రక్కనున్న ఆమెతో చనువుగా కబుర్లు చెబుతున్నారు. రాజేశ్వరరావుగారి మీదనుండి నాదృష్టిప్రక్కనేఉన్న స్త్రీస్వరూపంమీదికి దుమికింది. పైనుంచి క్రిందికి ఒక్కసారి చూచాను. పట్టలేని ఆశ్చర్యం కలిగింది. ఆవ్యక్తిని వర్ణిద్దామన్న కుతూహలం ఉందిగాని సుబ్బలక్ష్మమ్మ ఫొటో ఎలాయున్నదో ఈవ్యక్తికూడ అచ్చు ఆలాగానే ఉన్నదని చెప్పి ఊరుకుంటాను. అయినను తొందర పడకూడదనుకొని వారు బాగా దగ్గరలోకిరాగా చెట్లచాటునుంచి నేను యింటివీధిగుమ్మందగ్గరకువచ్చి వాకట్లోవున్న బల్లమీద కూర్చున్నాను. పావుగంటకాలంలో వారిరువురుకూడా వచ్చారు. నేను నిలబడి రాజేశ్వరరావుగారికి నమస్కారంచేసి ఒక కాగితం అందిచ్చాను. దానిని చదువుకొని ఆవిడతో 'మీరు భారతికి ఏజెంటట, నన్ను

చందాదారుగా ఉండమని అడుగుతున్నారు' అన్నారు. ఏంచేతనోకాని 'అలాగే ఉండవచ్చును' అని ముక్తసరుగా పలికి లోపలికి వెళ్ళిపోయింది.



"ఇప్పటికే చీకటిపడిపోయింది- ఈపూట యిక్కడ భోజనంచేసి రేపు వెళ్లవచ్చు"

"ఇప్పటికే చీకటిపడిపోయినది. ఈపూట యిక్కడ భోజనంచేసి రేపు వెళ్లవచ్చు" నని నన్నుగూర్చి రాజేశ్వరరావుగారన్నారు. అనుకూలంగా వ్యవహారం నడుస్తూఉందిగనక ఆలోచించకుండా రాజేశ్వరరావుగారి వాక్యం ముగియకుండా 'చిత్తం' అన్నాను. ఆయన లోనికివెళ్లారు. మార్గాయాసంతీర్చుకుందామని నేను బల్లమీద ఒరిగాను.

ఇంతలో వంటవాడు భోజనానికి నన్ను లేపాడు. రాజేశ్వరరావుగారు, ఆయనతో వచ్చిన ఆడమనిషి, నేను కలసిభోజనంచేసాం. తరువాత నేను రాజేశ్వరరావుగారు దేశపరిస్థితులను గురించి మాట్లాడుకొని రాత్రి తొమ్మిదిగంటలనగా పరుండటానికి విడిపోయినాం.. చావడిలో మడతమంచంమీద నేను పరున్నాను. నిద్రపట్టలేదు. చావడిని ఆనుకున్నగదిలో రాజేశ్వరరావుగారు సాయంత్రం చూచిన ఆడవ్యక్తితో మాట్లాడుచున్నట్లు వినవచ్చినది. నెమ్మదిగా గది గుమ్మందగ్గరకు వెళ్లి ఓరవాకిలిగా వేసియున్న తలుపులగుండా లోపలివారిని చూస్తు వారి సంభాషణ నాకేమైన ఉపయోగంగా ఉండునేమోఅని కూర్చున్నాను.

"మీతండ్రిగారు పోలీసువారికి రిపోర్టు యిచ్చినారట. ఆయన ఆవూరిలోకల్లా పలుకుబడికలవాడుకనుక పోలీసువారు శ్రద్ధతో పని చేసి మనగుట్టును బైటపెట్టగలరు. ఇకముందు ఆలోచనఏమిటి?" అని రాజేశ్వరరావుగారన్నారు.

"మగవారు ఆడువారికంటె ఆలోచనా పరులని లోకు లనుకుంటారు కనక మీరెలా చెపితే నేనల్లా చేయటానికి సిద్ధంగాఉన్నాను, యివ్వాళ్ళ మనయింటికివచ్చిన మనిషినిచూస్తే నాకనుమానంగానే ఉంది. ఏలాగైనా మనం మాత్రం మాతండ్రిగారి కంటపడగూడదు" అని మాటకు మాటకు సంబంధం లేకుండా, నిరుత్సాహంతో ఆమె అన్నది.

రాజేశ్వరరావుగారు కొంచెం ఆలోచించి "ఏవిధంగా చూచినా మనం యీవూరిలో ఉండటం మంచిదికాదు. మనం కనక రేపే బైలుదేరి కలకత్తా వెళ్ళిపోయి—అక్కడ బ్రహ్మసమాజం అధ్యక్షుడు చాలామంచివాడట, ఆసమాజంలోచేరి వెంటనే పెళ్ళిచేసుకున్నామా మనకిక నిర్భయం. మీవాళ్ళకి మన రహస్యం తెలియకుండా దూరానికి దూరంగాను ఉంటాము. మహాపట్నం గనక విద్యావంతులమైన మనకి జీవనోపాధికి లోటులేకుండాను ఉంటుంది" అని ఆవిషయాన్ని మరీ నొక్కిచెప్పకుండా, అటులజరగకపోతే ముప్పు రావచ్చునను అనుమానాన్ని సూచించు చూపులతో ఆమెను చూచి రాజేశ్వరరావు జవాబుకొరకు ఎదురుచూస్తున్నాడు.

కొంచెం సిగ్గుతో తలవంచి 'సరే' అని చటుక్కున వూరకుంది.

నేనిక అక్కడ ఉండలేదు. మడతమంచంమీదికివచ్చి పడుకున్నాను. కాలం మారుతున్నా ఆచారాలు మారకపోవటం చాలా అనర్థకం అనుకున్నాను. రాజేశ్వరరావు సుబ్బలక్ష్మమ్మను, ఆమె యిష్టంమీదనే లేవదీసికొని వచ్చాడని నిర్ధారణ అయిపోయినది.

ఇకముందు నేను చేయవలసినదేమిఅని ఆలోచించినాను. వీరు నిజమైన ప్రేమచే ప్రేరేపింపబడి బంధుకోటికి లోకానికికూడా వెరవకుండా యింతపనిచేసారు. ఈ నిశ్చలమైన ప్రేమలతనుతెంచి రాజేశ్వరరావుగారికి కారాగృహంలో మరణం కలిగేటట్లు చేయటం నాకు తగునా అన్న సందేహంతోచింది. ఆరాత్రి గడిచింది. భారతికి చందాదారుగా చేరినందుకు రాజేశ్వరరావుగారికి కృతజ్ఞతను తెల్పి మావూరికి బైలుదేరాను.

౭

సాయింత్రం మావూరికి వచ్చాను. దార్లోనే, చిట్టిరామయ్యగారి కీసంగతి తెలిసినా ఆనిర్మలప్రేమ ప్రవాహానికి అడ్డుపడరని నమ్మి, వారితోచెప్పటానికి నిశ్చయించాను. వెంటనే చిట్టిరామయ్యగారి దగ్గరకు వెళ్ళి సంగతి సంగ్రహంగా చెప్పి, కలకత్తా వెళ్ళమని సలహా యిచ్చాను. ఆయన అభిప్రాయం ముఖంలో కనబడలేదు. భార్యను పిలిచి 'అమ్మాయిసంగతి నాకు కొద్దిగా తెలిసింది. నేను యీరాత్రి మెయిలుకు ఊరుకు వెళ్ళవలసివుంది. వారం రోజులలో సుబ్బలక్ష్మిని వెంటబెట్టుకొని వస్తాను. యింట్లో మీరు ఖంగారు పడవద్దు" అని చెప్పారు.

ఆరాత్రే ఆయన వెళ్ళిపోయినారట. ఇప్పటికి పదిరోజులైనది. యింకా రాలేదట. సంగతి ఫలానా అని ఉత్తరంఅయినా వ్రాయలేదట. ఈవిషయం పోలీసువారికి ప్రజలకు తెలిసినదట. ఎవ్వరుకూడా 'ఇదమిద్ధ' మని చెప్పలేకుండావున్నారు. చౌర్యం వివిధగనుక ప్రజాబాహుళ్యానికి ఎంతత్వరలో తెలిస్తే అంత మంచిది గనుక పర్యవసానం తేలకపోయినప్పటికి పత్రికలలో ప్రకటించినందుకు క్షమాపణ కోరుకుంటున్నాను.




[శ్రీ తులసీరామాయణము లోనిది]

భాగవతుల నృసింహశర్మ గారు

మహేశ్వరుఁడు పార్వతితోఁ జెప్పుచున్నాఁడు

కం. శ్రీరాముఁ డవతరింపఁగఁ, గ్రూరాత్ముల సంహరింప ఘోరాటవులన్
బోరాము లనుభవింపఁగ, నోరామ! మఱొంపు హేతు వున్నది వినుమా.

కం. కేకయ దేశాధీశుఁడు, లోకైక బలుండు ధర్మలోలుఁ డరిదురా
లోకుఁడు, సుశ్లోకుఁడు, లక్ష్మీకరుఁ డన నొప్పు సత్యకేతువు వఱలున్.

కం. గుణధాము లతనిపుత్త్రులు, రణభీములు; వారిలోన రాజిల్లుసభో
మణినాఁ బ్రతాపభానుం, డనుమధ్యా! రాజ్యమేలె నతఁ డతిబలుఁడై.

కం. నానారిపు భూజానుల, సేనాతామిస్రపటలిఁ జెదరం జేయం
గానోపు ప్రతాపముఁగల, భానుండగు నా ప్రతాపభానుం డబలా!

కం. అరయన్ రెండవపుత్త్రుం, డరిమర్దనుఁ డాతఁ డహహా!! యరిమర్దనుఁ డీ
యిరువురుసోదరు లిరవుగ, ధరణిం బాలించి రతులధర్మసమాధిన్.

కం. రాగాభివృద్ధిఁ గోరరు, భోగానుభవంబుకొఱకుఁ బోక్కరు, ప్రజలన్
రోగార్తుల విడనాడరు, త్యాగార్జితకీర్తి ధనులు తరుణీ! వారల్.

కం. భూషింప రధికవేషుల, ద్వేషింపరు పరులసిరుల వికటంబున కేన్
భాషింప రనృతభాషల, ఘోషింపరు తాల్మి దూలి ఘోరాపదలన్.

ఉ. పాపమనంగ నెట్టిదియొ స్వప్నమునందు నెఱుంగ రెట్టి సం
తాపము లేనివారు, సతతంబును వైదికధర్మ కర్మ ని
ష్ఠాపరు లెల్లభంగులఁ బ్రజల్; పరికింపఁ బ్రతాపభాను ధా
త్రీపతిఁ బోలువారుగలరే? త్రిజగన్నుత రాజకోటిలో.

గీ. రాజనీతికి శుక్రుండు రాజ్యహితుఁడు, పాడిగలవాఁడు ప్రజలఁ గాపాడువాఁడు
ధర్మరుచి యను సచివుండు ధర్మపరుఁడు, ఆప్రతాపభానునిమంత్రి; యబ్జవదన!

ఉ. భండనసీమ కేఁగి బలవద్రిపుకోటి జయింపఁ జాలు త
మ్ముండు విధేయుఁడై తనదుపొంతనె యుండగ, రాజనీతికిన్
మండనుఁడైన ధర్మరుచి మంత్రపరుండయి చాతురీధురీ
ణుండయి యుండ నానృపుని నొంపఁగనోపునె యెట్టి భూపుఁడున్.

శా. సప్తార్చిప్రతిమాన బాణవితతిన్ సైరింపఁగా శక్యమే?
సప్తాశ్వుండు ప్రతాపభానుఁ డనుచున్ క్ష్మాకాంతు లగ్గింపఁగా
సప్తద్వీపములన్ జయించి, వసుధన్ శాసించె నాతండు, సం
ప్రాప్త శ్రీజితయక్షనాయకుఁ డనన్ రాకేందుబింబాననా!

కం. ధర్మార్థ కామమోక్షము, లర్మిలిఁ దను గొల్చువార లందఱుఁ బడయన్
శర్మము వర్ధిల్లగ, రిపు, మర్మస్పృక్కర్మమెఱిఁగి క్ష్మావిభుఁ డేలెన్.

గీ. అతని దండనీతిం బొంది యమరధేను, వనఁగ నొప్పారె భూదేవి వనజగంధి!
ఈతిబాధలఁ గలనైన నెఱుఁగరాదు; అతుల సౌఖ్యంబులం గాంచి రఖిలజనులు.

కం. వాపీకూప తటాకము, లేపారఁగఁ, బుష్పవనము లెల్లెడఁ గ్రాలన్
స్థాపించె దేవ గృహముల, క్ష్మాపాలుఁడు పాపమేఘఝంఝానిలుఁడై.

కం. సత్రంబుల, బహుపుణ్య, క్షేత్రంబులఁ బాదుకొల్పి క్షేమంకరుఁడై
క్షాత్రంబు రహింప, నహో, రాత్రంబు నతండు ప్రోచుఁ బ్రజలన్ గరుణన్.

కం. ఎప్పుడు త్రికరణశుద్ధిగఁ, దప్పక కార్యం బొనర్చి తత్ఫలము నతం
డప్పనము సేయు శ్రీహరి, కొప్పదె నిష్కామకర్మ యోగి యనంగన్.

ఉ. పాటలగంధి! యాత్మపరివారముతోడ హయాధిరూఢుఁడై
హాటకపుంఖ బాణనిచయంబు శరాసనమున్ ధరించి, యా
ఖేటకవేషమూని, పరికించి వనాటులు త్రోవఁజూప, విం
ధ్యాటవి కేగె నొక్కసమయంబున ఱేఁడు మృగాంతకుం డనన్.

కం. వేఁటరిమై యప్పోటరి, వ్రేటునకున్ వేనవేలుమృగములు గూలన్.
వేఁటాడి మాటలాడుచు, వాటంబగు బాట మఱ్ఱినీడ వచ్చుచునుండన్.

కం. చిక్కించి చెవుల గుత్తపు, డెక్కలసడి వాలకించి డీకొనఁగ నొడల్
నిక్కించి ఘుర్ఘురించుచు, నొక్కెడఁ బొద త్రొక్కనొక్క యొంటరి చెలఁగెన్

ఉ. అవ్వని నల్లగొండ నడయాడఁగ నేర్చి వనంగ, నేపుమైఁ
గ్రొవ్వి చరించు పంది నృపకుంజరుఁడుం గని యార్చి కెవ్వనన్
జివ్వున గుఱ్ఱముం గదియఁజేసి, శరాసన మెక్కుపెట్టి తా
లవ్వున బాణమున్ విడిచె ఱెప్పల వైచినయంత మాత్రలో.

కం. ముప్పించి యవ్వరాహము, మెప్పించుచు వేటకాండ్ర, మెడవంచి పడిన్
గుప్పించి యెగసి, గుఱిలోఁ దప్పించినయట్లు తూపుఁ దప్పించుకొనెన్.

కం. అదలఁడు పాఱిన పందికిఁ, గదలఁడు లోఁజిచ్చుపాటు గడలు కొనంగన్
మెదలఁడు పంతముఁ గుంతము, నదలఁడు, ధరణీవిభుండు పర్వతపుత్రీ!

కం. ఒంటరికై భూపాలుం, డొంటరియై యేగి యేగి యొక కొండదఱిన్
గంటకమయకాంతారము, నంటుకొనెన్ త్రోవఁదప్పి యలసెన్ సొలసెన్.

కం. ఈపాటి యేకలంబును, భూపాలుఁడు చంపలేకపోయెను; వినమ
ద్గోపాలుఁడు శ్రీపాలుఁడు, గాపాడినఁ జంపువాఁడు గలఁడే? లలనా!

కం. అడలెన్ గుఱ్ఱము వడికిన్, బడలెన్ బెనుదప్పివలన, బలిమియు మేనన్
సడలెన్ వృక్షచ్ఛాయకు, వెడలెన్ భూనాయకుండు విశ్రాంతిఁగొనన్.

కం. 'తక్కితి వివేకమంతయు, నక్కట! యాఖేటమనెడు వ్యసనంబునకున్
జిక్కితి'నని భూపాలుం, డొక్కించుక విశ్రమించి యూఱటఁగాంచెన్.

ఉ. ఊఱటఁగాంచి లేచి నరపోత్తముఁ డంతయుఁ దల్లడిల్లి, నే
పీఱిఁడినైతిఁ బందికై వివేకముఁ దక్కితిఁ ద్రోవఁ దప్పితిన్;
అఱడి పోకకున్ దగిన యాఱట మొందితి; నెంతతోలినన్
బాఱదు వారువంబు, పరివారముఁజేర నుపాయ మున్నదే?.

మ. తఱిఁగెన్ సత్తువఁ, దప్పితిన్ దెఱవు, దుర్దాహంబునే నోరుపా
డఱెఁ, బెల్లాకటఁ దూలిపోలెఁ దురగం, బారాటముంబాపఁగన్
దెఱఁ గింకెయ్యది? నాలుకం దడుపఁగా నీరంబు లేదయ్యె; నన్
దఱిమెన్ దుర్విధి భీకరాటవికి భూదారాపదేశంబునన్.






కె. నరసింహాచారి గారు

(సంపుటము ౨, సంచిక ౪ తరువాయి)

కొన్ని చోటులయందు కేవలము శిథిలములు కాక యుందు స్తూపాదుల యడుగున తత్సంబంధములు కాక వేరుపునాదు లుండుటవల్ల (Foundations) నచ్చట తత్పూర్వ మేదో స్తూపముగాని, ఆలయముగాని, మఠముగాని యుండి యవి శిథిలముకాగా కాలక్రమమున నా కట్టడముయొక్క పునాదినే యాధారముగాఁ జేసికొని వేరుస్తూపమునో, ఆలయమునో, మఠమునో కట్టినట్లు తోచుచున్నది. మరికొన్ని ప్రదేశములయందు పురాతన కట్టడములు శిథిలములై చాలకాలముకాగా వాటి పునాదులు పూడిపోవుటవల్ల నూతనముగ నా స్థలములయందు ఆలయాదులఁ గట్టువారి కచ్చట తత్పూర్వము వేరుకట్టడము లుండియుండినపని తోచకపోయి యుండవచ్చును. ప్రధాన ఆలయముచుట్టును చిన్నచిన్న స్తూపములు, చైత్యములు, దేవాలయములు, స్తంభములు, రాతిగొడుగులు విగ్రహములు భక్తులచే వారివారి ప్రార్థనాదికములకై ప్రతిష్ఠింపబడినవి పెక్కులు కలవు. సార్నాదు గొప్ప పుణ్యక్షేత్రమయినందున యాత్రాపరులు విశేషముగా నందుఁగూడి వారివారి భక్త్యనుగుణ్యముగా యథాశక్తిని మ్రొక్కులుచెల్లించుకొనుచుండిరి, కాన వారికి గావలసిన లోహశిలావిగ్రహములును, పరికరములును ప్రార్థన స్తూపములు (Votive stupas)ను అచ్చటనే తయారుచేయుటవల్ల నా క్షేత్రవాసులు గొప్పవ్యాపారమునుగూడ జరుపుచుండియుందురు. ఇందుల కాధారముగా నచ్చటవిగ్రహములు, కరగిపోయియు సామగ్రులును, లోహములును గూడ చిక్కినవి. తిరుపతి, వారణాసి, రామేశ్వరము, జగన్నాథము మొదలగు పుణ్యక్షేత్రములకు బోయినయాత్రికులు మరలివచ్చునపు డా క్షేత్రములనుండి దేవునివిగ్రహములనో చిత్రపటములనో లేక ఆలయములలో లభించెడి ప్రసాదమునో కడుభక్తితో గొనిపోవు రీతిగా నీ బౌద్ధక్షేత్రమును దర్శించిపోవు యాత్రాపరు లిందుండి చిన్నబొమ్మస్తూపములను, కురంగ-చక్రచిహ్నములును, నిష్కములను దీసికొనిపోయి వారివారి గ్రామములలో స్వగృహములయందుగాని, ఆలయములయందు గాని ప్రతిష్ఠించుకొని పూజించుచుండిరి. బర్మాలోని పగాన్ (Pagan) పట్టణమునందుగల యాలయములలోఁగూడ నిట్టి పూజనీయములగు కురంగచక్రచిహ్నాదులు ప్రతిష్ఠింపఁబడి యుండుటవల్ల యాత్రికు లీదూరదేశముల నుండికూడ హిందూదేశములోని సార్నాదు, గయ, మొదలగు బౌద్ధక్షేత్ర దర్శనార్థము వచ్చి వెళ్లుచుండినట్లు తెలియుచున్నది.

ఈక్షేత్రమును వైభవదశయందుండినకాలమునందేకాక, శిథిలమై నామమాత్రావశిష్టమై యుండు నీకాలమునందుఁగూడ లంక, బర్మా, టిబెట్టు, సయాము, జపాన్ మొదలగు దూరదేశములనుండి బౌద్ధయాత్రికులు హేమంతఋతువున వచ్చి దర్శించిపోవుచుందురు.

## ధామేక్ స్తూపము

దీని ఎత్తు భూమట్టమునకుపైన 116 అడుగులుండి పునాది 89 అ. కలిగియున్నది. ఈస్తూపము కూడ తత్పూర్వ మచ్చటనుండిన యొకపురాతన కట్టడపుపునాదిపై కట్టబడియున్నది. దీనియందు ముందుకు వంగిలి వచ్చియుండు 8 ముఖములు కలవు. ఇందు 7 ముఖములకు పైయందు సరళముగానున్నది. (Straight edged). పశ్చిమమునుండు 8వ ముఖముమాత్రము పైయందు విలువంపు కలిగియున్నది. స్తూపముచుట్టును చెక్కబడిన తీగ

పని ( Scroll work) ఈ శివ ముఖమువద్ద ఎక్కువ యందముకలిగి పరిసమాప్తి నొందింపబడినందున తక్కిన ముఖములకన్న నీముఖము ముఖ్యమైనదనిసూచించుచున్నది. మైత్రేయు*ని జ్ఞాపకార్థము కట్టబడిన యములలో విగ్రహము పశ్చిమాభిముఖముగా నుండుటవల్లను ధామేక్ స్తూపముయొక్క పశ్చిమముఖము ప్రాముఖ్యతను కనుపఱచుచున్నందునను నిదియు మైత్రేయుని జ్ఞాపకార్థమై కట్టబడి యుండును.



క. ప్రధానఆలయముయొక్క ప్లాను, ఎత్తును

[భారతి రెండవసంపుటము నాల్గవసంచిక తొంబదితొమ్మిదవపుటయందలి చిత్రము చూచునది]

* మైత్రేయుడు గౌతమబుద్ధునిచే తనతర్వాత బుద్ధుడగునట్లు వరమివ్వబడినవాడు.





ధామేక్ స్తూపమున నొకయరమైలు దూరమున చతురస్రమగు నొక ఇటుకరాతిదిబ్బ కలదు. దీనిపై నొక యష్టముఖ శిఖరము క్రీ.శ. 1588 సంవత్సరమున మొదలు చక్రవర్తియగు హుమాయూను జ్ఞాపకార్థముగా నతని కుమారుడు అక్బరుచే గట్టబడినది కలదు. అందొక శాసనము అరబిక్ లిపియందు చెక్కబడి యున్నది. ఇదాని

భావమేమనగా "ప్రస్తుతము స్వర్గము నలంకరించియుండు హుమాయూన్ చక్రవర్తి యొక నాడిచ్చటికివచ్చి కూర్చుండుటను గ్రహించినవాడై తన తేజముతో సూర్యుని తేజము నినుమడింప జేయగలుగును గాన ఆయనపుత్రుడును భృత్యుడునగు అక్బరు ఈప్రదేశమున నొక యున్నత శిఖరమును నిర్మించ నిశ్చయించుకొనెను" చౌఖండి స్తూపముపై గల శిఖరమునుండి చుట్టుపట్లజూచినయెడల పచ్చికబయళ్లును మామిడితోపులును కన్నులపండువై యొప్పుచుండును. ఉత్తర—పశ్చిమదిశలయందు 'నయాతలము' పూర్వదిశయందు 'సారంగతలము' అను జలభాగములు కలవు. ఇవి నైసర్గికములు (నదులు) కాక జనులచే ద్రవ్వి ఏర్పాటుచేయబడినవిగానుండి గట్టులయందు వీటినుండి త్రవ్వి యెత్తబడిన మట్టిదిబ్బలు కలిగియున్నవి. ఘాజీపుర మార్గమునకు వెనుక నొకదిబ్బపై 'మహావీరాలయము' ఒకటి కలదు. చౌఖండికి దక్షిణమున దూరములో వారణాసిలోని యున్నతసౌధములును, ఔరంగజేబుగోరీయును కనబడుచుండును. ఈస్తూపము 8 ముఖములు కలిగియున్నది.

బుద్ధుడు గయనుండి సార్నాదునకు వచ్చుచుండగా తన్నగౌరవపరచుటకై కుట్రలుపన్నుచుండిన కౌండిన్యాది పంచయతులను కనుగొనినప్రదేశమున గట్టబడినట్లు హియన్ట్సాంగుచే వర్ణింపబడిన స్తూప మీచౌఖండియే యనదగియున్నది.

స్తూపములు బుద్ధుని జ్ఞాపకార్థముగా గట్టబడినవి కాన సాధారణముగ ఆకారమున బోరగిలవేయబడిన బుద్ధుని భిక్షాపాత్రమును బోలియుండునట్లు కట్టబడియున్నవి. ఇట్టి యాకారమును స్తూపనిర్మాణమున ననుసరించుట కొక చిన్నకథ కలదు. బుద్ధుడు గయను వదలి సార్నాదుకు పోవుచుండగా మొట్టమొదట నిద్దరు వణిజు లెదురుపడిరి. వారు తమయొద్దనుండిన యాహారమును బుద్ధునికిగూడ గొంచెమిడి యాదరించిరి. ఇరువురు బ్రతిగా నాయన వారికి ధర్మమతమును బోధించి వారు పూజించుటకై తన కేశములను, నఖములను ఇచ్చెను. వాటిని కడుగౌరవముతో గొన్ని స్వగ్రామోన్ముఖులైన వణిజులా పదార్థముల బూజించు క్రమమును దెలుపుమని బుద్ధుని వేడుకొనిరి. బుద్ధుడును వారికోరిక నెరవేర్ప దలచి భూమిపై మొదట దన 'సంఘాటి'ని పరచి దానిపై దన 'యుత్తరాసంగము'ను 'శంకక్షికో'ను పెట్టి వాటిపై దన భిక్షాపాత్రమును మూసి దానిపై తన దండమును ని బెట్టి తనయభిప్రాయమును వారికి దెలిపెను. వా తమగ్రామములకుబోయి తామెరిగిన యారూపమును స్తూపమును నిర్మించిరి.

## శిలా విగ్రహములు

### రాతిగొడుగు

సార్నాదులో నొక గొప్ప బుద్ధవిగ్రహము రాతితో జేయబడిన గొడుగుకలదు. ఇది విరిగిక్రింద యున్నది. దీనివ్యాసము (Diameter) 10 అడుగు ఇది బోరగిలవేయబడిన తామరపువ్వును బోలి న్నది. గొడుగులో మధ్య నొకదిమ్మెయు దానిచుట్టు రెక్కలు గలిగిన గజ, సింహ, మకర, వ్యాఘ్ర, కురం ఉష్ట్ర, వృషభాదులచిత్రములు 12 చెక్కబడి యున్న వీటిమధ్య చదరబిళ్లలును వాటిలో తామరపువ్వులు కలవు. వీటి వెలుపలయమున 12 బౌద్ధచిహ్నము చెక్కబడియున్నవి. ఇందుముఖ్యమైనవి శంఖము, కొమ్ము, స్వస్తికమను చిహ్నము, ఫలపాత్రము. త్రిర చిహ్నము (బుద్ధుడు, ధర్మము, సంఘము అను 3 ర ములు) మత్స్యము, మంగళకలశము మొదలగునవి.

## కొన్ని శిలావిగ్రహములు

### తారాదేవి





రాతిగొడుగు (వ్యాసము 10 అడుగులు)

తారాదేవి విగ్రహము ధామేకస్తూపమునకు ఉత్తరదిశను కొంతదూరమున గనుగొనబడినది. కిరీటమున ధ్యాని బుద్ధుని విగ్రహము చెక్కఁబడియున్నది. రెండు చేతులును మధ్య విరిగియున్నవి. విరిగినచోట రంధ్రములు. రంధ్రము లుండుటవల్ల ఇంతకుపూర్వ మొకప్పుడు విరిగిపడిన భాగములను వేరురాతిలో చెక్కి యతికించినట్లు తెలియగలదు. ఇరుపార్శ్వముల యందును క్రింద రెండు స్త్రీవిగ్రహములు కలవు.



చతుర్ముఖతారాదేవి

## చతుర్ముఖ తారాదేవి

తారాదేవి చతుర్ముఖియని కూడ కొనియాడబడు చున్నది. ఒక్కొక్క శిరస్సునందును చిన్న బుద్ధవిగ్రహములు చెక్కఁబడి యున్నవి. తారాదేవియొక్క భూషణములు మిక్కిలి యందముగాఁ జేయఁబడియున్నవి.

## బుద్ధ విగ్రహము

ఈవిగ్రహము బుద్ధుడు గయనుండి సారనాథునకువచ్చి తన ప్రథమబోధ నొసర్చిన విధమును దెలియఁజేయునది యని విగ్రహమువడుగున (పీఠమున) గల ధర్మచక్రపాలనా[illegible]వల్లఁ దెలియుచున్నది. విగ్రహమున కిరు పార్శ్వముల యందును రెండు కురంగములు కలవు. చక్రమునకును రెండుప్రక్కలను కురంగములుకలవు. విగ్రహము శిథిలముకాక దొరకుట చిత్రము. శిరస్సునకు గల పరివేష చక్రమున నిద్దరుదేవతలు పుష్పములఁ జల్లుచుండునట్లు కలవు. ఇందుఁగల యలంకారచిత్రము (Design) చక్కఁగాఁ జెక్కఁబడియున్నది.

## అవలోకితేశ్వర విగ్రహము

తామరపుష్పముపై నిలుచుయుండు ఈవిగ్రహమునకు రెండుచేతులును విరిగియున్నవి. కిరీటమునందు ధ్యానిబుద్ధుని విగ్రహము కలదు. పుష్పపీఠము క్రింద నిద్దరుప్రేతలు ప్రార్థించుచున్నట్లు కలదు.

## బోధిసత్వ విగ్రహము

ఇందుకూడ కిరీటమున బుద్ధవిగ్రహము కలదు. హస్తము [illegible] యున్నది. క్రింద బోధిసత్త్వుని పూజించు స్త్రీ కలదు.



బుద్ధవిగ్రహము



అవలోకితేశ్వర విగ్రహము



బోధిసత్త్వ విగ్రహము



# ఋతులక్ష్మి

మిత్తింటి నరసింహమూర్తి గారు [కవితా నికేతనము]

(సంపుటము ౨. సంచిక ౫ తరువాయి)

నీనాథు గుప్పించు నీలాలు జార
శుక్తియు ముత్యాలు సొంపుగ జేయు
చంటిబిడ్డడు నింట సంతసమందు
క్రొత్తగా పెండ్లాడు కొమరిత లెంకో
మగనిపై భక్తిని మన్నించి మదిని
నీరూపు దలతురు నిశ్చలంబుగను
నిను జూచి పురిలోని నెచ్చెలు లెల్ల
సింగారముల దిద్ది సేవించు నిచ్చ
కన్నెలు వృద్ధలో పున్నెంపు స్త్రీలు
జవరాండ్రు బిడ్డల చంక బెట్టుకొని
ఇంటింట బోయి పేరంటముం గొండ్రు
వెనుక ముందర గట్టు వేణిలో పూలు
జంబెంపు వాటుగ సవరించి సిల్కు
పాల బుగ్గలతోడ పాపడు నగుచు
పాదంబులను సాచు పారాణి కొరకు
తమ తల్లి భూషల దామ ధరించి
సెనగల మూటల చేర్చి బట్టుచును
ముద్దుగ తమ తల్లి మ్రోల నడచుచు
హెచ్చరికను జూపు నింపుబిడ్డలును
గుంపుగనీవైపు గూడివత్తురు గదె
అందుల్లో వచ్చెడి అంద[illegible]
పుత్తడిబొమ్మ దా ముత్యాలకోవ.

పచ్చనిదేహంబు పరువైనరూపు
కుఱుచ విగ్రహ మెంతో బరువుగర్భమున
బంగారుపిచ్చుక భాతినిదోప
చిన్నివన్నెల చీర చెంగుచాటునను
చల్లని హృదయంబు చక్కగ నవ్వ
పారిజాతపుదంష పై హార మొప్ప
కంఠ కాసులపేరు కలువరింపంగ
పసుపునిగ్గులు దేరు పాదమ్ములకును
గోరింటరక్తిమ పారాణి వెట్టి
గల్లుగల్లని మ్రోగు కడియ మందెలను
మెత్తనిపదముల మెల్లగ నిడుచు
చిరునవ్వు మోమున చెంగలింపంగ
భావంబుహృదయాన పల్లవింపంగ
కాటుక కన్నుల కలయంగజూచి
కస్తూరితిలకంపు కమ్మనితావి
ఘ్రాణంబులకుమింత ప్రాణంబులీయ
కహ్లారహారతుల్ కరమునబట్టి
మోహినీదేవికి మోహంబుగలపి
సీతమ్మ కిసుమంత శీలంబు నేర్పి
రాధకు తనదైన రమ్యత దెలిపి
సిరులచే మించిన చిట్టిమాలక్ష్మి
సత్కులంబున బుట్టి సమ్మానమిమ్ము
చేరివచ్చుచునుండ చేతి నందిమ్ము.

గిరిరాజుబిడ్డలు గేరింతతోడ
నవయావనంబున నాథునిజేర
దేహ ముప్పొంగుచు తేజమ్ములూర
పుట్టినదాదిగ పోషించినట్టి
తండ్రిపాదము వీడి తరలెడువేళ
ఇసుమంతకన్నీరు ఇరుగెడ దోప
ఎట్టనై చూపులు నేరుల కొప్ప
తండ్రిగారింట రత్నా లాడిగట్టి
పందిళ్లపాన్పుపై ఫలవృక్షతతుల
దారిలో వనలక్ష్మి సారెలుబెట్టు
గందంపుమ్రాకులు చందన మలదు
ఫలియించి మారేడు పండ్ల నొసంగు
ఇరువంక వృక్షముల్ శిరములు వంచి
కుసుమపు వర్షముల్ గొల్లగ గుతియు
తామ్రపర్ణియొసంగె తరళముత్యములు
కావేరి కొనివచ్చె కలకంఠరవము
కృష్ణవేణియు దెచ్చె కెంపులు రవలు
కోనసీమనుగల కోవిదులెల్ల
వేద శాస్త్రమ్ముల వేదికనెక్కి
సామగానములతో స్వస్తులు చెప్ప
గోదావరీదేవి కేదారసీమ
చేయూత యొసగంగ చేరి నడచుచు
అత్తవారింటికి నరుగు పడుచని
పసుపు కుంకుమలిచ్చు పౌరాంగనాళి
బాల వృద్ధాదులు కట్టంగలేసి
సంతోషమున జేరి సాగిలి మ్రొక్క
ఈవంక ఆవంక కెంపుగ చూచు
పైబడి ప్రార్థించు పామరులకును
కలపచే గృహదానములను చేయుచును
ప్రక్కకుచేరియు పాదంబుగోలువ
పాదరజ మొసంగి భాగ్యమిచ్చుచును
వారి వారికి పుణ్య ఫలములకొలది
పంచిపెట్టుచు సారె బయలువెడలెను.
నీపాదములకు దా నెమ్మితో మ్రొక్క
ఈవంకకును వచ్చి యెఱగియున్నదదె
శిరమున చేయుంచి క్షేమంబుగోరి
పతియుఁదానును గొప్ప ప్రణయమొప్పంగ
సంసారసౌఖ్యంబు చక్కగ నొంద
ఆశీర్వదింపుము అక్షత లుంచి.

తొలికోడి కూయకే తొందరపడుచు
కాసారముల కేగి కమలమ్ము దెచ్చి
పాలవెల్లిని గట్టి మారేడుదూసి
విఘ్నేశు బూజించి వినయంబు దప్పి
పల్లేరు దారుల బాగుగ బోసి
సంసారులిండ్లను ధ్వంసంబుజేసి
లోకులు డట్టంగ లోమెచ్చికొంచు
కేరింతగొట్టుచు నూరిబాలకులు
కోలాట మాడుచు కొమ్మల నెక్కి
శ్రీకృష్ణుడేనంచు చెంగునదాటు
పచ్చాకుకట్టల బాలునిగొట్టు
తద్దులరోజుల ముద్దియ లాడ
తామును మేల్కాంచి తరుముచు వచ్చు
బలరాము డేనంచు పట్టులగాచు
చిలకలపై చేరి చెడుగుడులాడు
శోభనమ్ములు నీకు చోరుచుకరాను
ప్రాణేశు డేవేళ ప్రణయమ్ము గురియు
సంతసంబందని సత్వంబు గలదె?
ఆవంకగనుగొను మబల లందరును
దూరాన బిడ్డల ద్రోసిపుచ్చియును
నీరున్న చెలకలో దీరుగ నిలచి

వరియాకు కుదుళుల వంగుచు బెట్ట
చేనున్న గాజుల చిఱుత మ్రోతలకు
నలుగురికంతాలు కలియగజూచి
జిలిబిలిపాటల చేరి పాడంగ
మూన తిరుగకుండ మొలకలె త్తెడిని
దారిలో బాలుడు తాండవమాడు
మింటిలో పక్షులు మేలుగగూయు
పసిరిగ పశువులు బండువమేయు
దీర్ఘరోగియు నెంతో తేజంబుగాంచు
వరియును దేహంబు పల్మరుబెంచు
పట్టలేక తనువు పచ్చనై వెలయ
సిరులొప్పువయసున సిగ్గులు దోప
ఫలములభారాన తలవంచి నిలచె.

నీమేని చెమటలు నీలిమ దోచె
మేఘుండు డస్సియు మేలంబుమాని
తళుకు బెళుకులతోడి తారలగూడి
నిశినాథు డింతలో నింగిని మెరసె
పండువెన్నెలతోడ పక్కున నవ్వె
అది చూచి మేఘుండు అధరిపడుచును
వెలవెల బోవుచు వెనుకకు క్రుంగె
సిగ్గుచే ఋతులక్ష్మి శృంగారమొలచె
వరిలక్ష్మి ముగ్ధమై పరువుగలేచి
పొలమున నొకవంక పొందుగ నిలచె
నిర్మలంబైపాతా నీరమ్ములన్ని
ప్రజలకు పండువల్ ప్రబలంగ దొడగె
పితృదేవతలకెంతొ ప్రీతియు బుట్టె
గాంధర్వ లాలాపగానముల్ సేయ
ప్రమథాదిగణమెల్ల అంకెలు వేయ
నందీశ్వరుం డాడి నాట్యంబు జేసె.



## ఆమని

మోచర్ల రామకృష్ణయ్యగారు, బి. ఏ.

ఆనుపమోత్సాహలీల సుమాళివ్రాలి,
భవ్యమకరందపాన విభాసకేళిఁ
దేలి, మంజుల గానసుధాలహరిని
జిమ్ముమత్తమిళింద బృందమ్ము లహహా!
నునుజివుళ్లను మేసి మనోహరముగఁ
గూయుచున్నవి కోయిలల్ కొసరికొసరి;
శుకపికంబులొనర్చు విశుద్ధరవము
విందుగూర్చుచునున్నది వీనులకును
వివిధవర్ణ పర్ణాంబర విలసితాంగి
ప్రకృతికన్యాంగి, పమోద భరితయగుచు,
సురుచిరోత్ఫుల్లసుమకృతాభరణయగుచు
నాథుఁడగు మాధవునిమ్రోలనాట్యమాడు
నౌర! జగమెల్ల శోభామయంబుగాఁగ.
ఏది యెట్లున్న నేమి, యదృష్టహీను
లైనవారికిఁ బొసఁగునే! యాత్మ హితము
వరవసంతుఁడు వనమెల్ల వరలఁజేయ
పాప మాజాజిలీవ దౌర్భాగ్య మేమొ.
వృతుసంతతిమరియాద వీడి, దుర్మ
నోవ్యథనుగుండుఁ బుష్పింపనోచ కకట
యీశ్వరాజ్ఞ బలీయమై యొసఁగుఁ గాదె.




*మానవల్లి రామకృష్ణ కవి గారు, యం. ఏ.

ఆషాఢమాసపు భారతీసంచికలోఁ దుక్కాదేవి రచించెనన్న శ్లోకపంచకమును గూర్చివ్రాయుచు వానిలో రెండు వల్లభదేవుని సుభాషితావళిలో నుదాహరింపబడి యుండుటయు, నొక్కటి ముకుళభట్టుచే నభిధావృత్తిమాతృకయను గ్రంథములో నుదాహరింపఁబడియుండుటయుఁజూడ నాశ్లోకములు కృష్ణరాయలభార్యయగు తుక్కాదేవి రచియించి యుండుట సంభవింపదని వ్రాసియుంటిని. ముకుళభట్టు కాశ్మీర దేశమును క్రీ. శ. 850 కాలములోఁ బరిపాలించుచుండిన యవంతివర్మకాలములో శంకరావతారమని పొగడ్తగన్న భట్టకల్లటుని కుమారుఁడగుటచే నీపద్యములు క్రీ.శ. 1520 ప్రాంతములోనుండినకృష్ణరాయనిభార్య రచియించియుండుననుట పొలుగాదని నాయభిప్రాయమును నాధారముగాఁ నందుఁ జూపితిని. భట్టకల్లటుఁ డవంతివర్మకాలములో నుండెనని కల్హణుఁడు రాజతరంగిణిలోఁ జెప్పియున్నాఁడు. ఈతుక్కాపంచకముమీఁది నా విమర్శమును వేడుకగా నాక్షేపించుచు శ్రీ రంగస్వామిసరస్వతిగారు కార్తికమాసపు సంచికలోఁ బ్రత్యుత్తరమిచ్చిరి. అందుఁ గృష్ణరాయలు గజపతికూఁతుఁ బెండ్లాడెననుటయు, తుక్కా[illegible] నామమగుటచే గజపతికూఁతున కాపేరు వాడుకలో నుండవచ్చుననియు, నాశ్లోకపంచక మామె యితర కవుల చాటువులవలననో కావ్యములవలననో సేకరించియుండవచ్చుననియు, భట్టకల్లటునిగూర్చి కల్హణుని యభిప్రాయము విశ్వాసము కాదనియు, గజపతి పండితుఁడై పండితాదరము చూపినందున నతని కుమార్తెయు విదుషియై యుండనోపుననియు ఫలితార్థము తేల్చినట్లు తోఁచుచున్నది.

ఈయంశములలోఁ దుక్కాదేవి ప్రాచీనుల పద్యముల సేకరించెనని వారంగీకరించు నప్పుడు మాయభిప్రాయము గతార్థమయ్యె. ఆమె కవయిత్రి యని పెక్కండ్రు చరిత్రములలో వ్రాయుట కీ శ్లోకపంచకమే కారణము కాని పక్షమున ఆమెకవనధోరణి విని యానతిఁ గీర్తింప మాకును కుతూహలము కలదు. కేవలమును బూర్వకవిపద్యములఁ గృష్ణరాయలకు నవదేశభంగిగాఁ దుక్కాదేవి పంపియుండిన యెడలఁ గృష్ణరాయఁడు ప్రియురాలిసమయోపస్థితికి మెచ్చుకొని తుక్కా వైదుష్యమునకైనను దానితో సాంగత్యము గోరఁగల సామాన్యరసికుఁడు కావలయును. అట్లు కాకున్న సంస్కృతవాఙ్మయమున కేవలము పరిశ్రమపాటవములేక తత్కృతములుగానే భవించి

యామెను జేపట్టి యుండవచ్చును. ఎట్లైనను తుక్కాదేవికిఁ గవనశక్తి గలదా యను సంశము సందిగ్ధమే.

ఈసందర్భములో ముకుళభట్టు తండ్రి యగు భట్టకల్లటునిగూర్చి కల్హణుఁడు వ్రాసిన కాలము నమ్మఁదగినదికాదని శ్రీ సరస్వతి గారు వ్రాసినవ్రాఁతను బరిశోధింతము. కల్హణుఁడు తనకుఁ జాలఁ బూర్వకాలమువారి చరిత్రములు వ్రాయుటలోఁ బొరఁబడియుండవచ్చును. తనకంటెను మూఁడు శతాబ్దులకుఁ బూర్వమేయుండిన కల్లటుని విషయములో కల్హణుని కాలనిర్ణయము ప్రమాదదుష్టమని నేను సాహసించి చెప్పఁజాలను. కల్హణుని ప్రామాణ్య[illegible]మటఁ గలయునిండు. 1180 క్రీ. శ. లోనుండిన కల్హణునికంటెను భట్టకల్లటుఁడు తరువాతివాఁడగునా? కృష్ణరాయలు క్రీ. శ. 1509 లో నుండినవాఁడు. తుక్కాదేవి కంటెను కల్లటునిఁ జేర్కొనిన కల్హణుఁడు 350 సంవత్సరములు పూర్వుఁడని శ్రీ సరస్వతిగారే యంగీకరించి తీరవలయును. ఈ యంశము స్పష్టముగాఁ జెప్పక "పేరుగన్న కృష్ణరాయలకు భార్యయైన తుక్కాదేవి ఈ యైదు శ్లోకములు సేకరించి యుండదనుట యెంతసాహసము" అని వ్రాసిరి. సేకరించుట కంతటి గజపతికూఁతురును నాంధ్రభోజుని భార్యయుఁ గావలసిన యావశ్యము లేదు. సామాన్య స్త్రీయును జేయఁగలదు. సేకరించు పని యామెచేతఁగాదని యెవరు సాహసించి చెప్పెం? అట్లు చెప్పినవారిపై శ్రీ సరస్వతి గారికిఁ గోపము తప్పక రావలసినదే.

ముకుళభట్టు ప్రాచీనుఁడని వారు స్పష్టముగా నంగీకరింపనందున నేను మరలఁ గొన్ని యాధారములఁ జూపఁదలఁచినాఁడను.

(1) భట్టకల్లటుఁడును, కల్హణుఁడును తుక్కాదేవికిఁ దరువాతివారనియే క్షణకాల మంగీకరింతము. ముకుళభట్టు భట్టోద్భటుని కావ్యాలంకారసంగ్రహమునకు వ్యాఖ్య రచించె. దానిలోని పంక్తులను గుంతలకుఁడు వక్రోక్తిజీవితములోఁ దృతీయోన్మేషమున ఖండించెను. కుంతలకుఁడు లోచనవ్యాఖ్యాత యగు నభినవగుప్తునికంటెఁ బూర్వుఁడని యతని నాట్యశాస్త్రవ్యాఖ్యానమువలన స్పష్టమయ్యె.

(2) ముకుళభట్టుశిష్యుఁడు ప్రతీహారేందురాజు కొంకణదేశస్థుఁడు. క్రీ. శ. సుమారు 930 లో నుండినవాఁడు. గురుప్రశంసను తన యుద్భటాలంకారవ్యాఖ్యలో విస్తరించెను.

(3) ముకుళభట్టు కుమారుఁడు హర్షటుఁడు జయదేవచ్ఛందమునకు వ్యాఖ్య గూర్చెను. దాని నభినవగుప్తుఁడు తన నాట్యశాస్త్రవ్యాఖ్యలోఁ జేర్కొనియె. అభినవగుప్తుని గ్రంథములన్నియు క్రీ. శ. 1030 లోఁగా విరచింపఁబడియె.

(4) కావ్యాలంకారసూత్రములు వామనాచార్యుఁడు రచించి చనిపోఁగా నందుఁ గొన్నిభాగములు చెదపట్టఁగా ముకుళభట్టు దానిఁ దెప్పించి పూరించెనని తెలియుచున్నది. అభినవగుప్తాదులు వామనునిఁ బూర్వునిఁగాఁ బ్రశంసించి యున్నారు. వామనాలంకారవ్యాఖ్యాతలలో నతిప్రాచీనుఁడగు సహదేవుఁడు

## కుమారస్వామి



ఆదిత్యనిభుఁడు విపుల, ద్వాదశ బాహుండు షడ్వదనుఁ డఖిలదిశా
కోదంతరంబు వెలుఁగ మ, హోదారుండై కుమారుఁ డుదయం బయ్యెన్.

— శ్రీమదాంధ్రమహాభారతము.

తద్గ్రంథమునకు ముకుళభట్టసంబంధ మిట్లు వివరించుచున్నాఁడు.

వేదితా సర్వశాస్త్రాణాం భట్టోభూఽన్ముకుళాభిధః
లబ్ధ్వా కుకళ్చిదాదర్శం భ్రష్టామ్నాయం సముద్ధృతమ్.
కావ్యాలంకారశాస్త్రం యత్తేనైత ద్వామనోదితమ్

'వామనభట్టు రాష్ట్రకూట' జగత్తుంగుని సభ దర్శించినట్లు తోఁచుచున్నది. ముకుళభట్టును నతనికి సమీపకాలమువాఁడే.

(5) క్రీ. శ. 1100 కాలములో నుండిన మమ్మటుడు శబ్దవ్యాపారవిచార మను గ్రంథమున ముకుళుని యభిధావృత్తి మాతృకలో నీక్రిందిశ్లోకము నుదాహరించెను.

"వక్తుర్వాక్యస్య వాచ్యస్య రూపభేదా ద్విభిద్యతే."
అభి-6.

(6) క్రీ. శ. 1180 ప్రాంతములోనుండిన హేమచంద్రాచార్యుఁడు కావ్యానుశాసన వ్యాఖ్యానమున

"అస్మాభిరితిః నచ భట్టముకుళాదిభిః, తైర్హి రూఢిమపి ప్రయోజనతయా ఉపన్యస్య లక్షణతయా ప్రవర్తితా। యదాహుః 'రూఢేః ప్రయోజనాద్వాపి వ్యవహారోఽనలోక్యతే' (ఇతి కావ్యాను-పుట 25)

అనెను. ఈ శ్లోకార్థ మభిధావృత్తిమాతృకలోనే (12 శ్లో) యుండుటగాక దీని కుపస్తంభముగానే తుక్కాపంచకములోని శ్లోక ముదాహరింపఁబడియె.

(7) కావ్యప్రకాశవ్యాఖ్యాతయగు మాణిక్యచంద్రుఁడు (క్రీ. శ. 1200 కాలము వాఁడు) ముకుళభట్టును ఖండించె.

(8) విద్యారణ్యులవారి భ్రాతయగు భోగనాథుఁడు రచించిన కావ్యాలంకారసుధానిధి యను మహాగ్రంథమున ముకుళభట్టు రచించిన యభిధామాతృకలోనిశ్లోకముఖండింపఁబడియె. భోగనాథుఁడు క్రీ. శ. 1380 కాలమువాఁడు. కల్హణునికల్లటుఁ డేకాలమువాఁడైనను ముకుళునిఁ బేర్కొన్న వీరందఱును కృష్ణరాయనికిఁజాలఁ బూర్వులు. కావునఁదుక్కా కర్తృత్వము శ్లోకములకుఁ బొందుపడదుగదా!

ఇఁక గజపతికూఁతుపేరు తుక్కాయని యెట్లు సిద్ధాంతమయ్యె? కృష్ణరాయలు గజపతి నోడించి యతనికుమారితెఁ బెండ్లియాడుట నిశ్చయమేకాని యామెపేరు తుక్కాదేవి యనుట కాధారమేమి? వా రుదాహరించిన,

"ప్రతాపరుద్రస్య గజేశ్వరస్య
పుత్రీం పవిత్రీకృత భూతధాత్రీమ్;
ప్రత్యగ్రహీ ద్యః ప్రకటప్రతాపో
భద్రాం సుభద్రా మివ పాండవేయః."

అను శ్లోకమువలననే గజపతికూఁతురు "తుక్కా" కాదనియు భద్రాదేవియో లేక సుభద్రాదేవియో యని యేర్పడును. కళింగ రాజులకుఁ గులదైవములు జగన్నాథములోని కృష్ణుఁడును, సుభద్రాదేవియుఁ గావున వారి బిడ్డలకు సుభద్రయని నామముంచుట యాశ్చర్యముకాదు. సరియైన యన్వయమును వదలి పేరు చెప్పక కవిపద్యము వ్రాసె ననుట యంత సమంజసముకాదు. ఒకవేళ తుక్కానామము సుభద్రకు దాదులో విదూషకులో పెట్టియుందురేమో! గజపతిపాండిత్యపరాక్రమములును, కృష్ణరాయని యాంధ్రభోజత్వమును మన మెంత మెచ్చుకొన్నను తుక్కాదేవి యొకతె యుండి యామె కృష్ణరాయల పత్నియై యీ

శ్లోకపంచకముగాక వేఱుపద్యములు రచించి యుండునేని యామెకీర్తి కొనియాడఁదగినదే. అట్టిరసికురాలి కవితాసౌభాగ్యము లనుభవింపక కేవలము మాటవాసికి నిలిచెనన్న కృష్ణరాయఁడు వ్యర్థుఁడనియే నిందింపవచ్చునుగాని యట్టిస్థితి నిరూపింపఁబడ లేదు.

గతానుగతికముగా సందిగ్ధాంశములను గూడ సత్యోత్తరములుగా (?) నితరులు వ్రాయుచుండుటవలనఁ దుక్కాకథామూలమును శోధింపవలసివచ్చెను గాని శ్రీసరస్వతి గారికిఁ బ్రామాణ్యభంగారోపణము చేయుట మామతముకాదు. వారి వ్రాతనాధారముగాఁ గొని యితరులు పరంపరగా వ్రాయుటచే నింత చర్చింపవలసివచ్చెను. ఇట్లే కవి చరిత్రకారులవ్రాత లాధారములుగా నెన్ని క్రొత్త క్రొత్త దొంతులు నిరాధారములయ్యును భావనాగగనాంగణమున గంధర్వనగరజ్యోతుల వెదచల్లుచున్నవి!



# శతపత్త్రము

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి గారు

(సంపుటము ౨, సంచిక 3 తరువాయి)

వెడమొగ మదేల? ననుఁజూచి పెట్టుకొందు
వెవ్వరేఁ గొండెములఁ జెప్పిరే? సఖుండ!
ఇంతదాఁకఁగదా మన మెన్నియెన్నొ
ముచ్చటలు సెప్పుకొంటిమి, పువ్వుఁదోఁటఁ,
బాదరుటిండుల, సైకత భూములందు
వెన్నెలబయళ్ల వాహ్యాళి వెడలి మధుర
గానములు పాడుకొంటిమిగాదె కలిసి
యేను నిన్నెడఁబాసి పోయినది యొక్క
గడియ క్రిందట నీలోపుగా నకార
ణముగ నీ కెట్లు గలిగెను విముఖవృత్తి?

నాదు దీపంబు తైలశూన్యమని కాని
కాల, పరిమితి యింతని కాని తెలియ
దాని నిర్వాణకాలంబు దగ్గఱించి
నట్టులున్నది మిను మిన్కులాడుచుండె
నేను నెమ్మదిఁ జేయంగఁ బూనియున్న
కార్యములఁ జేయలేద యొక్కండునేని
నిలిపియుంటిని సోమరివలెఁ బరుండి
ముందు నాగతి యేమొ! తెల్పుము సఖుండ!
అలలు కాలసర్పము పడగల విభాతిఁ
బైకి నాల్కలు గ్రోయుచు వచ్చుచుండె

యమునిసైనికసందోహమునఁ దిమింగి
లాది జంతువుల్ తట్టుముట్టాడుచుండె
మృత్యుదేవతాయత్త, గళచ్ఛిద్రము లన
నెసఁగు నావర్తములు వివరించియుండె
జవ్వనను బలివేయు కసాయియొకఁడు
వాఁడికత్తితోఁ బైనుండి వచ్చుచుండె
ఓయి! యమృతశకుంతమా! యొక్కమారు
వెలయు నపరంజిరెక్కలు విప్పి వచ్చి
పైని వ్రాలి నీకాళులలోన నన్ను
గ్రుచ్చికొనిపోయి కాపాడఁ గోరినాఁడ
పవలు రేయును నా కెండవాన లనక
కష్టములను భావించి నాయిష్టములుగ
కృషిని సలిపితి మావిడివిత్తు విత్తి
ఆరసాలదేవతకు నేనన్వహంబు
జీవితంబు నైవేద్యంబుఁ జేసినాఁడ
నద్ది పెరిగెను నవనవ లాడుచుండె
నెపుడు ఫలియించునాయని యెడఁద యూట
లూరుచుండ నయ్యెను వసంతోదయంబు
చెట్టుపూచి కన్పండువు సేయుచుండె
రేపకడఁ జూచినాఁడ నాపాపమేమొ!
ముసిఁడిపండులతో నిండి పొలిచెఁ జెట్టు
నేమి వచియింతు నా దురదృష్టరీతి.

కన్ను తెలిదమ్ములును మనఃకైరవంబు
నడుగుఁదామరదోయియు హస్తకోక
నదము లివ్వన్ని గలిపి దండగను గ్రుచ్చి
తండ్రి! నీకు సమర్పింపఁ దలఁచినాఁడ
నాదు పిల్లనగ్రోవి, చే నూఁది దేవ!
తావకాలయమంటపస్తంభములను
జిగురు వెట్టంగ నొనరించి శీతలమయ
కాయమానంబు నిర్మింతుఁ గాంతుఁదీఱ.

అలరు శంపాలతాప్రగ్రహములు గలుగు
వారివాహాశ్వములఁ గట్టఁబడిన పుష్ప
రథముపై నెక్కి యూరేగు రమ్యమూర్తి
దివ్యతేజస్విఁ గనుగొంటిఁ దృప్తిఁగంటి

అల నదీసైకతములకు నరిగి యచటఁ
దనకటాక్ష విచిత్రశీతలతరంగ
ములను బ్రకటించు నాకృపాపూర్ణవార్ధిఁ
గనులపండువుగా నేడు గాంచినాఁడ
కోకిలాధ్వని శ్రుతిసేసికొని వసంత
రాగగీతంబుఁ బాడి భూరుహములెల్లఁ
జిగురువుట్టంగఁ జేయుచుఁ జిత్తములను
బరవశము సేయు గాయకవరునిఁ గంటి.






[The sapota or sapodilla—Achras sapota]

"కృషీవలుడు"

ఉత్తమ ఫలజాతులలో సపోటాచెట్టొకటి పేర్కొనదగినది. మన దేశమున నిటీవల ప్రవేశపెట్టబడిన ఫల జాతులలో నిది యొకటి. బంగాళా రాజధానిలో నీ తోటలు విస్తారముగ గలవు. కలకత్తాప్రాంతమునుండి కాబోలు మొదట విశాఖపట్టణపు జిల్లాలోనికి తీసికొనిరాబడి ఇపు డాజిల్లాయందే కాక దాని కిరుప్రక్కలనున్న గంజాం గోదావరిజిల్లాలలో గూడ నీతోటలు పెంచబడుచున్నవి. తక్కిన తెలుగుజిల్లాలలోగాని, దక్షిణదేశమున గాని యీఫలవృక్ష మంతగా గానరాదు.

సపోటాచెట్టు సామాన్యముగ అంటు మామిడిచెట్టంత పెద్దదిగను ఎదుగును. కొంచె మించుమించు పగడచెట్టును బోలి యుండును. [1 వ పటముచూడుడు]. దానివలెనే యిదియు నేకాలమునగాని ఆకులన్నియు రాల్చివేయక పచ్చగ నుండును. ఈచెట్టు కొంచె మించు మించు సంవత్సరమంతయు పూయును. కాని వర్షాకాలాంతమున మెండుగపూయును. పూవు పగడపూవునుబోలియే యుండునుకాని దాని పరిమళమునకు బదులు ఇందొక విధమగు దుర్వాసన గలదు. కాయ గుండ్రముగ గాని అండాకారముగ గాని యుండును. రెండవపటమున నాల్గురకముల సపోటాకాయలు చూపబడెను. అందు మొదటిది మిక్కిలి పెద్దదిగ నెదుగు గుండ్రరకము. ఈరకపు కాయ లొక్కొకటి 10-20 తులములవరకు తూగును. నాల్గవది గుండ్రని చిన్నకాయల రకము. ఈ కాయలు 6-12 తులముల వరకు తూగును. రెండవది కోలగానుండు పెద్దకాయల రకము. ఈరకపు కాయలును 6-12 తులములుతూగును. మూడవది అన్నిటిలోను చిన్నరకము. కాయ కోలగనుండును. గుత్తులలో తక్కిన రకములందుకంటె హెచ్చుకాయ లుండును. ఈరకపుకాయలు 3-8 తులముల వరకు తూగును. సామాన్యముగ 1, 4 రకములకంటె, 2, 3 రకములు కాపునందును, పండ్ల రుచి యందునుగూడ శ్రేష్ఠములు.

సపోటాకాయ పచ్చిగ నున్నప్పుడును పండినపుడునుగూడ పైని గోధుమ వర్ణము గలిగియుండును. కాని పండినపుడు పైని నును పెక్కును. పచ్చికాయను గోటితో గోకినయెడల నడుమున ఆకుపచ్చగ నుండును. పండబారినకాయ నట్లు గోకినయెడల కొంచెము పసుపుపచ్చగ నుండును. ఇదియే కాయ కోతకు సిద్ధమయినదా లేదా యని నిర్ణయించు విధము.



1-వ పటము

పలుచగనుండు పైతొక్కను తీసివేసిన యెడల లోపలి గుంజు కొంచె మెరుపుతో గూడిన పసిమివర్ణము గలిగి ఉండును. దీని నడుమ సీతాఫలపుగింజలవంటి నల్లనిగింజలు ఒకటిరెం డుండును.

సపోటాచెట్టు సమప్రదేశములం దంతటను సులభముగ పెరుగును. బంగాళా రాజధానిలోను, ఉత్తరాంధ్రదేశముననేకాక ఈ చెట్లు చెన్నపురిలోను[1], కోయంబత్తూరులోను[2], పశ్చిమ తీరమునను[3], బొంబాయి

౧. తేనాంపేటలోని వ్యవసాయకోద్యానవనమునం దొక పెద్దచెట్టు గలదు. అడయారులో నొకతోటగలదు.

౨. వ్యవసాయకళాశాలతోటలో కొన్ని చెట్లుగలవు.

౩. గోవా ప్రాంతములందు కొన్ని తోటలు గలవట.

ప్రాంతములందును పెరిగి కాయుచున్నవి. కాని సముద్ర ప్రాంతములందు లోపలిభాగమునందు



2-వ పటము

కంటె బాగుగ కాయునని కొందరి యభిప్రాయము. ఈవిషయ మింకను బాగుగ ధింపవలసియున్నది.

సపోటాచెట్లు గరపనేలలందు బాగుగ పెరుగుచున్నవి. గింజలనునాటిసపోటామొక్కలను బెంచవచ్చును. కాని యిట్లు పెంచిన మొక్కలు నెమ్మదిగ నెదుగును. అంత బలిష్ఠముగ నుండవు. కావున. బలిష్ఠముగ నెదుగు పాల మొక్కలకు గాని, ఇప్పమొక్కలకు గాని సపోటాకొమ్మలను అంటుగట్టి (మామిడిఅంట్లవలెనే) ఆయంట్లను నాటుట మంచిది. 3వ పటమున ఎడమచేతివైపున నొకపాలమొక్కయు కుడిచేతివైపున నాటుటకు సిద్ధముగ నున్న అంటొకటియు చూపబడెను.



3-వ పటము

సపోటాఅంట్లను నాటుటకు తొలకరియు శీతకాలమును అనుకూలములు. ఇవక చేయు నేలలలో శీతకాలమునను, చేయని నేలలలో తొలకరిలోను నాటవచ్చును. సపోటాఅంట్లను మామిడియంట్లవలెనే 12 గజముల కొక్కొకటిచొప్పున నాటవచ్చును. చతురముగ నీ దూరమున నాటినయెడల ఎకరమునకు 33 మొక్కలు పట్టును. అదేదూరమున ముగ్గండిగ నాటినయెడల 39 మొక్కలు పట్టును. బాగుగ దున్నిననేలలో సుమారు 1 గజము వెడల్పును లోతునుగల గోతులనుదీసి బాగుగ

నారనిచ్చి మంచి మంటినిపోసి మొక్కలను నాటవలెను. బాగుగచీకిన పశువులయెరువును 1, 2 తట్టలు గోతిలోపోసి పైమంటితో కలుపవచ్చును.

తొలకరిలో రెండుమూడుసార్లును, శీతకట్టు 3, 4 సార్లును, మొక్కలమధ్య దున్నుటయు, అప్పుడప్పుడు పదునుకనిపెట్టి మొక్కలకు నీరుపోయుటయు వాని మొదట గొప్పత్రవ్వుటయు, గడ్డిగాదములను తీసివేసి శుభ్రముగ నుంచుటయు దప్ప వీనికి చేయవలసిన యితరపను లంతగా లేవు.

సామాన్యముగ సపోటాచెట్లెరువు వేయకయే బాగుగ కాయుచుండును. కాని తగిన యెరువు వేసిన కాపు విస్తరించుననుటకు సందేహములేదు. సామాన్యముగ పశువులయెరువు లాభకరముగ నుండును. ఇతర యెరువు లేవేవి లాభకరముగ నుండునో యింకను పరీక్షింపవలసియున్నది.

లేతమొక్కలకేకాక కాపుపట్టిన పెద్దమొక్కలకుగూడ వేసవికాలమున నీరుకట్టుట మంచిది. ఇట్లు చేసినయెడల పిందెలురాలిపోక నిలుచుటయే కాక, కాయలు పెద్దవిగ నెదుగును. సామాన్యముగ నెల కొకతడిచొప్పున మొత్తముమీద 4, 5 సార్లు తడుపుట చాలును.

సపోటాచెట్లకు తెగుళ్లుగాని చీడలుగాని అంతగా పట్టవు. కావున నీచెట్లు మామిడిచెట్లకంటె నమ్మకముగ కాయును. కాని, తోటలలో నేకారణముననో కాని కొన్నిచెట్లు బొత్తిగా కాయక గొడ్డుపోవుట గలదు. బాగుగ పూచియు పిందెలు కట్టవు. గర్భోత్పాదనమున లోపమేమైన గలదేమో కనుగొనవలసి యున్నది. బాగుగ కాయుచెట్ల కొమ్మలంటే అంట్లుకట్టునెడల నాయంట్లు బాగుగకాయుననిచాల మంది యభిప్రాయము.

సపోటాపండ్లు కొంచె మించుమించుసంవత్సరము పొడవునను లభించును; కాని వేసవిలో నివి మెండుగ దొరకును. 6 సంవత్సరముల వయసుగలచెట్టు సంవత్సరమునకు 3-6 రూపాయలవరకు ఆదాయమునిచ్చును. లేకరి 7 సంవత్సరములవయసుగల చెట్లనుండి 14,15 రూపాయలచొప్పున దీయగలిగెను. 10 సంవత్సరములపిమ్మట చెట్టు 1-కి 10-25 రూపాయలు రావచ్చును. 15-20 సంవత్సరముల వయసుగలచెట్లు ఒక్కొక్కటి 50-60 రూపాయలపండ్ల నిచ్చుట గలదు.

సపోటాపండు కొందరు వెర్రితీపి గలదని యన్నను చాలమంది రుచికరమును ఆరోగ్యకరమునునగు ఫలముగ నెంచుచున్నారు. పరిమాణమునుబట్టి చూచినయెడల నీపండునకు వచ్చువెల సామాన్యముగ నేయితరఫలమునకు వచ్చుటలేదని చెప్పవచ్చును.

సపోటాపండ్లిపుడు గోదావరిజిల్లానుండి, కృష్ణాజిల్లాకును, బొంబాయికిని ఎగుమతి యగుచున్నవి.



# ధన్యుఁడు

వేమూరి సీతా రామయ్య గారు

కలనయినం బరాంగనలఁ గన్గొన నొల్లమి ప్రాణమానముల్
దలఁగిన మాటదప్పమి కృతంబు మొఱంగమి కల్మిలేములన్
గలఁగమి, నొచ్చియున్ బరులఁగాఱియవెట్టమి సర్వసామ్యపుం
గలిమి యొసంగునట్టి గుణగణ్యుఁడు ధన్యుఁడు నోజగమ్మునన్.

తనకులభించుపాటి ధనధాన్యములం బరితృప్తినొంది, య
న్యునకు శరీరమమ్ముకొన, కోపినయంత పరోపకారమున్
బూనరుచు, చెల్లవేళల "విభో! కరుణామయి దేహి పాహిమా"
మనుచుఁ జరించునాతఁడు కృతార్థుఁడుగా వివరించిచూడఁగన్.

నిలిచినఁ గూరుచున్న శయనించిన మేల్కనినన్, వయస్యులన్
గలసి ప్రసంగముల్ సలిపినన్, విహరించిన; వేనిచిత్తమున్
వలఁగవు శ్రీమహేశు చరణంబులు, దూరవుస్త్రీధనాదికం
బులగు మహోగ్ర దుర్విషయముల్ కృతకృత్యుఁ డతండు భూస్థలిన్.

తన జనియించు దేశము, మతంబు, గులంబును, వేనిపుణ్య న
ర్తనమున నొందె, నొందె మహితంబగు పాండితి, నొందె నొందు మే
ల్గానములమేటి సద్యశము కొల్లగొనున్, గనఁగా జగద్విల
క్షణగుణ శోభితుం డతఁ డొకండ కృతార్థుఁడు చూడ నిమ్మహిన్.

పరధనముల్ విషంబుగ నెవండు గణించునొ, వేనిగేహమున్
దఱిసి యాచకాళి వితథస్పృహమై మగుడంగఁబోవదో
యొఱుఁగఁడొ వేఁడు పాతకప్రవృత్తి నెవండు స్వసంస్తుతిన్ మదిన్
మురియఁడొ, యాతఁడే సుకృతి, పుట్టఁగ గిట్టఁగ నేమి తక్కొరుల్.






## ౧. కీటకభక్షకము లగు చెట్లు

చెట్లు మాంసమును భక్షించునని చెప్పిన అబద్ధముగా దోచును. కట్టుకథవలె గాన్పించును. అతి సున్నితములును, లలితములును నైన ఆకులతో నొప్పారు చెట్లెక్కడ? మాంసము తినుటెక్కడ? నమ్మదగిన విషయముగాదు; ఇదియంతయు ప్రకృతిశాస్త్రవేత్తల కల్పన అని తోచును. కాని దేవునిలీల ఊహాతీత మైనది. సృష్టివైచిత్ర్యము లనంతములు. మనము నమ్మినను నమ్మకపోయినను కీటకములను తిన నలవాటుపడిన చెట్లు తినుట మానవుగదా? ఇట్టిచెట్లు కీటకాహారము దొరకకపోయిన ఏపుగా పెరుగవు. ఈకీటకములను పట్టుకొని జీర్ణముచేసికొనుట కనువగు సదుపాయము లాచెట్లయందే యమరియుండును. ఈ రకపుచెట్లనేకము లనేకజాతులలోఁ జేరినవి కలవు. వానిలో ముఖ్యమైనవి కొన్ని ఇందు వివరించెదను.



కోశవృక్షము

### కోశవృక్షము (Pitcher plant or Nepenthes)

ఇదిఒక చిన్నచెట్టు. దీని ఆకు కీటకములను పట్టుకొనుటకు వీలుగానుండునటు చేయబడియున్నది. ప్రతిఆకును మూడుభాగములుగా విభాగింపవచ్చును. మొదటిభాగము కాడతోకూడిన సాధారణపుటాకు. ఈయాకు కొన రానురాను సన్ననై తీగెవలె మారును. ఇదియే రెండవభాగము. ఈతీగెచివర నుండు మూతతో కూడిన సంచి వ్రేలాడుచుండును. ఇదియే మూడవభాగము. కీటకములను పట్టుట కుపయోగించున దీమూడవభాగమే. ఈ సంచిలో నెల్లప్పుడును సగమువరకు నీరుండును. పురుగులు చిక్కిన సమయమందు తప్ప తక్కిన సమయములలో సంచి తెరచియుండును. ఈగలు, దోమలు మొదలగునవి జలమున కాశించి యాసంచిలో దూరును. వెంటనే సమయమునకై పొంచున్నట్లు సంచిమూత పడిపోవును.

ఊపిరి యాడక లోపలి ఈగ కొంతసేపు బయటకు రా ప్రయత్నించును. కాని ఫలముండదు; నీటియందుపడి చచ్చిపోవును. ఈలోపల లోపలి భాగమునుండి అన్నరసము (Gastric juice) వంటి ద్రావకము స్రవించును. ఆద్రావకములో చచ్చిన కీటకము కరగిపోయి చెట్టుయొక్క అన్నిభాగములకు బోవును. ఇట్లీ చెట్టు కీటకమును జీర్ణించుకొనగానే మరల మూత తెరచుకొని ఇంకొకసారి ఎరను పట్టుటకు సిద్ధముగా నుండును. ఈ ప్రకారము ఈ చెట్టు ఆకులచివర నేర్పడిన సంచుల మూలమున మాంసాహారము భక్షించుచున్నది.

### సన్‌డ్యూ (Sun dew)

ఇది తేమనేలను పెరుగు చిన్న చెట్టు. ఇతరచెట్లవలె దీనికి వేళ్లమూలమున ఆహారము భూమినుండి రాదు. కాని కీటకములను పట్టి సంపాదించు ఆహారము ఈ లోపమును తీర్చుచున్నది. పైన చెప్పిన చెట్టువలెనే ఇచ్చట కూడ ఆకులే పురుగుల్లను పట్టుట కుపయోగించుచున్నవి. కాని ఆకులరూపును, పురుగులనుపట్టువిధమును వేరు. ఇచ్చట ప్రతిఆకును కేసరములు గలిగి గుండ్రముగానుండును. ఈ కేసరములు ఆకుమధ్య పొట్టిగానుండి చివరకు రానురాను పొడుగగును. ఆకుచివరనుండునవి ఆకుపచ్చవర్ణమున నుండును. అనేక జీవకణములు(Cells)కలిసి ఒక్క కేసర మగును. అది రంగుగలిగిన రసముతో నిండియుండును. ప్రతి కేసరముయొక్క చివరభాగము కొంచెములావుగానుండును. దీనినుండి జిగురుగా నుండురసము స్రవించును. బుద్ధిపూర్వకముగానేమి, విధివశమున నేమి పురుగులు ఈ కేసరములమీద వ్రాలినప్పుడు జిగురుపదార్థము మూలమున వాటి కంటికొనిపోవును. తప్పించుకొనుటకు వీలుండదు. వెంటనే ఒకవిధమగు నరముల ద్వారా ఈసంగతి క్రమముగా అంచులనున్న కేసరములకు తెలియును. ముందు ఆపురుగు ప్రక్కనున్న కేసరములు దానిమీదవంగును. తరువాత నెమ్మదిగా వీటిప్రక్కనున్నవి వంగును. ఇట్లే ఒకటితరువాత నొకటివంగి యాపురుగు చుట్టుముట్టి కదలకుండ జేయును. ఇట్లీకేసరములన్నియు పూర్తిగా వంగి కీటకమును పూర్తిగా కమ్మివేయుటకు నాలుగైదు గంటలు పట్టును. ఇంతకంటె తక్కువకాలము కాని ఎక్కువకాలముకాని పట్టవచ్చును. ఇది ఆకుయొక్క వయస్సునుబట్టియు, చిక్కిన పదార్థమునుబట్టియు, సమయమునుబట్టియు నుండు


సన్‌డ్యూ


సన్‌డ్యూయొక్క ఆకు

ను. చిక్కిన కీటకములో చెట్టు కెక్కువబలము నిచ్చుపదార్థమున్నను, అది బ్రతికియున్నదైనను కేసరములు మూసికొనుటకు తక్కువ కాలము పట్టును. పండిపోయిన కేసరములు బలహీనములుగా నుండును గాన సహజముగా వాటికి ఎక్కువకాలముపట్టును. ఏదైనఆహారమునుఆకుమీద వెంటవెంటనేయుంచి కేసరములకు వెంటవెంటనే పనిగల్పించిన నని ఒకసారి కంటెనింకొకసారి త్వరితముగామూసికొనును. ఒక్కొక్కఆకు దినమునకు పదమూడు పదునాలుగుపురుగులను ముఖ్యముగా ఈగలను పట్టగలశక్తిగలదిగా నుండును. ఒక్కొక్కప్పుడు కనుదురిగవంటి పెద్దపురుగులను గూడ పట్టును. ఇక ఇట్లు పట్టినకీటకమును జీర్ణించుకొనుటకువీలగునాహారముగా జేయవలయును. విశ్రాంతిగానుండు సమయమున ప్రతిఆకుమీదను ఒకవిధమగు రసముండును. దీనికి ద్రావకలక్షణమెక్కడను కనబడదు. కేసరములు వంగినకొలదిని ఆరసమునకు ద్రావక లక్షణములధికమగుచువచ్చి వంగుట పూర్తియగు నప్పటికి నది పూర్తిగా ద్రావకమగును. ఈ ద్రావకము ఏపదార్థమునైనను చెడిపోకుండ నుంచుగుణముకలది. ఇది కీటకమును కరగించి అన్నిభాగములకును పంపుట కనువగునట్లు చేయును. ఈ ప్రకార మీచెట్టు వలసిన మాంసాహారమును పొందుచున్నది.

మోహినీమక్షికజాలవృక్షము (Venus fly trap)

ఈచెట్టుఆకునకు మూసికొనుచు తెరుచుకొనుచునుండు శక్తిఉన్నందువల్ల అది తనకు వలయు కీటకములపట్టి భక్షింపగలుగుచున్నది.



మోహినీ మక్షికజాలవృక్షము

ముళ్లు ఆకు నడల్పయినకాడ

దీనిఆకుతొడిమె మిగుల వెడల్పుగానుండి చూచువారల కాకువలెగాన్పించును. తొడిమెచివర మూసికొనిపోవుటకు తెరుచుకొనుటకు వీలుగానుండు రెండుభాగములు గలిగిన యాకు గలదు. ప్రతిఆకునకును పళ్లవలెనుండు అంచు కలదు. ఆకునడుమ రెండువైపులను జ్ఞానగ్రాహకములైన మూడేసిముండ్లుండును. వాటిలో దేనినైన ఏపురుగైనను తాకినట్లైన సద్యోలోని కేసరములవలెగాక ఆకుయొక్క రెండు భాగములు వెంటనే మూసికొని పోవును. అచ్చట వ్రాలినపురుగు పైకితప్పించుకొని పోకుండ జిగురు పట్టియుంచును గాన జాగుచేయుటకువీలున్నది. కాని యిచ్చటనన్నను జిగురు లేనందున అట్లుచేయుటకు వీలులేదు. ఇట్లు మూసికొనినందువల్ల ఏర్పడిన సంచి [illegible]న పురుగు జీర్ణమగువరకును జంతువుల జీర్ణకోశమువలె ప్రవర్తించును. పైనిచెప్పిన ఇతరోవెట్ల వలెగాక ఇచ్చట ద్రావకము లూరుటయందిం

కొకవిశేషము కలదు. ఆకుమీాఁనుండు వంగ పండుచాయగల జీవకణములు పురుగులోని నత్రజన్య ఆహారము లోనికి ఇనికిన తరువాత గాని దానిని జీర్ణముచేయు ద్రావకములను స్రవింపజేయవు. ఈచెట్టుయొక్క ప్రతియాకునకు ఆరుముల్లున్నట్లు చెప్పియుంటిని. ఈముల్లే ఆకు మూసికొని పోవుటకును తెరచుకొనుటకును కారణభూతములు. ఏ ముల్లయినను తాకినవెంటనే ఒకవిధమగు నరములగుండా ఆకు చివరవరకు స్పర్శజ్ఞానము కలుగును. ఈ ప్రకారము జ్ఞానగ్రహణమునకు ఆరుముల్లనుండి ఆరునరములుగలవు. ఇట్టీచెట్టు మాంస భక్షణమున జంతువులనుబోలుటయే కాక నరములు మొదలగువాటిని బట్టికూడ వాటిని బోలుచున్నది.

బ్లాడరువర్టు (Bladder wort)

ఈచెట్టు నీటిలో పెరుగును. సాధారణముగా మురికినీటియందు బాగుగ వర్ధిల్లును. ఇది సాధారణముగా నీటియందు పెరుగుచెట్లకుండునట్లు సన్నముగానుండు ఆకులతో అనేక విభాగములుగల కొమ్మలు గలిగియుండును.



బ్లాడరువర్టు



బ్లాడరువర్టు

ఈకొమ్మలకు చిన్నచిన్న సంచులుండును. ఇవి నీటితోను గాలితోను నిండియుండును. ప్రతి సంచియొక్క మూతిచుట్టు మూడు మొదలు ఏడువరకు ముల్లుండును. మూతికొక మూత యుండును. అది ముందరిభాగమునమాత్రము కొంచెము తెరచియుండును. ఆకు లోపలిభాగమున రెండులేక నాలుగుభాగములు గలిగిన ఉద్రోహము (Processes) లుండును. ఇట్లు ఈ సంచియే పురుగులను పట్టుట కుపయోగపడుచున్నది. ఈచెట్టునకుచిక్కు పురుగులు నీటిలో వసించునవియే. ఇవి యేవిధముగా ఎందువల్ల మూతనెత్తి సంచిలో ప్రవేశించునో గ్రహించుట కష్టము. లోపల ప్రవేశించినతరువాత కీటకము కొంతసేపు గిలగిల తన్నుకొని బయటికి వచ్చుటకు వీలులేక చచ్చిపోవును. తరువాత ఆచెట్టునకు పనికి వచ్చు పదార్థమంతయు ఉద్రోహములు పీల్చి చెట్టుయొక్క యన్నిభాగములకుబంపును.

ఇట్లు కీటకములను తిని జీవించునట్టి చెట్లింకనుకలవు. ఒక్కొక్కటొక్కొక విధమున తనకు గావలసిన మాంసాహారమును భక్షించుచున్నది. బట్టరువర్టు అను చెట్టుయొక్క ఆకులు పురుగులువ్రాలినప్పుడు చుట్టుకొని పోవును. అప్పు డాకుమీాదనుండు జీవకణముల నుండి రసము స్రవించి ఆపురుగులు జీర్ణమయి పోవును. పైనజెప్పిన చెట్లన్నియు సాధారణముగా మన దేశమునందు కనబడవు; గనుక వాటికి తెనుగుపేర్లు ఇచ్చుటకు వీలయినది కాదు. జడపదార్థము లనుకొను చెట్లుకూడ కీటకములను జంపి పొట్టపోసికొనుట చూడ స్థూలదృష్టి కగోచరములగు సృష్టివైచిత్ర్యము లెన్నిగలవో చెప్పలేముగదా?

—'అంబిక'



బట్టరువర్టు



# కవీంద్రగానము - కాలయానము

వి. టి. నరసింహాచార్యులు గారు

ఆకొమ్మకీకొమ్మ కాచెట్టుకీచెట్టు
కాపువ్వుకీపువ్వు కరిగిపాడితివి
ఆకొండకీకొండ కాగుట్టకీగుట్ట
కాపుట్టకీపుట్ట కరిగిపాడితివి
జలధరంబులమధ్య ఝంఝానిలముమధ్య
యుఱుముఘోషలమధ్య మెఱసిపాడి
[తివి

ఆశరద్రాత్రుల నలచకోరంబవై
యాచంద్రికలయందు నలరిపాడితివి
మంచుతోనిండిన మంచుకొండకుబైన
మంచుతోనైక్యమై మించిపాడితివి
ఆవృక్షములఁ బండు టాకులలోఁ జేరి
పడి ప్రాణములనట్లు వాసినే యటక!



# మంగళసూత్తము; వ్యాఖ్య

కొమాండూరు వెంకటాచార్యులు గారు

మంగళసూత్తము బౌద్ధమత గ్రంథములగు కుధుకపాఠ కుధుక నికాయములలో నొకభాగమునకు చెందియున్నది. కుధుకపాఠము ప్రథమ బౌద్ధసమావేశమునందు చదువఁబడెనందురుగాని వేర్వేరుకారణ, విమర్శనానంతరమున బౌద్ధసమావేశమైన చాలకాలమునకుగాని, మంగళసూత్తము పూర్తికాలేదని తెలియుచున్నది. ఏదియెట్లున్నను, 207 సం॥రములు క్రీస్తుకు బూర్వము అశోకచక్రవర్తి యాధిపత్యమున జరిగిన బౌద్ధతృతీయ సమావేశమునకు పూర్వము ఈ మంగళసూత్తము మిక్కిలి వ్యాపించియుండెను. ఈక్రింది శ్లోకములు బుద్ధభగవానునివలన ఆచరణార్థమై అప్పటికాలపు ప్రజాసమితికి అనుగ్రహింపబడినవి.

"అసేవనాచ, బాలానామ్ పండితానాంచ సేవనా
పూజాచ, పూజనీయానామ్, ఏతమ్‌మంగళమ్‌ఉత్తమమ్"

మూర్ఖులను పూజింపకుండుట, పండితుల సేవచేయుట, పూజింపనర్హులగువారిని పూజించుటఉత్తమమైనమంగళము(శుభప్రదము)

"పతిరూప దేశవంశోచ, పుబ్బేచ కతపుణ్ణతా।
అత్త సమాపిండీచ ఏతమ్ మంగళమ్ ఉత్తమమ్"

నివాసయోగ్యమైన దేశమునందు నివసించుట, పూర్వజన్మమందు చేసినపుణ్యకర్మలు కలిగియుండుట తనను తాను వశపర్చుకొనుట ఉత్తమమైన మంగళము.

"బహుసచ్చంచ శిప్పంచ వినయోచ సుశిఖితో
సుభాషితాయావాచ ఏతమ్ మంగళమ్ ఉత్తమమ్"

మంచి వినికిడియు, పనిపాటలయందు నేర్పును, వినయమునందు శిక్షణయు కల్గి ఎవరి పల్కులు సుభాషితములై యొప్పునో, వారలకు మంగళము.

"మాతాపితు, ఉపత్థానమ్ పుత్తదారశ్యసంఘహో
అనాకులాచకమ్మంతా ఏతమ్ మంగళ ముత్తమమ్"

తలిదండ్రుల సేవించుట, దారాపుత్రుల పోషించుట, తొట్రుపాటులేని కర్మలాచరించుట ఉత్తమమైన మంగళము.

"దానంచ, ధమ్మచర్యాచ జ్ఞాతికాంచ సంఘహో
అనవజ్ఞాని, కమ్మాని ఏతమ్ మంగళముత్తమమ్"

దానధర్మములు చేయుట, జ్ఞాతులను పోషించుట, పాపరహితములైన కర్మలుచేయుట మిక్కిలి శుభప్రదము.

"అరతి, విరతిపాపా మజ్జపానాచ, సఞ్ఞమో
అప్పమాదోచ ధమ్మేసు, ఏతమ్ మంగళమ్‌ఉత్తమమ్"

పాపములనుండి తొలగుట, సురాపానము చేయకుండుట, ధర్మగుణమునందు ప్రమాదము లేకుండుట శుభప్రదము.

"గారవోచ నివాతోచ సంతుట్ఠీచ కతన్నుతా
కాలేనధమ్మసేవానామ్ ఏతమ్ మంగళమ్ ఉత్తమమ్"

గౌరవము, వినయము, సంతుష్టి, కృతజ్ఞత, సరియగుకాలమున ధర్మముల నాచరించుట యెక్కువ శుభప్రదము.

"ఖంతాచ శోవాచస్సతా సమానంచ దశ్శానమ్
కాలేన ధమ్మశకచ్ఛా ఏతమ్ మంగళముత్తమమ్"

ఓర్పు, ఇంపగుపలుకులు, మునులు యోగులు మొదలగు విద్యాధికులదర్శించుట, సకాలమున ధర్మచర్చకు గడగుట ఉత్తమ మార్గములు.

"తపోచ బ్రహ్మచర్యంచ ఆర్యసచ్చేన దస్సనమ్
నిబ్బాన సచ్ఛికార్యాచ ఏతమ్ మంగళముత్తమమ్."

తపస్సు, బ్రహ్మచర్యము, ఆర్యసత్యముల తెలిసికొనుట, నిర్వాణము పొందుటయే మనుజుని ముఖ్యాశయము.

"ఫుత్తస్స లోకధమ్మేహి చిత్తం యస్సనాకంపతి
అశోకమ్ విరజమ్ ఖేమమ్ ఏతమ్మంగళముత్తమమ్."

లోకధర్మములచే స్పృజింపబడియు వాటికి లోనైయుండియు, నెవ్వనిమనస్సు చలింపదో, యెవ్వనిమనస్సు సుఖముగానుండునో, ఎవడు శోకింపకుండునో వానిదే ఉత్తమజీవనము.

"ఏతదిశాని కత్వాన సబ్బతా మపరాజితో
సబ్బతా సొత్తిమ్ గచ్ఛతీ తమ్ ఏతమ్ మంగళమ్."

ఎట్టి కర్మలుచేయుటచేత అన్నిస్థలములందును జయింపబడి సర్వత్రాసుఖముల పొందుచున్నారో వారలకు ఇదే ఉత్తమమైన మంగళము.

## మంగళసూత్తము

(పఠనానంతరము తెలిసికొనవలసిన సంగతులు)

మానవజాతియందు ముఖ్యమైన బ్రహ్మచర్యాశ్రమవిధులను వాటిని నడచుకొను మార్గములను మనకు మంగళసూత్తము బోధించుచున్నది.

అంతరాత్మను తెలిసుకొని, భగవానుని మనోవాక్కాయ కర్మలందు పూజించి, పాడి, ఆయనదయకు పాత్రులై యుండవలెనని యది బోధించును.

మరణానంతరము భగవానునిలో మన ఆత్మను ఐక్యముచేయవలె ననునది మంగళసూత్తము మనకు బోధించును.



# సుభాషిత సుధాలహరి*

## ద్వితీయ తరంగము

### ౨. దైవపౌరుషములు

భారతము

క్షేత్రంబు పురుషకారము
ధాత్రీశ్వర! బీజమరయ దైవము రెండున్
సూత్రపడఁ గూడెనేనియుఁ
బాత్రమగుం గర్మకరుఁడు ఫలమున కెందున్.

క. విను పురుషుఁడు గావింపని
పనులకు దైవమదియెట్లు ఫలమొనరించున్
జనములు కార్యము నడుపఁగ
ననుకూలత నిచ్చుఁగాక నయ్యైఫలముల్.

గీ. పౌరుషంబు దైవంబు తోడ్పాటు లేక
ఫలముఁ బొందంగ నేరదు పార్థివేంద్ర!
విత్తు సహకారి గాకున్న రిత్త నేల
వంధ్యమగుఁగాక తా ఫలవంతమగునె?

గీ. మేలు రెండులోకంబుల మేలు తెచ్చుఁ
గీడు చేసినఁ దప్పదు కీడెయగును
గానఁ బుణ్యవర్తనమున కానుకూల్య
శీలమగు దైవమది ఫలసిద్ధిఁ జేయు.

క. అనలం బించుకయైనఁ బ
వనుచే వెలుగొందుమాడ్కి వర్ధనముం బొం
దును సత్కర్మాచరణం
బున దైవం బానుకూల్యమున గురుముఖ్యా!

క. నేయి పాలుపడిన దీవియ
మాయుకరణిఁ గర్మసిద్ధి మలిగిన హీన
త్వాయత్తంబై, తానును [శా!
మాయును దైవానుకూల్యమహిమ మహీ

క. విను పౌరుషమును దైవము
నన రెండును గార్యఫలము నందింపఁగ నె
ట్టనఁ గారణములు గావున
జననాయక! సదృశములు విచారింపంగన్.

గీ. సారమతిఁ బరికింపంగఁ బౌరుషంబు
కంటె దైవము ముఖ్యంబు కార్యసిద్ధి
కెచట నేనియుఁ బౌరుష మెసక మెసఁగె
నేని యది దైవదత్తంబ యింత నిజము.

గీ. కార్యఫలముల యెడఁ దాన కర్తననుట
కడు నెఱుంగమి సువ్వె; తాఁ గర్తయేని
తగిలి తనదైన కార్యజాతంబు లెల్లఁ
జెడక ఫలియించునట్లుగాఁ జేయరాదె.

ఆ.వె. పౌరుషంబు చూవె ఫలమండ్రు కొంద, ఱ
ట్లనక దైవ మిచ్చునండ్రు గార్య
ఫలము గొంద; ఱెట్లు ఫలము భూతస్వభా
వమయటండ్రు గొంద; ఱమిత తేజ!

పంచతంత్రము

క. అలతులకు దైవయత్నము
బలవంతంబైన నెల్ల పనులొదవు, మహా
బలుల కది లేకయుండినఁ
బలుకులు వేయేల కడమపడు సర్వంబున్.

మార్కండేయపురాణము

గీ. జనులు మున్న కైపెక్కి యశక్యమని మ
నంబులోపల స్రుక్కి కార్యంబునందుఁ
బూని యుద్యోగమొనరింపరేని యెట్లు
దాని సఫలతా ఫలతలు దారు గండ్రు?

---

* దీపాల పిచ్చయ్యశాస్త్రిగారిచే చేర్చి కూర్పఁబడినది.



తారకాసురవధ

Lakshmi Art, Bombay 8.



# ప్రాచీనాంధ్రు లెవ్వరు? ఆర్యులుకారా?

(రెండవసంపుటము - రెండవసంచిక తరువాయి)

చిలుకూరి వీరభద్రరావు గారు

"మన మేజాతివారి చరిత్రమునైన విమర్శించునపు డతీతకాలారంభము మొదలుకొని విమర్శ నారంభింపవలెను. మనము వెనుకకుఁబోయి విమర్శించినకొలఁదిఁ బురాణకథలు (Myths), ఐతిహ్యములు (Traditions) ప్రచురముగానుండుకాలము మనవిమర్శలోనికివచ్చును. ఇంకను నావలకుఁబోవుటకుఁ బ్రయత్నించితిమేని చిట్టచీఁకటివలె నావలనేమియుఁ దెలియనికాలమునకుఁ బోవుదుము" అని యొక యాంధ్రమహాశయుఁడువక్కాణించెను. * ఐతరేయ బ్రాహ్మణము, సాంఖ్యాయనశ్రౌతసూత్రములు మొదలగు వైదికగ్రంథములందును, పురాణేతిహాసాది గ్రంథములందును ఆంధ్రుల ప్రశంస గన్పట్టుచున్నందున, ఆంధ్రజాతియొక్క సత్యచరిత్రముఁ దెలిసికొనఁగోరువారు వేదశాస్త్రపురాణేతిహాస గ్రంథముల నామూలాగ్రముగాఁ బరిశోధించుట మాత్రమెగాక, వానికి సమకాలీనములగు విదేశములయొక్కయు, విజాతీయసంఘములయొక్కయు, చరిత్రములనుగూడ బరిశోధించి విమర్శింపవలసియుండును. అంతవఱకు నాంధ్రజాతియొక్క సత్యచరిత్రము బోధపడుట దుస్సాధ్యము. ఈనావిమర్శ ప్రాచీనాంధ్రజాతివారి సత్యచరిత్రమును దెలిసికొనవలయునని కాని నేడాంధ్రదేశమని వ్యవహరింపఁబడుచున్న యీదేశముయొక్కగాని, యీదేశమునకు సంబంధించిన యేరాజవంశముయొక్క ప్రత్యేకచరిత్రమునుగాని దెలిసికొనవలయుననికాదు. ఇయ్యదిసాంఘిక సంబంధమైన చరిత్రముకొఱకుఁ బుట్టినదికాని రాజకీయసంబంధమైన చరిత్రముకొఱకుఁ బుట్టినది కాదు. ఈనాయుద్దేశమును దెలిసికొనఁజాలక శ్రీ వేంకటరంగయ్యగారు (మామిడిపూడి) కథాశేషమును కోపపూరితము గావించుచున్నారు.

"వీరభద్రరావుగారిది పురాణఫక్కిగాని చారిత్రక ఫక్కికాదు" అని యధిక్షేపించిరి. ఏదేశ చరిత్రమునకైనను మొదట నాదేశములోని పురాణకథలును, ఐతిహ్యములునే యాధారభూతములయినవి. మనకును వేద

* శ్రీ విజయనగరము సంస్కృత కళాశాలాపండితులగు శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారి 'ఆర్యభాషా విభాగము' అను గ్రంథమును జూడుడు.

శాస్త్ర పురాణేతిహాసములే శరణ్యములుగావున వానినుండియె చరిత్రాంశములను సేకరించుట తప్పదుగావున మనకుఁ బురాణఫక్కి యె గాని చారిత్రకఫక్కి యెక్కడనుండి రాఁగలదు? పురాణఫక్కి మన సంప్రదాయమున కనుగుణ్యమైనది. చారిత్రక ఫక్కి మనసంప్రదాయమునకు విరుద్ధమైనది. కానిండు, మంత్రములకు చింతకాయలు రాలవు. మన రంగయ్యగారు నిషాదరంగమునుండి యాంధ్ర రంగములోనికిఁ బ్రవేశించినందునకు వారికెంతయుఁ గృతజ్ఞుఁడను.

అంధ, అంధ్ర పదములు చెవి కొక్కటే మోస్తరుగనుండునట్లు కనుపించుట తప్ప మఱియేసంబంధ మీరెంటికి లేదు" 1 అని శారదలో వ్రాసియుండియు నిప్పుడు 'సంస్కృతపదమగు 'అంధ్ర'ము ప్రాకృతము అంధ' గమాఱుటకేలదు' అని యొప్పుకొని అంధశబ్ద మాంధ్రశబ్ద పర్యాయపదముగ వ్యవహరింప మొదలు పెట్టినారు. 2 ఇంక నాకు భయములేదు; విచారమునులేదు. వారి దూషణములు నాకు భూషణములు కాఁగలవు. ఎట్లందురా? వినుఁడు. "వీరు 'సర్వమంధమయమ్‌జగత్' అను సిద్ధాంతమును నెలకొల్పుటకు కంకణము గట్టుకొనియున్నారు. అందుచే వీరు వ్యాసములకు 'అంధపురాణ' మని పేరుపెట్టిన యోగ్యముగ నుండునని మనవిచేయుచున్నాను"అని హెచ్చరించిరి. 3

అంధ పురాణ మేని నాంధ్రపురాణ మనియే వారి యభిప్రాయము. ఏమన, ప్రాచీనాంధ్రులను ప్రశంసించుచు నాంధ్రవిష్ణువున కంకితము గావించినట్టి యీ నాపురాణమున కంధ్రపురాణమని పేరు పెట్టుట యుచితమే. మా చదువరులెవ్వరును దీనిని దూషణముగా భావించుట కవకాశములేదు. ఏమన:- విష్ణుపురాణములు 'సర్వం విష్ణుమయమ్‌జగత్' అనియు, శివపురాణములు 'సర్వంశివమయమ్ జగత్' అనియు ప్రతిపాదించుటకు పూనుకొన్నట్లు "నేను 'సర్వమంధమయమ్ జగత్' అనుసిద్ధాంతమును నెలకొల్ప నుత్సహించుచున్నానని నుడివిరి. ఇదివఱకు నంధ్రజాతులవారు విశ్వమువేఱు, జగత్తు వేఱనుకొని, విశ్వనాథునకు జగన్నాథునకు భేదము గల్పించుకొని శైవపురాణములు, వైష్ణవపురాణములు రచించిన మాటవాస్తవము. ఆకాలమందును విశ్వనాథునకు జగన్నాథునకు భేదము పాటించనివారు లేకపోలేదు. చూడుఁడు.

"అనయోరంతరం నాస్తి శబ్దైరన్యైర్జగపతే"

"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే"

"త్వాం ఏవాన్యే శివోక్తేన మార్గేన శివరూపిణం"

"బహ్వాచార్యవిభేదేన, భగవాన్, సముపాస్యతే"

"యేవిభేదం కరిష్యంతి మానవామూఢచేతసః,
నిరయం తే గమిష్యంతి విభేదాన్నాత్రసంశయః"

"యోహరిః సశివః సాక్షాత్ యః శివః సస్వయంహరిః
ఏతయోర్భేదమాదిష్టా న్నరకాయ భవేన్నరః"

ఇట్లు శివునకు విష్ణువునకు భేదములేదనియు నెవ్వరు భేదమును పాటింతురో యామూఢులు నరకమును బొందుచున్నారని భాగవతాదిపురాణములే ఘోషించుచున్నవి.

---

(1) శారద, సంపు ౨. సంచిక ౬, పే. ౭౧౩, (2) భారతి సంపు ౨. సంచిక 3, పేజి. 99 (3) డిటో పే.౧౦౩

ఏడాది క్రిందట గౌతమాశ్రమమని పూర్వాచారపరాయణులగు పెద్దలచే కీర్తింపఁబడునట్టి పడమటి గోదావరిమండలములోని కొవ్వూరునందు గ్రాంధీ భాండాగార సభ్యులచే సమకూర్పఁబడి నేనధ్యక్షుఁడనుగా నున్న యొకసభలో 'ఆంధ్ర' శబ్దమునుగూర్చి చర్చించుచు నుపన్యసించినవారిలో సనాతన ధర్మపరాయణులలో నగ్రేసరులని చెప్పఁదగిన పండితులు బ్రహ్మశ్రీ ఉపద్రష్ట సుబ్రహ్మణ్యశాస్త్రులవారు. వారికింగలవ్యాకరణశాస్త్రపాండిత్యము నంతయుఁ గనబఱచుచు 'ఆంధ్రుఁ'డన విశ్వనాథుఁడయిన శివుఁడనియు • జగన్నాథుఁడైన విష్ణువనియు, గూఢ నర్థముకూ గలదని సదర్థమును వక్కాణించి సభ్యులనెల్లరను సంతోషపారవశ్యులను గావించి యచ్చెరువు గలిగించిరి. కాని వీరి యభిప్రాయములో నాంధ్రులన నార్యులయిన బ్రాహ్మణులే గావున బ్రాహ్మణేతరకులములకు వేనికినాంధ్రనామము వర్తింపదనితమయాగ్రహమును వెలిపుచ్చుచు వక్కాణించిరి. ఇట్టివానిని కొందఱిని నే నిదివఱకే యెఱింగియుండుటచే, "ప్రాచీన నాంధ్రులెవ్వరు? ఆర్యులుకారా?"అను ప్రశ్నము దీర్ఘకాలము యోజించి యిరుప్రక్కల భారము సమానముగా తూఁగునట్లు సరిగాఁజూచి తూఁచి వేసినదిగాని సామాన్యమైనది కాదు. కనుక విశ్వనాథుని సేవించు నాంధ్రులకును, జగన్నాథుని సేవించు నాంధ్రులకును గలస్వల్ప భేదములను పాటింపక యభేదమును పాటింపవలసియుండునని ప్రబోధించుటకొఱకే యీ యంధ్ర పురాణము పుట్టినది గావున దీనిని వెక్కిరించు నుద్దేశముతో శ్రీ వేంకట రంగయ్యగారు దీని 'అంధపురాణ' మనుచున్నారని దోషారోపణముఁగావించి యొకపాపభారమును వారిశిరసుపై నుంచుకొంతటి కఠినచిత్తుఁడను గా కున్నాఁడను. ఈదోష కళంకమెంతమాత్రమును వారి నంటకుండునటుల మా యాంధ్రవిష్ణువువారివాక్కులపై మాధుర్యమును జిలికించుఁగాక. ఇంక నీ ప్రశంస విడిచిపెట్టుదము. మన వేంకటరంగయ్యగారు వివాద విషయము మఱియొకదాని నొప్పుకొని నా మార్గమునఁగల కంటకములను దొలగించి నాకు మహోపకారమును గావించియున్నారు. అదేదియన, "మొదటినుండియు 'ఆంధ్రులు', 'తెనుఁగు'వారు ఒక్కరే అని నాయభిప్రాయము." అని భారతిలో శ్రీనాథుని భీమేశ్వర పురాణ విమర్శాప్రశంసలో వాక్రుచ్చియున్నారు. [1] ఆంధ్ర వాఙ్మయములో తెనుఁగు, తెలుఁగు శబ్దములు పర్యాయపదములుగా వాడఁబడుచున్నవి. లోక వ్యవహారమునఁ గూడ నట్లే గానంబడుచున్నది. తక్కువ తరగతులవారిలో తెనుఁగు శబ్దమె బాహాటముగా వ్యవహరింపఁబడుచున్నది. కనుక తెనుఁగు, ఆంధ్రము ఒక్కటియేయని యొప్పుకొనువారు 'తెనుఁగు, ఆంధ్రము'నుండి తెలుఁగును వేఱుపఱుపఁ బ్రయత్నింతురని మన మూహింప నవసరము గాన్పింపదు. ఆంధ్రులనుండి తెలుఁగువారి వేర్పఱుపఁ బ్రయత్నించు పరిశోధకులు గొందఱు లేకపోలేదు. వారిలో ముఖ్యులు,

(1) భారతి సంపు ౨. సంచిక ౫. పు. ౨౧.

ద్రావిడులు. అందు ముఖ్యముగా శ్రీమాన్ పి. టి. శ్రీనివాసయ్యంగారిని డాక్టరు యస్. కృష్ణస్వామయ్యంగారిని మొదట పేర్కొనవలసి యుండును. వీరిలో రెండవవారు వ్రాసిన దానిని, చదువరుల కిదివరకె విశదపఱచి యున్నాను.[2] మొదటివారయిన పి. టి. శ్రీనివాసయ్యంగారు

"But the Andhra kings and the Andhra tribes have disappeared without any trace from the 3rd century A D"

కాన, ఆంధ్రరాజులును ఆంధ్రజాతులును క్రీస్తుశకము మూఁడవ శతాబ్దమునుండి యేవిధమైన జాడయుఁగానరాకుండ నదృశ్యులయి పోయిరి." అని 'ఇండియన్ అంటిక్వేరి' అనుపత్రికలో వ్రాసియున్నారు.[3] వీరుభయులును శాతవాహను లాంధ్రులు కారని మన వేంకటరంగయ్యగారివలెఁ జెప్పసాహసింపలేక యా యాంధ్రులువేఱు, తెలుఁగువారువేఱు అని వ్రాసియున్నారు.

శ్రీ వేంకట రంగయ్యగారు వక్కాణించిన చారిత్రక శక్తియొక్క తత్త్వమెఱింగుటకు మా చదువరులకు బోధపఱుపవలసి యున్నది. వీరాంధ్రులను వికారస్వరూపులగు నిషాదులని మొదట శారదలో విస్పష్టముగా వక్కాణించిరి. ఇప్పుడు భారతిలో క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దిలోఁ బరిపాలనముచేసిన రెడ్డి రాజులను శూద్రాంధ్రులనిరి. శ్రీమద్రామాయణ మహాభారతముల కాలమునుండి క్రీస్తుశకము ౧౪ గవ శతాబ్దివఱకు నాంధ్రదేశమునఁ గాని భరతఖండమునఁగాని పరిపాలనముచేసిన యాంధ్రులెవ్వరు వీరికంటికి గాన రాలేదు. ఆంధ్రదేశమును బరిపాలించిన శాతవాహనులుగాని, పల్లవులుగాని, చాళుక్యులుగాని, చోడులుగాని వీరి యభిప్రాయములో నాంధ్రులుకారు. గనుక వారు తెనుఁగువారునుకారు; తెలుఁగువారునుగారు. పదునాలుగవ శతాబ్దిలోఁ బరిపాలనముచేసిన రెడ్డిరాజులతో నాంధ్రవ్యక్తిత్వము ప్రపంచములో బైటపడ్డది. అంతవఱకు క్షీరసాగరమున శేషతల్పమునఁ బన్నుండిన శ్రీ మహావిష్ణువువలె ప్రపంచములో నేవిధమైన సంబంధము లేక యాంధ్రజాతి హాయిగా నిద్రపోవుచుండెను. ఇట్టి కరుణాళుత్వమును శ్రీ వేంకట రంగయ్యగారు చూపుటకు సమకట్టినను పి. టి. శ్రీనివాసయ్యంగారు 3 వ శతాబ్దిలోనే యాంధ్రులను భరతఖండమునుండి యదృశ్యులను గావించిరి. ఇట్టి నిర్భాగ్యస్థితియందుండిన తెలుఁగువారిని నాంధ్రులనుండి వేఱుచేసినప్పుడు తమలోఁ జేర్చుకొందురా యని యడుగుదురేమో యన్నభయముచేతఁ గాఁబోలు డాక్టరు కృష్ణస్వామయ్యంగారు తెలుఁగువారు తమిళులకుఁ జేరినవారుగాక పురాతనకాలమున బందిపోటు దొంగలని ప్రసిద్ధిగాంచిన బడుగు లగుటవలనవారిని తమిళులతోఁ జేర్పఁ గూడదనిరి. నేఁడీద్రావిడ పరిశోధకు లాంధ్రుల కెవ్విధముగాను భుక్తిముక్తులను బ్రసాదింపఁ దలపెట్టలేదు. మన సోదరులయొక్క పోకలీక తినినుండుటచేతనే వీరభద్రరావుగారు వీరిక

(2) భారతిసంపు ౨. సంచిక ౨.

(3) ఇండియన్ అంటిక్వేరి 1918. సంపు. 47 పే. ౨౮౬.

భయంకరముగా గనుపట్టునట్టి పురాణపక్కి-నవలంబింపవలసివచ్చినది. ఈ పక్కినను సరించిపోవుదుమేని క్రమక్రమముగా నాంధ్రులను గూర్చిన సత్యము బయల్పడకమానదు. ఆంధ్రులకు నార్యులకు నెట్టి రక్తసంబంధము గలదో, మఱియు నాంధ్రులకు నార్యులు, ద్రావిడులుగాని తదితరసంఘములకు నెట్టి రక్తసంబంధముగలదో దానినంతయుఁ దెలిసికొనుటకు నా పురాణపక్కియె తోడ్పడగలదు గాని మఱియొక పక్కి తోడ్పడఁజాలదు. వీరిఘోష యిట్లుండఁగా మైసూరు నివాసులయిన మఱియొక ద్రావిడపండితులు ఏ. గోవిందాచార్యస్వామి, సి. ఇ. ఎమ్. ఆర్, ఏ, ఎస్. ఎమ్, ఆర్. ఎస్. ఏ. ఎం. ఎం. ఎస్.' అనువారు:—

"Perhaps the modern Andhras who inhabit the Northern Circars and a good portion of the ceded Districts and the Nizam's Dominions as far as the central Indian States might have been the product of the intermingling of the advance Dravidian wing in the Cholas and the Kolarians, where-of the Odhras seem to be an offshoot, from the numerical superiority of the Odhras the name Andra, might have been given to this mixture of the races. In those days the differentiation of Telugu and Tamil does not seem to have taken place. And the Cholas must have spoken a tongue which was the parent of modern Telugu and more akin to Tamil. It was in fact, the Tamil of the first sangham of the Tamil land."

ఉత్తర సర్కారులలోను, దత్తమండలములలో విశేషభాగములోను, మధ్యహిందూదేశ సంస్థానములవఱకు వ్యాపించియున్న నైజాము రాష్ట్రములోను నివసించియున్న నవీనాంధ్రులు ద్రావిడులకు పురోభాగమున నున్న శాఖలవారగు చోడుల యొక్కయు, ఓఢ్రు లుపశాఖగానున్న కోలేరియనుల యొక్కయు సమ్మేళనమువలన నేర్పడిన మిశ్రజాతి వారయి యుండవచ్చును. అధికసంఖ్యాకులయిన యోఢ్రులనుబట్టి, ఆంధ్రశబ్దమునకు సులభముగా సామ్యము గల్పించునట్టి అంద్ర అనునామ మీ మిశ్రజాతివారికిఁ గల్పించి యుండవచ్చును. ఆకాలమున తెలుఁగుభాషకును తమిళభాషకును భేద మేర్పడినట్లు గనుపట్టదు. మఱియు చోడులు తెలుఁగు భాషకు తల్లి వంటిదియు, తమిళభాషకు నెక్కువ సంబంధముఁగ లట్టియు నొకభాషను మాట్లాడుచుండి యుండవలయును. ఇది నిశ్చయముగా తమిళకములోని మొదటి సంఘమునకు సంబంధించిన తమిళ భాషయై యుండెను అని 'ఇండియన్ అంటిక్వేరి' అనుపత్రికకు Indian Antiquary వ్రాసిన 'దక్షిణహిందూ దేశమునకు వచ్చిన బ్రాహ్మణవలస' Brahmin Immigration into South India అనువ్యాసములోఁ దమ యభిప్రాయమును దెలిపియున్నారు. వీరి యభిప్రాయములో తెలుఁగుశబ్దమునకు బదులుగా తెనుఁగుశబ్దమును వాడి ఓఢ్రశబ్దమును దొలఁగించుట జరిగించి యుండిన మొదల సత్యమును గొంతవఱకు సమీపించిన వారగుదురేమో? ఏమన తెలుఁగునకుఁ బ్రాచీననామము తెనుఁగై యున్నది. తెన్ అనఁగా దక్షిణము. తెనుఁగువారనఁగా

దక్షిణాపథవాస్తవ్యులు; వారుమాట్లాడుభాష తెనుఁగనుటకు సంశయింపఁబనిలేదు; చోర శబ్దముయొక్క వికృతియె చోడశబ్దము; చోరు లనఁగా దొంగలని యర్థము. వీరినే ఋగ్వేదములో దస్యులని వ్యవహరించియుండవచ్చును. దీనిని గోవిందాచార్యస్వామిగారి క్రిందివాక్యములలో నంగీకరించియే యున్నారు చూడుఁడు.

"Thus we see that even during the Rig-Vedic times the Aryans and the Dravidians must have come in contact with each other, it was, however, chiefly with the Dasyus that the Aryans had to fight and the Rig-Veda speaks of many hundreds of Dasyus sent to sleep by Indra and many forts belonging to them destroyed by the advancing Aryans. It was the Dasyus or the Choras or the Cholas that formed the more advanced northern wing of the Dravidian race settled along the east coast and penetrating even into the plains of Hindustan through the low lying lands and of the Gangetic Delta"

ఈ రీతి ఋగ్వేదకాలమున సహా ద్రావిడులు నార్యులు నొండొరుల సమావేశము కలిగియుండవలయునని మనము కనుఁగొనుచున్నాము. అయినను ముఖ్యముగా దస్యులతో నార్యులు దలపడి పోరాడవలసి యుండెను. అనేకశతసంఖ్యలు దస్యు లింద్రునివలనఁ బ్రాణములు గోల్పోయిరనియు, వారి దుర్గములు పెక్కులు ముందుకుఁ ద్రోచుకొనివచ్చునార్యులచే నాశనము గావింపఁబడినవనియు ఋగ్వేదము వాకొనుచున్నది. తూర్పుతీరమునం దయు మాత్రమేగాక హిందూస్థానములో గంగానది ప్రవహించు పల్లపుభూములుదాక వ్యాపించియుండిన దస్యులు లేక చోడులు ద్రావిడులయొక్క ముంగటిభుజముగా నేర్పడిన వారుగా నుండిరి:"

ఋగ్వేదములో దస్యులని వక్కాణింపఁబడియుండెను గాని ద్రావిడులని వక్కాణింపఁబడియుండలేదు. ఆ కాలమున ద్రావిడులను వ్యవహారనామ మేతెగకు నున్నట్టు తెలియరాదు. ఋగ్వేద మంత్రములకుఁ దరువాతిదియైనయైతరేయబ్రాహ్మణములో 'ఆంధ్రాదిజాతులు' కొన్నిమాత్రమే దస్యులుగాఁ జెప్పఁబడినవి. కనుక నప్పటికి ద్రావిడనామము వ్యవహారమునఁ గానరాదు. దస్యులు చోరులుగ నార్యులచేఁ దస్యుగా గ్రహింపఁబడియుండవచ్చునని గోవిందాచార్యస్వాములవారభిప్రాయపడుట విపరీతమైన విషయముకాదు. దక్షిణాపథనివాసస్థులగుటచేత చోడులు దాక్షిణాత్యులనంబడుచుండిరి. దాక్షిణాత్యులు తెనుఁగువారే. తెన్ అనఁగా దక్షిణమే. తెంగలులు మాట్లాడుభాష తెనుఁగుగాని మఱియొకటికాదు. ఉత్తరమున Tamalittiకి తామ్రలిప్తినుండి వచ్చిన క్షత్రియశాఖలవారిచే మధురానగరమున తెంగలులచే మాటలాడఁబడుచున్న తెనుఁగుభాష మొదటి సంస్కారమును గాంచి తమిళభాషయని నూతననామమును దాల్చియుండవచ్చును. గనుక గోవిందాచార్యులుగారు చెప్పినట్లు చోడులభాష తమిళభాషగాక

తెనుఁగుభాషయై యుండవలయును. తెనుఁగు భాష మధురాపురప్రాంత దేశమున తమిళభాష గాను నుత్తరమున తెల్గుఁగు, కన్నడ భాష లుగను విడిపోయినది. ఆంధ్రప్రాకృతము మాట్లాడబడు ప్రదేశమున మాత్రము తెనుఁగుపదము తెలుఁగుపదమునకుఁ బర్యాయపదముగా నిలిచినది. కనుక గోవిందాచార్య స్వామిగారు నక్కాణించిన మొదటి సంఘము వారి తమిళభాష తప్పక తెనుఁగు భాషయై యుండవలయును. దీనిని బలపఱచు విషయము మఱియొక్కటి గలదు. పండిత సంప్రదాయకోటిలోఁ జేరిన వారును, ఆంధ్రులలో ప్రముఖులును, నెల్లూరున హైకోర్టువకీలుగనున్న బ్రహ్మశ్రీ వంగోలు వేంకటరంగయ్యగారు భారతిలో 'ద్వాదశ లింగము'లను నొక చక్కనివ్యాసమును వ్రాసియున్నారు.[1] ఈసందర్భమున వివరించుటకు నెంతేయు నొప్పియుండి ముద్దులు మూటఁగట్టుచున్నవారి వాక్యములను గొన్నిటి నీదిగువ నుదాహరించు చున్నాఁడను.

"మనకావేరికి పేరుపెట్టినవారొకప్పుడు నర్మదా తీరములనుండినవారనుట కొక నిదర్శన మగపడుచున్నది. అరవదేశములోని వడమలను ద్రావిడ బ్రాహ్మణ తెగలో వడదేశవడమలు, తెన్ దేశవడమలు అని రెండు శాఖలుగలవు. "వడమ" అనుదానికి 'యుత్తరము' అనువ్యుత్పత్తి అరవవారు చెప్పుచున్నారు. ఈ యుత్తరపు వారిలో ముందు దక్షిణమునఁ జేరినవారు, బహుశః తెన్ దేశ వడమలు అని పిలువఁబడిరి కాఁబోలును. అనఁగా ముందు వచ్చినవారు దక్షిణవడమలు, వెనుకటివారు ఉత్తరవడమలు "వడమ"శబ్దమువ్యుత్పత్త్యర్థమును గోలుపోయి రూఢ్యర్థమును బొందినది. ఉత్తరాది వారగుటయందు న్యూనతయేమైన నున్న యెడల అదివడమలకును అన్వయింపఁగలదు. తెలుఁగువారు మాత్రమెయుత్తరాదివారుగారు. జన్మవిస్మృతి యెంతపని చేయఁగలదు.?

వడమ లొకానొకప్పుడు తాము నర్మదా పరిసరములనుండిన దాని మఱువక తమ నిత్య సంధ్యావందనమున నర్మద ననుదినము స్మరించుట గలదు. వారు సంధ్యలలో నీ శ్లోకము పఠింతురు:—

"నర్మదాయై నమః ప్రాతఃనర్మదాయై నమోనిశి ।
నమోఽస్తు నర్మదేతుభ్యం త్రాహిమాంవిషసర్పతః॥"

బహుశః వీరిపూర్వికులు నర్మదాతీరములో నివసులు గుదిర్చికొనిన కొంతకాలమున కాప్రదేశము విషసర్పభూయిష్టమై వాసయోగ్యముగాక పోయినది గాఁబోలును. "కవేర స్యాపత్యంస్త్రీకావేరీ" యను నుత్పత్తి ఆకావేరికిఁగూడ సరిపడఁగలదు. కావు+ఏరి= కావేరి యనునొక యుత్పత్తియు సాధ్యముగ నున్నది. కావేరినీళ్లు కావువర్ణము గలిగి యుండుటచే కావేరి యైనదని కొందఱు చెప్పుదురు. ఇదియు స్వాభావికముగనే యున్నది. కృష్ణాయమునానదులు వర్ణప్రాధాన్యముగలవి. బ్లూనైల్ (Blue Nile) వైట్ నైల్ (White Nile) యను పేర్లు గమనింపుడు.

(1) భారతి;సంపుటము ౨. సంచిక ౩. పేజి ౫౭

ఇదంతేయు నిట్లుండ మనదక్షిణ కావేరికి పౌరాణికనామము "మరుద్వృధ" యని తెలియుచున్నది మరుద్వృధయే కావేరి యగునెడల మనదక్షిణకావేరి జన్మవృత్తాంతమునకు నర్మదావతరణముచేసి సింధూప్రాంతముల కేగవలసి యున్నది. మరుద్వృధయను నది "ఇమంమే గంగే యమునే" ఇత్యాదిఋక్కులలో పఠింపబడిన వైదికనదులలో నొకటి. అసిక్ని (Chenab)యును, వితస్త(Hydaspes or Jhelem) కలసి ప్రవహించునది కీపేరని రాధాకుముద ముఖర్జీతన గ్రంథమునం జెప్పియున్నాఁడు.

శంకర ప్రోక్తమగు కావేరి కీచిక్కులన్నియులేకుండ నర్మదోపనదీత్వ మంగీకరింపనగును.

కావేరి నర్మదలపొందున కింకొక ప్రమాణమును జూపెదను. కలకత్తా హైకోర్టుజడ్జిగ నుండిన పార్గిటర్ న్యాయమూర్తిగారు వ్రాసిన ఏన్షంటు ఇండియన్ హిస్టారికల్ ట్రెడిషన్' (Ancient Indian Historical Tradition) అను గ్రంథమున కావేరి నర్మదల ప్రసక్తిమె నర్మదకు కావేరి యను నొక యుపనది యున్నటుల సప్రమాణముగఁ జూపఁబడినది. ఉపనది యయ్యును ఈకావేరి యుత్తమజన్మచే పేరాజిల్లుచున్నది.

"ఈమె యువనాశ్వుని మనుమరాలుగఁ బుట్టి కాన్యకుబ్జరాజగు జహ్నుని భార్యయై యువనాశ్వుని శాపవశమున నదియై నర్మదం గూడినదఁట."

ఈవ్యాసములో ద్రావిడ దేశములోని వడమలందఱు నుత్తర దేశమునుండి దక్షిణమునకుఁ బోయిన యుత్తరాదివారేయని ఋజువు చేసిన విధము బహుశ్లాఘనీయముగా నున్నది. మనము ద్రావిడుల, నరవలని వ్యవహరించుచున్నారము. ఈయరవలు శేషనాగులో వసునాగులో అనితోచుచున్నది. వీరుతల్లెమండలము నుండి కాంచీపుర ప్రాంత దేశమునకుఁ బోవుట చేతనే యాప్రదేశమునకు 'అరవ వడదలై నాడు' అనుపేరు గలిగెను. తల్లెయనునదియె తెలుఁగుదేశము "వడఁదలై" అనునది ఉత్తర తెలుగుదేశము; ఉత్తర తెలుగుదేశమునుండి వచ్చి కాంచీపుర ప్రాంతదేశము నాక్రమించుకొన్న వసునాగులనే 'అరవవడదలైయార్' అన్నారు. వడ అనఁగా ఉత్తరముకదా! తల్లెయార్ అనువారె తల్లెంగులు, కొన్ని ప్రాచీన భాషలలో 'ంగ' బహువచన ప్రత్యయము గానుండెను. తల్లెంగుశబ్దమె క్రమక్రమముగా తెలుగుశబ్దమైనది. ఓఢ్రదేశమును బరిపాలించిన భంజవంశపురాజులు పెక్కండ్రు తమది 'అండ' జవంశమనియు, తల్లెరాష్ట్రము నుండి వచ్చినవారమనియుఁ జెప్పుకొని యున్నారు. తల్లెంగులరాష్ట్రమె తల్లెరాష్ట్రమని మఱియొక ప్రత్యేక వ్యాసమునఁ జర్చించి నిరూపించుచున్నాను. శాతవాహనరాజులలోఁ గడపటివాఁడైన పులమావి చక్రవర్తికి సేనాధిపతిగనున్న శివస్కంధ వర్మనాగ శాతకర్ణియను నాగరాజు కాంచీపురము నేలు

చుండినట్లును, వాని కొమార్తెను నొక పల్లవ బ్రాహ్మణుఁడు వివాహముఁ జేసికొనఁగాఁ బుట్టిన కుమారునకు శివస్కందవర్మయని పేరు పెట్టినట్లును,మాతామహార్జితమైన యీరాజ్యమునకుఁ బ్రభువైనట్లునుఁ దెలియుచున్నది.[1] కాఁబట్టి, ఆంధ్రచక్రవర్తియగు పులమావికి సేనాధిపతిగనుండు 'శివస్కంధవర్మనాగశాతకర్ణి' యనునాతఁడు కాంచీపురము నేలుచుండుటయు, '(శ్రీ)పులమావి'నాణెములు కొన్ని కాంచీపుర తీరమునఁ గన్పట్టుటయుఁ జూడ నీ భాగము తెలుఁగువారిచే జయింపఁబడి పరిపాలింపఁబడినట్టు స్పష్టమగుచున్నది. అప్పుడీ ప్రదేశమునకు"అరవవడదలైనాడు"అను పేరు వచ్చియుండవచ్చును. దీనిక్రిందనె 'అరవై' నాడు కలదు. అనఁగా నుత్తరమునుండి వచ్చిన తెలుఁగు వారాక్రమించుకొన్న యరవనాటి ప్రదేశమునకె 'అరవవడదలైనాడు' అనుపేరు వచ్చినట్లుగా మనము తలంపవలసియుండెను. ఇప్పటివడమ బ్రాహ్మణులు విశేషముగా దక్షిణమునకుఁ బోయిన దీకాలముననే.

డాక్టరు కృష్ణస్వామయ్యంగారి కిటి సంబంధములు గోచరింపక పోవుట యాశ్చర్యకరముగానే యున్నది. ఆంధ్రులు, తెనుఁగువారు నొక్కరన్నియొప్పుకొనుచు (శ్రీ)మామిడిపూడి వేంకటరంగయ్యగారు శాతవాహనులాంధ్రులు కారని పెద్దఘోష పెట్టుచున్నారు. వీరికి నిజముగా సత్యమునందే విశ్వాసమున్న యెడల నీక్రింది పురాణవాక్యములను సహేతుకముగా ఖండించి శాతవాహను లాంధ్రులు కారని స్పష్టముగా ఋజువుచేయఁగలిగినప్పుడె వారివాదమును మెచ్చఁదగియుండును.

పురాణములలో నత్యంత ప్రాచీనములైనవని సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులచే నంగీకరింపఁబడినట్టి మత్స్యవాయు పురాణములలో కాణ్వావంశీయుఁడైన సుశర్మయను రాజును జంపి వానిభృత్యుఁడయిన యాంధ్రజాతీయుఁడు వసుంధర నాక్రమించుకొనునని స్పష్టముగా నీక్రిందిశ్లోకములలోఁ జెప్పఁబడియుండెను.

"కాణ్వాయనా స్తతోభూపాస్సుశర్మాణం ప్రగృహ్యతమ్
శృఙ్గానాంచైవ యచ్ఛేషం క్షపయిత్వా బలీయసః.
శిశుకోన్ధ్రః సజాతీయః ప్రాప్స్యతేమాం వసున్ధరామ్.
త్రయోవింశత్సమా రాజా శిశుకస్తు భవిష్యతి.

(మత్స్య పు. ఏకసప్తత్యుత్తరద్విశతతమోఽధ్యాయః)

కాణ్వాయనస్థ(నంత)తోభృత్యః సుశర్మాణం ప్రసహ్యతం
శృఙ్గానాంచైవ యచ్ఛేషం క్షపయిత్వా బలంతదా
సింధుకోహ్యంధ్రజాతీయః ప్రాప్స్యతేమాం వసున్ధరామ్.

(వాయు. పు.)

మత్స్యపురాణములో ఆంధ్రభృత్యవంశములో జనించిన ముప్పదియేడుగు రాంధ్రరాజులావంశ మంతరించినవెనుకఁ బరిపాలింతురని 'అంధ్రాణాం సంస్థితా (తే?) రాజ్యేతేషాం భృత్యాన్వయేనృపాః సప్తైవాంధ్రాభవిష్యన్తి' అని వక్కాణింపఁబడి యుండెను.

వాయుపురాణములో మూఁడువందలసంవత్సరములవఱకు భూమిని పొందుదురని 'అం

---

1. Report on Epigraphy for 1910-1911. G. O. Public 28th July Part II No. 3 Page 61 Ancient History of the Deccan by G. J. Dubreuil. Page 108.

త్రా భోక్ష్యంతి వసుధాంశతే ద్వేచశతంచవై' అనిస్పష్టముగా వ్రాయఁబడియుండెను. ఈ యాంధ్రజాతీయుల నామములే శాసనములలోఁ గన్పట్టుచున్నవి. సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకు లెల్లరు శాతవాహన రాజుల నాంధ్రులని యంగీకరించియుండఁగా నీచరిత్ర సంప్రదాయముల నేరీతిగా నెగురఁగొట్టఁగలరో యూహింపఁ జాలకున్నారము.

శ్రీ వేంకటరంగయ్యగారు (మామిడిపూడి) వెనుకముందు పొంతఁజూచుకొని వాక్యముల వ్రాసిన బాగుగా నుండును.

"తూర్పుచాళుక్యుల కాలమున 'ఆంధ్ర దేశము' మాటవ్యవహారములోఁ గాన్పించక పోవుటకు కారణమొకటి యని తోఁచుచున్నది. ఈరాజులు మొట్టమొదట ఆంధ్ర దేశములో నొకభాగమగు వేఁగీమండలమును మాత్రము జయించి వశపఱచుకొనిరి. అందుచే వీరికి వేఁగీశ్వరులనియు, వీరిరాజ్యమునకు వేఁగీరాజ్యమనియు పేరువచ్చెను. కాలక్రమమున ఆంధ్రదేశములోని మఱికొన్ని భాగములను జయించిన తర్వాతకూడ ఆపేరే రూఢమయ్యెను." అనువాక్యములు వ్రాయుట మిక్కిలి శోచనీయము.[1]

ఏఁడవశతాబ్ది మొదటనున్న దండి మహాకవి దశకుమారచరిత్రమును రచించెను. అందు వేంగీదేశమును బరిపాలించుచున్న చాళుక్యరాజగు జయసింహుని 'ఆంధ్రనాథే జయసింహేన' అని యాంధ్రనాథునిగా వర్ణించుటయె గాక యాంధ్రదేశమును వర్ణించుచు నాతని రాజధానియగు వేంగీపురము నిట్లు వర్ణించి యున్నాఁడు చూడుఁడు.

" అయాసిషం చదిన్నైః కైశ్చిదంధ్రనగరం। తస్యనాత్యాసన్నే సలిలరాశి సదృశస్య కలహంస గణదళితనళినీదళ సంహతిగళిత కింజల్కశకల శారస్యసారస శ్రేణి శేఖరస్య సరస్తీరకాననే కృతనికేతన స్థితః"

ఇందొక మహాసరస్సు గలదనియు, నది సారసనిలయమనియు సలిలరాశి సదృశమనియు, జలవిహంగములతోఁ గూడినదనియు, ఆంధ్రనగరమున కనతిదూరముగా నుండెనని యు, వర్ణించినాడు. ఇయ్యది కొల్లేటి వర్ణన గావునఁ దత్సమీపమునందలి వేంగీనగరమే యంధ్రనగరమై యున్నది. ఈదశకుమారచరిత్రమునఁ బేర్కొనఁబడిన యాంధ్రరాజగు జయసింహుఁడు కుబ్జవిష్ణువర్ధనుని కుమారుఁడు. ఇతఁడు క్రీ.శ. ౬౩౩ మొదలుకొని క్రీ.శ. ౬౬౩ వఱకు వేంగీపురము రాజధానిగ వేంగీమండలమును పాలించిన వాఁడే. ఇతని దేశము నాంధ్రదేశముగాను, ఇతని నాంధ్రరాజును గాను, ఇతని రాజధాని నంధ్రనగర మనియు దండియంతటికవి వర్ణించియుండఁగా ఈనామములు వ్యవహారమున లేవనితలంచుటయెట్లు? ఇతఁ డొక్కఁడేనా? ఆకాలమున నీ దేశమునకువచ్చిన చీనాయాత్రికుఁడగు "యువాన్‌త్స్వాంగు" అనువాఁడు అం-ధా-లో అనఁగా అంధ్రమని వ్యవహారములో లేనిమొదల నెట్లు

1 భారతి, రెండవసంపుటము శ్రీనాథుని భీమేశ్వర పురాణము. పేజి ౨౦.

ప్రస్తావింపఁగలిగెను? ఇట్టివెన్నియైనను దెలుప వచ్చును. "ఆంధ్ర దేశమునందు వ్రాయఁబడిన సంస్కృతాంధ్ర గ్రంథములలోని చరిత్రాంశ ముల నన్నిటిని ఘనఖ్యాతను క్రోడీకరించలేదు" అని వేంకటరంగయ్యగారు వ్రాయుచున్నారు. అవి యెందుకు? నెత్తినివేసి కొట్టుకొనుటకా? ఇదివఱకు క్రోడీకరించిన విషయముల యందు గౌరవములేక కాలితోఁ దన్నివేసెడు వేంకట రంగయ్యగారి పలుకులకేమైన నర్థముగలదా? పురాణములన్నియు నైకకంఠ్యముగా శాతవా హను లాంధ్రులని దెల్పినను వీరికి విశ్వాసము లేక శాసనములలో శాతవాహీను లాంధ్రు లని తెలుపలేదు గనుక చారిత్రక ఫక్కి ననుసరించి వాని నిరాకరించి శాతవా హను లాంధ్రులు కారనిరి. చాళుక్యుల శాసన ములలో ఆంధ్రదేశము, ఆంధ్రరాజులు పే ర్కొనఁబడలేదు గనుక చారిత్రకఫక్కి నను సరించి దండిమహాకవి ఆంధ్రదేశమును ఆంధ్ర నగరమును, ఆంధ్రరాజును పేర్కొన్నను దాని నిరాకరించిరి. అయినను, ఆంధ్రులచరిత్ర మింకముందు క్రమముగాను సమగ్రముగాను వ్రాయుటకొఱకుఁగాఁబోలు శ్రీనాథుని భీమే శ్వర పురాణమును బరిశోధించి, విమర్శించు చున్నారు. శ్రీ వేంకటరంగయ్యగారివంటి చరిత్రాధ్యాపక ముఖ్యులుగా నుండువారు పరి శోధించి విమర్శింపవలసినవి భీమేశ్వర పురా ణమువంటి యాధునిక గ్రంథములుకావు; మగ శబ్దమునుగూర్చి పరిశోధనము చేయవలయును. మగవారెవ్వరో తెలిసికొనవలయును. అప్పుడు గదా యథార్థము తేటపడునది.

మగవారి ప్రశంస

అచ్చతెనుఁగుభాషలో పురుషునకు 'మ గఁడు, మగవాఁడు' అనియు, స్త్రీకి 'ఆఁడది, ఆఁడుది' మగువ, అనియు పేర్లుగలవు. స్త్రీకి పర్యాయ పదములు పెక్కులు గాన్పించును గాని మగవానికి పర్యాయపదములు తెనుఁగు భాషలోఁ గానరావు. మగఁడు దీనిమొదటి రూపము మగండు. మగవాఁడు దీని మొదటి రూపము మగవాండు. ఇప్పటివ్యవహారములో పురుషునకు మగవాఁడనిమాత్రమె వాడు చున్నాము. పూర్వము మగడనికూడ వాడు చుండెడివారు. మగండనఁగా పురుషుఁడు. (౧) "చూచిన మగలైనఁ జొక్కెడునట్టి సౌందర్య సంపద సొంపుదాల్చెననియు" తిక్కన నిర్వచ నోత్తరరామాయణము మొదటియాశ్వాస ము. మగండన భర్త. (౨) "ఆ. మగఁడులేని మగువమాడ్కిఁగాకున్నె నా, నేన భీష్ము లేమిఁ జేసి నేఁడు" (భారతము. భీష్మ. ప. ౧. ఆ.) మగండనరాజు. (౩) "మ. అపుడప్పక్కి మ గండు రక్కసుల జియ్యందాకి యిబ్బంగిను గ్రపు గయ్యంబొనరించి మూర్ఛిలె' (రామా., ఆ. గి.) మగండనశూరుఁడు. (౪)

"కం. పాండవుల నాజినోర్చు ని
తండని మీరాజు నూతతనయుని బొగడున్
గండడచె భీముఁడిట్టిమ
గండు గలఁడె పిదప నెట్లుకయ్యము సెల్లెన్."

(భార. కర్ణ. ౨. ఆ.) ఇంక, 'ఆఁడది దీని మొదటిరూపము ఆండది; ఆఁడుది, దీని మొ దటి రూపము ఆండుది. ప్రాచీనచరిత్ర పరిశో ధనీమువలన మగజాతియనియు, ఆఁడలేక

ఆంధ్రజాతియనియు రెండుజాతులు ప్రాచీనకాలమున భరతఖండములో ప్రసిద్ధిగాంచినటులు దెలియుచున్నది. వీని ముక్కు మూలములు గానరావు. ఈ రెండుజాతు లొక్కజాతినుండి పుట్టినవో భిన్నజాతులనుండి వచ్చినవో పరిశోధించి తెలిసికొనవలసి యున్నది. మగజాతినిగూర్చి నేడు కొంచెము పరిశీలింతము. మన వేంకటరంగయ్యగారు కూడ నేలవిడిచిన సాముఁ జేయక దీని పరిశోధించి యథార్థమును గ్రహింతురుగాక!

తెనుఁగు భాషలో మగటిమి యన పౌరుషమని గూడ యర్థముగలదు. మగ యన పుంస్త్వమున కర్థముగలదు. ఇది యొద్ద యో మహాజాతియై యుండవలయును. మన తెనుఁగు భాషలోనిట్టి యర్థములున్నను, కుమారుఁడను నర్థమిచ్చునపుడు కన్నడములో 'మగ' అనియు, తమిళములో 'మగన్' అనియు, కూతుం డ్రను నర్థమిచ్చుపట్లనరవములో 'మగల్' అనియు వ్యవహరింపఁబడుచుండెనుగాని తెనుఁగుభాషలోఁగల పై నుడివిన యర్థములున్నట్టు నాకుఁ దెలియరాదు. భరతఖండములో "మగధ" దేశమని యొక దేశము పురాతన ప్రసిద్ధిగల దొకటి గానిపించుచున్నది. అదియైనను మగజాతినిబట్టి 'మగధ' యనిపేరు గాంచినట్టు గానుపించుచున్నది. దేశము కంటెను బూర్వమున మగ జాతి యున్నట్టు గానుపించుచున్నది. వారు నాగరికులు, భాగ్యవంతులు, బలాఢ్యులుగఁ గనుపట్టుచున్నారు. వీ రార్యులంకమా యున్న మొదట నార్యగణములోఁ జేరని వారుగ నున్నారని వేదమువలనఁ దెలియుచున్నది. త్రికాండశేష మనుకోశములో 'మాగధాః కీకటామతాః' అనియున్నది. కాని కీకటదేశము ఋగ్వేదమున నీక్రింది ఋక్కులో వర్ణింపఁబడి యున్నది.

> "కింతే కృణ్వంతి కీకటేషు గావో నాశిరందుహ్రే నతపంతి ఘర్మం ఆనోభర ప్రమగందస్య వేదో నైచాశాఖం మఘవా రంధయానః.
>
> (ఋ. వే. మం. 3.౫3.౧౪.)

ఇందనార్యులదగు కీకటదేశము వర్ణింపఁబడినది. దీని తాత్పర్య మిట్లున్నది. "నీయావులు కీకటములో నేమి చేయుచున్నవి; అవి హవిస్సునకై పాలియ్యవు; అగ్నిని బ్రజ్వలింపఁజేయవు; ప్రమగందుని సంపద మాకుఁ దీసికొనిరమ్ము. ఓయింద్రా; నీచమనుష్యుని మా స్వాధీనము చేయుము." ఇందు పేర్కొనఁబడిన 'కీకట ప్రమగంద' శబ్దములు ముఖ్యములయినవి. విశ్వామిత్రుని తెగవారు ఇంద్రుని గూర్చి చేసిన ప్రార్థనయిది. 'కింకృతాః, కిం క్రియాభిః' అను శబ్దములయొక్క అపభ్రంశమె కీకటశబ్దమైనదని నిఘంటుకారుఁడగు యాస్కుఁ డభిప్రాయపడినాఁడు. అనార్యులు నివసించు ప్రదేశము కీకటమని యాస్కుఁడు చెప్పినాఁడు. వడ్డికొఱకు ధనమిచ్చువాఁడు మగందుఁడనియు, మగందశబ్దమసలు మంగద శబ్దమనియు మన్- నాకు, గద- తిరుగవచ్చునది అనునర్థముగనుక తిరుగవచ్చునను నాసతో మఱియొకనికి ధనమిచ్చువాఁడు మంగదుఁడనియు, మగందుని కుమారుఁడు లేక సంతతివాఁడు ప్రమగందుఁడనియు, యాస్కుఁడు

తన నిరుక్తమునఁ జెప్పియుండెను. ఇంకొక యర్థముగూడఁ జెప్పెను. ఈ ప్రమగందశబ్దము ప్రమదకశబ్దమై యుండవచ్చుననియు, ప్రమదకుఁడన నీ ప్రపంచమునే శాశ్వతమని నమ్మి తక్కిన వానియం దెంతమాత్రము విశ్వాసము లేని నాస్తికుఁడని యర్థము చేసికొనవచ్చునని గూడ వక్కాణించెను (నిరుక్తము ౬-౩ ౨) సాయనాచార్యులవారు తన భాష్యములో నిరుక్తకారు ననుసరించి యర్థము వ్రాసెను. ఆర్యకర్మలయందు విశ్వాసములేక కేవలము ప్రపంచవ్యామోహముననుండి వడ్డీవ్యాపారము చేసెడు మగందుల కాటపట్టగు కీకటదేశమని తాత్పర్యము తేలుచున్నది. ఈ మగందులచే నివసింపఁబడు కీకటదేశము మహాభారత కాలమునాటికి మగధదేశమై యుండవచ్చును. వైదిక కర్మల నాచరించు వారిచే నాకాలమున స్వర్గమునిచ్చు వైదిక కర్మలకంటె వడ్డీవ్యాపారము మొదలగు కర్మలు నీచమైనకర్మలుగాఁ దలంపఁబడుచుండుటచేత నాకర్మలను జేయు వారిని నీచులనుగాఁదలంచి వారివలన విశేష బాధలు కలుగుచున్నందున వారిని స్వాధీనులను గావించుటకై ప్రార్థనలు చేయఁబడుచుండె ననుమాట వాస్తవము. అయ్యది ఆర్యానార్య జాతిభేదమునకు సూచనగాదు. ఏమనఁగా మగజాతివారిలో మఘములను గావించి పూజ్యతను గావించినవారిని 'మఘవాన్' అనిరి. వైదిక దేవతలలో నొక్కఁడగు నింద్రుని 'మఘవాన్' అందురు. "మఘఃయాగోఽస్యాస్తీతి మఘవాన్" యాగముగలవాఁడని యర్థము. "మహ్యతే పూజ్యతేమఘవా" పూజింపబడువాఁడు. "మహపూజాయాం" మగవానికిటువంటి పూజ్యార్థము తమిళ భాషలో లేకుండుటయు, తెనుఁగు భాషలో నుండుటయుఁ జూడ నీభేదము గన్పట్టఁగలదు. మఱియు నింకొక్క విశేషముగలదు. పై నుదాహరించిన ఋగ్వేదమంత్రములో 'ఇంద్రుని' 'మఘవాన్' అనిసంబోధించియుండెను. అప్పటికి కింకను వర్ణభేదమున్నట్లు గన్పట్టదు. మఘవాన్‌శబ్దమునకు రెండర్థము లుండుటచేత యాగముల మూలముననే పూజ్యతగలిగె ననునది తరువాతవచ్చిన యర్థము. తెనుగు భాషలో మగవాఁడన రాజునకు శూరునకుఁ గూడ నర్థమేర్పడి యుండుటచేతను, మఘములు చేయుటకుఁ బూర్వమె పూజ్యత వహించియుండిన వారని స్పష్టముకాఁగలదు. ఇదివఱకు అంద్ర శబ్దమునకు ఇంద్రశబ్దమునకు సంబంధము గొంత కనుబఱచి యున్నాను. ఇప్పుడు తెనుఁగుభాషలో పురుషవాచక పదమైన మగశబ్దమునకు మఘశబ్దమునకు సంబంధము చూపుచున్నవాఁడను. బుద్ధిమంతులు సత్యమును మాత్రము గ్రహింపవలసియుండును. ఆర్యానార్య శబ్దములు జాతిభేదములు గల్పించునవి కావనియీనావ్యాసము యొక్క ముఖ్యోద్దేశము. 'మగవాఁడు, మగఁడు' అనుశబ్దములు 'మఘవాన్' శబ్దముయొక్క ప్రాచీనరూపములు. 'మఘవాన్' శబ్దమునుండి పుట్టినవి కావని నాయభిప్రాయము. అయిన నింకను బరిశోధించి తెలిసికొందము. జరాతుష్ట్రుల జెండా అవెస్తా (ఛందోవస్థానము) వేదము నందు 'మగవాన్' లేక 'మఘవాన్' అనుశబ్ద

ము గన్పట్టుచున్నది.[1] మఱియు 'హెరాడటస్' అనుచరిత్రకారుఁడు ప్రాచీన పారశీకదేశమునఁ బురోహితులను 'మగీ' లందురనియు, వారు పారస మీడుల తెగలకు సంబంధించినవారనియు వక్కాణించి యున్నాఁడు 'మార్టిన్‌హాగ్' అనునాతఁడు 'అవెస్తా' గాథలలోని 'మఘవాన్' అనువారే 'మగీ' లైయుందురని తలంచెనుగాని పెక్కండ్రు అంగీకరించలేదు. ఈవిషయమును గూర్చి కీర్తిశేషులయిన సి. పి. టీలెగారు 'ఐరేనియనుల మతము' అని వ్రాసిన గ్రంథములోఁ జర్చించియున్నారు. దీని భాషాంతరీకరణము జి కె. నరిమన్' అనువారిచే 'ఇండియన్ అంటిక్వేరీలో' ప్రకటింపఁబడినది.[2] 'మఘవాన్' లేక 'మగవాన్' అనఁగా దయాళులైన గొప్ప ప్రభువులని యర్థము చెప్పుచున్నారు. బాబిలోన్, అస్సీరియా, దేశములలోఁ (మగీ—మగా)లను వారికి మాంత్రికులని యర్థము. క్రైస్తవ వేదమగు బైబిలులోని 'జరిమియ' అనుగ్రంథములో 'నెబూచెడ్‌నజ్జర్' అను బాబిలోని యారాజు "యహుదీ (జుదియా-యదు దేశము") దేశముపై దండెత్తిపోయినపుడు 'Rab-Mag' (రబ్-మగ్) అనువాడు వెంబడించియుండెనని చెప్పఁబడియుండుటచేత నాతని మగీ లేక మగాలలోనివాఁనిగ గొందఱభిప్రాయపడుచున్నారు గాని యతఁడు బాబిలోను రాజుయొక్క సామంత ప్రభువనియె హీబ్రూ గ్రంథకర్తలయొక్క యభిప్రాయ మని టీలెగారు వ్రాసియున్నారు. అతఁడు మగీలకధినాథుఁడే యైనయెడల నతఁడు మీడియానుండి బాబిలోనుఁ బ్రవేశించియుండవలయును. అట్లు కాదని తోచుచున్నదని వ్రాసినారు. సుమేరియను భాషలో 'మగ' శబ్దమునకు 'గొప్ప' అనియు, 'శక్తిగల' అనియు 'ప్రకాశ'మనియు 'ప్రభవనియు' నర్థములుగలవనియు నర్థముగలదే కాని, పురోహితుఁడని మాంత్రికుఁడని యర్థములేదని టీలెగారువ్రాసియున్నారు. కాని'మగ' శబ్దము రెండర్థములలోను వాడఁబడియున్నది. ఒకటిచెడ్డది. రెండవదిమంచిది. పూర్వకాలమున దేవతలకు గురువులుగా నుండు 'మగీ లేక మగా లను' వారు స్వసంఘములపై వారికుండు మాంత్రికశక్తులనుజూపి యకార్యకరణములు చేయువారుగ నుండిరని తెలుచున్నవి. అందువలన మగవారిలోనే రెండుశాఖ లేర్పడినవి. ఆకాలమున మగజాతివారిలోని గురువులిట్టి కార్యములు చేయుచుండుటచేత వీరి సంఘగురువులని పేరుపెట్టి యసహాయులయిన ప్రజలు దూషించి యుందురు. వీరవలంబించిన దురాచారము మూలముననే యాకాలమున వైదికకర్మలచేయువారిలో భేదము లుదయించియుండును. మగజాతివారొకప్పుడు మహోత్కృష్టమైనదశ ననుభవించినవారగుట నిశ్చయము. అట్లు కానియెడల మగ శబ్దముతో సంబంధించిన Magnate, Magni-

1. In the Gathas, however, in some places the magvans are mentioned in whom Martin Haug saw the magians that were to be and whom he attempted to bring into rapport with maga, which is repeatedly met with. This view is now surrendered by all scholars.

2. The Indian Antiquary Vol XXXIV-1905 P. 60

tude, Magnanimity, Majesty శబ్దములాంగ్ల భాషలోనికి వచ్చియుండవు.

ఓ చదువరులారా!, పరిశోధకులారా!! మీ కొక్క ప్రార్థనము గావించుకొనుచున్నాఁడను. దయతోఁ జిత్తగింపుఁడు.

తెనుఁగుభాషలో 'మగ' శబ్దమునకు గల యర్థములే సుమేరియనుల భాషలోగల 'మగ' శబ్దమునకుండినవని చెప్పఁబడియుండుట చేత వారికిని ప్రాచీనాంధ్రులకు నేమైన సంబంధ ముండునేమో మనము విచారింపవలసి యుండును. ఉండినయెడ వారు భరతఖండమునకు వచ్చినవారో లేక భరతఖండమునుండి 'సుమ్మేరియారాష్ట్రమునకుఁ' బోయినవారో తరువాత విచారించుకొందము. మన మహాభారతములో మేరువున కుత్తరభాగమునఁ గ్రౌంచ ద్వీపము గలదనియు, అందు క్రౌంచపర్వతము గలదనియు, దానికి సమీపమునఁ గుశలదేశ మున్నదనియు, దానికిఁజేరి దిగువున మనోనుగ దేశమున్నదనియు, దానికిఁజేరి దిగువ నుష్ణ (ఉశన) దేశ మున్నదనియు, దానికిఁజేరి దిగువ ప్రావరక దేశమున్నదనియు, దానికిఁజేరి దిగువ అంధకారదేశ మున్నదనియు నీక్రిందిశ్లోకములలోఁ జెప్పఁబడియున్నది.

శ్లో. క్రౌంచస్య కుశలో దేశో వా మనస్య మనోనుగః
మనోనుగాత్పరశ్చోష్ణో దేశః కురుకులోద్వహ.

శ్లో. ఉష్ణాత్పరః ప్రావరకః ప్రావారాదాంధ కారకః
అంధకారక దేశాత్తుముని దేశః పరః స్మృతః.

అంధకారదేశమునకు దిగువఁ జేరి మునిదేశ మున్నదనికూడఁ జెప్పఁబడి యుండెను. (మ. భా. భీష్మ. ప. భూమిఖండము. అ.౧౨.)

పైని వక్కాణింపఁబడినవానిలోఁ గుశలదేశమె కృష్ణదేశమనియు, ఉష్ణదేశము ఉశనదేశమనియు, (Ushuns or Uigurs) అంధకారదేశమె అంధదేశమనియుఁ దలంచుట కవకాశము గలదు. ఉష్ణదేశములోని ప్రజలను ఉశనులని యెట్లు తెలిసికొనుచున్నామో, అంధకారదేశములోని ప్రజలను అంధులని తెలిసికొనవలసి యుండును. ఈదేశములన్నియు, చరిత్రకారులచే 'సుమ్మేరియా' రాష్ట్రమని యేప్రదేశమునకుఁ బేరుపెట్టబడెనో యాప్రదేశమునందే యుండుటచేతను, పైనిచెప్పిన 'మగ' శబ్ద సంబంధముచేతను మన ప్రాచీనులకు నాసుమ్మేరియనులకు గొప్ప సంబంధమున్నట్టు గన్పట్టుచున్నది. ఈసుమేరియనులు, ప్రాచీన పారశీక పార్థియా, మీడియాలను జయించి వాని మీదుగాఁ బోయి బాబిలోన్ అస్సిరియా రాజ్యములను జయించి యచ్చట 'కిష్' లేక క్రష్ రాజ్యములనుస్థాపించినటుల చరిత్రములవలనఁ దెలియుచున్నది. మనయింద్రుఁడు ఋగ్వేదమంత్రములలోఁ బెక్కులు దూర ప్రయాణములు గావించినటులు గనుపట్టుచున్నది. దీనికి నిదర్శనముగా యూప్రిటీసునదీ తీరమున Baghaz-Keui (బఘాజ్-కీయుయి) అనుప్రదేశమునఁ గనుఁగొనఁబడిన యొక శాసనములో మిత్తానిదేశ ప్రభువుచేఁ జేయబడిన యొక సంధి పత్రమున 'ఇంద్రుఁడు, వరుణుఁడు, మిత్రుఁడు, నాసత్యుఁడు' సాక్షులుగా నుదాహరింపఁబడి యుండుటచేతను, ఈ శాసనము క్రీ. శ. పూర్వము పదునేనవ శతాబ్దిలోనిదిగా బరిశోధకులచే నిర్ణయింపఁబడి యుండుట చేతను, జరాతుష్ట్రులు తమవేద

ములో 'ఇంద్రుని అంద్రునిగ' వర్ణించి దయ్యముగా భావించి యుండుటచేతను, మనకును వారికిని నత్యంత ప్రాచీనకాలముననే, యెక్కువ సంబంధములు గలిగి యున్నట్టు గన్పట్టుచున్నది. ఈనాగరికతల కన్నిటికి మూలస్థానము మన హిందూదేశమే యని తోఁచుచున్నది. అనఁగా నీజాతులన్నియు మొదట మన దేశమునుండియె యాస్వర్గభూములకుఁబోయి యారాజ్యములను స్థాపించినట్లు నేడు తెలిసికొనుచున్నాము. దీని యాథార్థ్యము గ్రహించుటకు మనకు సాధనములు దొరకుచున్నవి. శ్రీ వేంకటరంగయ్యగారివంటివారాంధ్రజాతులవారి పూర్వచరిత్రమును దెలిసికొనఁ గోరుదురేని వారు పరిశోధింపవలసినది శ్రీనాథుని భీమేశ్వర 'పురాణముగాదు. పైని నేను పేర్కొనిన విషయములను బరిశోధింపవలయును. అంధపురాణ మని తెలియక యెదో ప్రసంగించుటకాదు.



# ఎచటి కేగితిరి?

కె. అన్నంరాజశర్మ గారు

అమ్మ నాయనలార! మీ రరిగి నట్టి
దేశమెయ్యదియో నాకుఁ దెలియరామి
పాపసంకులమైన ప్రపంచ మందె,
హేయకాయంబు నింకను మోయుచుంటి.

కలువపూ రెక్కల హిమంబు గారువేళ,
అమృతరసలిప్తమైన పూర్వాబ్ధి మీరు
జలదనౌకను గూర్చుండి, చనెదరంచు
గాంచుచుందును బాష్పముల్ కనులఁదొరగ.

కారు మబ్బులు నిండిన కాళరాత్రి,
మేఘపఙ్క్తిని ఛేదించు మించులందు
గానవచ్చెదరో యన్న కనుల విచ్చి,
కాంచుచుందు విహాయసీ గవాక్షమును!

బాహ్య దృష్టికిఁ గనరాని పరమభూమి
నెందు వసియించుచుంటిరో యెఱుఁగఁగాని
సుతుఁడనై పుట్టి ఋణమును సుంతయైన
బాపుకొననైతి మీరలు బ్రతికి యుండ.

భౌతికజగం బసహ్యమై ప్రాణశల్య
మగుచు దోఁచెను మీరు లేనంతనాకు
కర్మతంత్రుల బంధనాగారమందు
నిలువ నేఁటికి దివి మిమ్ముఁ, గలిసికొనక

రమ్మురమ్మని విజనలోకమ్మునుండి
వీనులం గూరు కేకల వినియె నేను
రేయిఁ బవలును జీవనిశ్రేణి నెక్కి
వచ్చుచున్నాను వంతలవరద దాటి.

భావవీథిని మీవ్యక్తి ప్రతిఫలింప
చెప్పరాని విరాగపు చింతతోడ
జాఱు కన్నీటి ధారలన్ సరులఁగూర్చి
పంచి 'యిచ్చుచు నుందునే' ప్రణయవిధిని.

ప్రకృతి జీవితనాటక భాగమెల్ల
విరతి యొనరించి నన్నొంటి, విడిచి చనిన
నాటనుండియు మిమ్ము స్వప్నములఁగాంచి
సతము దుఃఖంపు శ్లోకముల్ చదువుచుందు.

"మల్లెపువ్వులు"



మదరాసు విశ్వవిద్యాలయమునకు నూతనముగా వైస్‌చాన్సలర్ పదవి
కెన్నుకొనబడిన ఆంధ్రుడు శ్రీయుత
దివానుబహాదరు సర్. రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు



పచ్చయప్పకళాశాల అధిపతులు ఫిజిక్సు ప్రొఫెసర్

డాక్టరు జయంతి చినకామేశ్వరరావు పంతులుగారు

ఎం. ఏస్. సి. పి. హెచ్. డి.

# పరపతి సంఘములు లేక 'బ్యాంకులు'

## అవి చేయగల్గు పనులు

రంగనాయకులు (డి. యి. పి) ఆక్సుఫర్డు సి. యస్. డబ్ల్యు.

మనదేశమునందు పరపతిసంఘము లనగా కోపరేటివు బ్యాంకులని సామాన్యముగా ప్రజలు తలంతురు. 'కోపరేటివు' బ్యాంకు లనగా, సహకారపరపతిసంఘములని యర్థము వచ్చుననియు, ప్రస్తుతము ప్రభుత్వముచే స్థాపించబడి, కోపరేటివురిజిస్ట్రారు, అసిస్టెంటు రిజిస్ట్రారుల యాజమాన్యముద్వారా సాగించబడు 'కోపరేటివు బ్యాంకులు' సహకారపరపతిసంఘములుగాని, పరపతిసంఘములు కావు. బ్యాంకు లనగా పరపతిసంఘములు; పరపతియనగా నమ్మకముచే కల్గు విలువ. ఒకమనిషి కెక్కువ పరపతి యొక్కచోట నున్నదనగా ఆమనిషియందు దితరప్రజలయందా ప్రదేశమున యెక్కువ నమ్మకము కలదనియు, అందుచే నతనికి, అప్పుకల్గుట, అతనిసలహాబొంది యతనిహామీపై యప్పుగోరువారికి యప్పుకల్గుట సాధ్యమనియు తెలియవలయును. ఆమనిషికి ఆప్రదేశమున పదివేల రూపాయల పరపతి యున్నదనగా, ఆతనికి పదివేలరూపాయలవరకప్పు ఆచోట దొరుకుననియు, అంతకంటె హెచ్చుగా యప్పుదొరుకుట కష్టమనియు యర్థము. కనుక, మనము పరపతి యనుమాటను రెండువిధములుగా, ఇంగ్లీషునందున్న 'Credit' అను మాటను వారెట్లుపయోగింతురో యటులనే యుపయోగింతుమనియు, పరపతిసంఘములు లేక బ్యాంకుల గూర్చి విచారించునప్పుడొక్కయర్థమునే యెల్లప్పు డుపయోగింపవలయుననియు తెలియవలయును. ఒక్కయర్థము 'పరపతి' యనగా నమ్మకము. రెండవయర్థము, ఆర్థికసంపద ననుసరించి, ఆనమ్మకముద్వారా గల్గు విలువ. ఒకమనిషిని మంచివాడనియు, ఇతరులకేలు కోరువాడనియు, అమితానుభవముకలవాడనియు యెరింగినను, ఆతనికి వ్యాపారము తెలియదనియు, ఆతనికి ధనము ఖర్చిడుట తెలియదనియు తెలిసినచో, ఆతనికి 'పరపతి' యాప్రదేశమున గలదని మొదటి యర్థముప్రకారము తెల్పవచ్చు. పరొకమనిషి, తీసుకున్న యప్పు తిరిగి సరిగా యిచ్చుననియు కొంతయాస్తిగల్గి, జయప్రదముగా వ్యాపారము చేయగలడనియు తెలియవచ్చుచో, ఇతరులాతని కప్పునిచ్చుట కంగీకరింపుచో, ఆతని కచ్చుట రెండవయర్థముద్వారా పరపతి యున్నదని చెప్పవచ్చు.

కనుక రెండవయర్థానుసారమే మనమిచ్చట 'పరపతి' యనుమాట నుపయోగించు చున్నారమనియు, అట్టిపరపతి కల్గినవారికి 'పరపతి' నిచ్చు సంస్థలే బ్యాంకులు లేక పరపతిసంఘములనియు తెల్లము. ఇచ్చటగూడ నొక విషయము గ్రహించవలయు. పైన తెల్పినటుల నొక మనుష్యున కొక ప్రదేశమునందు కొంత మొత్తము, అప్పుద్వారా లేపుటకు శక్తికలదు. ప్రస్తుత మింత లేపగలడను సాధారణనమ్మకమెగాని, గట్టిగా, లేపగలడా లేడా యను ప్రశ్న నిచ్చుచో దృఢమగు సమాధానము చెప్పలేకపోవచ్చు. అట్టిప్రశ్నకు సమాధానము నిచ్చుటకు 'పరపతిసంఘము' ద్వారా సాధ్యమగు. కనుక పరపతిసంఘ మిచ్చు 'పరపతి' ఆమనుజునకుండు పరపతిపై నాధారపడియుండు, కనుక 'పరపతి' యనుమాటకు వచ్చు మూడర్థముల నెప్పుడును ముందుంచుకొని, 'నమ్మకము' అను మొదటి యర్థమును వేరుగా నుంచి, నమ్మకముచే గల్గువిలువ' యను రెండవయర్థమును, నమ్మకముచే గల్గు విలువయొక్క పరిమితి యను మూడవయర్థమును, మనప్రస్తుతవిషయమున కుపయోగించునని గ్రహించవల

యును కాన, 'బ్యాంకులు లేక' పరపతిసంఘములు చేయుపని యేమి? అసలు పరపతి సంఘములేవి? యను ప్రశ్నలకే ప్రశ్నలు కలవు? ఇతరులకు పరపతి నిచ్చునవి పరపతి సంఘములు లేక బ్యాంకులు; ప్రజలకు 'పరపతి' యెట్టులుండునో యటులనే, పరపతిసంఘములకు లేక బ్యాంకులకుకూడ 'పరపతి' యుండుగదా! బ్యాంకు కిచ్చిన ధనమెచ్చటకు పోదనియు, భద్రముగ నుండుననియు, అడిగినప్పుడు తిరిగివచ్చుననియు కల్గునమ్మకము, బ్యాంకు కున్న 'పరపతి' కనుక బ్యాంకుచేయుపని ఇతరులకు పరపతి నిచ్చుట, ఇతరులవద్దనుండి పరపతిబొందుట' లేక ఇతరుల కప్పు నిచ్చుట, ఇతరులనుండి యప్పుగొనుట. బ్యాంకు యనగా అప్పు లిచ్చి పుచ్చుకొనుటతో వ్యాపారము చేయు సంస్థ యని పైనతెల్పినదానిబట్టి తెలియుచున్నది. 1 పరపతిసంఘములు సహకారపరపతిసంఘములు కావు. 2 'పరపతి'యను మాటకు మూడర్థములు కలవు. (అ) నమ్మకము. (ఆ) నమ్మకముచే కల్గు విలువ (ఇ) నమ్మకమునే కల్గు విలువయొక్క పరిమితి. 3 ఇతరులకు పరపతి నిచ్చునవి బ్యాంకులు 4 బ్యాంకులు చేయు పని: ఇతరులకు పరపతినిచ్చి, ఇతరులనుండి పరపతి నొందుట 5 బ్యాంకు యనగా అప్పు లిచ్చి పుచ్చుకొనుటతో వ్యాపారముచేయు సంస్థయనియు నర్థమే.

మనదేశమునం దిట్టిసంస్థలు ప్రస్తుతపుబ్యాంకులకు మించి ప్రత్యేకముగా నున్నవా? సంస్థలు' లేవు కాని, ఆబ్యాంకులపనినే నెరవేర్చు ప్రజ లనేకు లున్నారు. మార్వాడీలు గుజరాతు, హైదరాబాదునుండివచ్చి, తెల్గుజిల్లాలయందు తమలక్షలకొలది ధనము నప్పుల కిచ్చుచు, అమితధనము సంపాదించుచున్నారు. మనకోమట్లు, తమ ధన మప్పుల కిడి ధనము బొందుచున్నారు. మన కమ్మవారు, రెడ్లు, వెలమ, తెలగవారు, కొందరు బ్రాహ్మణులు, వీరియందు చాలమంది యప్పుల నిచ్చుచు, అధిక ధనము గణించుచుండుట సర్వప్రజాయసిద్ధముగ వచ్చుచున్నది. సాహేబు షావుకారులు, బాకీ లిచ్చి ధనముచేయుచున్నారు. ఇటుల సంఘమునందున్న యన్ని భాగములవారియందు, అప్పుల కిచ్చువారి గాంచుచున్నారము. కాని, పైన మనము పేర్కొన్న 'సంస్థలు'గా వీరిలో నిచ్చుటను పరపతిసంఘములు బయలుదేరి వచ్చు టంతగా లేదు. తరువాత, ఇటుల నప్పులిచ్చువారందరు, ఇతరుల వద్ద నప్పుడప్పు డప్పుల తెచ్చుచుండుట సాధారణముగా జరుగుచునేయున్నది. తామెవ్వరి కెంత యప్పులో యున్నది, తమకితరు లెంత యప్పుల నివ్వవలసియున్నది లెక్కించుట ప్రతిషావుకారునకు నుదినానుభవమే! ఒకలక్షాధికారు డుండునో, అత డప్పుల కిచ్చు ధనము, ఆలక్ష'వరకే పరిమితిబొందియుండు. ఆతనికి, ఆలక్షవరకే, ఇతరు లప్పుల నిచ్చుట కివ్వ ధైర్యము చేయుదురు." కాని సాధారణముగా, అతడెప్పుడు, ఏబదివేలకంటె నప్పులందు తన ధన ముంచడు. మిగత యేబదివేలను భూములు, గృహములు, సొమ్ములు, స్థలములం దిడును. ఆతని కప్పుల నిడువారు, ఆతనికి రావలసిన ధనముపై సాధారణముగా నమ్మకముంచరు. కాని యాతని స్థిరాస్తిపై నమ్మకము గల్గియుండి, షుమారు ముప్పదివేలకంటె యెక్కువనప్పుల నీయ సాహసించరు. ఇట్లనుటచే, తమకున్న ధనమునంతయు అంతకు మించియు, అప్పులకిచ్చు ఆసాము లుండుట లేదనిగాని, తమకున్న స్థిరాస్తికంటె యధికముగా యితరులవద్ద ధన మప్పుల బొందుచుంట లేదనిగాని చెప్పుటకు వీలులేదు. మన దేశమునందు, ఏషావుకారునకెంతధనమున్నదను విషయము, జన వాడుక, షావుకారులందు గల పలుకుబడి ననుసరించి యాధారపడియుండును గాని, ఆషావుకారునకున్న ధనముపై గా దేర్పడునది. అందువలన, కొంతమంది షావుకారుల కున్న ధనముకంటె తక్కువ వాడుక పుట్టును. మరికొంతమంది కున్న ధనముకంటె హెచ్చువాడుక పుట్టును. కొంతమంది షావుకారులు విజయము వ్యాపారము బొందుచున్నను, నష్టముబొందుచున్నా రను వాడుక కల్గును. మరికొంత మంది షావుకారులు నష్టము బొందుచున్నను, లాభమొందుచున్నారను వాడుక పుట్టు. ఇందువలన, కొందరు షావుకారులు తమకున్న ధనముకంటె హెచ్చుధనములో అప్పులనిచ్చుచు, అప్పులగొను వ్యాపారముచేసి త్వరితముగ అధికధనవంతు లగుటయు, మరికొందరు షావుకారులు తమకున్న ధనముకంటె తక్కువధనముతో నట్టివ్యాపారము చేసి హెచ్చుగా సంపాదించలేకుండుటయు చూచుచున్నారము. కొందరు షావుకారు లిట్టి 'వాడుక'పై యాధారపడి, హెచ్చుధనముల నప్పుగొని, పరదేశముల కురుకుటయు, మరికొందరు వ్యాపారమున నపజయముబొంది అప్పుల నిచ్చిన వారి, కాని

ద్వారా వారికప్పుల నిచ్చినవారిని 'దివాలా' యందు దింపి బ్యాంక్రప్టసీ కోర్టునకు వెళ్లుచుండుట జరుగుచున్నది. ఒకప్పుడు శిస్తులు గోరు ప్రభుత్వోద్యోగులు పీడాకరులై, శిస్తులధికముగనున్న, తమకున్న ధనముకంటె తక్కువవారమని తెల్పి, వాదుకబుట్టించుట జరుగుచుండును. కొన్ని ప్రదేశములందు మరొకప్పుడు 'సాహుకారు' అనిపించుకొని గౌరవము బొందవలయుననే యాశతో, ఉన్న ధనముకంటె, హెచ్చుగా గలవారమని వాదుక కొన్ని ప్రదేశములందు బుట్టించుటయు సంభవించు. ఇటుల అప్పుల నిచ్చి, అప్పుల పుచ్చుకొను వ్యాపారము దేశమందంతట, చాలమందిచే నడుపబడుచున్నది. ప్రతిగ్రామమున యిట్టి సాహుకారులున్నారు. ఎల్లకాలములందు యీ వ్యాపారము సాగుచున్నది. బ్యాంకులు లేక పరపతిసంఘముల నడుపువారి 'సాహుకారు'లనుట మంచిది. పైన జూపినటుల 'సాహుకారులు' బ్యాంకులు చేయు పనినే చేయుచున్నారు. కొన్ని భేదములు కలవు. మనసాహుకారులు, అప్పుల నిచ్చిపుచ్చుకొను వ్యాపారమున కనుబంధముగా యితరపనులు చేయుచున్నారు. మరికొందరు సాహుకారులు, ఇతరపనుల కనుబంధముగా అప్పులనిచ్చి పుచ్చుకొను వ్యాపారముం జేయుచున్నారు. మనగుజరాతీ హైదరాబాదు మార్వాడీలు, వడ్డీవ్యాపారము చేయుచుండుటయేకాక, వారిలో కొందరు గుడ్డల వ్యాపారము, మరికొందరు బంగారు వెండి రాగి యాదిగాగల లోహములందు వ్యాపారము, మరికొందరు మిఠాయిదుకాణవ్యాపారము చేయుచున్నారని మన మెరుంగుదుము. మన కోమట్లు వడ్డీ వ్యాపారము చేయుటయేగాక, పొగాకు, మిర్చి, పసుపు 'ఖాయిదా' వ్యాపారము, అమ్మట కొనుట వ్యాపార మీవస్తువులు వస్త్రములు లోహములు సకల ధనధాన్యములందు వ్యాపారము చేయుచుండుట ప్రతిచోటను చూచుచున్నారము. మనరైతులందును కొందరు 'వడ్డీవ్యాపారము'న కనుబంధముగా కొంత వ్యవసాయపుపనిని, మరికొందరు రైతులువ్యవసాయపుపని కనుబంధముగా 'వడ్డీ' వ్యాపారమును చేయుచున్నారు. అటులనే మనవసామ్మదీయసాహుకారులు, 'వడ్డీ' వ్యాపారముతో బాటు తోళ్ల గుడ్డల కొంపరవ్యాపారముల చేయుచున్నారు. కనుక, ఇంగ్లీషు యార్థికశాస్త్ర పండితు లిదివరకు తలంచుచున్నట్లు, మనబ్యాంకరులు లేక సాహుకారులు, ఇతర 'పనుల' జేయుచు 'వడ్డీ' వ్యాపారము చేయుచున్నారని గాని, మన బ్యాంకరులు లేక సాహుకారులు 'వడ్డీ' వ్యాపారము చేయుచున్నారన్న, అప్పుల నిచ్చువారేగాని అప్పులపుచ్చుకొను వారు కారనికాని భావించుట తప్పు. అట్లని, మనసాహుకారులని పిలువబడువారందరు 'నిజముగా' అప్పుల నిచ్చి పుచ్చుకొనువారని తలంచుటగాని, 'వడ్డీవ్యాపారము' చేయుటయే ప్రధానవృత్తిగా గొనువారనిగాని తలంచుట తప్పు. కనుక యిచ్చటొక తృణమాగి, ఈమాటల తంటాలను వదలింతము 'సాహుకారు'లను తరగతియందు, వర్తకులు, ఖాయిదాదారులు, వడ్డీవ్యాపారులు వచ్చుచున్నారుగాన, ఎప్పుడేయేవారి మనము తలంచుచున్నది ప్రత్యేకముగా తెలుపకున్న, అర్థముచేసుకొనుట చాల కష్టము. కాన, మన ప్రస్తుతవిషయమునకు సంబంధించినవారినందరి, అనగా, అప్పుల నిచ్చి పుచ్చుకొనువారి నందరిని 'వడ్డీవ్యాపారు ల'ని పిలుచుచు, అమాటసే పరపతిసంఘ ప్రపంచమున వాడుట మేలని హెచ్చరించుచున్నాను. తరువాత, ప్రథమముననే 'అప్పుల నిచ్చి పుచ్చు'కొనుటలో గల ద్వంద్వపద్ధతి బాగుగ జూపెట్టిననేగాని విషయము బోధపడదని 'అప్పుల నిచ్చి పుచ్చుకొను వ్యాపారమ'ని పిలువ ప్రారంభించితి. ఇప్పటికా వ్యాపారపుపద్ధతి గ్రాహ్యమగుగాన, ఆవ్యాపారమునే యే వ్యాపారపుమాటచే మనప్రజలు పిలుతురో, అట్టి వడ్డీవ్యాపార మను పదముచే పిలువ ప్రారంభించవచ్చును. సాధ్యమగునంతవరకు, క్రొత్తపదముల సృజించుటకంటె, సహజముగా వ్యాపారు లుపయోగించు పదములనే, తగు జాగ్రత్తతో, ఆర్థికప్రపంచమున వాడుట, ఆర్థికశాస్త్రజ్ఞుల ధర్మము 1. అప్పుల నిచ్చి పుచ్చుకొనువారు, సాహుకారులం దొకతరగతికిం జెందిన 'వడ్డీవ్యాపారులు' 2. అప్పుల నిచ్చి పుచ్చుకొనువ్యాపారము 'వడ్డీవ్యాపారము' 3. బ్యాంకరు లనగా, 'వడ్డీవ్యాపారులు' 4. బ్యాంకింగు యనగా వడ్డీవ్యాపారము 5. మర్చంటు లనగా వ్యాపారులు 6. కమీషనర్లు అనగా ఖాయిదాదారులు.

ఇంతవరకు మనదేశమునం దిదివరకే, దేశమునందంతటను బ్యాంకింగు జరుగుచున్నదనియు, బ్యాంకరులున్నా

రనియు, బ్యాంకు లున్నవనియు, లేక వడ్డీవ్యాపారము జరుగుచున్నదనియు, వడ్డీవ్యాపారులున్నారనియు, 'అప్పుల నిచ్చి పుచ్చుకొను, వడ్డీవ్యాపారముచేయు ఖజానా లున్నవనియు తెల్లము. కనుక, బ్యాంకింగు లేక వడ్డీవ్యాపార మింగ్లీషువారు మనమధ్య పెట్టుచున్నారని గాని బ్యాంకింగు లేక వడ్డీవ్యాపారము యూరపియనుదేశపు వ్యాపారముగాన మనము అవలంబించరాదనికాని చెప్పుట, తలంచుట వెర్రి.

ఐనచో మన బ్యాంకింగుకులేక మనవడ్డీవ్యాపారమునకు ఇంగ్లీషువారి 'బ్యాంకింగుకు' భేదమేమి? మనవడ్డీవ్యాపారము చాల బాల్యావస్థయం దున్నది. అందువలన మనవాణిజ్యాభివృద్ధికి సహాయభూతముగ తగినంతగ నుండుట లేదని చెప్పుటలో యర్థమేమి? ఎందులకు సహకారపరపతిసంఘముల స్థాపించుచున్నారము? అను ప్రశ్నల వచ్చువ్యాసములందు విచారింతము. ప్రస్తుత మిచ్చట బ్యాంకింగు లేక వడ్డీవ్యాపారము ప్రస్తుతవాణిజ్యపుస్థితియందు యెట్లుండవలయు నను విషయము మాత్రము చర్చించబడు.

పై ప్రశ్నగూర్చి యాలోచించుటకు ముందు, బ్యాంకులు లేక పరపతి సంఘములు చేయగల్గుపనులను తెలుసుకొనవలయును. మొదటిపని(Credit giving) పరపతి నిచ్చుట. రెండవపని:(Deposits)పరపతి గొనుట: మన దేశమునందు రెండవపని మొదట ప్రారంభముకావలసియున్నది. ఇంగ్లండు దేశమునందు ఇతరనాగరికత బొందిన దేశములందు పరపతి నిచ్చుట పరపతిసంఘముల ప్రథమ ప్రధాన కార్యముగ నుండుచున్నది. ఆదేశములందు, ప్రత్యేకముగా, ఇంగ్లండు, అమెరికా దేశములందు ప్రతివాడు తనధనమును పరపతిసంఘమునం దుంచును. తనకు ప్రస్తుత మక్కరలేనిధనమును, రెండువిధములుగా వడ్డీకిచ్చును. ఒకటి జాయంటు స్టాకు కంపెనీలయొక్క షేరు పట్టాలగొనుటయందు కొంతధనము వడ్డీ కిచ్చును. రెండు బ్యాంకులు లేక, పరపతిసంఘములందు(Fixed deposits) లేక మనవాడుక ననుసరించి, వడ్డీకి కొంతధనము బెట్టును. దినదినమునకు వాడుకచేయవలసిన ధనము, వారము వారమునకు ఖర్చీడబడు ధనమును, మనవాడు చేతిలోని ధనము నుదాసని, పరపతిసంఘములందు, (Current Deposits) లేక పెట్టెలోని ధనముగా నుంచును. ఇటుల, ప్రజలయం దనేకుల ధనము, వడ్డీకొరకై గాని, పెట్టెలోని ధనముగా నుండుటకుగాని, పరపతిసంఘములందు, అనుదినము పెట్టబడుచుండు. ఈధనముయొక్క విలువ, ఈ వ్యాసము చివర పెట్టినపట్టీల గాంచిన తెలియగలదు. ప్రతి వర్తకుడు, తనకాదినము వచ్చిన ధనమును, పరపతిసంఘమునందు పెట్టును. ప్రతిదుకాణదారుడు తనగల్లాపెట్టెను పరపతిసంఘమునందు ప్రతిదినము ఖాళీచేయును. ప్రతి పనివాడు తనవారపుజీతమునందు కొంతభాగమును పరపతిసంఘమునందుంచు. ప్రతియజమాని ప్రతికర్మాగారపుటధికారి, తనధనము పరపతిసంఘమునందు బెట్టు. ఏయింటియందు నాల్గయిదుదినములకు కావలసిన ధనముకంటె హెచ్చుధన ముండదు. పనివారియిండ్లలో తప్ప రైతులు, వ్యాపారులు, ఖాయిదాదారులు, ప్రభుత్వోద్యోగులు, ఇతరచిల్లర జీతముల కుండువారు, దుకాణదారులు, స్త్రీలు, పురుషు లిట్లనుదినము తమతమధనము పరపతిసంఘములం దుంచుచున్నారు. ఖర్చిడవలసివచ్చినప్పుడెల్ల, పరపతి సంఘమునకు వెళ్లి, ధనము తెచ్చి, ధనముగోరు వ్యాపారులు, లేక, దుకాణదారులు, ఇతరుల కివ్వవలసిన యగత్యములేదు సరిగదా, అటుల చేయరు. ధనముగోరువారికి తమబ్యాంకు లేక పరపతి సంఘముయొక్క 'చెక్కు' ధనముకోరు రశీదుపై చెల్లింపవలసినధనము మొత్తము, ఎవరికి చెల్లింపవలసినది తెల్పుచు దస్కతుబెట్టి ఆరశీదు 'లేక' చెక్కునాయాప్రజలకిత్తురు. ఆప్రజలు, ఆచెక్కు తమకువద్దు, ధనమీయుమని, చెక్కు నిచ్చువారినెరుంగుచో కోరరు. అంత చెక్కులనుబొందిన ప్రజలు, సాధారణముగా, వానినితమతమపరపతిసంఘములం దిత్తురు. ఆపరపతిసంఘములు, ఏపరపతిసంఘముపై వ్రాయబడినవో యీచెక్కులు, ఆపరపతిసంఘమున కీచెక్కుల నిచ్చి ధనము తెచ్చి, తమసభ్యుల లెక్కలందు బెట్టి వారికి కావలసినప్పుడుధనమిచ్చెదరు. ఇటుల ధనముపయోగించుట తగ్గించి, చెక్కులద్వారా పరస్పరముగా ధనము చెల్లించుకొనుచు, తమధనమునంతను, పరపతిసంఘములందు బెట్టుచుందురు. ఇందువలన రెండులాభములు కల్గుచున్నవి. (అ)ప్రతివారు తమతమయిండ్లయందు తమధనము తమ పెట్టెలయందు భద్రముగదాచిపెట్టుకొనవలసినయగత్యము

పోవుచున్నది. ధనికులు, ఎప్పుడు దొంగలువత్తురో యని, దీపములు పెట్టుకొని, గుండెలు దడదడకొట్టుకొనుచుండ సరిగా నిదురపోక, పాయుగ బొమ్మపై చేయివేసుకొని సుఖపడ నోమునోచుకొనక నానావస్థలు మనవారు పడు చున్నట్లు వారు పడుట లేదు. మనదేశములోవలె, ఇనుప పెట్టెలవ్యాపార మంతవృద్ధిగా యాయాదేశములందు లేదు. ఏలనన, ప్రజల కాపెట్టె లనవసరము. కంతలువేసి, ఇంటి లోని వారి తలల పగులగొట్టి, కన్నములు పడకటిండ్లలో వేసి, ఇనుప పెట్టెల పగులగొట్టి దొంగిలించి, సహాయము చేసిన దేవతలకు కొల్పులుగొల్చి తందనాలెక్క వేలకొలది దొంగలు మనదేశములోవలె నచ్చట లేరు. ఇనుపపెట్టెలవలె, కిటికీలు లేకుండా, కొన్నియున్నను, పిల్లిరాలేనంత చిన్నవిగ, ఒకవేళ పెద్దకిటికీలున్నను, ఇనుపకడ్డీలతో బంధించుట, గట్టిగోడల, పెద్దరాయి, లేక, కోరుకొంపె రాళ్లతో కట్టించుట, గట్టిదర్వాజాల నేర్పరచి, తలుపు బ్రద్దలుచేయను, ఇనుప, ఇత్తడిసబ్బల తలుపు లంతటబెట్టి ప్రహరీగోడయుండమంత పోవునట్లుఅద్దపు పెంకుల నెత్తిపై గుచ్చి, అమితధనము మనముదృధాగా నచ్చించుచున్నట్లు వారు వ్యయపెట్టుటలేదు.

ఇంగ్లండుదేశమున యిట్టుల దొంగిలింతమన్నను దొరకు ధనము తక్కువగుటవలన దొంగలసంఖ్య తగ్గించుటకు చాలవరకు తోడ్పడుచున్నది. మనదేశమున పోలీసు వారి కింతపని కల్గుటకు మనయినుపపెట్టె లెంతవరకు కారణమో విచారింపవలసియున్నది. ఇంగ్లండుదేశమునందు ప్రతియింటియందనేక కిటికీలుండు. ప్రతిపడకగదియందు ఒకభాగమంతయు కిటికీలతో నేయుండు. ప్రతి భోజనశాలయందొకప్రక్క యంతయు పెద్దకిటికీయే. ఈకిటికీలమధ్య యినుపకమ్ములు పెట్టుటనుమారు, సన్నని యద్దపు తలుపులమాత్రము పెట్టెదరు. గదులయందు, అద్దముల పగులగొట్టి చేరుట యెంతయో సులభము! ఐనను దొంగతనము తక్కువచ్చట. పొలములందు, ఒంటరిగా నిట్టి గృహములందు గ్రామముల కెంతదూరముననో ప్రజలు నిర్భయముగ నిద్రించుచుందురు. ఇదియు పరపతిసంఘములందు ధనమునుంచుటచే వారికి కల్గుచున్న లాభములలో నొక్కటి.

(ఆ) పరపతిసంఘములకు పైనతెల్పిన పద్ధతివలన మరొకలాభము కల్గుచున్నది. ఇతరుల కప్పునిచ్చుటకు, పరపతిసంఘములకు ధన మగత్యము. ఈ వ్యాసము చివర లెక్కల జూచువారి కంతధనము, ఏపదిమంది ఏవేయి మందిధనవంతులు తమధనమంత బ్యాంకులందు పెట్టినను సరికాదని తెల్లము. అందువలన ప్రజలందఱట్లు తమ ధనమునంత బ్యాంకులందు పెట్టి, బ్యాంకుల తాత్కాలికముగా ధనవంతముగఁ జేయుటవలన బ్యాంకులందు, కోటానకోట్లధనముండుటయు, వేలకొలది కోట్ల ధనము బ్యాంకు లితరుల కప్పుల నిచ్చుటయు, తద్వారా వడ్డీని బొంది, లాభముల నందుటయు జరుగుచున్నది. ఇంత ధనము బ్యాంకులందుంచి, బ్యాంకులద్వారా వ్యాపారుల కన్నివిధముల నప్పులనిడి, వ్యాపారముల నిరభ్యంతరముగ నభివృద్ధి నొందించుచుండుటవలననే దేశపువాణిజ్యము హెచ్చె. ప్రజలయైశ్వర్యము వృద్ధియగుచున్నది. ఇచ్చట ఈచివరఁ దెల్పినసుఖము లెట్లుకల్గునో తెల్పుటకు వీలు లేదుగాని, ప్రజలయొక్క ధన మప్పుగొని, వారికి వడ్డీ చెల్లించి లాభమెటుల బ్యాంకులు బొందునో కొద్దిగా సూచించు టిచ్చట సాధ్యము. ప్రజలిచ్చు ధనమునకు వడ్డీని కొంచెము తక్కువరేటుప్రకార మిచ్చి, ఇతరులకు తాము కొంచెము హెచ్చువడ్డీల కప్పులనిడుటవలన కొంతలాభము వచ్చును. దినదినమునకు వలయు ధనము నంత నొక్కవారమే ధనమునుంచినప్రజలుకోరరు గనుక, అట్టి పెట్టెలోని ధనము లేక (Current Deposits) లోనుండి చాలభాగపు ధనమును, దినదినమునకుగా, వర్తకులకు నడ్డీలకిచ్చి వంకకు ఇలకు బేడ లేక పావులావడ్డీ చొప్పున ఒకటి, రెండు, మూడు, నాల్గుదినములకు మాత్రమిచ్చి లక్షలకొలది ధనము సంపాదింప సాధ్యము. మొదటివిషయము నిప్పుడు విచారింతము 'అప్పుల నిచ్చుట' యెట్లో, ఎందుల కప్పుల నివ్వవలయునో, అందువలన కల్గులాభము లెవ్వియో చూతము. దృష్టాంతపూర్వకముగా తెల్పెద. ఒకచిన్న బస్తీ కలదనుకొందము. అందొక్కటే బ్యాంకు కలదు. అచ్చటి ప్రజలందరు, ఆబ్యాంకునందే సభ్యులై దానియందే తమధనము బెట్టుచు, దానినుండియే యప్పులను బొందుచున్నా రనుకొందము. అ,ర,ల, న,శ,మ, సయను వర్తకులు, బ్యాంకువద్దకు, అప్పునకై వెళ్లినారనుకొందము. బ్యాంకు ఒక్కొక్కటికి పదివేలు అప్పు

నిచ్చెదనని వాగ్దానమిచ్చినది. అనగా బ్యాంకు 70 వేలకు వీరికి పరపతి నిచ్చినది. వీరు, తమకు ఒక్కొక్కరికి పది వేలరూపాయలు బ్యాంకులో నున్నదనుకొనవచ్చు. అంత, 'య' అనువాడు కొన్ని వస్తువులు 'ర' అనువానివద్ద కొని వేయిరూపాయలు బాకీపడి, అందులకొక చెక్కు తమ బ్యాంకిపైనిచ్చు అంత 'ర' 'ల' వద్ద ఐదువేలరూపాయలకు కొన్నివస్తువులు కొని, వానికొక చెక్కునిచ్చు 'ల' అనువాడు 'వ' అనువానికి నాల్గువేలకు, 'వ' అనువాడు 'శ'కు ఐదువేలకు 'ష' అనువానికి 'శ' అనువాడు నాల్గువందలు, 'ష' అనువాడు 'స' అనువానికి వేయిరూపాయలకు, ప్రతివాడు ఇతరవర్తకులకు, వేయిరూపాయలకు, ఆబ్యాంకిపై చెక్కుల నిచ్చినారనుకొందము. అంత చెక్కులను బొందినవారెల్లగు వానిని బ్యాంకుకి తీసుకొని వెళ్లి, పరపతిసంఘమునందుంచెదరు. వీరిలో నెవ్వరుపరపతిసంఘమునుండి బయటికి ధనము తేబోరు. క్రొత్తగా వచ్చిన చెక్కులను తమధనమునకు కలుపమనియే పరపతి సంఘమును గోరెదరు. జరుగు పర్యవసానమేమి?

| | | |
|---|---|---|
| య | 10,000—(1000 + 1000) | 8,000 |
| ర | 10,000—(5000 + 1000) + 1000 | 5000 |
| ల | 10,000—(4000 + 1000) + 5000 | 10,000 |
| వ | 10,000—(5000 + 1000) + 4000 | 8,000 |
| శ | 10,000—(400 + 1000) + 5000 | 13,600 |
| ష | 10,000—(1000 + 1000) + 400 | 8,400 |
| స | 10,000—(1000) + 1000 | 10,000 |
| ఇతరులు | + (7000) | 0007 |
| మొత్తం | 70,000—23,400 + 26,400 | 70,000 |

పైపట్టికవలన తెలియు విషయములెవ్వి? బ్యాంకు డెబ్బది వేలు, ఏడుగురువర్తకులకు అప్పునిచ్చినది. వీరు తమలో తమకుకాదితరబ్యాంకుమెంబరులకీధనమునందు కొంతభాగము (26,400 రూపాయల) నిచ్చుకొనిరి. ఈధనమును వీరివీరికి బ్యాంకు చెల్లించినది. కనుక యిరువదియారువేల నాల్గువందలపై, ఆవర్తకులు, వడ్డీని బ్యాంకుకు చెల్లించవలసియున్నారు. బ్యాంకు చేసినదెల్ల, ఇంతధనమును తన బొక్కసమునుండి వీరివీరి కిచ్చుచుండుటకాదు. ఒకరి కివ్వదగు పరపతినుండి కొంతతగ్గించి, ఆచెక్కువలన చెందదగువారి కామొత్తమును హెచ్చించి, ఇటుల, ఒకొక్కరికివ్వదగు పరపతిని తగ్గించుటో, హెచ్చించుటో పరిస్థితులబట్టి చేసి, తనబొక్కసమునుండి యొక్కదమ్మిడీనైన బయటికి పంపకయే, లెఖ్ఖలలో కూడిక, తీసివేతలతో పనిపూర్తిచేసినది. వర్తకులొక్క ఇంతమాత్రము పరపతి పుట్టునను నమ్మకమే లేనిచో, ఇంతవ్యాపార మింతచుల కనగ, ధైర్యముగ చేసియుండకపోవచ్చు. బ్యాంకు యిచ్చిన ధైర్యముచే, బ్యాంకు యిచ్చిన పరపతిద్వారా యిరువది యారువేల నాల్గువందల వ్యాపారముచేయుటకు శక్తికల్గెరి. ప్రతిసుకొనదారునకిట్లు కొంతధనమునకు బ్యాంకుపరపతి నివ్వవచ్చు. కొన్నిలక్షల వ్యాపారము సాగవచ్చు. వ్యాపారము చేయగల శక్తిగల్గిన, వ్యాపారమునందు లాభము చేయగల్గిన ప్రతివానికి తగినంత పరపతి నొసంగి, ప్రోత్సాహపరచి, బ్యాంకు, వారిచే నన్ని వ్యాపారములు జేయించి వ్యాపారాభివృద్ధి నొందించుటకు వీలుకల్గును. ధనము లేక, ఎందరో యనుభవజ్ఞులైన వ్యాపారులు చిన్నచిన్ని దుకాణములతో బాధపడుచుండవచ్చు. పూరికూటి యిండ్లను నష్టపుటం దతినేర్పరితనము కల్గిన మునలమ్మలు తగినంత ధనము లేక, హోటలుకట్టించకుండవచ్చు. మంచిహోటలు గట్టించి, పడవకాల్వలద్వారా రహదారుల నేర్పరచి, లాభము బొందగల్గినవారనేకులు పరపతిలేమిచే చిన్నబోటులతో నాల్గుదమ్మిడీలు సంపాదించుకొని గంజి త్రాగుచుండవచ్చు. పరపతిలేమిచే రైతులు ఎరువుల వేయక, బంజరుభూముల సాగుచేయక, పరపతి లేకపోవుటచే గనులనుండి లోహములు తీయక, పెద్దకాలువల నుండి పంటకాలువ దీసి వ్యవసాయముచేయక, మెట్టభూములందు కోనేరుల నేర్పరచి భూమిసాగుచేయించక ఊరకొనుట గల్గువచ్చు. వీటియన్నిటివలన, హెచ్చుగా 'పని' లేమిచే పనివారిలో హెచ్చుమంది నిరుద్యోగులై గర్భదారిద్ర్యమునం/దుండవచ్చు. ఉద్యోగము చేయుచున్నవారు తగినంత కూలి సంపాదించలేక, ఒంటిపూట భోజనములో సంతృప్తి నొందుచుండవచ్చు. ప్రజలందరు కుర్చీలు, కమిసీమంచములు, తపటాబల్లలు, స్టూలులు కోరవచ్చు. పనివారందరు, మంచియిండ్లు నాపరాళ్ల మంచిసీటలు, బంగారుసొమ్ములు అనుభవముగువస్త్రములు సుఖము గల్గించు పరమాన్నములు అభిలషింపవచ్చు. వ్యాపారులందఱు ఇండ్లు

కట్టుటందు కంచరసామాను, కొయ్యపనిముట్లు భోజన పదార్థములు, వస్త్రములు, గొడుగులు వీనిచేయించుటందు, కొనియమ్ముటందు ఇతరులు పరముగా కొని యమ్ముటందమితలాభము కల్గుట కనకాళము లున్నవని, పీలైన యాపీనుల చేర్చుటయని యుత్సాహపడుమండ వచ్చు. ఈపనిముట్లన్నిటి చేయగల్గినవారు కంసాలివారు, బంగారుపనివారు, కమ్మర, కుమ్మరవారు, ఎరువుగలవారు, ఓడలు, పడవలచేయువారు, వస్త్రములనేయువారు, ఎల్లరు తగినంత పనిలేక బాధపడుదు హెచ్చుపనిచేసి హెచ్చు వస్తువులచేసి హెచ్చుధనము బొంద తద్వారా, ఇతరులు చేయుచున్న వస్తువుల కొనుక్కొని సంసారసుఖములనంప యూరటలాడుచుండవచ్చు: కాని ఎందులకా బ స్తీయందలి ప్రజలు సోమరులవలె, దిక్కులేనివారివలె, అష్టదరిద్రుల వలె యున్నారు. గోడల నానుకొని గందులయందు బరుండి గుడ్డలులేక యలమటించుచు,మురికిగల్లీల తిరుగుచు,చెట్ల యాకుల్లదిని బ్రతుకుచు నేల ప్రజలంచ రిట్టి దుర్గతియందున్నారు? వారియందు పరపతిసంఘములు లేకపోవుట వలననేయని చెప్పిన, పరిహసింపకుడు నవ్వకుడు. అది సత్యము. పైనతెల్పినటుల వర్తకమునందు జయము బొందగల్గువారి కంవరికి తగినంతధనము నప్పుయిచ్చెదనని పరపతి కొసంగెనవని మనపరపతిసంఘము వాగ్దాన మొనర్చిన దనుకొనుడు. పైదృష్టాంతమునందు చేసినటులనే ప్రతివర్తకుడు కోరినధనమును, ఆతిడెవరికీయమనునో ఆ వర్తకునకు బ్యాంకుచెల్లించుచున్న దనుకొనుడుఅన్నివస్తువుల నాబస్తీయందే చేయుటకు వీలుకల్గుననుకొనుడు. అంత ప్రతివ్యాపారము గొప్పగొప్ప పద్ధతులపై సాగుట ప్రారంభించు. ఇదివరకున్న ఫ్యాక్టరీలన్నియు పూర్తిగా పనిచేయుచు, నిండుగా పనివారి నుపయోగింపు క్రొత్త ఫ్యాక్టరీలు స్థాపించ వర్తకులు పూనెదరు. బోటిలు, గుడ్డలు, కుండలు, కంచములు, తట్టలు, బుట్టలు, ఇండ్లు, దరవాజాలు, కిటికీలు, మురుగులు మురిడీగొలుసులు ముక్కుపుడకలు నాగరములు, పరమాన్నములు హల్వాలు, అన్నియు ప్రజలు చేయమొదలిడుదురు. ఎన్నియో పనులు సాగును. అన్నివస్తువులు హెచ్చుసంఖ్యగా చేయబడును. అందరుపనివారి కుద్యోగము దొరకును. నిరుద్యోగము అస్పృశ్యమగును. అందరి రాబడియు హెచ్చును. ప్రతిపనివానికి, అనేకవస్తువులు కొను శక్తికల్గును. వర్తకులు లక్షాధికారు లగుదురు. ఎల్లెడ నైశ్వర్యము తాండవమాడును. ఏమి యీమాహాత్మ్యము? ఎటుల యీయద్భుతము కల్గినది? బ్యాంకునందు, ఆకాశమునుండి కోట్లకొలది ధనము వచ్చిపడలేదే. వర్తకుల కెవ్వరు భూమిలోనుండి ధనమెత్తి యివ్వలేదే! పనివారికి బంగారు నాణెము కల్గి భూమిలోనుండి వరహాలబిందెలు దొరకలేదే! ఎటుల నీ తమాషా ఈగారడీ, ఈమెస్మరిజమును విడదీసి, ఈముచ్చటముడిని విడగొట్టి తెల్పుట? అదియే మనపని. ఇచ్చట పరపతి యిచ్చుటచే, అనమ్మకముపై, ధనమున్న దను ధైర్యముచే వర్తకులెక్కుపనివారి నుపయోగించి, హెచ్చువస్తువుల సృజించిరి. ఈవస్తువుల ధనమన్న దనుకొన్న మరికొందరు వర్తకులు కొని, ధనమున్న దనుకొన్న మరికొంద ఫ్యాక్టరీలవారి యినపమేకులు, మెషీనుల నమ్మిరి. తాము చేయు వస్తువులు, గుడ్డలు ప్రజలు కొందురను నమ్మకముతో, బ్యాంకునద్ద తెచ్చిన బాకీ నాధారపరచుకొని, ఈయజమాని యధికసంఖ్యాకులగు పనివారి నుపయోగించి, గుడ్డల నేయించు. ఈవిధముగ, ఒకరిపై నొకరాధారపడి, వస్తువుల నన్నిటి చేసి, ఎడ తెరపిలేకుండా కష్టపడి, తమకు కావలసినపనిముట్లు, తమకున్న, తాము సంపాదించుకొనిన ధనము ద్వారా కొనుక్కొని సుఖపడుచున్నారు. కనుక, చివరకు కల్గిన ఫలితమును సర్వప్రజలసౌభాగ్యము,వారంతటవారు చేతులారకష్టించి సంపాదించుకొన్నదే! ఇందు బూటకము లేదు! ఈలోపల, బ్యాంకులో జరుగుచున్న దేమి? వస్త్రముల దీసుకొందము: దూదికల్గిన రైతు, అప్పుపై యాధారపడి, పొలము సాగుచేసి, తిరిగి దూదినమ్మెను. ఆతడు ఖర్చిడిన ధనమును బ్యాంకు ఆతడుచెల్లింపమన్న వారికి చెల్లించియుండెను. దూది నమ్మినపిమ్మట రైతు తనధనమును, వడ్డీని బ్యాంకుయందు పెట్టు అనగా బాకీ తీర్చుకొనును. ఆత డెవ్వరికి ధనము చెల్లింపమనెనో వారును, బ్యాంకునకు బాకీపడియుండిరి గనుక, వారికివచ్చిన ధనమును బ్యాంకునకే యిత్తురు. అందువలన బ్యాంకునుండి దమ్మిడీ బైటికిపోకుండనే, రైతుకు బాకీ కల్గినది. ఆతని కన్నితినుబండారముల నొసంగిన దుకాణదారులకు బాకీ కల్గి, వారుచేసిన పనికి ఫలితము కల్గినది. అంతరైతునద్ద

దూదికొన్న వర్తకుడు రైతునకు చెక్కుద్వారా ధనము చెల్లించు. ఈవర్తకుడు దూదిని వడకిన పిమ్మట, మరొక వర్తకున కమ్మును. ఆవర్తకుడు, యీవడకిననూలునుండి వస్త్రములు నేయించు. వీరు, ఒకరికొకరు చెక్కుల నిచ్చుకొనుచుందురు. అందరిచెక్కులు బ్యాంకుద్వారాయే పోవును. అందరచ్చట బాకీయున్నారు. చేయుచున్న పని పూర్తియైనకొలంది, అప్పులు తీరుచుండును. తుదకు అందరు లాభమందుచున్నారు. ప్రతిపనివానికి చెల్లించిన ధనమంత చెక్కులద్వారాయే చెల్లింపబడినదని యనుకొనుచో వారికి ప్రథమమున కొన్నివారములవరకుమాత్రే మప్పు యిచ్చి, తినుబండారముల నిచ్చుచో క్రొత్తవస్తువులు తయారగుట, అంత వారిజీతములు వచ్చుచుండుట అంతే వారి యప్పులు తీరుటయేగాక వారియాదాయము హెచ్చుచుండుట, ఈయాదాయముతో యనేకవస్తువుల వీరు కొనుట, ఆవస్తువుల నమ్ముటతో వచ్చిన ధనముతో బ్యాంకుకు చెల్లించి అప్పులదీర్చుకొనుట జరుగును. ఇటుల చెక్కులు గిరగిరగిరగిరతిరిగి, ఒకలెక్కనుండి మరొకలెక్కకు కూడింపబడి ఒకలెక్కనుండి మరొకలెక్కకు తగ్గింపబడి తుదకు ధనమంతయు వస్తురూపముగా చేరును. అనగా తేలునది యేమి? ధనమును మనము తినము. రూపాయలను కరిగించుకొని మనముతినము. తిన్నను హెచ్చు రూపాయల తిని జీవించజాలము. మనము, రూపాయలను మూట గట్టుకొనుటకై పని చేయము. మనకూలివారు రూపాయలమొలకు తగిలించుకొనుటకు కూలిచేయుటలేదు. మనవర్తకులు రూపాయలచే చలిగాచుకొనుటకు, రూపాయలచే తమమానము గాపాడుకొనుటకు, రూపాయలచే నిదురబోవుటకు వ్యాపారము చేయుటలేదు. 'భస్మాసురునికథ' భాగవతము జదివిన వారికి తెలియు. తాకిన దెల్ల తగులబడవలెనని వరము తెచ్చుకొనెను. తుదకు తానే తననెత్తిపై బురదవేసుకొని భస్మమయ్యెను. పంచతంత్రము జదివినవారికి, తాకినదెల్ల బంగారుకావలెనని వరముబొందిన తాతయ్య, తినుటకన్నములేక, నాశనమయ్యెనని తెలియును. అటులనే రూపాయలె కావలెనని పరుగులెత్తు వారికి, ఆత్మసుఖము లేకపోగా, భౌతికశరీరసుఖముగూడ దక్కదు.

మనమందర మెందులకు కష్టించి ధనము సంపాదించుచున్నార మనగా, ఆధనముద్వారా యితరవస్తువుల కొని సుఖించుటకు తోటకూరను బెంచుగరువుస్త్రీ తోటకూరనే తిని సుఖపడజాల దెల్లకాలము. బంగాళాదుంపలు, చిలకడదుంపలు పెంచినను, ఆబిడకు సుఖము కలుగదు. సన్నబియ్యము, బెల్లము, తెల్లనిబియ్యము, కమ్మని ఖర్జూరపండ్లు, కన్నుల కింపుగనుండు రంగులరవిక, సొంపు గల కోక యాబిడ కవసరము. ఆయావస్తువుల నమ్ము వర్తకులయొక్క గ్రామములకు తనకున్న తోటకూర, బంగాళాదుంపలు, చిలకడదుంపలు, తట్టలలో నెత్తుకొనివెళ్లి, అవి కొనుటకు పోవుట సాధ్యముకాదు సరిగదా, తీసుకొని వెళ్లకల్గినను, ఆయావస్తువుల నమ్మువారికీమె యమ్మగోరు వస్తువుల కొనగోరకపోవచ్చు కనుక ముఖ్యమైన కార్యమేమన, తోటకూర, బంగాళాదుంపలు, చిలకడదుంపలు కోరువారి కవి యమ్మి, రూపాయలను బొంది, ఈరూపాయల నిచ్చి, గుడ్డల, బెల్లము, బియ్యము, పండ్లు కొనుక్కొను టతిచలకన. ఈవస్తువుల నమ్మువారీరూపాయలను ఇతరవస్తువుల కొనుటకై యుపయోగింతురు. ఇటుల, రూపాయలను నాణెముల ద్వారా, అన్నివస్తువుల తదితరవస్తువులకు పరస్పరముగా, అవసరములేని వస్తువుల వానియజమానులు తమకవసరమైన వస్తువులకొనుటకై మార్చుకొని, లాభము బొందుదురు. కనుక, రూపాయలను కల్గియుంట, అవి కల్గించుకొనగల శక్తికై గాని, వానియందున్న లోహముకై కాదు సరే! వెండిరూపాయల నొకచోటినుండి మరొకచోటికి జేబులోపెట్టుకొని మోసుకొనిపోవు టతికష్టము. దొంగలభయము గలదు; కత్తిరించు గజటక్కరుల దుండగములు గలవు. కాని, చెక్కులు చేతిలోనుండి, అవసరము వచ్చినప్పుడు స్వదస్తూరితో ధనముతీయు యుల వాటున్న మరింత లాభముకల్గు. ఈపద్ధతి నవలంబించియే పైదృష్టాంతమున తెలుపబడిన పట్టణపుప్రజలు, బ్యాంకునుండి దమ్మిడీయైన బయటికి తీసుకురాకుండా, తనుకమ కార్యములకును, తమకు కావలసిన వస్తువులను చెక్కులతో, కొని తమకవసరములేని వస్తువుల చెక్కులకొరకై యమ్మి, 'పరపతి'పై అన్నిపనుల నాధారపరచి, పట్టణ సౌభాగ్యమును వృద్ధిపరచిరి.

ఆబస్తీయందె రెండుబ్యాంకులు కలవనుకొందము. బస్తీయందుగల ప్రజలందరు, ఈరెండుబ్యాంకులద్వారా

నే, అప్పులబొందుమన్నా రనుకొందము. అంత జరుగునది యేమి? 'య' యను బాంకుసభ్యులు 'ర' యను బ్యాంకు సభ్యులతో వ్యాపారము చేసెదరు. 'య' బ్యాంకుసభ్యులు 'ర' బ్యాంకుసభ్యులనుండి యనేకవస్తువుల ననేకదినములందు క్రమముగా గొని, వారికి తమ 'య' బ్యాంకుపై చెక్కులను, వస్తువులధర ననుసరించి యిత్తురు. ఇట్లనే 'ర' బ్యాంకుసభ్యులు 'య' బ్యాంకుసభ్యులనుండి వస్తువులగొన్న, వానికి తమబ్యాంకుపై చెక్కుల యాధనము నకు ఇత్తురు. ప్రతివారము, ఈసభ్యులమధ్య జరుగుచున్న వ్యాపారము ననుసరించి,'య' బ్యాంకునందు 'ర' బ్యాంకుపై వ్రాయబడిన చెక్కులు యివ్వబడుచుండ, (ర) బ్యాంకునందు (య) బ్యాంకుపై వ్రాయబడిన చెక్కులు ఇవ్వబడుచుండును అంత. సభ్యులమధ్యనున్న పరస్పరము యప్పులు తీరును కాని, ఒకబ్యాంకు మరొకబ్యాంకుకు, పరస్పరముగా కొంత ధనమివ్వవలసియుండు. 'య' బ్యాంకుపై ఒకవారమున 50,000 రూప్యలకు చెక్కులువచ్చెన నుకొందము. 'ర' బ్యాంకుపై యావారమున, 60,000 రూపాయలకు చెక్కులువచ్చె. అంత తేలునదియేమి?

'ర' బ్యాంకు 'య' బ్యాంకుకివ్వవలసినది 60,000
'య' బ్యాంకు 'ర' బ్యాంకుకివ్వవలసినది 50,000

'ర' బ్యాంకు 'య' బ్యాంకుకివ్వవలసినది 10,0 0

| | | |
|---|---|---|
| మరొక వారము | 'ర' ,, 'య' బ్యాంకుకివ్వవలసినది | 100,000 |
| | 'య',, 'ర' బ్యాంకుకివ్వవలసినది | 110,000 |

'య' బ్యాంకు 'ర' బ్యాంకుకివ్వవలసినది 10,00)

రెండువారములపైన తేలినలెక్క—

• ఒకరొకరి కేమియు బాకీ లేరు.

ఇట్లవారవారమున కొక్కొ బ్యాంకు మరొక్కొ బ్యాంకుకు కొంతయివ్వవలసియుంటగాని, ఆబాంకునుండి ధనము రాబట్టుకొనవలసియుంటకాని జరుగుచుండును. ఈ బాంకులమధ్య యిట్టుల నొకరొకరి కప్పుపడుచుండుటయు, అందుల కొకరికొకరు 'పరపతి' నిచ్చుకొనుటయు జరుగును. రెండుబ్యాంకులకు బదు లనేకబ్యాంకు లున్న వనుకొందమాబస్తీయందు. అప్పుడును, ఈపర్యవసానమె కల్గును. ఐన, లెక్కల సరిపెట్టుకొనుటమాత్రము కొంత కష్టతరమగును. 'Clearing House' అను తూరుపార బట్టు గృహము యవసరమగుటయు తేలుగానుండు లేక పరస్పరముగా కొట్టివేతబడు చెక్కులు సెటిలగుటయు, గట్టిగా నుండు చెల్లింపవలసిన చెక్కులకు 'పరపతి' యేర్పరచుటయు జరుగవలసియుండు. 'తూరుపారబట్టు గృహము' గూర్చి వేరుగా మరికొంత తెలియపరతుము. ఇప్పటి కీమూలసూత్రము దెలుసుకొన్న చాలు.

మనము, పనివారికికూడ చెక్కులిచ్చుట సాధ్య మనుకొంటిమి. కాని నిజమగు జీవితమందు, పనివారికి, దిన దినమునకు, వారవారమునకు కూలివచ్చుచుండుటచే వారికి చెక్కులనిచ్చుటగాని, వారు బ్యాంకులందు తమధనము బెట్టి, తమ చెక్కుల మార్చుకొని, బ్యాంకులందు 'పరపతి' పొందుటకాని సాధ్యముగాదు. తరువాత, ఇతరప్రజలు కూడ, పది పదునేను రూపాయలనైన జేబునందిడుకొని, చిల్లరపనులకు చిల్లరవస్తువులకు ధనపూర్వకముగా చెల్లింపకుండుట సాధ్యముగాదు. రైలుప్రయాణములు చేయుటకు, బస్, ట్రాంబండ్లు, గుఱ్ఱపుబండ్లు, ఒంటెద్దుబండ్లు వగైరావానికిచెల్లించుటకు, ఇతరప్రదేశములందు కొంత కాలముండుటకు, జేబులో కొంతధనముండవలయు కాన, చిల్లరపనులకుగా 'Till money' యను గల్లాపెట్టెధనము మన యాబస్తీయందున్న బ్యాంకులందుండవలయును. ఈ ధనమెంతగా, ప్రతిదినము బాంకు 'గల్లాపెట్టె' యందుంచవలసినది, క్రమముగా దినదినమునకు ఒకసంవత్సర పర్యంతము చూచిన పిమ్మట తేల్చసాధ్యమగును. ఈధనమును దినదినము వచ్చిపోవు సభ్యులకు, అడిగినప్పుడెల్ల అడిగినంత యివ్వవలసియుండును. కనుక, ఎల్లప్పుడు మనబ్యాంకులు నాణెములరూపకముగా కొంతధనమును, ఉంచుకొనవలయును. ఐన బ్యాంకువద్దకువచ్చి ఇట్ల నాణెమురూపకముగాధనముగోరి కష్టము కల్గించువారెవ్వరు? బ్యాంకునం దిదివరకే పెట్టెలో నున్నధనము లేక (Current accounts) గా పెట్టినవారు, బ్యాంకునందు 'వడ్డీ'గా ధనముంచినవారు, బ్యాంకునందు 'పరపతి' బొందినవారు నై యున్నారు. పై రెండువిధములగువారు తా మిదివరకె యిచ్చినధనమును మాత్రము కోరుచుందురు. మూడవతరగతివారు, బ్యాంకువారిచ్చెదనన్న 'పరపతి'పై యాధారపడి, ధనమును గోరుచుందురు. కనుక, బాంకుకు దినదినము వచ్చుచున్న 'చిల్లరధనముపై వడ్డీ'ని

తగ్గించవలయునన్న చేయగల్గినచో 'పరపతి' నిచ్చుట తగ్గించవలయును. అనగా, లెక్క లేకుండా, ఇదివరకు మనము నమ్మినట్టుల 'పరపతి' నిచ్చుటకు వలనుపడదు. మొదటి మెట్టునందే, బ్యాంకులోనికెట్లు ధనమువచ్చునది చూచితిమిగదా? ఆధనమునుండియే, ఇతరులకు, అప్పులుగా, బ్యాంకు, అప్పిచ్చుననియు చూచితిమి. కాని యీ యప్పుల నెంతవరకిచ్చుటకు వీలుకల్గునని చూపలేదు. తనకు వచ్చుచున్న ధనమునుండి దినదినమున కెంతెంతధనము ప్రజలు తిరిగి యివ్వకోరునది తెలియును గాన మిగిలినధనమును, మరికొంత 'పరపతి' నిచ్చినగూడ దినదినము ఎంతధనము బయటికిచ్చుచుండవలయు నను విషయము తేలినపిమ్మటనే 'పరపతి' నిచ్చుట బ్యాంకునకు మంచిపద్ధతి: ఎటులనందురా?

బ్యాంకు

| | | | |
|---|---|---|---|
| బ్యాంకుపై నున్న ధనము | 10,000 | బ్యాంకుపై నున్న ధనము | 10,000 |
| ఇతరులు గల్లాపెట్టెధనముగా నుంచినది | 100,000 | అప్పులవారి కివ్వవలసినది | 1,000,000 |
| ఇతరులు వడ్డీకిచ్చినది | 500,000 | పిలుచుటతో వచ్చు అప్పులు | 500,000 |
| అప్పులవారి కివ్వవలసినది | 1,000,000 | నాణ్యముగా నున్న ధనము | 100,000 |
| | | | 1,610,000 |
| ఇతరుల కివ్వవలసినది | 1,610,000 | | |

ఈపైన యొక్క దృష్టాంతపూర్వకమైన Balance Sheet ను యిచ్చితిమి. బ్యాంకుకు రావలసినధనముగూర్చి విచారింతము. బ్యాంకువస్తుసామగ్రిపమ్మినవచ్చుధనము పది వేలు. అప్పులు తీసుకొన్నవారివ్వవలసినది. 1,000,000 రూపాయలు. రెండు మూడు దినములకు మాత్రమే యిచ్చిన యప్పులధనము, 500,0000. బ్యాంకునందు, నాణెమురూపకముగానున్న ధనము, 100,000 రూపాయలు. కనుక బ్యాంకుకు రావలసిన ధనము రూ 1,610,000 కాని, అవసరమొచ్చినప్పుడు, బ్యాంకువస్తుసామగ్రియందు గలధనముగాని, అప్పులవారివ్వవలసినధనముగాని తెచ్చుటకు వలనుపడదు, కనుక, పిలుచుటతో వచ్చుధనము నాణెముగా నున్న ధనమే అవసరమొచ్చినప్పుడు చేతి కందు ధనము. ఈరెండు ఐటములు కలిసి, 600,000 ఆరులక్షల ధనముగను.

బ్యాంకు యివ్వవలసిన ధనము:— బ్యాంకు వస్తు సామగ్రియందు ఇర్చిడిన ధనము నెప్పటికైన బ్యాంకు యజమానులకివ్వవలసినదేగదా. అయ్యది పదివేలు. ఇతరులు గల్లాపెట్టెలుగా నుంచినది 100,000 రూపాయలు ఇతరులు వడ్డీకిచ్చినది ఐదులక్షలు. అప్పులవారికి 1,000,000 రూపాయల నివ్వవలసియున్నది. పదిలక్షల 'పరపతి' వారికిచ్చిరి. వారెప్పుడు కోరిన యప్పుడీధనము నంతయు, లేక కొంతభాగము నీయవలసియే యున్నది. కనుక, బ్యాంకువస్తుసామగ్రియందున్న ధనమును, ఇతరులు వడ్డీకిచ్చిన ధనమును, అడిగినప్పుడివ్వవలసిన యావశ్యకము లేదు.






## గాలి వాన

ప్రకృతి ప్రభావమతివిచిత్రము. నిశ్శబ్దముగనున్న ప్రకృతిస్వరూప మొకగడియ కాలమునను ప్రళయాకారమును దాల్చును. శుభ్రాంబరము గాఢాంధకార బంధురమై భీతావహ మగును. మందమారుతము ఝంఝానిలమై భీభత్సాకారమునుదాల్చును. మార్తాండప్రభావము మాటుపడి తమసావృతమై ప్రాణరక్షణయందు ప్రభాకరుడు ప్రమత్తుడగుచుండును. ఇంద్రాగ్ని వరుణ వాయు దేవతలు మహామల్లులై ప్రకృతిరంగమునందు లీలావిలాసార్థము బలాబలములను ప్రదర్శించుచు మహాసంక్షోభమును గలుగజేయుచుందురు. మహాసంరంభమునందు నదులు పొంగి పొరలుచుండును. చెట్లు కుంకుమప్రేళ్ళతో కూలి పడుచుండును. ఇండ్లు కూలుచుండును. జంతువులు మడియుచుండును. జంతుజాలము లన్నాశ్రయాధారములు లేకను హాహాకారములు చేయుచుండును. ఈ మహోపద్రవావస్థయందు నిస్సహాయస్థితియందు భీభత్సావస్థయందు ప్రజాదృష్టి సహజముగను వైరాగ్యాయత్తమై భూతనాథునిమీదను లగ్నమగుచుండును. సంకీర్తనములు చెలరేగుచుండును. ప్రార్థనలు ప్రబలుచుండును. ఆపన్నుడైన గజేంద్రుని భంగిని ప్రజలార్తనాదమును జేయుచుందురు.

శా. లావొక్కింతయులేదు ధైర్యమువిలోలం
బయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దను
వున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవేతప్పనితఃపరం బెఱుఁగ మన్నిం
పందగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సం
రక్షింపు భద్రాత్మకా.

భూతేశుడపుడునిర్భరానందుడై నారాయణరూపమును దాల్చి ప్రజలమొరల నాలించునో మహావిష్ణువై దీనాలాపముల నాలకించి రక్షణము బూనునో మహాయోగులు గ్రహింపనోపుదురు. గడియలో నంతయును మారిపోవును. మహాభూతములు రోషావేశములను వదలి సహజస్వరూపమునుదాల్చును. ప్రకృతి సౌమ్యాకృతిని బొందుచు శాంతస్వరూపమును దాల్చును. మహాభూతసంరంభసంజాతమైన మహాభీభత్సము నిలిచియున్నను ప్రజలు సంసారప్రవృత్తియందు నిమగ్నులై లోకయాత్రను మహదానందముతో జేయుచుందురు. ఈ ప్రభావమును గనుగొనుటకు జగన్నాటక సూత్రధారుడే సమర్థుడు.

* * * *

వైశాఖమాసము. ముందు వేసవి. గాలి వాన. మహాప్రళయము. ఈ యవస్థా సంయోగములు సామాన్యముగ కని విని

యెఱుంగని విషయములు. గ్రీష్మమునందు గాలిదుమారములు సంభవములు గాని గాలి వానలు సంభవములు గావు. రైతులు పశువులను పొలములయందు గట్టియుంచి పొలములను బాగుచేయుచుందురు. పొలములలో గొల్లవాండ్రు గొఱ్ఱెలమందల గట్టుచు జీవయాత్రను చేయుచుందురు. పశువులు, జనులు కాలమును పొలములందు గడపుచుండుట సాధారణము. తృణధాన్యాదు లింకను చేలయందు నిలిచియుండును. ప్రజలు గృహకుటీర నిర్మాణమునందును జీర్ణగృహ కుటీరోద్ధరణము నందును నిమగ్నులగుచుందురు. ఈ సమయమునందు సంప్రాప్తమైన ధారాపాత వర్షము మహామారుతము గలుగజేసెడి బీభత్సమును చూచినవారలు దెలిసికొన గలుగుదురు గాని వర్ణనలవలన దెలిసికొనజాలరు. కృష్ణామండల సముద్రతీరమునను తుపాను 60 మైళ్లు వెడలుపునను ప్రారంభమై 70 మైళ్లు పొడవున వ్యాపించినది. కృష్ణామండలములోనిదివి బందరు గుడివాడ ఏలూరు కైకలూరు పామర్రు బెజవాడ గన్నవరము తాలూకాలయందును, గుంటూరుమండలమునందలి రేపల్లె తెనాలి తాలూకాలందును తుపాను నష్టము విశేషముగ గలిగినది. ఈప్రాంతములందు కూలినయిండ్లకు, పడిపోయిన చెట్లకు, చచ్చిన జంతువులకు, పాడయిన తోటలకు పొలములకు, నష్టమైన యాస్తికి మితి మేరలు లేవు. బందరు బెజవాడలందె 30 లక్షల రూప్యముల నష్టము, పరిగణనము చేయబడినపుడు మండలము మీాదను కోటిరూప్యముల నష్టమైనను సంప్రాప్తమైయుండును. అన్నిచోట్లను ప్రజలు కష్టముల ననుభవించుచున్న విధమును వార్తలు ఘోషించుచున్నవి. ఎన్నియో గూడెములు మాలపల్లెలు పాడుపడి నిరుపేదలు నిలుచుటకు నీడలేకను పరితపించుచున్నారు; కాని ప్రతీకారము మాత్రము కంటికి గోచరము గాకున్నది.

* * * *

ప్రభుత్వదృష్టి ప్రజలనుండి ద్రవ్యోపార్జనము జేయుటయందువలె ప్రజలకు సహాయమును జేయుటయందు లగ్నముగా దను విషయ మనుభవసిద్ధము. కోట్లకొలది ద్రవ్యమును గురిపించెడి ప్రాంతములకు సహాయార్థము లక్షరూప్యములను మంజూరుచేయుటయందు గల యౌదార్యమును వర్ణించుట యనవసరము. ప్రభుత్వ మేమిచేసినను చేయకున్నను నాపన్నులకు సహాయము చేయవలసిన భారము శ్రీమంతులైన ప్రజానాయకులమీాదను గలదు. శ్రీమంతు లచ్చటచ్చటను సహాయము చేయుచున్న శుభవర్తమానములు తెలియుచున్నను సహాయార్థము కేంద్రసంస్థగాని యుపసంస్థలుగాని యేర్పడలేదు. ఎవరిసబ్బమును వారు గడపుకొనునటులు గనుపడుచున్నది. సహాయము చేయవలసిన యావశ్యకత విషయమై చెన్నపురియందు గూడిన బ్రాహ్మణేతరనాయకులసభయందు సర్. కూర్మా వేంకటరెడ్డి నాయుడుగారుపపాదించిన తీర్మానమేకగ్రీవముగ నామోదింపబడినది. దుఃఖము ననుభవించెడి రయితులు విశేషముగను బ్రాహ్మణేతరులు. గొల్లలు బ్రాహ్మణేతరులు;

పంచములు బ్రాహ్మణేతరులు. చిల్లరజాతివారు బ్రాహ్మణేతరులు. బ్రాహ్మణేతరసంఘ పక్షవ్యాజముననధికారపదవుల నభ్యర్థించిన నాయకులు త్యాగమును జూపవలసి వచ్చినపుడు కర్మకలాపము పొడి మాటలలోనె ముగియుచున్నది. పురోహితులు విఘ్నేశ్వరునకు సమస్త పూజాలంకారములను హారిద్రాక్షతలతో సరిపెట్టునటులు పొడిమాటలతో నాయకులు దుఃఖోపశమనమును జేయబూనుట వృథాప్రయాసముగదా! దేశమునందనేక సేవా సంఘములును నిమ్నజాత్యుద్ధరణ సంఘములును సత్యాగ్రహాశ్రమములును కాంగ్రెసు సభలును స్వరాజ్యసభలును క్షత్రియవైశ్య కమ్మ మహాజనాదిసంఘములును గలవు. ఆయాసంఘ సభాసభ్యులైనను నడుము గట్టుకొని కార్యపరాయణులగుటకు బూనుకొనకుండుట శోచనీయము. కృష్ణామండలమునందు శరపరంపరలుగగలపరపతిసంఘముల ప్రయోజనమును ప్రకటించుటకిపుడు తరుణమాసన్నమైనది. కృష్ణాగుంటూరు మండల పరపతి సంఘములందు లక్షలకొలఁది ధనము లుపయోగపడకను మూలుగుచున్నవి. ఆధనమును నాపన్నులకు తక్కువవడ్డీకిచ్చి కాపాడుట కవకాశములు గలవు. కాని యధికారాయత్తములైన పరపతిసంఘములకు ధనమును ప్రజోపయోగార్థము వినియోగించుట కవకాశాధికారము లెటులు లభించును? స్వపరిపాలన గల దేశములందట్టి యాపదలు సంభవించినపుడు ప్రభుత్వము ధనమును విచ్చలవిడిగ వ్యయము చేయుటయును నాపన్నులను రక్షించుటయును సహజమై యున్నది. గత సంవత్సరమునందు కావేరీప్రాంతములందు గాలివానలు వచ్చినపుడు ద్రవిడసోదరులుచూపిన మహాసంచలనమైనను నాంధ్రులుచూపకుండుట విచారకరము. రాజధానీనగరమైన చెన్నపురియందు శ్రీమంతులైన యార్యవైశ్య శిఖామణు లెందరో గలరు. సంపన్నులైనన్యాయవాదులును నుద్యోగస్థులును గలరు. వీరి ద్రవ్యోపార్జనమునకు మూలాధారము కృష్ణాగుంటూరు మండలములు. వీరైననునాపన్నుల రక్షణార్థము ప్రయత్నములను జేయకుండుట యాంధ్రహృదయము నావరించిన యలసత్వమును విశదము చేయుచున్నది. ఇప్పుడు కాలవిలంబనమైనను నాంధ్రులు దీక్షాపరాయణులై స్వధర్మనిర్వహణమును జేసి ధన్యవాదములను బడయుదురు గాత!

*　*　*　*

మహాత్ముని వంగదేశ పర్యటనము

గాంధిమహాత్ముఁడు మెయి మాసారంభమునుండియును మాసాంతమువరకును వంగదేశ విజయయాత్రను జేసి స్వధర్మనిర్వహణమును జేయగలిగెను. కేరళ ఘూర్జర రాష్ట్ర సంచారములవలె వంగరాష్ట్ర సంచారమును జయప్రదముగ ముగిసినది. రాష్ట్రమునందంతటను జయజయధ్వానములు చెలరేగినవి. మహారాజులు, రాజులు, విద్యావంతులు, శ్రీమంతులు, సామాన్యులు, స్వాగత సత్కారముల నొసంగుటయందహమహమికను జూపిరి. ప్రజలు సన్మానపత్రములను సమర్పించిరి. పాదాక్రాంతులై పాదధూళిని శిరసావహించిరి.

మహాత్మునకు జూపిన స్వాగత సన్మానపూజా విధానములు వంగదేశీయుల యుద్రేకోత్సాహముల్లకనురూపములై మహాత్మున కానందమును గలుగ జేసినవి. ఉత్సాహ తరంగములు పొంగి పొరలి మహాత్ముని ముంచినవి. రామమోహనరాయలు జగదీశచంద్రబోసు బంకించంద్ర ఛట్టోపాధ్యాయులు రవీంద్రనాథ తాకూరు అవనీంద్రనాథతాకూరు మొదలగు సుప్రసిద్ధ మహాపురుషుల నామరూపములను మహాత్ముడు సంస్మరించి వంగదేశ మాహాత్మ్యమును గొనియాడెను. కాని మహాత్మున కింతటితో సంతృప్తి గలుగలేదు. వంగదేశ సౌఖ్యసౌభాగ్య మీపదుగురితో గలుగజాలదు. గ్రామసీమలందు నివసించుచున్న 4 కోట్ల బెంగాలీలమీదను వంగదేశసౌభాగ్య మాధార పడియున్నది. గ్రామవాసుల సౌభాగ్యమె దేశ సౌభాగ్యము. గ్రామవాసులదుర్భరమైన దారిద్ర్య దుఃఖము ననుభవించుచుండగను నగరములందెన్ని ప్రాసాదములున్నను నెందరు కోటీశ్వరులున్నను దేశసౌభాగ్యము గగనకుసుమము. ఈపరమార్థమును మహాత్ముడు గ్రహించినటు లితర నాయకులు గ్రహించియుండలేదు. మహాత్ము డితరరాష్ట్రములందునలె వంగరాష్ట్రమునందును తన సంచారానంతరము గ్రామసౌభాగ్యసందేశమును ప్రకటించెను. ఆచార్య ప్రఫుల్లచంద్రరాయిగారు ఖాదీప్రతిష్ఠాపనములద్వారా చేయుచున్నపని మహాత్ముని ప్రశంసకు పాత్రమైనది. కాని వంగదేశపు రాటములును రాటములపనియును మహాత్మున కాశాభంగమును గలుగ జేసినవి. పూర్వము 200 వ నంబరుగల డక్కా మజిలినుల తయారుచేయ గలిగిన వంగదేశమిపుడు చిన్నిరాటముల మీదను 10 వ నంబరునూలునైనను తయారుచేయజాలకుండుట దేశమునకు సంప్రాప్తమైన యధోగతిని విశదము చేయుచున్నది. దేశమునం దంతటను గృహపరిశ్రమలు నశించినవి. వ్యవసాయము కూలిపనులు జీవనాధారములైనవి. ఈపనులైనను నేడాదియం దారుమాసములు మాత్రముండుట సర్వత్ర విదితమైయున్నవి. గృహపరిశ్రమల పునరుద్ధరణమే గ్రామసీమల సౌభాగ్యమునకు మూలాధారమనిగాంధీమహాత్ముడు వంగరాష్ట్ర సంచారానంతరము తిరిగి ప్రకటించెను. గృహపరిశ్రమలయందు రాటపు పరిశ్రమము మాత్రమే సకలజనులును నవలంబింప దగినదియును సకలజనోపయోగమైనదియును నైయున్నది. ఈవిషయమందఱకును తెలిసియున్నను మహాత్ముడు విశ్వప్రయత్నములను జేయుచున్నను ప్రయోజనము ప్రయత్నముల కనురూపముగ గలుగుటలేదు. కారణము ప్రపంచము నావరించిన పాశ్చాత్య పారిశ్రామిక ప్రాబల్యవ్యామోహ మని విశదమగుచున్నది. వ్యవసాయము ప్రధానవృత్తియైన భరతఖండమున క్షితి యసంగతమైనను ప్రభుత్వ ప్రాబల్యము, ప్రజలయులసత్వము మహాత్ముని సందేశవ్యాపకమునకు ప్రతిబంధకములుగ నున్నవి. ముప్పదికోట్ల ప్రజలు గల దేశమునందు నూలు చందాను చెల్లించిన వారిసంఖ్య 15000 మాత్రమే యని తెలినపుడు ప్రజల నావరించిన యుల

సత్వము విశదమగుచున్నది. నూలుచందావిషయమునను మహారాష్ట్ర దేశమునందు బహిర్గతమైన ప్రతిఘటన్నమును నీవిషాదస్థితిని విశదము చేయుచున్నది. మహాత్ముడు జూన్, జూలై మాసములందు అస్సాము, బీహారు, రాష్ట్రములందు సంచారమునుచేసి ఆగస్టు, సెప్టెంబరు మాసములందు తమిళాంధ్ర రాష్ట్రములందు సంచారమునకు బూనుకొనవచ్చును. ఆంధ్రులు మహాత్మునిసంచారకాలమునకైనను తమ యావచ్ఛక్తిని వినియోగించి మహాత్ముని సదాశయములను సఫలముచేయుటకు పాటుపడుట ధర్మము.

*     *     *     *

ఆంధ్రరాష్ట్ర జాతీయోపసంఘము

గతమాసమునందు రాజమహేంద్రవరమునందు గూడిన ఆంధ్రరాష్ట్రీయ జాతీయోపసంఘసమావేశమునందు కార్యశూరులైన శ్రీయుతులు బులుసు సాంబమూర్తిగారును, మండపాక రంగయ్యనాయుడుగారును అధ్యక్షులుగను కార్యదర్శులుగను నెన్నుకొనబడుట శుభసూచకముగ నున్నది. సుప్రసిద్ధ దేశారాధకులైన వీరియాజమాన్యముక్రిందను దేశావృతమైన యంతఃకలహములును, యుల సత్వమును యంతరించి దేశము స్వధర్మనిర్వహణమునందు లగ్నమగుటకు భగవంతుడు తోడ్పడునని నమ్ముచున్నాము. గాంధి మహాత్ముడు ఆంధ్రదేశస్థితిని తలంచి విషాదమును బొందుచున్నవిధమును వారిభావములు విశదము చేయుచున్నవి. ఈ విషయమై మహాత్ముడు చెన్నపురియందు తెలిపిన భావములనే యంగుఇండియా పత్రికయందును గతవారమునందు ప్రకటించి ఆంధ్రులకర్తవ్యమును వ్యక్తము చేసెను.

"నాకు ప్రేమాస్పదమైన యాంధ్రదేశస్థితి నాకు విచారమును గలుగజేయుచున్నది. అదుపాజ్ఞలు లేకను నెవరికివారు ప్రభువుగ నున్నారు."

గాంధిమహాత్ముడు కొండంతలను గోరంతలను జేయునుగాని గోరంతలను కొండంతలను జేయడని సర్వజన విదితము. మహాత్ముని సంతాపమునకు గారణంబులైన రాగద్వేషాసూయాలసత్వభావముల నాంధ్రసోదరులు విసర్జించి మహాత్ముని మన్ననలకును నీశ్వరాశీర్వాదములకును బాత్రులగుటకు బాటుపడుదురు గాత!

ఆంధ్రోద్యమమునకును నాంధ్రరాష్ట్ర జాతీయోపసంఘమునకును జనకులై ఆంధ్రరాష్ట్ర జాతీయోపసంఘమున కారంభము నుండియు నధ్యక్షతపదవిని వహించుచు కష్టసమయమునందు సాహసధైర్యోత్సాహములతో నాంధ్రప్రతిభను సంరక్షించి జాతీయోద్యమమును నడిపి ప్రజాదరణమునకు బాత్రులైన దేశభక్త వేంకటప్పయ్యపంతులుగారు ధన్యులు. దేశమునందసహాయోద్యమమారంభము గాకపూర్వమె పంతులుగారు

సేవావ్రతమును స్వీకరించి చేసిన సేవ యాంధ్ర దేశమునకు చిరపరిచితము. ఆ సేవావర్ణనము ప్రస్తుత మనవసరము. ఆంధ్రరాష్ట్ర జాతీయోపసంఘాధ్యక్షులుగను వేంకటప్పయ్య పంతులుగారు చేసిన సేవకు రాజమహేంద్రవరసమావేశము చేసిన యభివాదన తీర్మానముతో మేమును నేకీభవించుచు శ్రీయుత దేశభక్త వేంకటప్పయ్య పంతులు గారికి ధన్యవాదముల నర్పించుచున్నాము. శ్రీపంతులుగారు రథ్యకపదవి నలంకరించక పోయినను నెప్పటివలెనే యథాశక్తిని సేవావ్రతమును నిర్వహించగలరు. దేశసేవా పరాయణులు శ్రీపంతులవారి సేవామార్గము నవలంబించుచు ధన్యవాదములకు బాత్రులయ్యెదరుగాత!



# తరణి

పెద్దిభట్ల రామచంద్రరావు గారు, బి. ఏ., (సాహితిసమితి)

సాంధ్యవేళను సైకతస్థలము మిగుల
చల్లనై సువిశాలమై శాంతమగుచు
బాలకృష్ణుని క్రీడల భవ్యమైన
సైకతంబుల విధమున సౌఖ్యమొదవె.

బాలభానుని కిరణాలవన్నె మీరి
మేలిబంగరుచాయను మెరయుచుండి
దీవరతుణయా మహాదేవికరణి
తరణియొక్కటి వసధిమోదంబు గూర్చె.

అరుణకాలంపు కెంజాయ నలరుచున్న
ఆకసంబున లీనమై, యతిమనోజ్ఞ
మై, యగాధమై యంబుధిధ్యేయమయ్యె,
త్రాత వామనమూర్తి పాదంబుపగిది.

జీవజలధినిదాటించి చిత్రముగను
నన్ను దరిజేర్పజాలిన నౌకయైన
నీవిమలమూర్తి యప్పుడు నిల్చెమదిని;
దీప్తమయ్యెను నాజన్మ దినమయ్యె.



Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7 Thambu Chetty Street, G. T. Madras.

# భారతి - ద్వితీయ సంపుటము

## వ్యాసముల అకారాది సూచి



(1) (ప) = పద్యము. (2) (క) = కథ. (3) ౪౮ త. అనగా ఆ సంఖ్యగలపత్రమునకు తర్వాత. (4) (గే) = గేయము [illegible] యెఱుఁగునది.